SRI VENKATESVARA ORIENTAL SERIES No. 47.

*Editor* :—Prof: P. V. RAMANUJASWAMI, M.A

# శ్రీనివాసవిలాససేవధి

ద్వ్యర్థి కావ్యము

శ్రేష్ఠలూరి - వెంకటార్య

ప్రణీతము.

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయమున

ఆంధ్రవాఙ్మయపరిశోధకుఁడగు

కోరాడ రామకృష్ణయ్య M. A. చే

సంపాదితము.

తిరుమల తిరుపతి దేవస్థానం బోర్డు అఫ్ ట్రస్టీస్‌వారి తరఫున

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరువారగు

శ్రీ చెలికాని అన్నారావు, బి. ఏ. గారి

యనుమతిని ప్రకటింపఁబడినది

తిరుపతి

తిరుమల తిరుపతి దేవస్థానముల ముద్రాక్షరశాల

1954

రూ. 3=00

# పీఠిక

"శ్రీనివాసవిలాససేవధి" యనునది ఆంధ్రదేశమునందలి ప్రసిద్ధ పుణ్యక్షేత్రమగు తిరుపతి కొండపై నెలకొని శ్రీనివాసులని పేరుగన్న వేంకటాచలపతి విలాసములను విహారలీలలను వర్ణించు నొక చక్కని ద్విపదకావ్యము. ఆ దేవుని విలాసకథలకిది యొకనిధి. ఇది శ్రీ వేంకటాచలపతియే స్వయముగాఁగోరి శ్రేష్ఠలూరి వేంకటార్యుఁడను కవిచే రచింపించుకొని తాను కృతిగొన్న కావ్యములలో నొకటి. వెంకటపీర రాఘవ అనునది యీతని పూర్తిపేరయినట్లు బ్రౌనుదొరగారు వ్రాసికొన్న దానినిబట్టి తెలియవచ్చుచున్నదిగాని, యీ పేరీతని గురువగు అన్నాని అప్పలాచార్యుల పేరుగాఁ గనఁబడుచున్నది. బ్రౌనుదొరగారని యీతని పేరే అని పొరబడియుండవచ్చును.

వేంకటార్యుఁడను నీ కవి భారద్వాజ గోత్రుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు.

> " అష్టభాషా కవిత్వార్జిత ప్రోద్య
> దష్టావధాన విఖ్యాత భైరదుడు
> శ్రీ కృష్ణయార్య లక్ష్మీగర్భవార్ధి
> రాకాసుధానిధి రాజపూజితుఁడు
> వివిధ విద్యాశాలి వేంకటార్యుండు "

అగునీతఁడు కావ్యరచనాభిలాషియై యుండగా శ్రీ వేంకటేశ్వరు లాతనికి స్వప్నమునఁ గానుపించి,

> " గరిమ నీక్షించి, యో కవివర్య మున్ను
> ధర సంస్కృతప్రాకృతముఖ భాషలను

ద్రవిడాంధ్రములఁ బ్రబంధము లెన్నియైన
సవరించితివి మాకు సంతసంబెసఁగ
నొక కృతి శేషాచలోరువై భవము
ప్రకటితాలంక్రియాస్పదవర్ణనలను......
విసువక శృంగార వీరాద్భుతాది
రసములు భావముల్ రంజిల్లునట్లు
ద్విపద లోకులకెల్లఁ దెలివిడిగాన
ద్విపదగాఁ దెనుగునఁ దేటగావించు
వారాహ వామన బ్రహ్మాండ పాద్మ
గారుడ స్కాంద మార్కండేయ ముఖ్య
బహుపురాణోక్తి సంబాధంబువలన
గహనమై పెనుగొన్న కథ చిక్కుదీర్చి
శరధిలోపల రత్నజాతంబు లేర్చి
మెరుగుసానను దీర్చి మెలకువఁ దేర్చి
భూషణంబొనరించు పొలుపున కర్ణ
భూషణంబుగను సల్పుము చెల్వు గుల్క"

అని యానతీయ, నాతఁడు వెంటనె మేల్కాంచి, పెక్కు పురాణములలోఁ జిక్కుపడియున్న శ్రీనివాసుల కథలలో, పునరుక్త కథను ద్రోచి, మొదలుతుద యేర్పరించి, పూర్వోత్తర విరోధములను దోచనీక, సర్వ సమాధాన సరణిని, భావుకభావ సంభావ్యతనలరఁ గావించి, పటుమహాకావ్యలక్షణములు వెలయ నందే వేంకటాద్రిమాహాత్మ్య మింపొందునట్లుగాఁ దెనుఁగున నీ ద్విపదకావ్యమును భూనుత విఖ్యాతి పొసగ విరచింపఁ బూనినటులఁ జెప్పియున్నాఁడు. పిదప నా కృతిపతియగు ధవేంకటేశుని షడ్విధ ప్రాకృత భాషలలో—ననఁగా—ప్రాకృతము, శౌరసేని, మాగధి, పైశాచి, చూళికోక్తి, భాండీరం అనువానిలో స్తోత్రము

చేసినాఁడు. ఈ కవి సంస్కృత ప్రాకృతములందును, ద్రవిడాంధ్రము లందును పెక్కు కావ్యములను రచించి, యింతకుఁ బూర్వమే తన కర్పించినట్లుగా నా వేంకటాచలపతి యీతని కలలోఁ జెప్పుటను బట్టి తెలియవచ్చుచున్నదేగాని, యీతని యితర గ్రంథములేవియు నింత వరకుఁ గానరాలేదు. ఆరు ప్రాకృతములలోని యల్పరచనలు మాత్ర మీ గ్రంథమునందే గానవచ్చుచున్నవి. ఈతనిది ద్విపదరచనయే యైనను, దాని నీతఁడు,

" చటులార్థకల్పనల్ శబ్దసందర్భ
మొరపొందమాధుర్య ముల్లసిల్లగను
సరస పద్ధతిమిది వర్ణనల్ గులుక
నతుల శృంగార వీరాద్భుతరసము
లతిశయింపగ, విభావాది భావములు,
భావుక భావ్య సంభావ్యత నలరఁ
గావించి, పటు మహాకావ్యలక్షణము
నెలయఁ దెనుంగున ద్విపదకావ్యముగ "

రచింపఁబూనినట్లు చెప్పికొన్నాఁడు. అట్టి రచన ద్విపదయే యైనను మహాకావ్యలక్షణములతోఁ గూడినదై యే యున్నదనుటకు సందేహములేదు. వేంకటాద్రిమాహాత్మ్యమును, శ్రీనివాసుని విలాసములను వర్ణించు గద్యపద్యాత్మకములగు గ్రంథము లనేకములున్నను, ఈ ద్విపదరచనయే చక్కని తెనుఁగుదనముగలిగి, కావ్యలక్షణములతోఁ గూడి వానికన్న మిన్నయేయై యున్నదని చెప్పఁదగియున్నది.

ఈ వేంకటార్యుని తండ్రి పేరు కృష్ణయార్యుఁడు, తల్లి లక్ష్మి. ఈతఁడు శేషదేశికులకెఱిగి " వాధూల వంశావతంసుడగుఁ నస్మదాచార్య నన్నావి యప్పలాచార్య " ని భజియించుచున్నాఁడు. దీనిని బట్టి యితఁడు వాధూలవంశావతంసుఁడగు అన్నావి అప్పలాచార్యుల

శిష్యుఁడైనట్లు తెలియుచున్నది. వాధూల గోత్రజుఁడగు నీతని అసలు పేరు వీరరాఘవాచార్యులనియు, ఈయనకే కందాళై కోవిలఅణ్ణా అని ప్రసిద్ధికలదనియుఁ జెప్పుదురు. ఈయన వైష్ణవ సంప్రదాయ గ్రంథములగు అష్టాదశరహస్యములలో నొకటగు 'శ్రీ వచనభూషణమునకు' లఘువాఖ్యను రచించినవారు. వీరి వాసస్థానము తిరుపుల్లిశై అను పూనమల్లి సమీపమునఁగల యొక గ్రామము. ఈ కందాళ అప్పలాచార్యులే తెనాలి రామకృష్ణ విరచిత మగు పాండురంగమాహాత్మ్యమునకుఁ గృతిపతియగు విరూరి వేదాద్రికిఁగూడ గురువైనట్లా గ్రంథమున రామకృష్ణకవి యీయనను గూర్చి చేసిన యీ క్రింది వర్ణనమునుబట్టి తెలియ వచ్చుచున్నది :—

సీ॥ వేదమార్గ ప్రతిష్ఠా దైవతజ్యేష్ఠుఁ
డభ్యస్త షడ్దర్శనార్థ రాశి
యతిరాజ రచిత భాష్యగ్రంథనిర్ణేత
యఖిల పురాణేతిహాసకర్త
బంధుర దివ్యప్రబంధానుసంధాత
పంచసంస్కార ప్రపంచ చణుఁడు
వాధూలమునిచంద్ర వంశవర్ధనమూర్తి
సకల దేశాచార్య నికరగురువు

పట్టమేనుంగు శ్రీరంగపతికి నణ్ణ
గారి గర్భాంబురాశి నీహారరశ్మి
సాంగసాహిత్య సర్వస్వశయ్యపేటి
కూళవందారు కందాళ యప్పగారు.

వైజయంతీవిలాసకర్తయగు సారంగు తమ్మయ్య కూడ నీ కందాళ అప్పలాచార్యులుగారినే తనకు గురువుగా,

కం॥ వందారు దాసజనతా
మందారు న్వేదశాస్త్ర మహితప్రజ్ఞా
బృందారకగురు మద్గురుఁ
గందాళప్పలగురున్ జగద్ధితుఁ గొలుతున్.

అని చెప్పికొనియుండుటచే, నా యప్పలాచార్యుల శిష్యుఁడే యగు మన వేంకటార్యుఁడును తెనాలి రామకృష్ణ, సారంగు తమ్మయ్య లతో సమకాలికుఁడై — క్రీ. శ. 17-వ శతాబ్ది ప్రారంభముననుండి యుండునని నిశ్చయింపఁదగియున్నది. ఈ కందాళ అప్పలాచార్యుల వ్యాకరణశాస్త్ర పాండిత్యమునుగూర్చి ప్రశంసించుచు నాయన శిష్యుఁ డొకఁడు "అపశబ్దభయం నాస్తి అప్పలాచార్య సన్నిధౌ" అని చెప్పిన సందర్భముననే, సమకాలికుఁడగు తెనాలి రామకృష్ణుఁడు 'అనాచార భయం నాస్తి తిమ్మన్ మాత్రస్యసన్నిధౌ' అని పరిహసించెనని చెప్పుదురు. రామకృష్ణుని గూర్చిన యిట్టి కథలనేకములు విశ్వసనీయములైనను కాకున్నను మన శ్రేష్ఠలూరి వెంకటార్యుఁ డాతనికి సమకాలికుఁడని మాత్రము వ్యక్తమగుచున్నది. ఈతని వాసస్థానమగు శ్రేష్ఠలూరు అనంతపురం జిల్లాలోఁజేరిన చెట్లూరు కానవచ్చునని తోచుచున్నది. కావున నీ కవి యిప్పటికి సుమారు 350 సంవత్సరములకుఁ బూర్వపు వాఁడుగాఁ గనఁబడుచున్నాఁడు.

ఈతని ద్విపదరచన ప్రబంధకవిత్వమునుబోలి ప్రౌఢమైన వర్ణనలతో రసభావబంధురమై ధారాళమైన శైలితో నొప్పుచున్నది. ఇంకను దనకావ్యకన్యక శయ్యకుఁ దగిన మృదుపదము, ఒయ్యారినడలు, శుభోరుకాంతి, సద్వృత్తులు, సరసభావంబులు, సౌకుమార్యంబు గలిగి సువర్ణమయ మూర్తియగుచు, లలిత శృంగారలీలల సొంపు నింపు గైకొనియుండి శ్రీకాంత కైనగాఁగఁ జెలగుటచేత నద్దానికి కలశాబ్ధి

కన్యకావిభుఁడగు శౌరియే తగిన పతియంచు భావించి యాతనికి కవి సమర్పించినట్లు చెప్పికొన్నాఁడు.

శ్రీనివాసుని విహారలీలలతోపాటు ఆతని కావాసమైన వేంకటాద్రి యొక్క మాహాత్మ్యమునుగూడ వర్ణించి వివరించుటచేత నీ రచనా ప్రాశస్త్య మినుమడించిన దనవచ్చును. ఇంతేకాదు ఆ శ్రీనివాసులీ యాతనికలలోఁ గానిపించినప్పు డానతిచ్చినట్లుగా, నా దేవునికథ, ' బహు పురాణోక్త సంబాధంబువలన గహనమై మొదలుతుదలేక, పూర్వోక్తి విరోధములతోఁ గూడి చిక్కుగానియుండుటచే నట్టి కథలోని చిక్కులన్నీతీర్చి మొదలు తుదయేర్పరించి శరధిలో గలరత్నములనేర్చి సానదీర్చి మెఱుగువెట్టి భూషణంబొనరించు రీతినే యీతఁడీ కావ్యమును దిద్ది యా వెంకటాద్రివిభు నలంకరించినాడు. శ్రీవేంకటేశ్వరుల గూర్చిన కథలు, సంస్కృత భాషారచితములగు 12 పురాణములలో గానవచ్చుచున్నట్లు ఇటీవల ప్రకటితమగు " శ్రీ వేంకటాద్రిమాహాత్మ్య " మను నొక సంకలన గ్రంథమునుబట్టి తెలియుచున్నది. కాని ఆ యా పురాణభాగములుగా నందుఁ జేర్పఁబడియున్న రచనలు కొన్ని మూల పురాణ గ్రంథములలో గానవచ్చుటయేలేదు. ఈ కారణముచే నీ భాగములా యా పురాణములం దేయేకాలములఁ జేర్పబడియుండునో తెలియదు. మన వేంకటార్యకవి కాలమునకు మాత్రము — అనఁగా క్రీ. శ. 17-వ శతాబ్ది ప్రాంతమునకు వారాహ, వామన, బ్రహ్మాండ, పాద్మ, గారుడ, స్కాంద మార్కండేయములను నీ యారు పురాణములలోను, నీ వేంకటాద్రి మాహాత్మ్యమును గూర్చిన కథాభాగములు గానవచ్చుచున్నవని యీతడు చెప్పుటనుబట్టి నిశ్చయింపవచ్చును. అప్పటికే వీనిలో నొకదాని కొకటి పొందకయుండినవని కవియే—కాదు—వేంకటాద్రి దేవుఁడగు శ్రీనివాసులే — చెప్పికొనియున్నాఁడు. భిన్నకాలములందు భిన్న గ్రంథ కర్తలచే రచింపఁబడిన కథాభాగము లా యా పురాణములఁ జేర్పఁబడి

యుండుటచే నట్టి చిక్కు ఏర్పడియుండె నేమో! ఈ చిక్కును విడదీసి కథను మొదలు తుద లేర్పరించి చెప్పుటలో నీతఁడు కాలగతిని అనఁగా యుగముల వరుసను అనుసరించి, త దనుకూలముగనే వారాహ వామన బ్రహ్మాండ పాద్మ గారుడ స్కాంద మార్కండేయ పురాణములందలి కథను యథాక్రమముగా సవరించి రచించిన ట్లగపడుచున్నది.

ఈతని ద్విపదరచన మూరాశ్వాసముల గ్రంథము. అందు మొదటి మూడాశ్వాసములలోను ప్రధానమైన "వెంకట ధరణీధర మహిమను వినుపించినాడు". ఈ ముఖ్యకథాభాగమంతయు వారాహ పురాణాంతర్గతమైనదే. అసలీ కథకంతకు మూలమే యాదివరాహావతారము. మున్నీట మునిగియున్న వసుధను పైకెత్తుటకై శ్వేత వరాహరూపమును దాల్చిన శ్రీకాంతుఁడు ఆధరణిని "ఒక కోరమొన నొత్తి యుబుకపైకెత్తి యెగసి వెల్వడివచ్చియిల ధాతకిచ్చి" న పిదప నా భూమియందే భూరిలీలల విహరింపఁ దమి పుట్టఁగా, నా దేవుఁడు వైకుంఠమందలి మన నగరిలోని రత్ననగరాజము నిచ్చటికిఁ దెమ్మని, చెంతనున్న గరుఁడునికాజ్ఞయిచ్చి, తానా భూమిపయిని గౌతమి కరువ దామడను స్వర్ణముఖర్యాఖ్య వాహినిచెంత స్వర్ణనగాధిత్య సదృశమైన యొకచో నొక వనముంగనుఁగొని దాని వైఖరి కలరి యచ్చట విహరించుచుండెనట. ఇదియే వేంకటాచల ప్రదేశము. ఇంతలో గరుడుఁడు వైకుంఠమునకుఁబోయి యచ్చటి నారాయణాద్రిని పెకలించి నిమిషమాత్రనె తెచ్చి యెదుట నిలువగా, నా వాసుదేవుం డా చెంతనున్న స్వామిపుష్కరిణియన్ సరమునుజూపి యీ మహాసరసిపై నెసగంగధరణి నిడుమని యానతీయఁగా నాతఁడట్లుచేసెను. దీనినిబట్టి భూమిపై స్వామిపుష్కరిణి యను నొక సరస్సు, వెంకటాద్రియను నొక కొండ వెలసియుండగా దీనినే నారాయణాద్రిగఁ జేసినట్లగపడుచున్నది. అందు వరాహావతారమున వెన్నుఁడు విహరించుచుండ, దేవతలాతని స్తుతించి "తనుధారులిట్టులీ

దారుణ రూపమునుజూచి భయమున మూర్ఛులయ్యెదరు, చాలించి యీ మూర్తి సౌమ్యరూపమున మే లొసంగవె" అని ప్రార్థింప నా దేవుఁడు సురల కానందమొసగ "సేవింప నింపైన శ్రీనివాసుఁడయి" నిలిచినాడట. ఇది స్వర్ణముఖరీ తీరమునఁగల స్వామి పుష్కరిణియను సరస్సు చెంతనున్న వెంకటాద్రియందు వరాహావతారమూర్తి శ్రీనివాసుడై వెలసినకథ. ఇది యంతయు వరాహ పురాణాంతర్భాగముగానున్నది. వరాహావతార మునకుఁబూర్వమే పృథివిపై స్వామిపుష్కరిణి యెట్లువచ్చినది, ఆ వరాహ మూర్తి దీనిచెంతకే యెందులకు రావయ్యె ననుప్రశ్నకు సమాధానముగా కల్పాదియందు ప్రళయమై కుంఠ విలసితోద్యానమున ప్రవిష్టమైనట్టి దాని యందు నిజపదోద్భవయగు గంగనునిచి "యే నేను గానని యుర్వికి బిలుచుకొని వచ్చినాడట! ఆ గంగతో స్వామిపుష్కరిణియు వచ్చినదట. ఈ తీర్థ తీరంబునందు వరాహుఁగొలిచి పూజించినఁ గోటిజన్మంబుల కలుషసంఘంబు తత్క్షణమే తొలంగునట. ఈ రీతిగా వరాహుని, శ్రీనివాసునిగూడ వెన్నుని రూపములుగా నీ స్వామిసరోవరతటమున నిల్చినట్లైనది. కాని వరాహుఁడే శ్రీనివాసుఁడై నాడుగదా. షష్ఠాశ్వాస ములోఁగూడ తొండమాన్‌రాజు మూలమునఁగాఁ దనకు విమాన ప్రాకా రాదుల నిర్మాణమును సాధించుపట్ల, నాతనికి నచ్చటి నిషాదునికి నా శ్వేత వరాహరూపముననే మొదట కానుపించి, పిదప భూమిలోనికిఁ జొరబడి పోయి, యాప్రదేశమును రాజుత్రవ్వించినపుడు జానువులవరకు భూమిలో పాతుకొనిపోయిన శ్రీనివాసుని యర్చారూపమే గానుపించుటనుబట్టికూడ వరాహుఁడే శ్రీనివాస రూపముదాల్చినట్లు మనము నిశ్చయింపవచ్చును. కావుననే వరాహపురాణమున నీ కథాభాగము తొలుతఁ గానఁబడుటకుఁ గారణముకూడ వ్యక్తమగుచున్నట్లున్నది. ఇప్పుడిదిఁ 'మహావిష్ణోరాజ్ఞ యా' ప్రవర్తమానమగుచున్న శ్వేతవరాహ కల్పముగావున నీ కల్పమున కాదియగు నా వరాహమూర్తితో నీ శ్రీనివాసమూర్తి కభేదము కల్పింప

బడుటయు క్తమే. ఇంక నా మూర్తిప్రభావమును ఆస్థలతీర్థముల మహిమ లనువ్యక్తపరచుటకుగాను, శంఖణుఁడను చంద్రవంశపురాజుకథ, చక్కఁగఁ బ్రబంధరీతిని ప్రథమాశ్వాసమున వర్ణింపఁబడినది. రెండవ యాశ్వాస మున నాత్మారాముఁడను బ్రాహ్మణునికథ మూలముగా వేంకటాద్రి ప్రభావము, మూర్తి ప్రభావమును వర్ణించి, యచ్చటి పదునేడుతీర్థముల మహిమలను దెలుపుసందర్భమున, పాండవులు అరణ్యావాసమున కృష్ణుని యుపదేశముతో శ్రీనివాసాచల శిఖరమున నొక వత్సరము తత్పుణ్యో దకముల స్నాతులై తపస్సుచేయుటచే జయమొందినట్లు చెప్పెను. అట్లే మరియొక యుగమున దశముఖుని ఖండింపఁబోవుచున్న రాముని నా కొండపై తపస్సుచేయుచున్న అంజనాదేవి గాంచి “ఆ రావణుని రణమునగెల్చుట దుర్ఘటము కావున స్వామి పుష్కరిణిని స్నానంబుచేసి వేంకటేశ్వరుగాంచి వరమంది చనుమని పలికినదట. హనుమంతుఁడు నట్లు విన్నవింప “మోమున చిరునవ్వు మొలకలెత్త సౌమిత్రియు రామచంద్రుఁడు నా సరసి స్నానముచేసి నీలశైలేశు భావించిరట. ఈ విధముగా తొలి యుగంబునందలి ఆదివరాహావతార కథతోపాటు, త్రేతా ద్వాపర యుగములందలి కథలుకూడ నీ వేంకటాచలక్షేత్ర తీర్థ దైవతములతో ముడిపెట్టఁబడినవి. రావణబాధితులగు మునులు బ్రహ్మతోఁగూడి వెన్నుని వెదకుచు క్షీరాబ్ధిలో వెన్నుఁడు లేఁడు వేంకటాచలమున నున్నాఁడని చెప్పిన నారదునితోఁగలిసి శేషశైలమునకు వచ్చి ఆ యా తీర్థములఁ దపస్సుచేయుచుండగా పుత్రార్థమైవచ్చి తపంబు సల్పుచున్న దశరథునకును వారికిని స్వామి ప్రత్యక్షమయ్యెను. అప్పుడు ముందు దశరథుని పల్కరించఁగా స్వామి నాతఁడు నాల్గుశ్లోకములచే స్తుతించుటచేత నాతనికి నల్వురుపుత్రులుగలుగ వరమిచ్చెనట. తరువాత దేవతలు రావణవధకై ప్రార్థింపఁ దానేవచ్చి సంహారించెదనని చెప్పిపంపెను. ఈ సందర్భముననే బ్రహ్మ స్థిరముగా నాగిరిని ఆ మూర్తితోనే భక్త

వశ్యుఁడవై యుండుమని వేఁడుకొని, యాతని యర్చాకృతికి నుత్సవము సల్పుటకనుజ్ఞ వడసి, దేవశిల్పిచే మందిర ప్రాకారాదుల నిర్మింపఁజేసి యుత్సవములను వైభవముతో నడపించెను. దీనినిబట్టి శ్రీనివాసుని యర్చాకృతి కుత్సవము సల్పువిధానము త్రేతాయుగముననే బ్రహ్మచేఁ బ్రారంభింపబడినదని తెలియవచ్చుచున్నది. అప్పటికే కలశప్రతిష్ఠాపనము, ధ్వజారోహణము, దిగ్బలి, తిరువీధులేగుట సంప్రదాయవిహితములైనవి. తిరునాళ్లకుఁ చోళద్రమిళ పాండ్యసూరసేనాంధ్ర మాళవ కర్నాట మగధ సౌవీర కురు ఘూర్జ రోత్తరకోసలప్రముఖ ధరణీశ్వరులు తత్త ద్రాష్ట్ర జనులు నడుగడుగుకు దండముపెట్టువారు, నోటితాళములు వూనువారు, తమ్మటంబులుబెట్టి తాటించువారు, గోవిందబెట్టుచు గునుకువారునై వచ్చుచుండిరి. అచ్చటి ప్రపాపాలికలు పాంథుల ననేకవిధముల నాద రించుచుండిరి. అందరికి నట్లే శ్రీనివాసుఁడు దృశ్యుఁడగుచుండునట్లు ప్రతివర్ష మామహోత్సవమట్లే జరుగుచుండునట్లు బ్రహ్మ వరమును బడ సెను.

ఇది వరాహపురాణకథ. తొలిమూఁడు యుగములకు సంబం ధించినది — దీనిని మూఁడాశ్వాసములలో నిముడ్చినాఁడు కవి. పద్మావతీ పరిణయము కలియుగమునకు సంబంధించిన కథయని గాఁబోలు నిందు తెలుపఁబడలేదు. 5, 6, ఆశ్వాసములం దా పద్మినీపరిణయము, అర్చా కృతి యర్చనార్థము కొండపై మండపప్రాకారాది నిర్మాణాదికథలు భవిష్యపురాణోక్త పద్ధతిని వివరింపఁబడినవి. ఇఁక నడుమనున్న నాలుగవ యాశ్వాసమున తీర్థాదుల మహిమలును, వానిని గూర్చినకథలును, వామన బ్రహ్మాండపురాణోక్తరీతిని వర్ణింపఁబడినవి. వేంకటధరణీ ధర మహిమను విన్న ఋషులువేసిన ప్రశ్నల కుత్తరముగా, స్వామిపుష్క రిణీతీరమున కుమారుఁడు తారక సంహారమువలనఁ గలిగిన బ్రహ్మ హత్యను దొలగించుకొనుటకై శివుని యుపదేశంబున స్వామిపుష్కరిణీ

తీరంబున తపంబుసలిపి నారాయణు నెట్లుదర్శించెనో, విష్వక్సేనుఁడు సువర్చలయందు వరుణుని కుమారుఁడై పుట్టుటచే, నా పేరితీర్థమున కెట్లు మహిమకలిగెనో, అహల్యాజారుఁడగు నింద్రుని తపస్సుమూలముగా వజ్రతీర్థమెట్లు మహితమయ్యెనో, తెలుపుకథలను విపులముగా వామన పురాణమునుబట్టి వర్ణించి, వేంకటాద్రికి వివిధనామములు గలుగుటకుఁ గలకారణములను బ్రహ్మాండపురాణోక్తరీతిని వివరించెను.

ఇక 5, 6, ఆశ్వాసములలో వృషాసురునిఁ బొలియించుట మూలముగా వృషాచలనామమెట్లుకలిగెనో, శ్రీనివాసుఁడు పద్మినీకాంత నెట్లు పెండ్లాడెనో, కలియుగాగమమునందెట్లు వెన్నుఁడు విహరింపఁదొడఁగెనో యను విషయములను గూర్చి (యేయే) పురాణముల దడవి, వ్యాసుని భావంబుననిలిపి సూతుఁడు మునీశ్వరులకుఁ జెప్పినట్లు మాత్రమే యీ కవి చెప్పినాడుగాని యే పురాణ విషయములో వ్యక్తపరుపలేదు. ఈతఁడు తొలుత పేర్కొనినవానిలో మిగిలినవి "పాద్మగారుడములు". ఇందలి కథ తెలుపు విశేషమేమనఁగా నీ భూమిపైనున్న "వేంకటాచలమను" నది "వెన్నుఁడు మున్నుతిన్నగా భూమికి వైకుంఠమునుండి తెప్పించినదే" యని. ఇదివరలో వైకుంఠమునుండి వెంకటాచలమును తెప్పించినట్లుచ్చటను ఈతడు పురాణోక్తముగనైనను చెప్పియుండలేదు. తొలుత వరాహమూర్తి గరుడునితోఁ జెప్పినది "పక్షీంద్ర నీవు నిబ్బరమునవేగ, యక్షీణ లక్ష్మిచే నలరు వైకుంఠ నగరంబునను మన నగరిలో రత్నసగరాజ మొకటి యున్నదిగదా దాని భువికిఁదేవలె" నని. ఆతడు దానినట్లు తేసికొనిరాఁగా "స్వామిపుష్కరిణియను సరమునుజూపి ఈ మహాసరసిపై నెసగంగధరణి నిడుమన, నాతఁడయ్యెడ సమంబైన పుడమిని యా దివ్యభూధరంబునిచె" ననిచెప్పెను. ఆ వరాహమూర్తి శ్రీనివాసుఁడైనట్లే ఆ రత్నసగరాజమే స్వామిపుష్కరిణి సమీపమున నుండుటచే వెంకటాచలమయ్యెనని మనము తలంపవలసియున్నది.

పంచమాశ్వాసములోని వృషభాసురుని కథయే యీ విషయ మును వ్యక్తపరచునట్లున్నది. ఎలయనఁగా, నా యసురుఁడొకనాడు "శేషాద్రి శృంగంబు లతులిత మణికాంచనాంచిత శ్రీల కనుపట్టినఁ జూచి కరముచింతించి ' వనభూమి నెందుండివచ్చె నీ కొండ, ఒకనాడు నిందిది యుండుటలేదు ప్రకటింప నెవ్వఁడో ప్రబలమాయావి తనశక్తి గల్పించి తగిలియిందుండు — నతనినే ఖండింతుగాక ' యని యనుకొను టనుబట్టి ఒకప్పుడా వెంకటశైల మచ్చటలేదని, వెన్నుని యాజ్ఞపై నది యచ్చటికి వైకుంఠమునుండి తేఁబడినదేయని వ్యక్తముచేయఁబడి నట్లైనది. తనపై నెత్తివచ్చిన వృషభాసురుని స్వామి చక్రముచే ఖండించెను. ఈ కారణముచే దానికి వృషాద్రియను పేరుగలిగినది. ఒకప్పుడు చెంచురూపమున శ్రీ వేంకటేశ్వరులు స్వర్ణముఖరి చెంతనున్న కాననమున వేటాడఁబోవ చెలికత్తెలతో వనవిహారమునకు వచ్చిన పద్మినిఁ గాంచుట తటస్థించినది. పిదప పరస్పర ప్రేమాంకురములు, విరహము, వకుళమాలిక చెలికత్తెయై వీరికి సంధానముచేయుట కంగీకరించి ఆకాశ రాజునింటికిఁబోయి వివాహముహూర్తమును నిశ్చయించుట, నారదు డీలోపల నెఱుకతవేషమున శ్రీనివాసుఁడు పద్మినిం జేపట్టునని యెఱుక చెప్పుట పద్మినీ వివాహవైభవము మొదలగు కథాభాగము వర్ణింప బడినది. ఈ సందర్భములోనే యాకాశరాజున కయోనిజగా లభించిన పద్మినియను కూతురు యొక్క పూర్వజన్మకథ దెలుపఁబడెను. కృతయుగ మునాడు వెన్నునివివాహమాడఁ దపస్సుచేసిన బృహస్పతి మనుమ రాలైన వేదవతి త్రేతాయుగమున రావణసంహారమునకుఁ దోడ్పడి, ద్వాపరమున కృష్ణునిఁగూడలేక ఇప్పుడు పద్మినియైన వృత్తాంతమును శ్రీనివాసుఁడే వ్యక్తముచేసినట్లు వర్ణించినాడు కవి.

తరువాతి కథ కలియుగమున స్వామి అర్చాకృతి వేంకటాచలమున వెలసినరీతిని దెలుపుచున్నది. వెనుక తొలియుగమున సముద్రమున

మునిగిపోవుచున్న భూమి నుద్ధరించుటకు వెలసిన వరాహావతారరూపమే ఈ యుగమున మరల నీ కొండపై నవతరించి వసుడను నిషాదుడు వేసి కొన్న కొఱ్ఱచేనును తిని పాడుచేయుట మూలముగాఁ దానచ్చటి దైవమని వానికెరింగించి తనమాహాత్మ్యమును రాజు తొండమానున కెరింగింపు మని చెప్పుటయు, వాడట్లుచేయ, రాజు తనకుఁ గలలోవచ్చి చెప్పిన దైవముమాట నిదర్శనముగా నాప్రదేశమునకువచ్చి యా శ్వేతవరాహ మొక పుట్టఁజొచ్చుటనుఁజూచి, దానిని త్రవ్వించి క్షీరఘటాభిషేకము చేయించగా, నాదేవుని యర్చాకృతి భూమిలో పాతుకొనిపోయి కాన వచ్చుటయు, నద్దాని కితఁడు మండప ప్రాకారాదులనునిర్మించి, యుత్స వాదికమును వెనుక బ్రహ్మాదులు సల్పినట్లే సలుపుటయు వర్ణింపబడినది. విశేషమేమనగా నపుడు భూమినుండి వెలికితీసిన యా యర్చాకృతియే తొండమానా రాజుతో భాషించుచు నాతని కొక బిలముఁజూపి ప్రతి దినము నీ వీ బిలద్వారమునవచ్చి నన్నర్చింపవచ్చును, ఎల్లపుడు నాసేవ యందే నిమగ్నుఁడవై యుండవద్దు, భోగముల్ మాని యోగివలెనుండు టేమి? రాజయోగి వికమ్ము. నీవు నీ భార్యలతో యథేచ్ఛ భోగము లను భవించుచునే యుండుమని దేవుఁడే హెచ్చరించినాడట! నీవు యావజ్జీవ నియత కైంకర్యసేవ లిట్లే సేయుచుండి భోగభాగ్యంబులు భుజియించి, తుదకు మోక్షమొందుము అని చెప్పెను. ఆతఁడు నట్లే ధర్మవృషభము నాల్గుపాదముల నడచునట్లు రాజ్యముచేసి తుదకు పరమాత్మ సాయుజ్య మునుపొందునని భవిష్యత్పురాణకథ వ్యక్తముచేసినాడు. ఈ రీతిగా బహుపురాణోక్తి సంబాధంబువలన గహనమైయున్న శ్రీ వేంకటాచల పతి కథను చిక్కులుతీర్చి పునరుక్తిదోషంబు చాలవరకు పరిహరించి సక్రమపద్ధతిని శ్రీనివాసుని విలాసకథలను వెంకటాద్రిమాహాత్మ్యము వ్యక్తమగునట్లు. ఈ కవి ద్విపదకావ్యముగా రచించినాడు. ద్విపదకావ్య రచయితలు సామాన్యముగా పాల్కురికి సోమనాథుని దలపింకమానరు.

శ్రీనివాసులు కవితోఁ గలలోఁజెప్పిన "ద్విపదశ్లోకులకెల్లఁ దెలివిడిగాన, ద్విపదగాఁ దెలుఁగునఁ దేటగాఁ బెంచు" అన్నమాటలును, తదాజ్ఞానుసారముగా వేంకటార్యుఁడు చెప్పిన,

ఘటియించి తగు నలంకారముల్ మెరయ,
చటులార్థకల్పనల్ శబ్దసందర్భ
మొరపొంద మాధుర్యముల్లసిల్లగను
వరుస పద్ధెనిమిదివర్ణనల్ గులుక
నతులశృంగార వీరాద్భుతరసము
లతిశయింపగ విభావాది భావములు
భావుకభావ సంభావ్యతనలర
గావించి పటు మహాకావ్యలక్షణము
వెలయ దెనుంగున ద్విపదకావ్యముగ
భూనుత విఖ్యాతిపొసఁగ సల్పెదను.

అనుమాటలును సోమనాథుని యీ క్రిందివాక్యములను దలపింపకపోవు.

" ఉపమింపగన్యపద్యోచ్చావళి కృతులు ద్విపదయు సమమభావింప
సత్కృతియను నూత్నసంగతి దనర
తొమ్మిదిరసములు దులుకాడ దాని
యిమ్మడివర్ణనలెగంగఁ ద్విగుణ
మగు నలంకారము లసలార, దాని
తేటతెనుంగున ద్విపదరచింతు " (పండితారాధ్యచరిత్ర)

ఇట్లీ కవి యీ ద్విపదకావ్యమును రసభావములతోను చక్కని వర్ణనలతోను అలరారునట్లుచేసి దీనినిమహాకావ్యముగనే రూపొందించినాఁడనుటకు సందేహములేదు.

ఇందు ప్రథమాశ్వాసముననే నై కుంతిపుర వర్ణనము, సముద్ర వర్ణనము వేంకటాచల వర్ణనములును గలవు. రెండవ యాశ్వాసమున స్వామిపుష్కరిణీతీరమునఁ దపస్సుచేయు మునులను దశరథుఁడుగాంచిన సందర్భమున గ్రీష్మాది ఋతువర్ణనముకలదు. స్వామిపుష్కరిణీ ప్రభావమును దెల్పు శంఖణుఁడను చంద్రవంశపురాజు కథాసందర్భమున స్వయంవర వర్ణనము కలదు. ఇట్లే చంద్రార్కోదయ వర్ణనములు సందర్భానుసారముగా నా యా కథాసందర్భములతోడఁ బ్రకృతి సానుభూతిఁ దెలుపుటను సూచించుచున్నట్లుగాఁ జేయఁబడినవి. తృతీయాశ్వాసమున స్వామి తిరునాళ్లుముగిసిన నాటి రాత్రి వర్ణనము మరునాటి సూర్యోదయ వర్ణనమును జూడుడు.

" ఆరేయి .........................

తిరునాళ్లఁగనుటఁ జెందిన ప్రసన్నతను
మురియుచు దిగ్వధూముఖపాళి దనరె
పొడుపుగట్టను సౌధమును గయినేయ
నిడిన దీపంబన నినుఁడుదయించె
తిరువెంకటేశ్వరు తిరునాళ్లకెనయ
నరుణమండలమును నంటెచేఁ బూర్వ
హరిదబ్జముఖ కుంకుమాసారములను
ధరణిజ విటపాళి దగుల వసంత
మొరపురంజెల్లె నా నురువనాగ్రముల
నెరయ కెంజాయల నీరెండ యడరె,
నరుణాతపద్యుతి నందు కారాకు
తరుణపల్లవముగాఁ దలఁచి కోయిలలు
నొక్కి త్రుంచగలేక నుసివినం జూచి
పక్కననగియెనా పద్మంబులలరె " etc.,

ఈరీతి చక్కని భావంబులలర సందర్భానుకూలముగ నాయా వర్ణనలను ప్రౌఢరీతిని సాగించినాఁడీకవి. చక్రరాజు శ్రీనివాసుల యాజ్ఞానుసారముగఁ జేసిన దానవసంహార సందర్భమున జరిగిన యుద్ధములు వీరాద్భుతరస భరితములు. రావణసంహారమునకై పోవు రాముఁడు కపి సైన్యముతో శ్రీనివాసులను సేవింప వెంకటాచలమున విడిసినప్పు డా వానరులలోఁ గొందరు కాంచినట్లుగాఁ జెప్పఁబడిన వైకుంఠగుహా వర్ణనము అద్భుతరసావిష్కృతిని గొల్పుచున్నది. రంగదాసునికి మతి భ్రమము కల్పించిన గ్రంధర్వస్త్రీల జలకేళివర్ణనము అహల్యకొరకై ఇంద్రునకును, పద్మావతికొరకై శ్రీనివాసులకును గలిగిన విరహము వర్ణనమును, కుంతల — సువర్చల — కథాసందర్భమున శృంగారాది వర్ణనములును చక్కఁగా రచింపబడినవి. సందర్భానుసారముగా దక్కిన వర్ణనములును కుదురుపరుపఁబడియున్నవి.

'వేంకట' గిరి పాపైకదాహకమను నర్థమును వ్యక్తముచేయు టకుగా మాధవ సోమయాజి యను బ్రాహ్మణకుమారునికథ చెప్పఁబడినది. ఇది చాలవరకు తెనాలిరామకృష్ణుని పాండురంగమాహాత్మ్యమునందలి నిగమశర్మ కథను బోలియున్నది.

బ్రహ్మదేవుఁడు మునుల నిగ్రహమును బరీక్షించుటకై అహల్య యను స్త్రీరత్నమును సృష్టించు సందర్భమున, కాళిదాసు శకుంతల సృష్టిసందర్భమున బ్రహ్మ యవలంబించినాఁడన్న పద్ధతినే, యీకవియు, నాతని కాపాదించినాఁడు, చూడుఁడు.

" నెమ్మెన, నుదిరి బంగరురంగు నొరపొందు మెఱపు
పొదలికె తళ్కునుం బూవుల తావి
కలయ మేదించి శృంగారంపుతేట
వలరాజు చెలువ చెల్వము జిగి నీటు
బదునిచ్చి మెరుగిడ భావించి తనదు

మదిని నూహించు సమ్మదయత్నమునను
చేతనంటెన కందుజెందెడి ననుచు
చాతురి మనసుచే సరగనిర్మించి
కని యొచ్చెమింతయు గనమిఁదహల్య, యనిసంజ్ఞగావించె" నట.

తృతీయాశ్వాసమునందలి యుద్ధవర్ణనము నన్నిచోడుని కుమార సంభవమందలి 11-వ యాశ్వాసమందలి యుద్ధవర్ణనమును దలపించు చున్నది.

"రథమును రథముఁసారథిని సారథియు,
రథికుండు రథికుండు రౌతునురౌతు
తురగంబు తురగంబు దొరయును దొరయు"

క॥ కరిఁగరి భటు భటు డరదం
బరదంబుహయంబు హయము.సవి మొత్తములై" (కు. సం)

"కత్తినొక్కఁడు కచాకచి వైరిశిరము
మొత్తి డొల్లించునా మొండెంబుతనదు
చేతివాలున వాని శిరముఖండించు
చాతురి నొకఁడీటె సరిగట్టె వడగఁ
బగతురఁబొడుచు నా పగర యయ్యాటె
తెగడుస్సిపోనెక్కి తెగటార్చునతని (పుట—145)
మొండు భండన మంట మింట నచ్చెరలు
తనవల్లభుఁడుపీడు తనవిటుఁ డితఁడు
తననాయకుడు వీడు తనపతియితడు
తనభుంజగుడు వీడు తనవిభుడితడు
అనుచు గొర్కొనుచు నయ్యని జూచుచుండ"

ఇట్లు ప్రాచీన ప్రబంధకవుల యనుకరణములచ్చటచ్చటగలవు.

ఈతని శైలి ధారాళమై కుంటులేక తేటతెనుఁగు పదములతోఁ దీగసాగినట్లు సాగుచుండును. ద్విపద యేపాదమున కాపాదము విరిగిపోవు చుండునేగాని కలిసిపోవుట సామాన్యముగా కానరాదు. ప్రాసములలో రేఫ శకటరేఫముల భేదము నీ కవి పాటింపకుండుటేగాక, ణ-న ప్రాసము శ-స ప్రాసమును గూడ నీ కవి ప్రయోగించినాఁడు. ప్రాసముకొరకీ కవి 'ఒకడు అను దానిని 'ఒగడు' గా మార్చినాడు.

"ఆని చూడు మటంచు నదలించు నొకని,
నొగఁడు దప్పి యడంగియును దనమోము
సొగసుఁజూచుచుఁ ద్రావుచొప్పున రిత్త
గుటకలుబెట్ట ...................."

అక్కడక్కడ కొన్ని యపూర్వ పదములను హిందూస్థానీ పదములను ప్రయోగించినాడు.

ఆమటిమ్రొక్కులు = ఆమడదూరమునుండి పెట్టుదండములు.
తలసీలనుఁలు = తలవెండ్రుకలు
ఆహూయరక్షకుడు = పిలిచిరక్షించేవాడు
సుదినాహము = సుదినము
దహజ్జ్వాల = మండుచున్న అగ్ని
గద్దరిహాంతకాఁడు = దిట్టరియైన జెట్టికాడు
వణుకులు = సందులు, గుహలు
ఇజుకు = శ్రమము, సంకటము
కొణిగ = ముంజూరు
బజాహిణిచేయుట = వీణె తీగలు బిగించుట
గాజిరాసంధించి = అంగీతొడుగుకొని
తాణెము = కావలిదండు
ఉక్కళము = శత్రువులెత్తివచ్చుటను తెలుపుకావలి
బిస = యంత్రపుకీలు
పిస = అవివేకము

పరిష = పరిషత్తు, పరుస
ఆనిక = దార్ఢ్యము
ముంగాముురము = (ముందు + కై + మురము) హస్తాలంకారము
పాలకాయింటులు = కర్ణభూషణములు
పసిడినకాసెమేల్ = బంగారుదట్టీమీద, బంగారునగిషీపని
చిక్కటిలు = చిక్కుపడు
దెబ్బటించు = ఆపదనొందించు
ఎదపడు = భయపడు
శ్రీకమిత = శ్రీకాముకుడు, విష్ణువు
బైరదుడు = బిరుదుకలవాడు
నెవ్వ = ఉపాయము
ఉలుపాలు = కానుకలు
బారీలు = ఏనుగు కాలికిగట్టుగొలుసులు
చేతిపంజు = చేతిలోని దివిటీ
చెంగులు = శంఖములు
పట్టుసరాతులు = గుడారముచుట్టు గోడవలె నేర్పరచిన తెర
తగిటీల మేల్కట్లు = సరిగంచులుగల వితానములు
ఆదా = ఆదాయము
గోరియు = గోరీ
గోహారు = ఉపద్రవము

ప్రయోగవిశేషములు.

హరువంబు, మంతరము, మిళ్లు, దూర్పడు, ప్రతిదరి, ప్రతితటి, మోము వంచుకనిలిచి, తమదారములు, చించాగమంబు, నోరుపుచ్చిపొయ్యేను, ఇత్యాదులు.

సంధులు — దీనొయ్యారము, అతనుద్ధరించి, ఇదహల్య, మనసు వీనెడలేదు, తళుకుల గనోయనగ, ఇత్యాదులు.

ఈ గ్రంథము వ్రాతప్రతియొకటి శ్రీ వెంకటేశ్వర ప్రాచ్యపరిశోధ నాలయు పుస్తకభాండాగారమునం గలదు. దీనికి మాతృకయేదో తెలి

యదుకాని, మద్రాసు గవర్నమెంటు ప్రాచ్యలిఖిత పుస్తకాలయములో బ్రౌను దొరగారు వ్రాయించిన వ్రాతప్రతి యొకటికలదు. దానిని మా పరిశోధనాలయ డైరెక్టరుగారు దయతో తెప్పించగా దానితో సరిపోల్చి చూచుటచే పలుతావుల సరియైన పాఠములు లభించుటేగాక, పరిశోధనాలయ ప్రతిలోని లుప్త భాగములుకొన్ని గూడ యందు దొరికినవి. ఈ ముద్రిత ప్రతిలోఁజేరనివి కొన్నిపాదము లీదిగువ సంగ్రహింపబడినవి.

I. ఆ. 7. పుట.

......................... మెఱయ
చటులార్థకల్పనల్ శబ్దసందర్భ
మొరపొంద మాధుర్యముల్లసిల్లగను
వరుస పద్దెనిమిది వర్ణనల్ గులుక.

I ,, 10. ,, తుల్యాధి కరహితాద్భుత శీలునకు.

I. ,, ,, ,, సమ్మతంబొప్పగ సన్నుతిచేసి

I. ,, 54. ,, శ్రీ చిరవాసమా చిత్రకూటంబు.

I. ,, 70. ,, అచ్చరల్ నర్తించి రజుఁడు శంకరుఁడు
నచ్చుటఁ గీర్తించి రాగమోక్తులను.

II. ఆ. 122-వ పుట. 1089-వ పంక్తి. నుండి 30 పాదములు వ్రాతప్రతిలో లోపించినవి ప్రా. లి. పు. ప్రతినుండి సమకూర్పఁబడినవి.

IV. ఆ. పుట. 220, పంక్తి 1078 నుండి 1115 వరకు వ్రాత ప్రతిలో లోపింప ప్రా. లి. పు. ప్రతినుండి సమకూర్పఁబడినవి.

VI. ఆ. పుట. 365. 1410—12. పంక్తులు. సమకూర్పఁబడినవి.

ఈ సందర్భమున మాకు తమ వ్రాతగ్రంథమును దయతో నొసఁగిన మద్రాసు గవర్నమెంటు ప్రాచ్యలిఖిత పుస్తకాలయాధికారులకు మేమెంతయుఁ గృతజ్ఞులము.

ప్రాచ్యలిఖిత పుస్తకాలయమందలి యీ గ్రంథము మెకన్జీ దొర గారు సంగ్రహించిన లిఖితపుస్తక సమితిలో నొకటఁగా బ్రౌను దొరగారు

దానికి నీ ప్రతిని వ్రాయించినట్లు వారి స్వహస్త లిఖితాక్షరములతో ఇంగ్లీషులో వ్రాసిన యందలి యొక పత్రమునుబట్టి తెలియుచున్నది. దానిలో కృతికర్త పేరు వెంకట వీరరాఘవుఁడని యున్నది. కాని యది యాతని గురువుగారిపేరు. ఈతనిపేరుకాదు. ఈ ద్విపద రచన బ్రౌన్ దొర గారి కంతనచ్చలేదని వారందు వ్రాసియుంచిన పత్రములోని ఈ క్రింది వాక్యములనుబట్టి తెలియవచ్చుచున్నది.

"Sreenivasavilasa sevadhi". Being a Vaishnavite book written in Telugu Dvipada by Venkata Vira Raghava. This I caused to be transcribed from the original manuscript found among Mackenji MSS. ..... .....This appears to be a modern composition of no merit. It abounds with Hindustani words. As is usual in Vishnu books the author asserts that the God appeared to him in a dream and directed him to undertake this work. The preface declares that the story here given is modelled on that recorded in the Markandeya, Padma and other Puranas.

పిదప నిందలి కథా విషయము సంక్షిప్తముగాఁ దెలుపఁబడినది. ఆంధ్ర భారతమును మనువసుచరిత్రాది ప్రబంధములను పండితుల సహాయముచే వ్రాయించిసంపాదించిన బ్రౌనుదొరగారికి వైష్ణవకథారూపమగు నీ ద్విపద కావ్యమంతగా రుచింపలేదనుటలో నాశ్చర్యములేదు.

ఈ వేంకటాచలమాహాత్మ్య కథలనే పద్యకావ్యముగా రచించిన వారిలో దామెర చినవెంకటరాయడు, చెళ్లపిళ్ల నరసకవి, తరిగొండ వెంకమాంబ మొదలగువా రనేకు లున్నారు. కాని వారందరు నీ వెంకటార్యున కర్వాచీనులుగానే కనఁబడుచున్నారు. వేంకటాచలపతికంకిత ముగా వేంకటాచలమాహాత్మ్యమును తెలుఁగునఁ దొలుత రచియించిన వాఁడు శ్రేష్ఠలూరి వేంకటార్యుఁడే యైయుండుననుటకు సందేహములేదు. ఈతనికిఁ గలలోఁగనంబడి యా దేవుఁడు చెప్పిన మాటలనుబట్టియే యది కొంతవరకు సూచితమగుచున్నది. గ్రంథాంతమం దీతఁడు చెప్పిన యొక్క రహస్యముమాత్ర మందరు గమనింపవలసినదై యున్నది. కావున దానినిచ్చట వినుపించెదను,

" ఇకనొక్కటి రహస్యమిదిబుధుల్ వినుడు
సకల వేదాంతార్థసారరూపంబు
శ్రీనివాసులు, నట్టి శ్రీ వేంకటాద్రి
యానందనిలయంబు, నాస్వామి సరసి
జీవకోటులఁబ్రోవఁ జెలగి యెల్లెపుడు
పావనస్థితినుండు, భావంబుదెలిసి
ద్వీపాంతరంబుల దేశాంతరముల
నేపట్లనుండైన నెట్టివాడైనఁ
దదభిముఖంబుగా ధర వ్రాలి మ్రొక్కి
మదిలోనఁగొల్చిన మాత్రంబునందు
శ్రీనివాసులు వాని చెంగటనిలిచి
తానె యిష్టార్థముల్ దయమీర నొసగు
వేదశాస్త్రమువంటి విద్య వేరొండు
శ్రీదేవి కెనయైన చెలువ యొకర్తు
భూమికి సరియైన భూత మింకొండు
స్వామిపుష్కరిణికి సాటితీర్థంబు
వేంకటాద్రికి నుద్ది విష్ణుస్థలంబు
వెంకటేశ్వరుఁబోలు వేరైదైవతము
సత్యంబుగాఁగ నెచ్చట లేదు లేదు!!
ప్రత్యక్షముగ నుమాపతి సాక్షి యిందు "

ఇట్లు సకల వేదాంతార్థసారరూపుఁడై వేంకటాచలమునఁ బ్రత్యక్షదైవమై నిలిచిన శ్రీనివాసులు, తత్సేవానిమగ్నులై దయతో నాకు నట్టి యవకాశమును గల్పించిన ప్రధానకార్యనిర్వాహకులగు శ్రీ చెలికాని అన్నారావుగారికిని, పరిశోధనాలయడైరెక్టరుగారగు శ్రీ పి.వి. రామానుజ స్వామిగారికిని వారియిష్టార్థముల దయమీర నొసఁగుచు వేదశాస్త్రముల విద్యను పెంపొందించి భక్తాళి కానందనిలయముఁ బ్రసాదించుగాక!!

శ్రీవేంకటేశ్వరప్రాచ్యపరిశోధ
నాలయము, తిరుపతి.
12—8—54.

కోరాడ. రామకృష్ణయ్య.

# విషయసూచిక.

## ప్రథమాశ్వాసము





## ద్వితీయాశ్వాసము

## తృతీయాశ్వాసము



## చతుర్థాశ్వాసము

## పంచమాశ్వాసము

## షష్ఠాశ్వాసము

ఓం

# శ్రీనివాసవిలాససేవధి

శ్రేష్ఠలూరి వెంకటాచార్య ప్రణీతము.

## ద్విపదకావ్యము

### ప్రథమాశ్వాసము

శ్రీకాంత కిరవుగాఁ జెలఁగు పేరురము
వైకుంఠమిదె యంచు వంచినకరము
మలసి నిగ్గులు గుల్కు మకరకుండలము
లలరు కౌస్తుభశోభి హారమండలము
కంతు సంతునకు నగ్గలమైన గళము
వింతదర్పణము నవ్వోడు గండతలము
కరుణఁ జిల్కు వెడంద కన్నుల ఠీవి
చిరునవ్వు తేట రంజిల్లు కెమ్మోవి
కప్రపు నామంబు కళలీను మోము
దీప్రకిరీటంబు తెఱఁగొందు గోము
ఘనకటితటి బద్ధ కనకాంబరంబు
కనదురుమేఖలాగణడంబరంబు
నలువఁగాంచిన తమ్మి నలువొందునాభి
కలన చాణూరుని కలఁచు నూరువులు
జనని రోలును బిగించఁగ నర్జునములఁ
ధునియింప జరుగు ముద్దులజానుయుగము

బలిని దానమువేఁడి బలిమిఁ బెంపొంది
కొలిచి ముజ్జగములు గొన్న పాదములు
మకరతోరణదీప్తి మరగి సంపంగి
నికరంపు దండగా నీటొందు నిగ్గు
కనుగొన్న భక్తలోకముల కానంద
మొనరించు సోయగ ముల్లసిల్లంగ
నంజెనచల లక్ష్మి యమరురూపమున
నంజనాచలసీమ నలరు పెఱవేల్పు
కొలఁదికాని వరాలకును వరాలిచ్చి
వెలుసుబేరము లాడు మేటివర్తకుఁడు
వడ్డికాసుకు కాన్పువలయు గొడ్డాండ్ర
కడ్డిచేయ కొసంగు నాటలవాఁడు
తలనీలములుడించి తగువైన సిరులు
కలకెత్తి యనుచు వింతల యెమ్మెకాఁడు
కురువ దను గుణించి కుమ్మరి మట్టి
విరులఁబెట్టిన మెచ్చి వెసవిఱ్ఱవీఁగి
పుడమిరెండు నిజాంఘ్రి పూజననిధుల
నిడువిరుల్ దిగువగా నెదనెంచు జాణ
ఆమటిమ్రొక్కుల కలరి దాసులకు
కామితార్థములిచ్చు కరుణాపయోధి
తాతకుఁ దాతయై తానొక్క మనుజుఁ
డాత నీళ్ళని వేఁడు తచ్చనకాఁడు
జనములందఱుఁ జూడ సంపంగిచెట్టు
ననువుగా నడిపించు నైంద్రజాలికుఁడు

---

ప్రా. ప్ర. అంజనాచల.

చక్రవర్తి కొసంగి చక్రము విమతు
లాక్రమించిన చక్రమందినమేటి
వేరువేరుగ రూపు వేళవేళలకు
నేరుపునను జూపు నెఱమాయలాఁడు
చక్కఁదనము మించు జవరాండ్రఁబొంచి
దక్కఁ బెనంగు గద్దరిహరాంతకారి
ఆహూయరక్షకుం డార్తశరణ్యుఁ
డా హార బ్రహ్మాది కాత్మమిత్రుండు
నందకుమారుఁ డానందమయుండు
నందకధరుఁ డుమానందనారాధ్యుఁ
డఖిలకారణ కారణాదికారణము
ముఖరిత శ్రుతి చతుర్ముఖ సన్నుతుండు
కరుణాది కానంత కల్యాణగుణుఁడు
పరమాత్ముఁ డగుణుఁడు భవరోగవైద్యుఁ
డాద్యుఁ డనాద్యుఁడ త్యమలయోగీంద్ర
వేద్యుం డవేద్యుండు విశ్వాత్మకుండు
విశ్వాతిరిక్తుండు విశ్వరక్షకుఁడు
శాశ్వతికాంకార సంసారదూరుఁ
డఘటన ఘటనా సమర్థవిలాసుఁ
డఘవినాశన వాసనార్థ ప్రకాశుఁ
డాకిటి విధజగ దాధారమూర్తి
శ్రీకరోల్లాసుండు శ్రీనివాసుండు
మీనకచ్ఛప కిటి మృగరాజవదన
మానవవటు విప్రమహిప రూపముల
మునినాది వేషముల్ మాను తాధరించి

జనుల శిక్షించి యాసరణి సంసరణ
మవఘళించు జనాళి నటు నటింపించు
తవర యా కపటనాటక సూత్రధారుఁ
డసదృశాలంకార హావభావములు
రసచమత్కృతు లతిరమ్యభూమికలు
నరుసనేర్చి మదీయవాణిని వాణి
కరము నటించంగఁ గరుణించుఁ గాత !
అనుచు నాయిలువేల్పు నల నెలదాల్పు
కనుఁగొన్న పెన్నిధిఁ గరుణాంబు నిధిని
అలమేలు మంగా సమంచిత వక్షు
విలసత్సరోజాక్షు వేంకటాధ్యక్షు
భావించి సేవించి ప్రార్థించి నతులు
గావించి మఱియు జగత్త్రయీ జనని
కలశాంబునిధిరాజ కన్యకా మణిని
నలమేలుమంగమ్మ నర్మిలిఁ గొల్చి
శేషాహి సౌపర్ణ సేనాధిపులకు
శేషతఁ మ్రొక్కి యశేష దేశికుల
కెఱఁగి సాష్టాంగంబు నెలమి సద్భక్తి
వఱలంగ వాధూల వంశావతంసు
వాచాతిగజ్ఞాన వైభవు నస్మ
దాచార్యు నన్నావి యప్పలాచార్యు
భజియించి వాల్మీకి బాదరాయణుని
సుజన సమ్మతులైన సుకవివర్యులను
బేర్కొని పొగడి యభీష్ట సిద్ధికిని
గోర్కులుబ్బ రసజ్ఞకోటి సంతసిల

నొకకావ్యమొనరింప నూహదలంచి
యకళంక సత్కథ లరయుచుండంగ -
సిరులొందు నెలను మించినమోమువాఁడు
హరినీల రుచిఁ గెల్వనగు గోమువాఁడు
కమలసంపదఁ గేరు కన్నులవాఁడు
విమలోర్ధ్వ పుండ్రంబు విలసిల్లువాఁడు
డంబైన మకరకుండలములవాఁడు
హారంబట్టు వల్లెవాటొప్పినవాఁడు
బురుసారుమాల్ గట్టి పొలుపొందువాఁడు
నెరరాజసంబున నీటైనవాఁడు
చిరునవ్వు వెన్నెలఁ జిల్కెడువాఁడు
కరుణారసముఁజల్లు ఘనమైనవాఁడు
రమణీయలీలల రంజిల్లువాఁడు
కమలాస్త్రు మించు చక్కదనంబువాఁడు
పూజార్హుఁడగు మహాపురుషుఁ డొక్కరుఁడు
రాజబింబాస్యయౌ రమణితోఁగూడి
మెఱుఁగు బంగరుమేడ మీఁదనుండంగఁ
గరమచ్చెరువుమీఱఁగాంచి నే నందుఁ
జేరి నివ్వెరపాటుచే నిల్వఁగరుణ
భూరివైభవుఁడట్టి పురుషుండు నన్ను
గరిమ నీక్షించి యో కవివర్య మున్ను
ధర సంస్కృతప్రాకృతముఖ భాషలను
ద్రవిడాంధ్రములఁ బ్రబంధము లెన్నియైన
నొనరించితివి మాకు సంతసం బెసఁగ
నాగస్తుతి శేషాచలోరువైభవము

ప్రకటితాలంక్రియా స్ఫదవర్ణనలను
వినువక శృంగార వీరాద్భుతాది
రసములు భావముల్ రంజిల్లునట్లు
ద్విపద లోకులకెల్లఁ దెలివిడిగాన
ద్విపదగాఁ దెలుఁగునఁ దేటగావించు.
వారాహ వామనబ్రహ్మాండ పాద్మ
గారుడస్కాందమార్కండేయముఖ్య
బహుపురాణోక్తసంబాధ బు వలన
గహనమై పెనుగొన్న కథ చిక్కుదీర్చి
శరధిలోఁ గలరత్న జాతంబు లేర్చి
మెఱుఁగుసాననుదీర్చి మెలకువ దిద్ది
భూషణంబొనరించు పోలుపున కర్ణ
భూషణంబుగను సల్పుము చెల్వుగుల్క,
తొలుత భాగవత భక్తులు మాకు కబ్బ
ములుకూర్చి ధన్యతఁ బొల్చి రన్నటులఁ
గలగని మేల్కాంచి కడుచోద్యమునను
తలఁచి తలంచి తత్కాలన నూహించి
శ్రీనివాసులె యిట్లు చెలగుచు చెలిమి
నానతిచ్చుటగాదె యని నిశ్చయించి
మానితభాగ్యసంభావన నెంతె
నానందరసవార్ధి యాత్మనుప్పొంగ
వారాహవామన బ్రహ్మాండపాద్మ
గారుడాదిపురాణ కథలు శోధించి
కసటుదేర్చి ప్రసిద్ధకథ సంగ్రహించి
వెసచిత్రకథ చాల విస్మృతఘటితఁ

గదియించి పునరుక్తి కథ ద్రోచి మొదలు
తుద యేర్పరించి బంధురసంగతులను
పూర్వోత్తరవిరోధములుద్రోఁచ నీక
సర్వసమాధానసరణి దీపింప
ఘటియించి తగునలంకారముల్ గలుగ

. . .    . . .    . . .    . . .

నతులశృంగారవీరాద్భుత రసము
లతిశయించఁగ విభావాది భావములు
భావుకభావసంభావ్యత నలరఁ
గావించి పటుమహాకావ్యలక్షణము
వెలయఁ దెనుంగున ద్విపదకావ్యముగ
నల వేంకటాద్రిమాహాత్మ్యమింపొంద
శ్రీనివాసవిలాససేవధి యనఁగ
భూనుతవిఖ్యాతి పొసఁగ సల్పెదను.
శయ్యకుఁదగిన యుజ్జ్వల మృదుపదము
లొయ్యారినడలు శుభోరుకాంతియును
నలువొందు సూక్ష్మత నడుమఁ జెన్నొంద
చెలఁగనుచ్చైస్తన శ్రీనలంకృతులు
వితతలక్షణముల విఖ్యాతిఁజెంది
యతులితసద్వృత్తు లమరవహించి
సరసభావంబులు సౌకుమార్యంబు
తెరలెడు బెళుకులు తియ్యబల్కులును
మలసిమించు సువర్ణమయమూర్తి యగుచు
లలితశృంగారలీలల సొంపు నింపు
గైకొని సుముఖమై గడుప్రసన్నతను

శ్రీకాంత కెనగాఁగ చెలఁగుమత్కా[1] వక్ష
కన్యకఁగలశాబ్ధి కన్యకావిభుఁడు
ధన్యచరిత్రు డుదారశేఖరుఁడు
రతిరాజజనకుఁడౌ రమణీయమూర్తి
యతిలోకవైభవు డతిపుణ్యకీర్తి
అఘహారి గుణహారి యహితసంహారి
అఘటనఘటనావిహారియౌ శౌరి
పతిగాఁగఁదగునంచు భావించి కాంచి
మతిలోన హర్షించి మరియు నూహించి

ప్రాకృతభాష

ఇందరక్ఖయథే ఉపేంద ముయుంద
చందచూళత్థుత జలజత్థజణయ

శౌరసేని

కమణియ్యకహా దెచ్ఛగవ్వసంతిఅర
యమిసహా దాణిం పియంకాహి ణాహా

మాగధి

శిళివహలావల్ల హే ‘శిదలోఅశుళ హే
శిళివచ్ఛళుఇళంగె చిళతళపుళుశె

పైశాచి

గునపున్న కాలున్న కోత్థుహహాలన
అనహామతనలూప అరియ ముంతాహి

చూళికోక్తి

సలచక్ఖ చకతీసె చనరక్ఖనపల
కులుతలకున పాహి కోవింతలాచ

1. వ్రా. ప్ర. “చలగు మతనిశ్కృతి”

ఖాండీరం

దేవు రే పదిమక్ఖ దీనరక్ఖణు రె
పావణచరిదు రే పణమేమి తుహా రె

ఇందులకు ఛాయ

ఇంద్రరక్షకహే ఉపేంద్రముకుంద
చంద్రచూడస్తుత జలజాస్త్రజనక
కమనీయకథ దైత్యగర్వశాంతికర
యమసఖే దాసీం ప్రియంకురు నాథ 190.
శ్రీవధూవల్లభ శ్రితలోక సులభ
శ్రీవత్సరుచిరాంగ చిరతరపురుష
గుణపూర్ణకారుణ్య కౌస్తుభాభరణ
అనఘమదనరూప ఆర్య మాం త్రాహి
శరజాక్ష జగదీశ జనరక్షణపర
గురుతరగుణ పాహి గోవిందరాజ !
దేవ భో పద్మాక్ష ! దీనరక్షణ భో !
పావనచరిత భో ! ప్రణమామి త్వాం భో !
అని యిట్టి బాసల నచ్చెరువెనఁగ
కొనియాడుచును వేగఁగని కొల్చి మఱియు 200.
శ్రీచిత్రకూటపురీ నివాసునకు
ప్రాచిత భువనకారణవిలాసునకు
దుగ్ధాబ్ధికన్యకా ధూర్వహస్థితికి
ముగ్ధగోపాంగనా మోహనాకృతికిఁ
గిరిరాజరక్షణ కారుణ్యనిధికిఁ
బరమయోగీశ్వర భావనావధికి
భక్తపరాధీన పార్థసారథికి

వ్యక్తసాధుజనేప్సితార్థసేవధికి
కల్యాణగుణగణాకరశీలునకును
... ... ... ...
భువనమౌక్తికచయ ప్రోతసూత్రునకు
దివిజసన్నుతవసుదేవపుత్రునకు
నరకసంహారి కానందకారికిని
ధరణీధారికి బుధాంతరవిహారికిని
స్థిరకృపావేశ రక్షితబిడౌజునకు
హరవిరించ్యార్చ్యపాదాంభోజునకును
అతిమహోదార భూర్యమరభూజునకు
వితతతేజునకు గోవిందరాజునకుఁ
బూనిసమర్పితంబుగ నే నొనర్చు
శ్రీనివాసవిలాససేవధి యందు
భువనపావన గుణాద్భుతతమ మహిమఁ
గవినుతంబగు కథాక్రమ మెట్టి దనిన

కథా ప్రారంభము.

శ్రీనైమిశారణ్యసీమను వ్యాస
మౌనికిఁ బ్రియశిష్యమణియన సూతుఁ
డున్నతమణిపీఠి నుండఁ బురాణ
సన్నుతకథలు వే సరసవాక్ప్రౌఢి
శౌనకాదిమునీంద్ర సంఘంబు వినఁగ
వీనులకింపుగా వివరించువేళ
సన్మౌను లాతని కంజలిసేసి
... ... ... ...

మును పెక్కులుపురాణములు మాకు మీరు
వినుపించితి రొకొండు వినఁగఁగోరెదము
వ్యాసులకరుణ మీకు కల పురాణేతి
హాసముల్ హస్తతలామలకముఁగ
విదితమ్ము లగుఁగాన వెఱపింతలేక
గదిసి యిత్తఱి యడుగఁగఁబూనితిమి
ధరణిలో నతిపుణ్యతమమైనక్షేత్ర
వరమెద్ది భువనపావనగిరి యెద్ది
యెందు ముకుందుఁ డయ్యిందిరఁ గూడి
పొందుగా విహరించు భూరిలీలలను
విచ్చలవిడి మ్రొక్కు వేఁడువారలకు
నిచ్చలు కరుణచే నిచ్చునిష్టంబు
లెక్కడ బ్రహ్మాదు లీశ్వరుఁ గాంచి
యెక్కువ భవబంధ మెడలఁజాలుదురు
భోగమోక్షము లెందు భూజనుల్ సెంద
యోగి దుర్లభబోధ మొందుదు రెట్టి
కథ వినినంతనే కలుగు సంపదలు
ప్రథితపుణ్యము లందు పాతకం బణగు
నేది విన్నంతనే యెల్ల వేదంబు
లాదరంబున విన్న యట్లగు నట్టి
స్థలము గల్గెనయేని దాచక తెల్పు
ప్రలసద్వివేక ! పౌరాణికచంద్ర !
అనవుడు సూతుఁ డత్యాశ్చర్య మొంది
ఘనచింత నూహించి ఘటికాద్వయంబు
ప్రత్యభిజ్ఞానంబుఁ బాటిల్లఁ గాంచి

యత్యంతసమ్మోదమలర నిట్లనియె.
మౌనీంద్రులార యిమ్మహారహస్యంబు
జ్ఞానవిజ్ఞానైకసాధనస్థాన
మరయంగ శుద్ధసత్త్వాస్పదం బైన
పరమపదం బొండు భావింప శేష
గిరి యొండుగాక యీక్షితిని వేఱొండు
కరము చూడఁగ వినఁగాఁ దగ దెందు
నైన వైకుంఠ[1] మమర్త్యగమ్యంబు
గానఁ బ్రత్యక్షమై కనుఁగొనరాదు
దేవమనుష్యాది దృశ్యమై భూమి
నీవేంకటాద్రి యింపెసఁగు నట్లగుట
వైకుంఠము దొఱంగి వనజాక్షుఁ డిదియె
చేకొని విహరించు శ్రీకాంతతోన
నిది మీకుఁ దెలుపంగ నేఁ గోరుచుందు
నది మీర లడుగుట నద్భుతం బయ్యె
నద్భుతం బాగిరి యతులితమహిమ
అద్భుతతర మందు హరివిహారంబు
నా కథావృత్తాంత మత్యద్భుతంబు
లోకింప నింతయు లోకాద్భుతంబు
ఆదివరాహమై హరి సృష్టివేళ
ప్రాదుర్భవించుట పరమాద్భుతంబు
కిటిరూపమున నిట్టి క్షితినుద్ధరించి
చటులత వేంకటాచల భర్తయైన
పుణ్యచరిత్ర మద్భుతతమం బని య

1. ప్రా. ప్ర. మర్త్యజ గమనీయంబు.

గణ్యవాక్పటిమ వొంగఁగఁ బఠించినను
తెలిపినఁ శుభములు తిరముగా సిరులు
కలితసౌఖ్యారోగ్య ఘనభాగ్యకీర్తు
లలఘువై భవము లత్యర్థముం గల్గి
వెలయుదు రటు గాన వినుఁడు తెల్పెదను
నావుడు మౌను లానంద ముప్పొంగ
నీవసుధోద్ధార మిటు సల్ప [1] నిటకు
నాదివరాహమై యవతీర్ణుఁ డగుట
యాదిగ శ్రీ వేంకటాద్రివై భవము
వివరింపు మన విని వే సూతుఁడటుల
వివిధవృత్తాంతముల్ వివరింపఁదొడఁగె.

శ్రీ రమణుఁడు వరాహావతారమున భూమి నుద్ధరించుట.

శ్రీ రమణుఁడు మున్ను శేషతల్పమున
క్షీరాబ్ధిని శయించి చెలఁగునవ్వేళ
లీలచే భువనముల్ సృజియించుకోర్కె
నాలోన తననాభి నంబుజం బొప్పఁ
గలిగించి యా దివ్యకమలంబునందు
నలువఁబుట్టించి యా నలువకు స్మృతుల
దయ నుపదేశించి తతపంచభూత
మయలోకనిచయ నిర్మాణపాటవము
కల్పింప నారీతి కమలసంభవుఁడు
కల్పాదియందు లోకములు సృజింపఁ
బూని నీరము వహ్ని పుడమిని గాడ్పు

1. ప్రా. ప్ర. సల్పవేటికి.

వానిన బరువుచే వసుధ మున్నీట
మునిగి కూర్మమువెన్ను మోసియుండంగఁ
గని దానిఁబై నెత్తగా నేరకునికి
పరమకారుణికాత్ముఁ బద్మనాభుండు
చిరునగ వాననశ్రీకిఁ దళ్కొసఁగ
కౌతుకం బొప్ప నాకస్మికంబుగను
శ్వేతవరాహమై చెలువొందె నపుడు
అట్టి మహావరాహాకృతి నంశ
ఘట్టనోద్ధతపరాక్రమ ముట్టిపడఁగ
ఘుర్ఘురాయితమహా ఘోరరవంబు
నిర్ఘాతశతకోటి నీటణంగించె
మెఱుగుకోరలతీరు మేతము స్థలను
దారలంగఁ గొఱకుచోఁ దునియలై వ్రీలి
దండిగా సెలవులఁ దగిలిన వెండి
కొండ ఖండంబుల కొమరున నమరె
బుసకొట్టునట్టి యూర్పులకుఁ గలంగి
కసరెత్తి సప్తసాగరము లుప్పొంగె
కడలినీరెల్ల నగ్గలిక నింకించు
బడబాగ్ను లన కండ్లు ప్రబలి కెంపెక్కె
పక్కన బ్రహ్మాండభాండంబు పగుల
నిక్కరించెను చెవుల్ నిష్ఠురాకృతిని
చలిగట్టుపై తాలసాలంబు లనఁగ
బలురోమములు నిట్రుపాటున నిలిచె
గొరిసెలఘాటిచే ఘూర్ణిల్ల జలధి
దిరదిర దిరిగె నల్దిక్కు లాకసము

[1] హారుఁడు విస్మయమొందె నది చూచి బెదరి
పరమేష్ఠి నిర్వాణపాటున నిలిచె
అప్పు డాపెనుబంది యతిజవం బంది
యుప్పొంగు ప్రళయకాలోదధి జలము
చొచ్చి చెల్లాడి హెచ్చుగ నుల్లురేచి
విచ్చలవిడి నొక్క వేదండవరము
కొలను సొచ్చిన యట్లు కొండలమొనఁగ
నల మందరము కవ్వమై త్రచ్చుకరణి
బిరబిర తెరలుబ్బి పెంపొంది ప్రోయు
నురుగు తెట్టియలు మిన్నుల నిండ నెగయ
వెసవెస పాతాళవీథిఁ గలంచి
యసురపుంగవు హిరణ్యాక్షుఁ గనుగొనియె
అట్టిదైత్యుని భీకరాకారమునను
గట్టుకై వడి తొలంగఁగ నిల్చి యెదుట
కనుగ్రుడ్లు నిప్పులుగ్రక్కంగ నోరు
పెనుబొంద చందాన బెట్టుగాఁ దెఱచి
యడరినపిడుగుల ట్లార్చి యెంతయును
పొడవైన చేతుల పూన్కి నంబుధులు
తెరవిచ్చి పాయలై తెఱువిచ్చి తొలఁగ
నురువడి [2] నడరిన యురువేగమునను
గిరగిర దిరుగుచుఁ గెరలి లోఁదెరలి
మొరయు నార్భటి మారుమొరయున ట్లుబికి
నుడివడ నీరముల్ నుడిఁబడి కలఁగ

---

1. వ్రా. ప్ర. హారూఢ.
2. వ్రా. ప్ర. నడవినయూర్వ్యురువేగ.

తోడివడ నటఁజేరి దొరకె నిం దొక్క
భక్షణం బని వేగఁ బఱచిన వాని
నాక్షణంబ వరాహ మలుకఁచేఁ దాఁకె
తాఁకిన యసుర నత్తఱిఁ దత్తరమున
వీఁక దప్పక గిన్క వేగ ఘట్టించి
పిడికిటఁ బొడిచిన బెట్టు రోసమునఁ
గడిమికోరల వాఁడి గావించి మించి
వడిమీఱ సురరాజు వసుధాధరంబుఁ
గడక వజ్రముచేత ఖండించినటుల
కరిరాజకుంభంబు కంఠీరవంబు
గురుతరనఖరేఖఁ గొట్టిన యటుల
తనకకోరకరాళ దంష్ట్రాగ్రమునను
తునియించి గొరిజలఁ ద్రొక్కి చెక్కాడ
రక్కసుం డీల్గె తద్రక్తంబు లెగసి
యక్కజంబుగ నిండ నంభోధిజలము
నంతయుఁ గలయంగ నరుణీభవించె
నంతట నాదంష్ట్రి యతివేగమునను
ఆదికూర్మము వీఁపునందుండు ధరణి
నాదరంబుగ గాంచి యవలీలగాఁగ
నొక కోరమొన నొత్తియుబుకఁ బైకెత్తి
యెగసి వెల్వడివచ్చి యిల ధాత కిచ్చి
ఫణిరాజుపడగలపై నిల్పి నపుడు
ప్రణతులు గావించు పద్మసంభవుని
కల్పాంత మిటువలెఁ గాఁగ లోకములు
కల్పించు మిఁక నొండు గలుగ దపాయ

మనుచు నానతియిచ్చి యఖిలభూచక్ర
మనువుగాఁగనుఁగొంచు నట సంచరించి
కులపర్వతమ్ములు కుదురుగా నుంచి
జలధుల విభజించి చంద్రసూర్యులకు
నుచితతేజములతో నుండ నేమించి
రుచిరమౌ గౌతమీరోధను చేసి
చెంతను భక్తితో సేవించుగరుడు
నంత వీక్షించి యిట్లని యానతిచ్చె

**వైనతేయుఁడు హరియాజ్ఞచే వైకుంఠమునుండి రత్న నగరాజమును దెచ్చుట**

పక్షీంద్ర నీవు నిబ్బరమున నేగి
యక్షీణలక్ష్మిచే నలరువైకుంఠ
నగరంబునను మన నగరిలో రత్న
నగరాజ మొకటి యున్నదిగదా దాని
భువికిఁ దేవలె నిందు భూరిలీలలను
దవులుగా విహరింపఁ దమిబుట్టు మదిని
ఇందిరారమణిని హితపారిషదుల
నిందురా తోడ్కొని యేగి వేవేగ
ననుచు నియోగించి యావైనతేయు
ననిచి గౌతమిదాటి యలకౌతుకమున
మరి కుంభజావాసమహితదిగ్భాగ
మరయుచు గౌతమి కరువ దామడను
స్వర్ణముఖర్యాఖ్యవాహిని చెంత
స్వర్ణ[1] నగాధిత్య సదృశ మహానొక్క—

1. వ్రా. ప్ర. స్వర్ణగణాద్యంన,

వనముఁగన్గొని దాని వైఖరి[1] కలరి
వినుతిసేయుచు నందు విహరించుచుండె
అపు డట్టివనభూమి హారికటాక్షమున
విపుల లక్ష్మివహించె వివిధభూజములు
చందన మందార చంపకాశోక
తిందుక జంబీర దేవదారువులు
తాల తమాల హింతాల తక్కోల
నారికేళామ్ర మన్మథ సింధువార
పారిజాతార్జున పనస శైలూష
నారంగ పున్నాగ నాగకేసరము
లామలక కదంబ కాశ్వత్థ వకుళ
తామస తింత్రిణీ తపసాఖ్యములును
న్యగ్రోధ సప్తపర్ణాశ్వకర్ణార్క
శిగ్రుకరంజక శ్రీఫల కుటజ
కరవీర మరువక కంకేలికోల
కురవ కురంటక కోవిదారములు
పిచుమంద జంబూ విభీతక హారిత
లికుచ శాభ యాలర్క నింబ ఝింటికలు
సాల కాకోల రసాల దాడిమలు
పాలాశ శాల్మలి పాటలంబులును
సురభి ప్రియాళ రించోళ ఖర్జూర
సరళ వంశాగురు సహకారములును
తిలక లవంగ జాతిక పూగ ఖదిర
కలివాన శింశుపా కర్ణికారములు

1. ప్రా. ప్ర. కలిగి.

కదళీవనంబులు కలువబావులును
పొదలైన మల్లెలు బొండుమల్లియలు
చేవంతులును పచ్చచేవంతిగములు
తావిరంజిల్లు గేదంగిమొత్తములు
జాదులు విరిజాజి సన్నజాజులును
పూదోటలం జెలంగు పూపొదరిండ్లు
కమలాకరంబులు కల్హారములును
విమలకాసారముల్ విపులనిర్ఝరము
లంతంతకును వసంతావాసమునంగ
నెంతయు వింతగా నింపొందెనందు.
అపు డట్టిపక్షికులాధినాథుండు
విపులవిక్రమమున వినువీధి కెగసి
వారిదంబులు రెక్కవడిం ద్రోలంగంగ
భూరి మారుతపదంబులు విలంఘించి
స్వర్గలోకము దాంటి వడి మహర్లోక
మార్గంబును ధరించి మరి జనలోక
మాతపోలోకంబు లవలీలం గడచి
ధాతకు నిరవుగాం దగు సత్యలోక
ము నతిక్రమించి సమున్నతాజాండ
ఘనవివరము దూరి గడిమీఱి యెసగ
నావరణజలంబు లగ్నిమండలము
నావాతబంధంబు నంధకారంబు
పెనుబయల్ వెనుకంబోం బెట్టురికి
ఘనవిరజానది గర్భంబు సొచ్చి
కడతేరి యద్దరి కడిమిమ్రాకుం జేరి

నడచి యూర్వై కుంతనగరోపకంఠ
మగుట సద్భక్తి సాష్టాంగ మెఱఁగి
తగు వినయంబుతోఁ దడయ కేగంగ
నుద్యానవనసీమ నుండుభూజములు
విద్యాధరాప్సరుల్ వివిధకిన్నరులు
క్రీడామృగంబులు కేకిశారికలు
చూడనౌ హంసముల్ శుకకోకిలములు
నప్రాకృతంబులై యమలవిజ్ఞాన
దీప్రంబు లగుటచేఁ దిలకించి యతని
సేమ మరసి యక్కుఁ జేర్చి సంతసిలి
ప్రేమ నాతిథ్యంబు పెనుపొందఁ జేయ
వడిఁ దేఱి యాతండు వారి వీడుకొని
వడినేగి యాపురద్వారంబు గాంచె
నందు నూరును పదియారు వన్నియల
కుందనంబులు చెక్కు గోపురంబులను
పులుఁగురా మేటిరూపులు దాల్చి మెఱుఁగు
పులుఁగురాతాల గుంపుల డాలెసంగ
చెలఁగుడాలులు తమ శేఖరంబులుగఁ
[1] గులుకుఘంటికలు పల్కుల నాదరింప
చలువగా డ్పాలయ నైజపటాళి వీవ
నలరుచు నొయ్యన నరుగు నత్తఱిని
వివిధమణీగృహవీథికాతతుల
ధవళేందుకాంత సౌధప్రకాండములు
విస్తృత వైడూర్య వేదికావళులు
నిస్తుల ముక్తామణీకవాటములు

1. ప్రా. ప్ర. ఘంటికలు.

తులలేని పచ్చల తోరణములును
వెలలేని పగడాల వేయుకంబములు
దృష్టింపరానట్టి దీప్తుల కెంపు
లష్టాంగవజ్రంబు లంతరాంతరము
లంతయుఁ దాఁచిన యట్టికుడ్యములు
వింతనీలములు బర్వెనగవాక్షములు
పొలుపొందు కాంచనపుష్పరాగములు
మలచిన యాస్థానమంటపంబులును
జీవదంతంబులఁ జెలఁగుసెజ్జలును
జీవిపాంచాలికాంచిత విటంకములు
నిలువుటద్దములు వన్నిన పడకిండ్లు
నిలువునిగ్గొడిక మందినకురుంజులును
గాణిక్యనటన రంగస్థలంబులును
మాణిక్యములఁ బొల్చు మజ్జనశాల
లాణిముత్యమ్ముల హావణించు నంబు
వేణికాయంత్రముల్ వెలయుమేడలును
చలువరానిగనిగల్ సవరించుమించు
చలువతాలఁ జెలంగు చప్పరంబులును
గోరోచనచ్ఛవి గుల్కు—పా న్పలర
పేరోజనంబులఁ బేర్చుమంచములు
చమరవాలంబులు జల్లు లుల్లసిలి
యమరవాటిల్లు నాయతవితానములు
మణిశైలములమించు మఱపించి మించు
రణరణన్నవరత్న రథకదంబములు
నిరుపమ చింతామణీచిత్ర సింహా

పరివారితోన్నత భద్రపీఠములు
కలితకాంచన పత్రికాధూయమాన
లలితశుద్ధాంత డోలాయంత్రములును
విధుముఖజనవచోవిసరానువాద
మధురోక్తశారికా మణిపంజరములు
కనుఁగొన నానందకరములై మెఱయఁ
దనరు నప్పురియొప్పిదములు వర్ణింప
వశమె శేషునకైన వాక్పతికైన
నసమేక్షణునకైన నజునకునైన
నా నందకాయుధునాలయాంబరయు
నానందరసఘనమై తేజరిల్లు
బద్ధచేతనులకుఁ బ్రాపించరాని
శుద్ధసత్త్వైకవిస్ఫూర్తి రంజిల్లు
నిత్యముక్తాత్ముల నిలుచుప్రో లగుచు
నిత్యసత్యజ్ఞాననివహమై యొప్పు
సూరచంద్రాగ్నులు చొరరాని దివ్య
భూరితేజఃపుంజముగఁ దేజరిల్లు
వేనూరువేవేలవేలక్షకోటి
పూని యొక్కెడఁగూడి పొదలక నిలిచి
మెఱయుమెఱుంగుల మొఱుఁగులేమైన
నరయ ననంతకోట్యర్కులేమైన
సరిగఁబోల్పంగ నచ్చటి మిణుంగురుల
కురుఁజునిగ్గుకురాదు గొనరాదుసువ్వె
అట్టి వైకుంఠపురాంతరంబునను
దిట్టమై చని వైనతేయుండు కృష్ణుఁ

బొలుచుమేడలు మేడఁ బొలయుపుల్గులును
పల్కుఁగులతోఁ బల్కు పుణ్యపూరుషులు
పురుషులు ధరియించు భూషణంబులును
వరభూషణమ్ముల వరలునమ్మణులు
మణికీలితంబైన మందిరగణము
గణనీయమూర్తుల క్రమమునఁగుశల
మడుగంగ నటుసేమమంతలువడసి
నుడుల కలవిగాని నూత్న[1] విభూతి
భవనుతుండైనట్టి పరిభూతభవుని
భవనప్రతీహార భాగంబు సేరి
యచలబంగరుబెత్తు లనువుగాఁ బూని
యచిరప్రభానిభంబైనఖడ్గంబు
పడఁతల ధరియించి పసిడిపుట్టంబు
కటిమిన్నగాఁ గట్టి కరతలంబులను
సవరణచెలగంగ శంఖచక్రములు
వివిధభూషణములు వెలయఁగఁ దాల్చి
నరకిరీటంబు శ్రీ వత్సలాంఛనము
నురమునఁ గౌస్తుభం బొప్పు మురారి
సారూప్యమున నిల్చు జయవిజయులను
గూరిమి భజియించి కుశలము లడిగి
తా వచ్చురాకయుఁ దడయక తెల్పి
దేవనియోగంబు దెలియ నిట్లనియె
వినుఁడు శ్రీ రమణుండు వెన్నుండు ధరణిఁ
దనలీల విహరింపఁదలఁచి యుండుండు

1. ప్రా. ప్ర. వైభవము.

పడవాలు మొదలుగాఁ బరిజనంబులను
దడయక దోడ్కొని తతవిహారార్థి
తెమ్మని ననుబంచె దేవాజ్ఞ యట్లు
నెమ్మితోఁ జనుఁడని నియమించి మఱియు
సైన్యపతికిఁ బారిషదులకు మ్రొక్కి
మాన్యత నిందిరామందిరోద్యాన
మరయుచు నరిగి యం దారత్నశైల
మరుదుగాఁ గనుఁగొని యాత్మ రంజిల్ల
ఘనలీలనిం దెకా కమలావధూటి
వనజాక్షుఁడును గూడి వదలనిప్రేమ
సరసంబులాడుచు సరివలపులను
మురువుగా నేకతంబున రహఃకేళి
సలుపుదు రిం దెకా సారకహ్లార
జలజోత్పలంబుల సరుల నొండొరులఁ
గయిసేసి కస్తూరికాతిలకములు
ప్రియమున దిద్దుచు బిగువుకౌగిళ్ల
మెలఁగుదు రీపొన్న మృదుపల్లవములఁ
జెలిమి నిందేకాదె చెలఁగి జూదంబు
వింతగా నాడుచు వేడ్క నందుదురు
చెంత నీపాళి యాచెలువుఁ డెల్పెడని
మచ్చిక నిచ్చోట మఱలయుచు నిరుప్ప
రిచ్చటభుజియింతు రీభాజనమున
నీ సరోవరమున నీదులాడుచును
భాసురజలకేళి పాటింతు రెపుడు
గుహచెంత నిం దెకా కొమరుమీఱంగ
విహరింతు రడుగు లివ్వేళఁ గన్పట్టె

నిరువురు నీచోటనే నిరుల్ గోసి
రరయఁగా దేని యిట్లలరునే తోఁట
ఈపొన్ననీడనే యెనసి కూర్చుండ
రేపున నటు గాన నిది కరం బెసఁగె
నౌర యీతరువులయందంబు నేఁబు
నోరులచేనైన నుతియింపఁ దరమె
పగడంపువన్నియ పరగినతరులు
ధగధగద్రుచులచేఁ దనరెడుఁ గాదె
మరకతమణికాంతి మలయు నీమహిజ
వరము లింపొందెడి వనభూషలగుచు
చంద్రకాంతచ్ఛవిఁ జలుచు నిట్టి
సాంద్రద్రుమము లొప్పసాగె నయ్యారె
మే లిట్టిలతికలు మిసిమిబంగారు
డాలు మించంగ నాట్యము సేయఁదొడఁగె
భళిరె యీపొదరిండ్లు బటువుముత్తెముల
కొలఁది లేమొగ్గలగుత్తులఁ దాల్చె
నిచ్చటిమృగములు నిన్నివన్నియల
మెచ్చుచు మారీచమృగలీలఁ బూనె
నెన్నన్నివింత లివ్యోడఁ గాననయ్యో
వెన్నుఁడు విహరించు వెల్గు లబ్బుటను
బాపురె యీశృంగపాళి రత్నములఁ
జూపట్టుచున్నది సొబగు రంజిల్ల
నిది వింత యీఝరి యెనలేనిపసిమి
యుదిరి కడానిడా లూని రాణించె
నని మెచ్చిచూచుచు నచ్చెరువంది

విన్నుతించుచు వెస మ్రొక్కు వెండియు లేచు
మొదలి ప్రదక్షిణంబులు సేయు భక్తి
పెనుపొంద భావించుఁ బేర్మినటించు
నానందభరితుఁడై యానందకథరు
నానతిఁదలపోసి యతివేగ డాసి
పటులీల నా గిరి బలిమి నెత్తంగ
కటిని బంగరుశాల్వ కడిమి బిగించి
మేరుశైలాయితమేయైన సాటి
గా రూఢిఁ గొన్న శిఖరసంఘములును
నల రోహణాద్రిసహస్రంబులైన
తుల సేయరానట్టి తుంగశృంగములు
మంచుకొండలకోటి మార్కొని గెలువ
మించిన కూటముల్ మిగులఁ గ్రాలంగ
ఫణిరాజఫణములపగిది మాణిక్య
ఘృణి నొప్పు సానువుల్ కెలన దీపింప
మహనీయమందిరమండలాకృతిని
గుహలు లతాగృహకోటులు దనర
నా లతాగృహములయందుఁ గిన్నరులు
కేళిని బొందుచు గీతముల్ సేయ
నల గీతు లాలించి యలరి యచ్చరలు
లలితనాట్యంబులు లయమీఱ సలుప
నా నటనము మెచ్చి యచట బర్హంబు
లూని [1] కలాపిక లుగ్గడించంగ

1. వ్రా. ప్ర. భరతులూని కళాచికలు.

నా తాళమానంబు లంది మయూరు
లాతతలాస్యంబు హావణింపుచుండ
నట్టి లాస్యంబున కతిహర్ష మొంది
నెట్టన శుకహంసనికరంబు వొగడ
నగలక్ష్మి చూడ నన్నగరా జొనర్చు
సొగసు నాటకశాలచొప్పున నొప్పు
బాపురే యనఁగ ముప్పదియోజనముల
చాపును మూఁడు యోజనముల వెళుపు
కలిగి వెన్నునిపాన్పుగా నుల్లసిల్లు
చిలువరాయనిరూపు చేకొని మెఱసి
మరియుఁ గోటికిరీటమండలిఁ దాల్చి
వరుసగ మణిసానువరభూష లంది
జాతరూపావని జాతరూపాగ్ర్య
పీతాంబరం బింపు పెంపొందఁ గట్టి
నృత్యన్మయూరికోన్నిద్రబర్హంబు
లత్యంతరుచు లీన హంసచక్రంబు
రహిఁ శంఖచక్రపరంపరగాఁగ
బహుళపద్మాకరపంక్తులకాంతు
లమితలోచనవదనాభఁ జూపంగ
విమలనిర్ఝరహారవితతి శోభిల్ల
స్ఫారవిరాట్స్వరూపంబునఁ బొలుచు
నారాయణుండె కా నలువుండు నట్టి
నారాయణాద్రిఁ దిన్నగ నుద్ధరించి
భూరిభుజాశక్తిఁ బూని మాపునను
వారక నంటి విష్వక్సేనముఖులు

కూరిమి రాఁగ చంగున నింగి కెగసి
నిజపక్షవిక్షేపనిష్ఠురోద్ధతుల
గజిబిజి బ్రహ్మాండఘటము లూఁటాడ
మెఱిసిసట్టులు కండ్లు మిఱుమిట్లుగొనఁగ
సురకిన్నరాదులు చూచి నివ్వెఱగు
పడి కంప మొంద సప్తసముద్రపాళి
సుడివడి ఘూర్ణిల్లుచును బెట్టు మొరయ
కులగిరుల్ దిర్దిర కుమ్మరిసారె
పోలుపునఁ దిరుగంగ భూనభోంతరము
దిక్కులు బోరునన్ దీరనిరొదలఁ
బిక్కటిల్లగ లోకభీకరంబుగను
జవసంజనితభూరిఝంఝానిలంబు
భువనపాళిక నిండి భూరుహంబులను
పెకలించి సుడిగాడ్పు బిసబిస విసర
వికలజీర్ణపలాశవితతి యనంగ
భ్రమియింపఁగాఁ జని ప్రౌఢవేగమున
నిమిషమాత్రనె తెచ్చి నీరజేక్షణుని
సమ్ముఖమున పారిషదులును దాను
నెమ్మి కేల్మోడ్చి వినీతుఁడయి నిలిచె
నిలిచిన విహగాగ్రణిని బూర్ణకరుణఁ
దిలకించి యా వాసుదేవుండు చెంత
సారసకలహంసచక్రవాకములు
సారసోత్పలలతాచయంబులఁ గవలు
గూడి మృణాళముల్ గొని మెసవుచును
వేడుక విహరింప ఏరుల తేనియలు

గ్రోలుచు తుమ్మెదల్ రొప్పు ఝంకృతులు
చాల వీనుల కెల్ల సంతసం బెసఁగ
తటజమందార చందన కుంద వకుళ
కుటజ చంపక వట కోవిదారములు
నాగకేసర తాల నారంగ పనస
పూగ పున్నాగ జంబూ ముఖద్రుమము
లతిశీతలచ్ఛాయ లడరించు శాఖ
లతులితచ్ఛవి గప్పి యావరింపుచును
పుష్పవత్కీర్ణముల్ బొదలంగనీక
పుష్పధారావర్షములు గురియంగ
నల్ల నీడలజాడ నరిగి తెమ్మెరలు
చల్లదనము తావి చల్లంగ మెఱయు
స్వామిపుష్కరిణియన్ సరసునుఁ జూపి
ఈ మహాసరసిపై నెసగంగ ధరణి
నిడు మన నాతఁ డయ్యెడ సమంబైన
పుడమిని యా దివ్యభూధరం బునిచె

దేవతలు వరాహస్వామిని స్తుతించుట.

అప్పుడు వినువీథి నలరులసోన
లొప్ప వేల్పులభేరు లులిసె నచ్చరలు
నటియించి రటు జూచి నలినసంభవుఁడు
నిటలాక్షుఁ డింద్రుండు నిర్జరమునులు
నతివిస్మయంబున నచ్చోటి కరిగి
క్షితివరాహస్వామి సేవించి భక్తి
ప్రణుతించి దేవ యో భక్తమందార

గుణగణాధార త్రిగుణవర్జితాత్మ
ఈవె జగత్కర్త వీవె రక్షితవు
నీవె సంహర్తవునీవె బ్రహ్మాండంబు
ధర నుద్ధరించి తందరిని బ్రోచితివి
స్థిరమైన నీదు శక్తిప్రభావమున
నే మెల్ల నీవిచ్చు నియ్యాధికార
మోముహాలుదు మింక నొకటన్న నేల
సర్వశక్తివి సర్వజగదాత్మ వీవ
సర్వభూతదయైకజలనిధి వీవ
యనఘాత్ముఁడు గజేంద్రుఁ డాదిమూలంబ
యని నిన్ను దలఁచెఁ గా కన్యుల మదిని
దలఁచెనే సురమునుల్ తగువేళ నిన్నుఁ
గొలుతురు గా కన్యుఁ గొలువఁ బోవుదురె
సరవిగా భజియించు సకలజీవులకు
వరము లిచ్చెద నని శివాదు లియ్యఁగలరు
భువనరక్షకుఁ గాదె భూమిక లిటుల
నవధరించితి వీవె నభవుండ వీవు
పరమకారుణికస్వభావ నీయమిత
వరగుణోత్కరములు వర్ణింపఁగలమె
తనుధారు లిట్టు లీదారుణరూప
మును జూచి భయమున మూర్ఛ లయ్యెదరు
చాలించి యీమూర్తి సౌమ్యరూపమున
మే లొసంగవె జనుల్ నేము గొల్వఁగను
నావుడు నా సురలకానందం బెసంగ
సేవింప నింపైన శ్రీనివాసుండయి

నిలిచి వారు నుతింప నిఖిలేప్సితములు
ననువున నొసంగి యంతట నాత్మమాయ
నంతర్హితుండైన నా శ్రీనివాసుఁ
డంతర్హితంబయ్యె నద్భుతంబుగను 720.
అటుల తిరోధాన మందు గోవిందుఁ
బటుభావనం గాంచి బ్రహ్మాదు లపుడు
తమనివాసములకుఁ దరలి యేగుటయు
రమణీయమైన నారాయణగిరిని
తపనీయగోపురాస్థానమంటపని
రుపమభద్రాసనద్యుతు లింపు నింప
యత్నదుస్సాధస్వయంవ్యక్తమైన
రత్నవిమానంబు ప్రాదుర్భవించె
నందు ముకుందుండు వ్యక్తరూపమున
నిందిరం దిరమైన యెలమితో నలమి 730.
వదలక నంత విష్వక్సేనగరుడు
లుదితభక్తిని జెంత నుడిగముల్ సేయ
నిత్యముక్తులు భక్తి నెరి నోలగింప
సత్యసంకల్పత్వసత్యకామతలు
ప్రత్యక్షముగ నాత్మభావంబుఁ జూడ
నిత్యంబు లీలైకనిరతభావమున
నొక్కొక్కయెడ సదృశ్యుం డయి మరియు
నొక్కొక్కవేళ మాయోపగూఢుఁ డయి
యొకచో వరాహమై యుదయించు మూర్తి
యొకచో నృసింహమై యొనరు రూపమున 740.
నొక్కెడ శ్రీనివాసోజ్జ్వలాకృతిని

నొక్కెడ వరరాజయోగ్యవేషమున
వనవిహారమ్ముల వరదరిసలుప
లను విలాసముల డోలాఖేలనముల
నిష్కటరోహణాన్విత [1] మగు స్వామి
పుష్కరిణిని శుభాంబుక్రీడనమున
వాహనారోహణవారితవిహృతి
సాహసమృగయాప్రసంగకలీల
నవ్యాజదీనావనాసక్తి నెపుడు
భవ్యసంచారంబు పరఁగ సల్పుచును
శ్రీ వేంకటాచలశృంగాంతరమున
నీవఁగ యుగము లెన్నేనియు నుండె
ననుచు సూతుఁడు వరాహపురాణసరణి
వినుతింపగా మునుల్ విస్మితాత్ము లయి
బాదరాయణపాదపంకజభృంగ
వేదాంతనిధి నీవు విశదంబు గాఁగ
వైకుంఠకిటివైభవంబును వేంక
టాకుంఠితాతిమాహాత్మ్యంబు లోక
మాన్యపురాణక్రమమున దెల్పి విని
ధన్యుల మైతిమి తగ నందు స్వామి
పుష్కరిణి యనంగ భువి నెట్లు గలిగె
పుష్కరాక్షున కది ముద మెట్లు సల్పె
శ్రీపతి నెవ్వారు సేరి గన్గొనిరి
యేపగిదిని యూరేఁ డిల విహరించె
నంతయుఁ దేటగా నాద్యంత మిపుడు

1. వ్రా. ప్ర. స్వామికేశవస్వామి.

సంతోషముగ సవిస్తారంబు దెలుపు
మనుచు ప్రార్థించిన నమ్మునీంద్రులకు
వినవిన నమృతంబు వెదజల్లినటుల
నభినవానందంబు లతిశయించంగ
శుభకథావ్యాఖ్యాత సూతుఁ డిట్లనియె 770.

స్వామిపుష్కరిణీ ప్రభావము.

యమిచంద్రులార నారాయణాశైల
విమలవైభవములు వివరించుతఱిని
స్వామిపుష్కరిణిం బ్రసంగసంగతిగ
నేమును సంగ్రహోక్తిని బేర్కొనిన
నదె మీర లడిగెద రట్టి మాహాత్మ్య
మెదనుంచి పలుకంగ నెవ్వరితరము
పదినూరువోములఫణిరాజుకైన
వదనాయుతము గల్గు వనజాక్షుకైన
స్వామిపుష్కరిణీస్రవంతిప్రభావ
భూమ గణింపను బొగడంగ వశమె ? 780.
ఐన నే వినినంత యరసి మీ కిపుడు
పూని తెల్పెదు మహాద్భుత మద్భవిల్ల
పావన మిది మహాపాపహారంబు
భావితారోగ్యసంపత్కారణంబు
కేవలశ్రవణసంకీర్తనామృతము
సావధానము మీఱ సమకట్టి వినుఁడు.
మును పా హరి వరాహమూర్తియై ధరణి
కనుఁగొని చింతించి కల్పాదియందు

ప్రళయతమఃకృతాపావనత్వమున
కెలమి నిష్కృతిఁజేయ నిచ్ఛించి మదిని
నిజపదోద్భవమైన నిర్ఝరతటిని
నిజముగా నెప్పుడు నిత్యయై కతనఁ
బ్రళయవేళను దానిఁ బ్రళయమై కుంఠ
విలసితోద్యానప్రవిష్టమై సట్టి
స్వామిపుష్కరిణిలో సంగతి నునిచి
యే మేను గా నని యుర్వికిఁ బిలువ
గంగతో స్వామిపుష్కరిణియు వచ్చె
సంగతిశుచిగాఁగ సలిపె నీ భూమి
జలజాక్షుఁడును గేళిసరమైన దీని
తొలఁగక తత్తటి ధ్రువముగా నిలిచెఁ
గావున స్వామిపుష్కరిణి లోకైక
పావని హరిమనఃప్రమదంబు సల్పు
దానిఁ దలంచిన తలఁగు నఘంబు
మానితపుణ్యసంపదయుఁ జేకురును
స్వామిపుష్కరిణియన్ సంజ్ఞఁ బేర్కొనిన
భూమి సదారోగ్యభోగభాగ్యములు
పుత్రపౌత్రసమృద్ధి పుణ్యకీర్తులును
ధాత్రీతలస్వామితయును సిద్ధించు
నై రమ్మదసరోవరాఖ్యఁ జెన్నొంది
సారెకు హరికేళిసరసిగాఁ జెలఁగు
ఆ తీర్థముఁ బ్రదక్షిణావృత్తినతులఁ
బ్రీతిఁ బూజించిన స్త్రీశూద్రులకును
గోరిక లెల్లఁ జేకూరు నెల్లెడలఁ

దీరు నాపద లెల్ల దివ్యసౌఖ్యములు
కలుగు నెంతయు లక్ష్మి కదలక యింట
నెలకొను హరిభక్తి నిత్య ముప్పొంగు
నల తీర్థతీరమునందు వరాహుఁ
గొలిచి పూజించినఁ గోటిజన్మముల
కలుషసంఘంబు తక్షణమే తొలంగు
తలఁచిన నిష్టసంతానంబు గలుగు
బహుభాషణము లేల బధిరాంధమూక
విహతాంగవంధ్యాదివివిధజనంబు
లాపుణ్యతీర్థంబునందు వత్సరము
రేపకడనె మున్గి శ్రీకాంతుఁ గొల్చి
నియమంబు మీఱంగ నిత్యకృత్యంబు
నయపరులై విధానక్రమంబునను
వ్రత మాచరించి యవ్వత్సరాంతమున
క్షితిసురపూజ లా శ్రీనివాసులకుఁ
బ్రీతిగా భక్తి సల్పిన యట్టివారి
కేతీరునను గోర్కె లీడేరు సువ్వొ
వినికి చూడ్కియుఁ బల్కు వినుతాంగపటిమ
తనయులుం గలుగును తథ్య మెంతయును
అది గల్గు నిది గల్గ దని సంశయంబు
మది నుంచకుఁడు తీర్థమహిమ యట్టిదియె

### శంఖణుఁడను చంద్రవంశపురాజు కథ

ఇతిహాస మొక్కటి యిట్టి యర్థమున
ప్రతిబంధ మయ్యె నప్పరిపాటి వినుఁడు

ఇద్ధరఁ గాంభోజ మేలువాఁ డొకఁడు
బుద్ధిసంపన్నుండు భూరివైభవుఁడు
మంత్రివశ్యుఁడు సాంగమంత్రకోవిదుఁడు
సంత్రాసితాఖిలశత్రుమండలుఁడు
నీతిశాస్త్రజ్ఞుఁడు నిఖిలార్థవేది
ఖ్యాతిమంతుఁడు పరాక్రమపంచముఖుఁడు
తురగరేవంతుఁడు దోర్బలాన్వితుఁడు
సరసాగ్రగణ్యుండు శస్త్రాస్త్రవిదుఁడు
శరదభ్రశంకరాచలహారహీర
శరచామరపటీరసారకర్పూర
పారదడిండీరఫణివరక్షీర
శారదరాభ్రేభసంఘనీహార
శంఖేందుజాహ్నవిసదృశసత్కీర్తి
శంఖణుం డనురాజు చంద్రవంశజుఁడు
కలఁ డాతఁడు విచిత్రకళల భోజుండు
కలనైన పగరఁ బెన్గలనైన నన్య
కాంతలపాలిండ్లు కైసేయఁ డెందు
పంతంబునను ద్యూతపటిమఁ జేకొనఁడు
వేడకము న్నిచ్చు వేడెనే నర్థి
వేడినంతకు హెచ్చు వేవేగ నిచ్చు
నాడఁడు పెక్కు లట్లాడెనే నంటి
యాడినంతయు నిక్క మైయుండఁ జేయు
నెంచఁడు నేరంబు లెంచెనేని బుధు
లెంచంగ శిక్షించు నెయ్యెడ ఖలుల
నలుగఁ డల్పంబున కలుగునే నొకెడ
నలుకరేఁచువిరోధి నప్పుడె ఖండించు

వినయపరుండయ్యు విమతులయెడల
ననయంబు భీషణుం డగుచుఁ జెలంగు
వీతలోభుఁడయైన విబుధసంగతుల
నాతతలోభంబు నాత్మ వహించు
భయదూరుఁడయ్యును పరమశాంతాత్మ
లయినవిప్రులపట్ల నతిభీతి మెలఁగు
ధరఁ దాన యఖిలస్వతంత్రుఁడై యుండి
గురుజనపరతంత్రగుణములఁ బరగు
నలహరిశ్చంద్రశంతనుముఖ్యభూప
తులకన్నఁ బుణ్యుం డతులధర్మశీలు
డాశాధిపసమానుఁ డగు నట్టి యతఁడు
కాశినిమించు సాంకాస్యాఖ్యపురిని
రాజ్యపాలనకేళారక్తుఁడై ప్రజల
ప్రాజ్యభుజాశక్తిపటిమఁ బ్రోచుచును
భూలోకగతుఁడైన పురుహూతుపగిది
శ్రీల వైభవములఁ జెలఁగుచుండంగ
మహనీయశీలుండు మాళవాధిపుఁడు
విహితధర్మపరుండు విజయుఁ డన్వాఁడు
రతికన్నఁ జక్కని రమణీలలామ
ప్రతిలేక నటియించు బంగరుబొమ్మ
మెఱుఁగుకన్నను నిగ్గుమెఱయు పూఁబోఁడి
మరునిదీపమువంటి మానినీమణిని
మొనసి లేజవ్వనంబునఁ బొల్చుదానిఁ
దనకూఁతుఁ గనుఁగొని తగ నిట్లు దలఁచె
ఆమని లేఁదీవె యలరినయట్లు

ఈ మెలఁతకు మేన నెసఁగె జవ్వనము
ప్రాయంబువచ్చిన బాల నిట్లుంచ
న్యాయంబు గాదు నా నరపాలుఁ డెవఁడు
దీనిరూపవిలాసదీప్తుల కెనయఁ
బూనుచక్కదనంబు బొలుపొందువాఁడు
కులశీలములె యింపు గురుజనంబులకు
బలపరాక్రమములే భావించు తండ్రి
యమితసంపదలకు హర్షించు మాత
రమణీయరూపంబు ప్రార్థించు కన్య
కావున మన మెంతగా మంచివరుని
భావించి తెచ్చిన బాలికామణికి
మన సెట్టులుండునో మన కేల యింక
వనిత కిప్పుడు స్వయంవరము చాటించి
రాజుల నందఱ రావింపవలయు
రాజాస్య తనకైన రమణు వరించు
నని నిర్ణయంబుగా నరసి దూతలను
జననాథులకు నిట్టె సరవి చాటించ
బనిచి నిజావాసపట్టణం బెల్ల
దనరఁ గైసేయఁ బ్రధానుల బంచె
వారలు నారత్నవతి యనుపురము
గారవంబునను సింగారింపఁ దొడఁగి
బంగారుమేరువుల్ బలుకుఱుంజాలును
రంగైన కేతువారంబులు దనరు
పందిరు లుత్తుంగభవనభాగములు
పొందైన తోరణంబులును గావించి

పచ్చలతోరణప్రకరంబుఁ గట్టి
పచ్చకప్రపుముగ్గు బరఁగఁ బెట్టించి
విరులసరుల్ బూన్చి వివిధవీథులను
నెరయ నెచ్చోటఁ బన్నీరు జల్కించి
యల గృహాపాళిక ననటికంబములు
నిలిపి మంచలు దీర్చి నీటు మీఱంగ
హారంబట్టు మేల్కట్టు లోరుగుదిండులను
కెంబట్టు సుళువుసకినెలపానుపులు
తాపితాబిల్లలు తగుచిత్రపటము
లేపట్ల సవరించి హెచ్చుతివాసు
లేపుగఁ బరపించి లేఖాంగలనఁగఁ
జూపట్టు గణికల సొగసు మీఱంగఁ
దాళవై ఖరుల నృత్తము సల్పుచుండ
మేళంబు లెయ్యెడ మిక్కిలి మెఱయ
వీణారవంబులు వెలయించి రపుడు
రాణించె నాపురరత్న మెంతయును
అంతట మహికాంతు లట్టి వృత్తాంత
మంతయు విని కాంత నంతరంగమునఁ
దలఁచి మోహాంబునఁ దడయక వెడలి
నిలిచినపాళెన నిలువక తమక
మడర హుటాహుటి నప్పురంబునకు
వడి నేగ శంఖణవసుధాధిపుఁడును
చతురంగబలముతో సన్నాహ మెసఁగ
నతులితోన్నతిఁ బటహార్భటిచెలఁగ
దివినుండి భువిడిగ్గు దేవేంద్రుకరణి

రవళి నేగెడు రతిరాజుచందమున
రత్నవతీనగరంబున యువతి
రత్నంబు గైకొన రహి నేగె నంత
వచ్చినయారాజవరుని భూవరులు
విచ్చలవిడిఁ జూచి వీనిరూపంబు
వీని విలాసంబు వీని వైభవము
వీని యొయ్యారము వెలఁది కన్గొనిన
మనలను వరియింప మనమునఁ దలఁప
దని యాస లుడిగి తియ్యనివిల్తుకాక
లురవడి మది నంట నుస్సురు మనుచు
పొరలుచుఁ జింతతోఁ బొగులుచుండంగ
నారాజులను మాళవాధినాథుండు
కూరిమితో నెదుర్కొనుచు రప్పించి
[1] తగినబిడారు లందఱికి నొసంగి
వగమీఱ నులుపాలు వరుసఁ బెట్టించె
ఈ రాజు లందంద నీటు లుల్లసిల
నారయ నిరవలంబాయాసి నగుచు
నే నుండరా దంచు నినుఁడు సిగ్గునను
తాను గ్రుంకె ననంగఁ దపనుండు గ్రుంకె
వీరల యనురాగవిసరంబు విరిసి
మీఱి వెల్లురికె యెమ్మెయి న పరాశ
నెలకొనెనో యనంగ నిరుపమరాగ
మిల నపరాశ నెంతేనియు నడరె
నారాజులకు మోము లటు నల్లనైన
తీరునఁ దమముచే దిఙ్ముఖంబులును

1. ప్రా ప్ర. తనదుబిడారు.

నల్లఁదనము దాల్చె నవతారలకును
వెల్లఁదనము దోఁచువిధమున నంత
తారలరుచి ననంతము తెల్లఁబారె
సారమందస్మితచంద్రిక లెసఁగ
వెస శంఖణముఖంబు వీఁకఁ జంద్రుండు
లసమానకళలచెల్వమునఁ జెలంగె
తరుణివేమరులున ధరణీశు లపుడు
విరహతాపముఁ జెందువెరవున నందు
మక్కువఁ దనుకవల్ మాయ నాయెనని
జక్కవల్ విరహజసంతాప మొందె
నట్టిజేలకు రమణ్యాభినివేశమున
నట్టి చే యుగయుగంబై యుండె మదికి
నంత వియుక్తుల నడరి యేయుటలు
కంతుఁడు చాలించఁగా వానిధర్మ
దారలు ప్రోయుచందానఁ గుక్కుటము
లారవంబు లొనర్చె నానిశాంతమున
తరుణావళీరక్తిఁ దా ప్రముచ్చిలించి
యరుణుండు ధృతరక్తిమ కానఁబడియె
నినుఁ డగ్నికిరణ మయ్యెడఁ గొని యరుణు
నెనయ ననూరుగా నిడి రథంబునను
వినువీధిఁ ద్రిప్పంగ వెడలెనో యనఁగ
ఘనరక్తి నుదయాద్రిఁ గనుపట్టె నంత
అంధకారకిరాతుఁ డణఁగంగ ముదము
సంధిల్ల జెలువొందె జక్కవకవలు
తమవల్లభకరంబు తను వంటినపుడె

తమిమీఱఁ బద్మిని దనరె నల్లసిరి
కళలంది పద్మినీ కాంతసంగతికిఁ
గలువ సిగ్గున వేగఁ గన్నులు మోడ్చె
నావేళ భూపాలు లందఱు రేయి
పూవుఁబోఁడివిరాళిఁ బొరయక నిదుర
జేగురించినకండ్లు చిదుముడిపాటు
తావిమించినమేను తమకు రంజిల్ల
మజ్జనంబై చల్వమడుగులు గట్టి
అజ్జగా తిలకంబు హావణించి నుదుట
కలపంబు లలఁది మై కలితభూషణము
లలరుచుఁ దాల్చి యొయ్యారంబు మీఱ
పరిచారకులు చెంతఁ బరిచర్య సేయ
వరుస మంచెలమీఁద వైభవం బొప్ప
విరులతూపులవానివిశ్వరూపంబు
కరణి ధారణిగాఁగ గడు మెఱయంగ
అపు డట్టి మూళవాధ్యక్షుకుమారిఁ
జపలేక్షణులు మంచి సంపంగినూనె
యంటి జకల మార్చి హరువుగా నూనె
గంటి వైచి హరిద్ర గలయు కుంకుమము
వన్నె మీఱఁగఁ బూసి వలిపెంపుమడుగు
నన్నెఱి తడి యొత్తి నయమైన మెఱుఁగు
చెంగావి పావడ చెలువొందఁ గట్టి
బంగారు సరిగంచు బలురంగు మించు
దువ్వాటంబు ఘటించి దురుసుచన్దోయిఁ
బువ్వులజంటల పొంబట్టు రవికె

బిగువుగాఁ దొడిగించి పేర్మి ఫాలమున
మృగనాభి తిలక మొప్పెను దిద్ది ముద్దు
చెక్కుల మకరికల్ చెలువొప్ప వ్రాసి
చక్కఁగాఁ గండ్ల కంజనములు దీర్చి
కమ్మలు భావిలీల్ కంకణమ్ములును
సొమ్మైన హారమ్ము లుంగరంబులును
సందిదండలు కంఠసరులు బారీలు
నందెలు మెట్టియల్ హారువు మేఖలయు
బంగరొడ్డాణంబు బన్నసరములు
ముంగర పాపటబొట్టును చంద్ర
వంకయు మురువులు వరుసఁ గై సేసి
పొంకంబుగఁ దురాయిఁ బూనిచి కొండ
రందంబుగా గంద మలఁద నెమ్మేన
పొందుగా జడ యల్లి పొలతి వేఱొర్తు
నెరికురులను తావి నెఱిమించునటుల
విరులు సరుల్ చుట్టి వెల్గె రాణింప
రతనంపుకమలంబు రహి కీలు గొలుప
నతిమోహనాంగియై యా తటిల్లతిక
పొలుపున నపరంజిబొమ్మచందమున
వలనొప్ప నప్సరోవనితచాడ్పునను
చెలఁగుచు వెడలి నెచ్చెలు లెందరేని
కొలువఁగ బెత్తులు గొని యన్నగార్లు
ముందరి జనబృందముల నివారింప
నందఱుం గనుఁగొని యర్మిలిఁ బొగడ
లీల మధూకమాలిక చేతఁ బూని

చాల మాణిక్యహంసకములు మ్రోయ
ధళధళభూషణతతమణుల్ మెఱయ
వలరాజువంటి భూవరుని వరింప
నతులసంభ్రమముతో నరదంబు నెక్కి
రతిలీల రాజమార్గము ప్రవేశించె
వచ్చుచో నా కన్యవైఖరిఁ జూచి
మెచ్చుగాఁ బురజనుల్ మేడలనుండి
మఱిమఱి దిలకించి మగువ లమ్మగువ
మఱువుకు మురు లంది ముచ్చట మీఱ
నీ రమణి వరింప నెవనికి భాగ్య
మారూఢిఁ గలుగునో యతఁడె ధన్యుండు
పదివేలజన్మముల్ బలు సూదిమొనను
పద మటు లూని తపంబు సల్పినను
గాక యీ కమలాక్షిఁ గలియు సుఖంబు
చేకూరునే యెంత శ్రీమంతునకును
మనలను మగువలై మహి స్సృజియించి
వనజసంభవుఁ డెంత వంచన చేసె
నైనను దీనిమే నంటి పెనంగఁ
గా నొక సామ్యముగాఁ గల్పించఁడాయె
నీ రంగు నీయంగు నీ యొయ్యారంబు
నీ రూపు నీ కైపు నీ విలాసంబు
లీ కుల్కు లీ తళ్కు లీ బెళ్కుచూపు
లీ కల్కితనముల నెంచి చూడంగ
నింతయు నీ యింతి కెనఁగెను గాక
కాంతల కింతైనఁ గలుగునే జగతి

మునుపు మోహినియైన మురవైరిరూపు
గనఁగొన నిదె బోలు కంతునియింతి
యేము యీ మదిరాక్షి యే మహీపాలుఁ
బ్రేమ మీఱంగ వరించునో గాక
వనజాస్త్రుఁడైన నవ్వనితఁ గూడంగ
ఘనతపం బొనరించఁగావలెఁ గాదె
యనుచు విస్మయ మంది యలరుచుఁ జూడ
ననఁబోఁడి మంచెల నడుచక్కి నరిగె
అయ్యెడ కలవాణి యనునొక్క దాది
చయ్యన నా రాజసంఘంబుఁ జూచి
వారి యూరును పేరు వంశవైభవము
వారక తెలిసినవనిత తా నగుట
వనజేక్షణకు వారి వరుసగాఁ జూపి
వినుతించి వేర్వేర వినుతింపఁ దొడఁగె
కలికిరో ! తిలకించఁగదవె యీ రాజు
బలశాలి రతికళాపాంచాలుఁ డిందు
కులజుఁ డా వనరాశికువలయం బేలఁ
గల మేటి నకులుఁడఁట కర్నాటవిభుఁడు
వీని వరించ నో వెలది ! నీ వెంచి
తేని చేకొనవచ్చు నింద్రభోగములు
నావు డా కన్య యన్నరనాథుఁ జూచి
భావ ముంచమి నగి పలుకక నిలిచె
నిలుచుబాలమనంబు నెమ్మదిఁ దెలిసి
కలవాణి యవ్వలికడ కేగి బలికె
కలికి చూచితివె యీ కాశ్మీరరాజు

పలికి బొంకనివాఁడు భండనంబునను
పరరాజమత్తేభపంచవక్త్రుండు
నిరుపమప్రాభవనిర్జరేంద్రుండు
వితరణకర్ణుండు విఖ్యాతకీర్తి
క్రతుమంతుఁ డనుపేరు గలవాఁడు వీఁడు
వరియించితేని దుర్వారసౌఖ్యములు
నిరతంబు చేకూరు నీలాహివేణి !
అనవు డా మదిరాక్షి యటు మోముఁ ద్రిప్పఁ
గని సమ్మతముగామి కలవాణి యవల
నుండు నొక్క నృపాలు నువిదకుఁ జూపి
మండలేంద్రుఁడు వీఁడు మత్స్యభూవిభుఁడు
చాతుర్యగాంభీర్యశౌర్యధుర్యుండు
ఖ్యాతిమంతుఁడు సుప్రకాశుఁ డర్కరాజు
వీనిఁ బెండ్లాడవే విరిఁబోణి యనిన
పూనినవిరిదండ పూఁబోణి డించె
మనసు వీనెడ లేదు మదవతి కనుచు
కనుఁగొని కలవాణి కడిమి ముందరను
పేరోలగంబున్న పృథివీశుఁ జూచి
వారిజేక్షణ వీఁడు వంగభూవరుఁడు
సత్యకీర్తిసుతుండు సంజయాఖ్యుండు
కృత్త్యంబరునిచెంతఁ గినియక దనరు
వలరాజుచందంబువాఁ డిటు లెస్స
తిలకింపఁగదె వధూతిలకమా ! వీని
చెట్టఁ బట్టితివేని సిరులు భోగములు
మట్టుమీఱఁగఁ గల్గు మతమె నీ కనిన

ఆవలికథఁ జెల్పు మనె నంబుజాక్షి
యా వనితను జూచి యటు కలవాణి
యరిగి పురోవర్తియగు నృపుఁ జూచి
తరుణీలలామ ! యీ ధాత్రీవరుండు
భోజనృపాలుండు పుణ్యశీలుండు
తేజోంబుజాప్తుండు దేవారిసుతుఁడు
జనదేవుఁ డనురాజు సౌందర్యశాలి
కనకాంగి ! మొగ మెత్తి కనుఁగొను మితని
వీనిపొందుకు వేల్పువిరిబోణులైన
మానసంబునఁ గోరి మరులు చెందుదురు
అనిన సమ్మతిలేని యా యంబుజాక్షిఁ
గని యవ్వలికి నేగి కలవాణి వలికె
వీఁడె పాండ్యవిభుండు విశ్రుతకీర్తి
వాఁడిమీఱినవాఁడు వైరులయెడల
సరసాగ్రగణ్యుండు జయవర్మ యనెడు
నరపాలుఁ డీతఁడే నవబోణి ! చూడు
ఇతఁ డింపుగాఁడేని యెలనాఁగ ! యతఁడు
ప్రతిలేని చోళభూపాలవర్యుండు
శ్రుతవంతుఁ డనురాజు సురరాజతుల్యుఁ
డతులవిక్రమకళాహతవైరిబలుఁడు
నలకూబరజయంతనవరూపశాలి
యలివేణి యీతని నంగీకరించు
మీతఁడు సరిపోఁడె యిభరాజగమన !
ఈతఁడే తిరిగి చూ డీ రాజవరుని
ఇతఁడె కాంభోజభూమీశ్వరాత్మజుఁడు

వితతపరాక్రమవీరసింహంబు
చంద్రవంశంబున జనియించి కీర్తి
చంద్రికల్ వెదజల్లు సర్వజ్ఞమౌళి
శంఖకుందమ[1] రాళచంద్రసత్కీర్తి
శంఖణుఁ డనురాజు జలజాస్త్రసముఁడు
తిలకింపవే సిగ్గుతెర పుచ్చి వీనిఁ
గలిసి నీ కెనయైన కాంతుఁ డితండె
కుందనంబును మణి గూడినపగిది
పొందు వీనికి నీకుఁ బొసఁగు నిక్కంబు
నెల వెన్నెలను జెంది నీటైన యట్ల
యొలనాఁగ! నిను బొంది యితఁడు రంజిల్లు
రతి మదను వహించి రహి మించినట్లు
పతిగాఁగ నితని బాల చేకొమ్మ
నా విని మాళవనరనాథుకన్య
భావించి తనమదిఁ బతిగా వరించి
ఈక్షణోత్పలదాన మెసఁగంగఁ బూన్చి
లక్షితమధుకమాల్యంబును వైచె
అంతనే దుందుభు లార్భటి మ్రోసె
కాంతలదీవనల్ కడువేడ్కఁ జెలఁగె
మంచలు దిగి యేగు మహిపాలురకును
ముంచినచీకట్ల ముఖపద్మపాళి
ముకుళించె శంఖణుముఖచంద్రుఁ డలరి
ప్రకటించె శ్యామానుభావకలక్ష్మి

1. వ్రా. ప్ర. కుంద మరంద.

నపుడు మాళవవసుధాధినాథుండు
నుపచరింపుచు శంఖణోర్వీశమాళి
కా కన్నియకుఁ బెండ్లి యపుడె కావించె
లోకు లుత్సవము లాలోకించి పొగడ
పరిభవంబును బొందు పార్థివు లెల్ల
కరకరి చింతించి కాతరబుద్ధి
దొమ్మి చేయఁ దలంచి దొడరి మాళవుఁడు
గ్రమ్మిన నిలువ శక్యంబు గా దనుచుఁ
గాంభోజుపై నీర్ష్య కడు వెల్లివిరియ
సంభృతలజ్జ మించగ నేగి రంత
అల వధూవరు లాత్మ హర్షించి కొన్ని
నెల లుండి వెనుక నా నృపుఁ డరణంబు
నొసఁగి పంపించ వా రుల్లసిల్లుచును
పొసగిన తమతమ పురముల కేగి
సతతంబు రతితంత్రసౌఖ్యానుభూతి
నతులితానందంబు లందుచు నుండి
రటులఁ గొన్ని దినంబులైన శంఖణుఁడు
పటుతరనిజరాజ్యపాలన మఱచి
గణకుల మంత్రులఁ గనుఁగొన కాప్త
గణముల డిగనాడి కామభోగముల
పరవశుఁడై గురుబంధుహితోక్తి
నరుచిఁ జేయుచు నెప్పు డంతఃపురంబు
తరలక నెవరికి దరిశన మీక
తరుణిరతాసక్తిఁ దగిలియుండఁగను
గొన్ని దినంబులకును మీఱి యహితు

లున్నతైశ్వర్యంబు నొంది రాజ్యాంగ
మంతయుఁ గ్రమమున నాక్రమించుకొని
కొంత పేరడిగాఁగ గొహా రడగించి
మంత్రిమిత్రాదు లేమరి యుండునట్లు
తంత్రంబు లొనరించి తచ్చనచెలిమి
గావించి సామంతగణ్యసైనికులను
రావించి నలుదిక్కు రాయిడిచేసి
పురమున నొకకొంత పోటు బుట్టించి
మరి భేదదానసామముల లో జెరివి
కూటయోధులు గుంపు గూడి గ్రమ్మినను
పాటించి యా మాట బహుదినంబులకు
వనితాభుజిష్యల వచనంబువలన
విని శంఖణుఁడు బైలువెడలి కోపమున
శరచాపధారియై చనిన నా రమణి
వెరచి పిరుందనె వెడలినఁ జూచి
యింతిరో చింత యింతేల నీ వుండు
మంతఃపురంబున నర్థక్షణంబు
పురము ముట్టడిచేయఁ బూనినవైరి
ధరణీశబలముల దరలంగఁ గొట్టి
సొచ్చుపాళెము లెల్ల చూరలుబట్టి
విచ్చిపోఁదఱుముదు వెఱవ నేమిటికి
ననవుడు వల్లభు నలమి కౌఁగిటను
వనజాక్షి కన్నీరు వరువ గట్టంగ
విభునిసాహసవృత్తి విడిపించఁ దలఁచి
యభిమతనీతిగా నతని కిట్లనియె

అవనీశులకు మంత్రు లాప్తులు కోశ
మవికలరాష్ట్రంబు నఖిలదుర్గములు
చతురంగబలములు స్వవశంబు లగుచుఁ
బ్రతిపాలితములైనఁ బరుఁ గెల్వవచ్చు
నివి యెల్ల నొరునిచే నిచ్చినరాజు
భువి వైరుల జయించి పొగడొందఁ గలఁడె ?
రమణ మోసము వచ్చె రాజనీతులకు
క్రమ మెఱుఁగక నీవె రాజ్యతంత్రంబు
పరునియం దిడి మిత్రబంధువర్గముల
నరయక గజతురగాదిసైన్యములఁ
బరికింపక ధనంబు పాటి చేకొనక
గురుజనమంత్రిముఖ్యులమాట వినక
ననిశంబు కామభోగాసక్తిఁ దగిలి
ధనబలసంగ్రహాస్థఁ దొలంగి యుంటి
వేనును నీమంత్రు లెచ్చరింపంగ
నానాఁడు దెల్పిన నదియు నీమదికి
విన నింపు గాదయ్యె విధివశం బటుల
వెనుక చింతించుట వెఱ్ఱికార్యంబు
ఇపుడు నీవరులపై నేగంగ నెవ్వ
రు పబలంబుగ వచ్చి తూర్పు వా రిచట
పగర లందఱు గూడి పై విడియుంగఁ
దగునె నీ వొకఁడవే తారసంబగుట
కలహంబునకుఁ దఱిగా దిట్టివేళ
నిలయంబునం దిఁక నిలువంగరాదు
రమ్ము పోదము మధ్యరాత్రమ్మునందె

ఇమ్ము దప్పినవేళ నెమ్మి యేమిటికి
ననుచు యోజనఁ జెల్వు నా వన్నెలాడిఁ
గనుఁగొని దైన్యంబు గదురంగ జనువు
మున్మురించగ నతిముగ్ధభావమున
కొమ్మను వెంటఁ దోడ్కొని నడురేయి

పురము రాజ్యము ధనంబులను బో విడిచి
నరపతి ఘోరకాననముల కరిగె
అరుగుచో నామాళవాధిపుకన్య
ధరణి మోపినఁ గందు తన పాదములను
పలుగురాళ్లును [1] ముండ్లు బలుకంప లడరు
బలుకానఁ బ్రియునివెంబడి నంట నడవ
చిగురులకన్నను జిగికోమలికము
తగునట్టి యడుగుల తగిలి కంటకము
లెడలేక నాట నయ్యేలనాఁగ నొప్పిఁ
దడయుచుఁ జీకటిఁ దడవాడికొనుచు

తోవఁ గానక పొదల్ దూరి చే నెల్ల
దీవెలుకంప లెంతేఁ గొట్టి జీరు
కొనునట్టి బల్ చురుకును నెరుంగకయు
గునుకగంటికి రూఢి కోరెందగుములు
కుంతళంబులఁ బట్టి గుంజి యీడువగ
నంతయుఁ దప్పించి యరుగుచో నెదుట
గుటగుట రొప్పుచు గోల్పులుత్వాలుగు
లట వీభములు వరాహములు గార్కొతు

1. వ్రా. ప్ర. ముండ్లు బరికి: ప. లడరు.

కదుపులు చేమలగములు సింగములు
పొదలుచు భీకరంబులుగాఁ జరింప
నళుకుచు మై కంప మందంగ నిలుచు
నళికుంతలను జూచి యువనీవిభుండు
కడు శోకమున నెదఁ గనలుచు నూతఁ
బడి వెడలఁగలేని ఫణిరాజుపగిది
బోనునఁ జిక్కు బెబ్బులిచందమునను
కాననోదంబునఁ గాల్రొమ్మగ్గి ద్రెళ్లు
వనదంతిచాడ్పున వగ మీఱ నూర్చి
నను జెట్టఁబట్టంగ ననబోఁడి నీకు
కడలేని యాపదల్ గలిగెఁగా నింత
యిడుములఁ బడి కుందు నీ పాటుకన్న
పగరపైఁ బడి తెగి పడిన మే ల్గాదె
మగుడక దావాగ్ని మ్రగ్గిన లెస్స
మాళవరాజకుమారివై యెల్ల
వేళల వేవేలు వెలఁదులు గొలువ
నలరుదోటల చల్లనాగు చప్పరముల
నెలకొని యాడుచు నిరతిభోగంబు
లనుభవింపుచునుండు నట్టి నీ విపుడు
ఘనభయంకరమృగాకరమైనయట్టి
వనభూమి భయ మొంది వణఁకుచు నిటుల
మొనసి దుఃఖాబ్ధిని మునుఁగగా నయ్యో
కటకటా విధి యెంత కరుణావిహీనుఁ
డటవి నివ్వెరిబోఁణి నలయించఁ దగునె
యనుచు కన్గవఁ గ్రమ్మ యశ్రువుల్ దొరఁగ

తనదుకౌఁగిటఁ జేర్చి తరుణితత్పదము
లరచేతఁ దడివి ముం డ్లన్నియుఁ దీసి
నెరి బుజ్జగింపుచు నెనరు సంధిల్ల
యలరుదండ ధరించునట్టుల బాళి
నలరుబోణిని యెత్తి యక్కునఁ బూని
యహిభయంబున దూర మరిగెడుమాడ్కి
నహిభయంబున నిల్చి కరిగె బల్కుడిగి

చిటుకు మనఁగ నళ్కు చింతయు నిగుడ
పటుగతి నుదయమహాపాటికి నైదు
యోజనంబులు దాటి యొక్కెడ గాన
నేజనంబుల గానకిచ్చిననాన
విన్ననై పొదరిండ్లు విడిదిగా నిలిచి
యున్నవ వడఁ దీర్చి యాదరింపుచును
చనిచని యందందు ఝరులును దరులు
ఘనగిరులును జరుల్ గనుఁగొంచు నంత
నికటభూమిని మండనితరామగిరిని
ప్రకటగోదావరి భవ్యలహరిని

నిపుణవిహారసన్నిహితనృహరిని
యపవర్గకారిణి యగు ధర్మపురిని
సేవించి విజితసంసృతి మృగతృష్ణ
పావనవాహినిభరితయా కృష్ణ
తిలకించి యిందిరాధీశుకాపురము
కలితసంపద మించు కాంచికాపురము
చూచి మాణిక్యభాసురకవాటంబు

... ... ... ...

భావించి లోకసంభావితవారి
కావేరిఁ గాంచి యక్కడ రంగధాము
పరమదయోద్ధాముఁ బ్రణమిల్లి యవల
నరిగి కన్గొని చంపకారణ్యాలోలు
శ్రీ రాజగోపాలుఁ జెలిమి భజించి
యారాజముఖితో రయంబున నరిగి
దక్షిణపాథోధితటభూమిఁ జేరి
వీక్షించి యలరుచు వెలఁది కిట్లనియె

సముద్రవర్ణనము.

జలరాశి చూచితే జలజాతనయన !
ఇల యెల్ల జుట్టుక యెటు మట్టిమేర
లోకపట్టునను లేక యుండియు నీతిఁ
బ్రకటించి మర్యాద పాటించు రాజు
పోలుపున నిట్టి యంభోధిరా జెపుడు
చెలియలికట్ట మించి యొకింత రాఁడు
గాక తరంగసంఘాతఘాతమున
కీ కట్ట యానునె యెయ్యెడనైన
ప్రబలోర్మికావధూపరిధూయమాన
నిబిడాచ్ఛశీకరనికరచామరము
లలర ననంతాంతరాక్రాంతవిశద
జలదమండలమయచ్ఛత్రంబు మెఱయ
ఘనపాండుడిండీరఖండహారములు
దనర విద్రుమలతాతతిచిత్రచేల
మంతరాళాంతరీపాంతికరత్న
సంతతోన్నతమహాచలకిరీటంబు

[1] సావేగమృగనాభిసారాంగరాగ
మావేలవితతశంఖారవంబులును
విపులాంగకచ్ఛపవితతిఖేటములు
నిపుణతిమింగిలనికరకింకరులు
విలసిల్లగా వినువీధిపై కెగసి
బెళుకు జూపి నటించు పెనువాలుగలును
నటుల విద్యలు జూపు నాకేభఘటలు
ఘటితధ్వజంబులుగా బారు లిడగ
జలమానుషావళిసైన్యంబు గొలువ
పొలుపొంది నిధి మహాంబుధిచక్రవర్తి
జలనిధి హరిలీలఁ జక్రప్రయుక్తి
వలన మహోశరవాహిను లడఁచి
వెలుపులను మన్చి విఖ్యాతి గాంచి
నీలమేఘచ్ఛాయ నెలకొనె చూడు
మీ శరధియె కాదె యినవంశకర్త
దాశరథి భజించి తను వేడ మున్ను
తనసీటఁ గొండలతండముల్ తేల్చి
ఘనసేతు వొనరింపగా వరం బొసఁగె
నలువకుక్షిని గాంచనం బుంచె ననుచు
నిలమణుల్ తన కుక్షి నిడియె నీ కడలి
యల్లుని కల్లుఁడై యలరు నీ యబ్ధి
నెల్లవింతలు గల్గు నే మద్భుతంబు
ఘోరనక్రవిహారఘూర్ణితవీచి
వారసంస్ఫాలితావనిభృద్ధురూర్ధ

1. వ్రా. ప్ర. సైవేల.

గంభీరనాళముల్ కకుబంతరాళ
జృంభత్ప్రతిధ్వానసృష్టిచే నిట్టి
భువిభూతసంఘాతముల కెల్లఁ జెవులు
చెవుడుపడంగ మించి మృదంగభంగ
ఢక్కార ఢమఢమ ద్రటహాటాత్కార
ధిక్కార మొనరించు తీరు వహించె
మదిరాక్షి ! చూడు మీ మహితరాజీవ
మిది నీదు కన్గవ కెన యౌదు నంచు
కడు మిట్టిపడనేల కాంచునే లీల
జడధిసంభవమైన సంభ్రమం బింతె
యెలనాఁగ నీ వేణి కెన యౌదు నంచు
నల నాగ మురుభోగ మందనేమిటికి
చెలగు నామోదంబు చెల్లునే తనకు
మలక మాత్రమె గాక మరి యేమి గలదు
మగువ నీ మోవితో మలయుదు ననుచు
పగడంబు జగడంబు పచరించఁ దగునె
సరసత తన కెందు సాగునే వట్టి
పరుసంబె తనవంకపా లెట్లు దీరు
చాన ! నీయూరుతో సరివత్తు ననుచు
నా నాచుతీవె తా నలరంగ నేమి
ఈ చక్కఁదన మొందు టెట్లకో తనదు
కౌచు బాపుకొనంగఁ గలదె తా ననుచు
ముచ్చటాడుచు నా సముద్రతీరమున
వచ్చు తెరల శైత్యవైఖరివలన
మయివడదీర నెమ్మది భువనాతి

శయనంబయిన దర్భశయనంబుఁ గాంచి
యిందుబింబానన యిందు భూరుహము
క్రింద నమితకీర్తి కృతి ధని రామ
చంద్రుఁ డబ్ధిగురించి సౌమిత్రిబలుచు
సాంద్రదర్భాంకురచ్ఛటఁ బవ్వళించె
కావున కల్యాణకర మిట్టి పురము
పావనతర మిభ్యపంకజాకరము
శ్రీతాళవననీలజీమూతభరము
వేతాళపుర మిదె వెలది! కన్గొనుము
వనధి సేతు వొనర్పవలసి రాఘవుఁడు
మును నవ పాషాణములు నాటె నిచట
ఈ సైకతశ్రేణి యెంత ధన్యంబో
శ్రీసఖపాదాబ్జచిహ్నముల్ దాల్ప
ననుచు నానందాశ్రు లడర భావించు
వినతులు గావించు వెసను సేవించు
నర్థించు శ్రీరామునామంబు మిగుల
కీర్తించు నిటుల భక్తి దలిర్ప నతఁడు
దుష్టరావణవంశధూమకేతువును
స్పష్టపాతకజాతశమనహేతువును
సీతాంగనామోదజీవధాతువును
వీతకల్మషరఘువీరసేతువును
గాంచి యంజలికంజకలితమౌళి యయి
ప్రాంచితానందపూర్ణాద్భుతం బడర
తిలకించితే లోకతిలకమా దీని
కలితవసుంధరాకాంతకుఁ గాంతుఁ

డాసరించు కీల్జడయో ముక్తిసౌధ
మున కెక్కు సోపానములపంక్తి యిదియ
ప్రబలమౌ రావణప్రాణమారుతము
కబళించి మించిన కాళాహి యిదియ
యవని ధరించు రత్నాకరకాంచి
సవరించురాకట్టైసగు సీల యిదియ
సముద్రగమలయగజము రాక్షసేంద్ర
కమలాహృతికిఁ జూచు కరదండ మనఁగ
తనకూతు హరియింప దశముఖుఁ ద్రుంప
కినుక రెట్టించి యీ క్షితి వనరాశి
విల్లుగా తీర ముర్వీస్థలిఁబూన్చు
భల్లకాండం బిది భావించి చూడ
నీ సేతు వద్భుతం బెద నుద్భవిల్ల
భాసురాకారమై భవము చూపెడిని
అమరాలయుంబు కా పథికమై నిండ
శమనాలయము బిండు సల్పె నీసేతు
నిల దీనిఁ దలఁచిన నెల్ల పాపములు
దొలఁగును గనుగొన్న దొరకు నిష్టములు
స్నానదానంబులు సలుపు ధన్యులకు
మానితమోక్షమె మ్మాయి కరస్థంబు
దీని మాహాత్మ్యంబు దెలిసి వర్ణింపఁ
గా నేర రీశుండు కమలజుండైన
అని నుతింపుచు నంత నఘశైలకోటిఁ
హననోగ్రశతకోటి యగు ధనుష్కోటిఁ
గని యందు దుర్వారకల్మషంబులను

మునుకొని గడుగంగ మునిగి యాతీర్థ
విధులఁ దీర్చి జపించి వెస మళ్లి యచట
మధుసూదనుని సేతుమాధవుఁ గొల్చి
అమితనిర్మలబోధు నా రామనాథుఁ
గ్రమమునఁ బొడఁగాంచి గంగాదితీర్థ
తతి నవగాహించి తగ బ్రహ్మకుండ
మతులసీతాతీర్థ మగ్నితీర్థంబు
మొదలుగా నారుణమోచనతీర్థ
మది తుదగాఁ గల్గు నన్నితీర్థముల
నరయుచు నందెల్ల నవగాహనాది
కరణీయములు సల్పి కాంతయుఁ దాను
బహువాసరము లిట్లు పరమమోదమున
మహిపాలుఁడు వసించి మరలి యనంత
శయనజనార్దనస్థలములఁ జూచి
భయహారిణినిఁ దామ్రపర్ణి నా కన్య
గ్రుంకి వైకుంఠము వృషభాచలంబు
నంకెను మలయాద్రి యదుగిరి గాంచి
యందందు శ్రీపతి నర్చించి మాని
బృందామితాశ్రమప్రియకరలహరి

స్వర్ణముఖరీవర్ణనము.

నల స్వర్ణముఖరి రయంబునఁ జేరి
తిలకించి యదియున్న తెఱఁగు భావించి
మది సంతసంబు విస్మయము నెంపొంద
మదిరేక్షణకుఁ జూపి మరియు నిట్లనియె
ఈ మహానదిఁ జూడు మిభరాజగమన!

భూమహిళాకంఠభూషణం బనఁగ
హల్లకపద్మరాగావళి మెఱయు
తెల్లదమ్ములును ముత్తెములు రాణింప
నాచులఁ బచ్చరాల్ నలువు శోభిల్ల
మేచకాబ్జమణిసమృద్ధి నింపొంది
బహువిచిత్రప్రభాభరితవిస్ఫూర్తి
రహి మించు చూడ్కులు రంజిల్ల మరియు
గండుమీలు వెడందకన్నులు గాఁగ
నాడు నిగ్గులతమ్మినెమ్మోము గాఁగ
నీలోత్పలగణంబు నెఱికురుల్ గాఁగ
లోలతరంగముల్ భుజములు గాఁగ
బలుజక్కవలు గుబ్బపాలిండ్లు గాఁగ
నలరు శైవలము రోమావళి గాఁగ
పొలుపుమీఱిన సుడి పొక్కిలి గాఁగ
తలమైన యా సైకతము శ్రోణి గాఁగ
చెలఁగు ప్రవాహంబు చేలంబు గాఁగ
కలహంసగమనంబు కడు నుల్లసిల్ల
తనవిభుఁ గలయంగఁ దమకించి నడచు
ననబోఁడికరణి యీనది యున్న దిపుడు
ఈతటినీతటి హేరాళముగను
మాతులుంగార్జున మదన మాధూక
పారిభద్ర కపిత్థ పనస జంబీర
నారంగ ఖర్జూర నారికేళముల
మాలతి మల్లికా మాళవికాంచ
సైలా వకుళ పాటలీత్యాదిలతలు

ఘనసారకదళికాకదళీవనములు
కనుఁగొన నింపొందె కనులపండువుగ
నీకాన మునిచంద్రు లెవరున్నవారొ
గాక యిట్లెనఁగునే కాననభూమి
తాపసాశ్రమము లీ తరి యెన్నియైన
చూపట్టుచున్నవి చోద్యంబు గాఁగ
ఈవల్కలములు మహీరుహంబులును
ప్రావేల్లితంబులై పరగుచున్నవియు
వారలు మునులె కావలయు నిశ్చలత
తీరభూములఁ దపస్థితి నున్నవారు
వారల నండ గోవ్యాఘ్రమృసింహేభ
సారంగవృకకిటిసారమేయాది
ఘోరజంతువు లెల్లఁ గూడి యాడుచును
వైరం బెడలి శాంతి వరలెడు నౌర
యనుచుఁ గన్గొనుచు నత్యాశ్చర్యమునను
చనిచని యా శుకాశ్రమమును గాంచె
కని యట్టి వనికి యేగంగ గంగాయ
మునలకన్న నగణ్యపుణ్యకారణము
సారసమాస్వాదసమదసంచార
... ... ... ...

చంచల్లతాంచితచంచరీకప్ర
పంచవిపంచికాభవరవోత్కరము
రుచిరాంగనతరమా రుచిరూపభాను
రచితసంతతవాసరము పద్మసరము
తిలకించి యాచుట్టు తిరిగి యా కొలని

చెలువంబునకు మెచ్చి చింతించి కొంత
వనజాక్షి యీ సరోవరమున్న సొబగు
మనమున కెంత సమ్మదము సల్పెడిని
సురకిన్నరాదులు సొంపున నిందు
విరిబోణులను గూడి విహరింతు రేమొ
మౌనీంద్రు లియ్యెడ మన నేత్రములకుఁ
గానరాకయె తపోగరిమ నుండుదురు
వినవచ్చుచున్నది విశదమౌ పలుకు
కనుఁగొన మెవ్వారిఁ గడు చోద్య మయ్యె
కలికి చూచితివె యీ కమలాకరమున
పులుగులు కవఁ గూడి పొలుపొందు తెఱఁగు
పచ్చతివాసీలు పఱచినయట్టి
రచ్చకూటంబుల రాజు లున్నటుల
కంజదళాళిపైఁ గడు బారు దీరి
రంజిల్లుచున్నవి రాజహంసములు
జక్కవ యిది ప్రాణసఖి కూర్మి నగము
మెక్కి యిచ్చినతూఁడు మెసవ నింపొంది
సారసం బొకటి లక్షణపక్షపాళిఁ
జేరి నెమ్మది నిద్ర సేయంగ సాగె
తమ్మిచాటుకు నేగు తన కొమ్మఁ గాన
కిమ్ముల వెదకెడు నీ నీరుకోడి
ఈ కురరి నిజేశు నెడబాసి దీన
యై కూత లిడుచున్న దశ్రువుల్ దొరుగ
[1] కమలసౌధము నెక్కి కాంతతో నొక్క
భ్రమరంబు మధుపాన పరవశ మయ్యె

1. వ్రా. ప్ర. కమహా.

నని చూపి రమణి కయ్యవనీశుఁ డందు
మునికి జపార్చనములు దీర్చినంత
సరసిజమిత్రుఁ డా శంఖిణుకరణి
పరరాజమండలోల్బణ ముద్భవిల్ల
పగలు మించె నటంచు పటుతేజ ముడిగి
మగువతో వనరాశిమధ్యంబుఁ జొచ్చె
అపు డిందుఁ డుదయాచలాగ్రంబునందు
నుపమించగాఁ గాంచనోన్నతసౌధ
మునఁ బెంపుమీఱు కెంపులకుంభ మనఁగ
ఘనతమోమత్తేభఘటలను ద్రుంచి
చిందు నెత్తుటఁ దడసినసింగ మనఁగ
నంద మొందెను గలశాంబుధితనయుఁ
గని యుబ్బి జగమెల్లఁ గప్పెనో యనఁగఁ
దనరుచు వెన్నెల ధర నింగి నిండె
అది చూచి యలరుచు నన్నరేంద్రుండు
సుదతియు నొకచోట సుఖనిద్రఁ జెంది
తెలిసి వేకువ లేచి దివ్యమానట్టి
జలజాకరంబున స్నానాదివిధులు
సలిపి యావనభూమిఁ జరియించు పక్షి
కులముల మృగముల గుంపులఁ జూచి
కొనుచు నచ్చటి వృక్షకుంజపుంజములు
కనుఁగొంచుఁ దత్ఫలకందమూలములు
భుజియింపుచును రొప్పు పులులకు మత్త
గజముఖ్యములకు సింగంబుగుంపులకు
బలుశరభంబులబారుల కింత

యళుకక దిరిగి యింపగుచోటఁ బండి
యతివతో ముచ్చటలాడుచు నిటుల
నతఁడు కొన్నిదినంబు లయ్యెడ నుండె
ఒకనా డతఁడు బుద్ధి నూహించి దుఃఖ
మకట నే మత్తుండనై యేల నుంటి
నమ్మఁదగనివారి నమ్మి యిక్ట్లేల
సొమ్ములు రాజ్యముల్ సుఖములు విడిచి
యడవులఁ బడనాయె నలివేణి యిట్లు
పడరానియిడుములు పడనాయె నకట
పసిడిమేడల నాడు భామిని యిందు
వసివాడఁ బొదరిండ్ల వర్తించనాయె
విరులపానుపులపై విహరించు పడతి
చురుకైన ముండ్లపై సొలయంగనాయె
బలు తూగుటుయ్యేలఁ బవళించు చెలువ
పలురాతిదిన్నెలఁ బడియుండనాయె
మగువలు గొలువఁగా మలయు మానవతి
మృగములు బెదిరించ మెలగంగ నాయె
సరసాన్నపానముల్ చవిఁ జూచునింతి
విరసకందంబులు వేడంగనాయె
కటకటా విధి యెంత కఠినుఁడో సిరుల
నటమటించి కడింది యాపదల్ పెట్టె
నెవ్వరు దిక్కింక యేమి సేయనగు
నెవ్వరు నా మది నెడ దీర్చువారు
అనుచు నసహ్యశోకాగ్నిచేఁ గంది
కనుగవ నశ్రువుల్ కడు వెల్లివిరియ

నురగంబుకై వడి నూర్చి యెంతయును
తరుణితోఁ బలుకక తనలోనె కుంది
తాను తెంపొనరించఁ దమకించు తఱిని
వానికి నాకాశవాణి యిట్లనియె
ఓహోమహీపాల ! యుడుగుమీ యిట్టి
సాహసంపు తలంపు సరగ రాజ్యంబుఁ
జెంద నుపాయంబు చెలిమిఁ దెల్పెదను
ముం దెఱుంగని శోకమును మాని వినుము
మహి నిచ్చటికిఁ గ్రోశమాత్రంబునందు
గహనాంతరమున వేంకటశైల మనఁగ
నొక గిరి యున్నది యోగిసేవితము
సకలపుణ్యాకరంబు స్వామిపుష్కరిణి
యన నొక సరమున్న దందు నీ వచట
జని యట్టి సరసిలో స్నానంబుఁ జేసి
యా సరోవరతటి హరిని గురించి
మాసషట్కము పూజ మరువక వినుము
సలుపుచుండుదువేని స్వామిపుష్కరిణిఁ
గలితవై భవమునఁ గమలేక్షణుండు
నీకోరిక లొసంగు నిక్క మింతయును
చేరుకు భాగ్యంబు చింత యేమిటికి
అనవుడా శంఖణుం డద్భుతం బొంది
కనుఁగొని దిక్కు లాకసమును నెందు
నొకజనంబును లేమి నులికి మై వడకఁ
బ్రకటోక్తి యిటు వినఁబడె నశరీర
పలుకులో స్వప్నంబో భ్రమయొ నిక్కంబొ

తెలియ దెక్కిన మేల్ దెలుపుట గాదె
యడవిలోఁ బరదేశినైన నే నెందుఁ
దోడరి వైరులచేత దొరకినరాజ్య
మెందు నే నది మళ్ల నెట్లు చేకొందు
నం దుపాయం బెట్టి దగు నకాలమున
నిది యసంభావితం బెంచి చూడంగ
తుది దైవయత్నంబు దుర్బలం బగునె
దైవంబె శరణ మెంతయు నెల్లవారి
కావిధి గా కిట్లడవులఁ దరమె
యింత చేసినవిధి కే మసాధ్యంబు
సంతసంబున నట్లు సలుపుదు గాక
యని నిశ్చయించి యయ్యతివను లేపి
తనమనంబునఁ గల్గు తలఁపెల్లఁ దెలిపి
సుదతియుఁ దాను నచ్చోటనుండి కదలి
ముదమున నుత్తరముఖముగాఁ జనియె
చని యందుఁ గాపిలాశ్రమసమీపమున

## వెంకటాచల వర్ణనము.

కనకమయంబులౌ ఘనశిఖరములు
ధళధళ మెఱయు రత్నమ్ములచరులు
చలినిగ్గురాగనుల్ సవరించు వణుకు
లచ్చుపుపచ్చరా లలరు కందరము
లెచ్చైన నీలంబు లెసగు సానువులు
కాంచనద్యుతి మించు గహనభూజములు
మించుతీగలడాలు మెచ్చని లతలు

చిత్రవర్ణముల రంజిలు మృగంబులును
నేత్రోత్సవము సేయ నిరుపమకాంతి
మలయంగ జాజ్వల్యమానరూపమున
విలసిల్లుచుండు శ్రీ వేంకటాచలము
చేరికఁ గాంచి మించిన సంతసమున
వారిజాక్షియుఁ జూచి వర్ణన సేయ
నొయ్యన గిరి నెక్కి యుచితమార్గమున
నయ్యెడ తీర్థంబు లరయుచు నతఁడు
నారాయణాద్రిచెంతను దూర్పుకడను
సారసారసవారసౌరభపూర
పూరితమారుతపోతసంచార
చారువౌ నొకవృక్షషండంబుఁ జేరి
అందు బాలురకైన నవలీలఁ గేల
నంది కోయఁగనైన యమృతోపమాన
రసము లొల్కెడు ఫలరాజభారమున
వసపోక నెంతయు వ్రాలు రెమ్మలను
మీరిన ముంతమామిడిగుంపు పనస
నేరెళ్లు తియ్యని నిమ్మలగుములు
దాడిమల్ కిత్తళ్లు దనరంగఁ బుష్ప
పాళికె వెదజల్లు పాటలాశోక
వరనాగకేసర వకుళ పున్నాగ
కరవీర కేతకి కనకవారములు
మొదలైన భూరుహంబులు తీరభూమి
ముదము సల్పంగ నంబుజము లుత్పలము
లలర సత్పురుషుల యంతరంగంబు

పొలుపున నిర్మలంబులు ప్రసన్నంబు
లై మహాపుణ్యంబులగు నుదకముల

స్వామిపుష్కరిణియొద్ద శంఖణుఁడు తపంబొనర్చుట.

స్వామి కిం పొనరించు స్వామిపుష్కరిణి
సకలతీర్థములకు స్వామిని యగుటఁ
బ్రకటింపుచుండ నా పార్థివేంద్రుండు
కనుఁగొని తనమదిఁ గడు హర్ష మొంది
మును బయల్ పల్కులు మొనసి తెల్పంగ

విన్నలక్షణముల వెస నిశ్చయించి
వన్నెలాడికి దానివై భవం బెల్ల
తెలుపుచు నిదె సుమ్ము దేవతారాధ్య
మిలఁ గల్గువారల కిష్టంబు లొసఁగు
నిదె లోకపావన మిది పుణ్యతీర్థ
మిది యోగిసేవితం బిదియె వైకుంఠ
మానితోద్యానసమాగతం బిదియు
చాన సేవించుమీ స్వామిపుష్కరిణి
యనుచు నంజలికంజ మాదలఁ జేర్చి
వినతుఁడై పొగడుచు దెసఁ బ్రదక్షిణము

గావచ్చి యాచెంతఁ గనుపట్టు పట్టు
క్రేవతీర్థంబున గ్రుంకిడి సాంధ్య
కరణీయములొనర్చి కడిమి నందొక్క
పరిశుద్ధతమభూమిఁ బటుపర్ణశాలఁ
గావించుకొని ఫలకందముల్ నియతి
గా వేళ భుజియించి కాంతతో నిట్లు

పూని నిత్యవ్రతంబుగ నాఱు నెలలు
శ్రీనివాసార్చనల్ సేయుచు నుండ

### శ్రీనివాసుండు శంఖునకుఁ బ్రత్యక్షంబై వరంబులొసఁగుట.

నొకవేళ కోటిసూర్యోదయదీప్తి
ప్రకటితంబై నట్లు పదివేలకోట్లు

మెఱుపు లొక్కెడఁ గూడి మెఱసినయటుల
మెఱయుచు రత్ననిర్మితమైన యొక్క
దివ్యవిమానంబు దేదీప్యమాన
భవ్యప్రభలు నభోభాగంబు నిండ
నా సరోవరతరంగాంతరంబునను
భాసురాంబురుహాంబుపటలి బాపుకొని
వెడలె దేవగణంబు విస్మయం బొందె
తొడివడ నైలింప దుందుభుల్ మ్రోసె
వన్నెమీఱగ పుష్పవర్షంబు గురిసె
కిన్నరగంధర్వగీతముల్ నెగడె

నచ్చరల్ నర్తించి రాగమోక్తులను
... ... ... ...
హరి చతుర్భుజుఁడు హేమాంబరధరుఁడు
కరధృతశంఖచక్రగదాయుధుండు
కమలాయతాక్షుండు కౌస్తుభాంచితుఁడు
సమదనీలాంబుదశ్యామగాత్రుండు
శ్రీవత్సచిహ్నుండు శ్రీకాంతుఁ డపుడె
ఆవిమానంబున నావిర్భవించె

అంతట నల శంఖణావనీంద్రుండు
సంతోషవిస్మయశంక లుప్పొంగఁ

దన యెదుటనె వచ్చి దయమీఱ నిల్చు
వనజలోచను శ్రీనివాసు నీక్షించి
యానందబాష్పము లలర మేనెల్ల
పూనినపులకముల్ పొలుపొంద భీతి
వడకుచు సంభ్రమవార్ధిలోఁ దేలి
కడఁగి యంతట వివేకము సంభవిల్ల
నరసి యీశ్వరుఁ డంచు నలరి సాష్టాంగ
మెఱఁగు లేచు జోహారు లిడు ప్రదక్షిణము
దిరుగుఁ బేర్కొనుచు నర్తించు హాసించు
పరువడి ద్రొక్కు నిబ్బరమున మ్రొక్కు

పొలయు నిల్చును చక్కఁజూచు నుతించు
తలచుక నిష్టముల్ తడవి యర్థించు
నిటుల భ్రాంతునిమాడ్కి నెసగు నారాజుఁ
జటులకరుణఁ జూచి జనపాల ! నీకు
నేది వాంఛిత మది యిపుడె యియ్యంగఁ
గాదె వచ్చితి మదిఁ గలవెల్ల నడుగు
మనుచు శ్రీవల్లభుఁ డాన తిచ్చుటయు
జనవల్లభుఁడు చాల సంతోష మొంది
శ్రీవల్లభ ! ముకుంద ! శేషశైలేశ !
నీ వెఱుంగని దేమి నే విన్నవింతు

నీ వొసంగినయట్టి నిజరాజ్య మెల్ల
భూవరుల్ గుమిగూడి పొదివి చేకొనిరి

నీకృప లేకున్కి నే నోట మొంది
యీకాననంబుల నిటు లున్నవాఁడ
దీనవత్సల దయాదృష్టిచే నాదు
దీనతఁ బాపవే దేవదేవేశ!
అనవుఁ డాతని హరి యాదరింపుచును
వినుము కాంభోజేంద్ర వెస నీకు రాజ్య
మిచ్చితిఁ జను మింక నేల సంశయము
విచ్చి వైరులు తామె వీగిపోయెదరు 1730.
స్వామిపుష్కరిణిలో స్నానంబు సేయు
నామనుజుల కెల్ల నాపదల్ దొలఁగు
రాజ్యంబు చేకురు ప్రార్థనకొలది
పూజ్యతయును గల్గు భువనంబునందు
నని యానతిచ్చి యయ్యంబుజాక్షుండు
వనజోద్భవాదిదేవతలు నుతింప
మానితమాయచే మణివిమానంబు
తాను నాక్షణమె యంతర్ధాన మొందె.
అంతట బ్రహ్మాదు లందఱు హరిని
చింతించి యా రాజశేఖరువలన 1740.
స్వామిదర్శనము పావనమైనయట్టి
స్వామిపుష్కరిణిదర్శనము లభించె
నని కొనియాడి నిజాలయంబులకుఁ
జనినంత నా రాజు సకియతోఁ గూడ
వేడుక నలరుచు వేంకటాచలము
నాడె డిగ్గి రయంబునఁ దన నిజపురికి
నరుగుచుండఁగ నట్టి యవనిపాలకుఁ

గరము రాజ్యార్థమై కలహంబు పొడమి
చతురంగబలములు సమయంగ వారు
హతబుద్ధులై చెందినట్టి రాజ్యంబు
సరసశంఖణుమంత్రిజనులచే నిచ్చి
ధరణీశు రావించి తసరుపట్టంబు
కట్టఁ డనుడు వారు కడువడి నెల్ల
పట్టుల వెదకుచుఁ బరతెంచి విభుని
గోదావరీతీరకుంజాంతరమున
నాదరంబునఁ గాంచి యట్టి వృత్తాంత
మంతయుఁ దెల్పి వాహనములమీఁద
నింతిని మహికాంతు నిడుకొని యరిగి
పురముఁ జేరంగ నా భూపతుల్ వచ్చి
సిరులు మించఁగ నభిషేకంబుఁ జేసి
రంతట సాంకాస్యమను పురంబునను
సంతుష్టచిత్తుఁడై శంఖణాహ్వయుఁడు
నంభోజముఖియు మహాసౌఖ్య మరల
కాంభోజదేశంబు కరుణఁ బాలించి
క్రతువులు సలుపుచుఁ గడు ధర్మనిరతి
శ్రుతులఁ బోషింపుచు సిరు లొందుచుండె.
కావున స్వామిపుష్కరిణివైభవము
లీ వసుధ నుతింప నెవరికిఁ దరము
మునుపు వాల్మీకిసన్ముని యానతిచ్చు
వినుతేతిహాసంబు వివరించి తిపుడు
ఈ కథవినువారి కిష్టసంపదలు
చేకురు భాగ్యంబు సిద్ధించు నిజము

[illegible] స్వామిసరసి వాయవ్యకోణమున
న[illegible] వరాహతీర్థాఖ్య వహించి
తనరు పావనత నుత్తరభాగమునను
ధనదతీర్థంబన ధనదభాగ్యదము
చాల నీశాన్యదిశను బుణ్యకరము
గాలవతీర్థముగా నుతి కెక్క
కరము తూరుపున మార్కండేయతీర్థ
వరముగా నాయుష్యవర్ధనఁ బగును
ఆగ్నేయదిశను మహాపావనముగ
నగ్నితీర్థంబను నాఖ్యఁ జెన్నొందు
రమణీయదక్షిణప్రాంతంబునందు
యమతీర్థమన నొప్పు నఘమోచనముగఁ
జెలఁగు రాక్షసదిశ సిద్ధిదం బగుచు
చెలువంబు దనరు వాసిష్ఠతీర్థంబు
పడమట నశ్వత్థపాదపచ్ఛాయఁ
గడు వాయుతీర్థవిఖ్యాతి నింపొందు
నడుమ సరస్వతీనామకం బగుచు
కడలేని విద్యాప్రకాశంబు నిచ్చు
నొకనాఁట నిన్నిట నొనర గ్రుంకిడిన
సకలలోకులకు నాస్వామిపుష్కరిణి
భోగభాగ్యంబులు పుత్రసంపదలు
యోగిదుర్లభముక్తియు నొసంగు సువ్వె
స్వామిపుష్కరిణిని స్నానంబు సలిపి
శ్రీ మించఁగ వరాహు సేవించ కెవఁడు
వేంకటేశ్వరుఁ గొల్వ వెడలు నవ్వాని
సంకల్పితార్థ మెంచఁగ వ్యర్థ మౌను

స్వామిపుష్కరిణీతీర్థ మాహాత్మ్యము.

వినుఁ డామహాతీర్థవిభవ మెంతయును
మునులార ! తెల్పెద ముదము రంజిల్ల
శుభ ధనుర్మాసశుక్లద్వాదశులను
విమలారుణోదయవేళలయందు
భువిఁ గల్గు గంగాదిపుణ్యతీర్థములు
జవమున స్వామిపుష్కరిణిలో వచ్చి
తమయందుఁ గ్రుంకు పాతకులపాపములు
తము నంటకుండఁ బ్రార్థన సేయుచుండు
నావేళ నందు స్నానాదికృత్యములు
గావించువారికిఁ గామితార్థములు
సిద్ధించు నిద్ధరఁ జెలఁగు గంగాది
శుద్ధనదీసరస్తోమావగాహ
పుణ్యఫలం బబ్బు పురుషోత్తముఁడు న
గణ్యకారుణ్యవీక్షలఁ బ్రోచు వారి
ననుచు రహస్యార్థ మమ్మునీశ్వరుల
కెనయ సూతుఁడు దెల్పె నింపు దీపింప
అనుచుఁ జిత్రార్థసమర్థనాకలిత
ఘనసర్గవిశ్రుతకవిముఖ్యపేర
విపులానుభావభావితసంవిధాన
కపటనాటకజగత్కారణుపేర
భాసురాంగశ్రుతిభారతిభవ్య
లాసికాగీతవిలాసునిపేర
తారకాంతకపితృద్వంద్వా [1] ద్వ్యతీత

---

1. వ్రా. ప్ర. ద్వధీత.

తారకమంత్రాభిధానునిపేర
ప్రత్యాహృతోత్తరాపత్యచైతన్య
సత్యనిత్యబ్రహ్మచర్యునిపేర
క్షీరపారావారసీకరాసార
పూరితనిజముఖాంభోజునిపేర
పావనభక్తాప్తబంధునిపేర
గోవిందరాజముకుందునిపేర
శ్రేష్ఠలూర్యన్వయశ్రేష్ఠశీలుండు
ప్రేష్ఠమహాయశశ్శ్రీధురీణుండు
గోత్రభారద్వాజగోత్రవర్ధనుఁడు
సూత్రుఁడాపస్తంబసూత్రానువర్తి
అష్టభాషాకవిత్వార్జితప్రోద్య
దష్టావధానవిఖ్యాతభైరవుఁడు
శ్రీకృష్ణయార్యలక్ష్మీగర్భవార్ధి
రాకాసుధానిధి రాజపూజితుఁడు
వివిధవిద్యాశాలి వేంకటార్యుండు
సవరించు శ్రీనివాసవిలాసమునను
హారువొందనిది ప్రథమాశ్వాసమగుచు
ధరఁ బొల్చు నాచంద్రతారకంబుగను

ప్రథమాశ్వాసము, సమాప్తము.

# శ్రీనివాసవిలాససేవధి

## ద్వితీయాశ్వాసము

శ్రీ రమణీకాంత త్రిజగన్నిశాంత
వారిదశుభగాత్ర వసుధాకళత్ర
నందగోపకుమార నరకసంహార
కందర్పశోభరూప [1] కమనీయరూప
ఫణికులేశ్వర తల్ప భవ్యసంకల్ప
గుణగణైకనివాస కుహనావిలాస
కూటసంగరబాణ కుంఠనబాణ
కోటిభాస్కరతేజ గోవిందరాజ
అవధరింపుము సూతుఁ డమ్మునీంద్రులకు
వివరించి తత్కథ వెస నిట్టు లనియె

### ఆత్మారాముఁడను బ్రాహ్మణునికథ.

కలఁ డొకవిప్రుండు కనకాద్రివింధ్య
ములకు మధ్యమదేశమున ధనాఢ్యుండు
కులశీలవంతుఁడు కోవిదోత్తముఁడు
విలసచ్చతుర్వేదవేదాంతవేది
యతని కుమారుఁ డాత్మారాముఁ డనఁగ
వితరణశాలి వివేకవంతుండు
సతతంబు నతిథిపూజనకర్మశీలుఁ
డతులకీర్తి వహించి యవనిఁ బెంపొందు

1. వ్రా. ప్ర. కమనదురూప.

నాతఁడు గృహమేధియై గృహకృత్య
మాతతవైభవం బలరవహించి
తనతంద్రికన్న నుదాత్తవృత్తులను
దనరుచు గురుభక్తిఁ దాల్చి సజ్జనుల
బంధుమిత్రాశ్రితపరిజనంబులను
బంధురబుద్ధి సంభావించుకొనుచు
కులకాంతయందె మేల్ కూరిమిభోగ
ములఁ బొందు పరదారలను గోరఁ డెందు
నియతకాలములయం దీత్రివర్గంబు
ప్రియమునఁ జేకొను పేదలనరయు
నసమవెచ్చముసేయఁ డతిలోభమొందఁ
డెనగు నాదాకన్న హెచ్చుగఁ బోఁడు
తల్లిదండ్రుల దేవతలకా భజించు
నెల్లధర్మంబులు హితమతి నలుపు
నప్పులన్నను తంటలన్న వడంకు
తప్పఁ డాడినమాట తగవు మీరండు
హీనవృత్తికిఁ జొరఁ డేపట్లనైన
మానంబు వదలఁడు మదము గైకొనఁడు
దయయు దాక్షిణ్యంబు దనరంగ నడుచు
నయము సౌజన్య మెంతయు మానఁ డాతఁ
డీరీతుల గృహస్థుఁ డెనయు నీతులను
మీరక వర్తించు మిగుల నవ్విప్రుఁ
డతని యిల్లాలు ప్రాయము చక్కదనము
మతియు శీలంబును మాన మార్జవము
నత్తమామకు నైనట్లు నడత

చిత్తప్రసన్నత చెలిమి మృదూక్తి
పతియె దేవతగాఁగ భావించు తలఁపు
వ్రతనిష్ఠ దయయును [1] నమ్రతయోర్పు
నవరసజ్ఞతయు ధర్మానుకూల్యంబు
లివి యెల్ల కులసతి కెనయు లక్షణము
లగుట నీగుణము లింపగు నలంకార
ముగఁ బూని తను నెల్లపొలతులు వొగడఁ
దనరుచుఁ గొందటి దనయులవరుసఁ
గని మన్చి కంచంత కాపురంబుగను
దంపతు లన్యోన్యదత్తభావముల
నింపొంది కొన్నియేం డ్లిట్లు లుండంగ
జనకుఁడు జననియుఁ జనినంత వారి
కనుపమంబుగ బిత్రుయజ్ఞంబు దీర్చి
విహితకర్మములెల్ల వెలయఁజేయుచును
బహువత్సరంబులు ప్రబలి వర్తించె
నంతటఁ గొన్నాళ్ల కావిప్రవరున
కెంతయు భాగ్యంబు వెడలు దుర్దశను
పొలములోఁ బశువులం బులులు రోగములు
పొలియించె చోరు లప్పుడె యింటనుండు
ధనముల్ హరించిరి ధాన్యం బకాల
ఘనవర్షముల వెల్లిగలిసెను జూత
యీవికి లోభించె నిచ్చినరుణము
లేవగలనురాక [2] యిజ్జేకులఁబడియె

---

1. వ్రా. ప్ర. నంచవయోగ్ప.
2. వ్రా. ప్ర. హిజ్జుగుల.

చేలు పంటదొలంగ క్షేత్రము లెండ
మేలుభూషణము లెమ్మెయి మాయమయ్యె
నీరీతి శ్రీవీగి యేగంగ నంత
దారిద్ర్యభూత మెంతయు నిల్లు సొచ్చె
నది చూచి తమరుండ ననువుగా కతని
ముదము ధైర్యము రూపమును నేర్పు దరిగె
నెన్నెన్ని పోయిన నెలమికీర్తియును
బన్నిన సుకృతముల్ పగులక నిలిచె
నెండమావులవంటి యీధనంబునకు
మెండుదైన్యమునొంది మేనమ్మి కొలిచి
వంచించి కడ తేరువాటులు గొట్టి
కొంచించక నకృత్యకోటికి నొగ్గి
గడియింతు రవి పోవఁగఁ నిల్వలేరు
విడువను లే రెంత వెడమాయ యాన
తరళమా నల పారదముచేత సుదృఢ
తరకాంచనము జెందు తగు వాదికరణి
ధన్యులు స్థిరమైన ధనముచే భువన
మాన్యమా సత్కీర్తి మహిమఁ జేకొంద్రు
అపు డాసరోజాక్షి యతిదీన యగుచు
ద్విపము మ్రింగినయట్టి వెలగపంటిక్రియ
రిత్తబోయిన తన గృహాగర్భసీమ
తత్తరంబునఁ జొచ్చు తడవు వే వెడలు
పొద్దు పల్మరుఁ జూచు పొగులుచు నూర్చు
నెద్దియు లేమిచే నెంతొ చింతించు

బడలిక వసివాడు బాలురఁ గాంచు
కడుఁ జేయునదిలేక కన్నీరు డించు
విభునిచెంతకుఁ జేరు వెసఁ బల్కవెఱచు
నభిమానవతి గాన నాత్మలోఁ గుందు
నిటుల దారిద్ర్యాగ్ని నెంతయుఁ గుములు
కుటిలాలకను జూచి కొడుకులఁ జూచి
మన మెరియుచు ధరామరవర్యుఁ డెంత
ఘనదుఃఖములఁ జూడఁగాఁ జాల నిట్టి
తనువుతో హీనవర్తనలకు నొగ్గి
. . .   . . .   . . .   . . .
యొరుల వేఁడఁగఁజాల నుద్ధతులైన
దొరలఁ గొల్వఁగఁజాల దుర్విధి యిట్లు
లేమిఁ జూపిన సిగ్గులేమి మే లేమి
లేమికన్నను మనలేమియే మేలు
అని రోసి యెద శోక మడరంగ ఘోర
వనిఁ జొచ్చి తిరుగుచు వచ్చి యచ్చోట
కపిలతీర్థముగాంచి కపిలేశుఁ గొల్చి
విపులసౌఖ్యకరంబు వేంకటధరముఁ
గని యధిరోహించి క్రమమున నందు
మును వజ్రతీర్థాది ముఖ్యతీర్థములు
పదియునైదును రెండు పరికించి మునిగి
తుద కేగి యొక్క యద్భుతమైన మునిని
నిడుదకెంజడలఁ బూనిన యోగమట్టె
యొడల తెల్లనిభూతి యుదరబంధంబు
నిటలోర్ధ్వపుండ్రంబు నెరయు గడ్డమును

స్ఫటికాక్షమయమైన జపమాలికయును
కట్టినపులితోలు ఘనకమండలము
పట్టినదండంబు పటుయజ్ఞసూత్ర
మరమోడ్పుకనుదోయి యచలసంస్థితియు
మెరయ మంత్రావృత్తి మెదల నోష్ఠములు

హరిపదధ్యానయోగానందసింధు
పరివాహమగ్నహృత్పద్మతనుండు
వైరాగ్యజితమారు వారిజోద్భవకు
మారునట్టి సనత్కుమారుఁ గన్గొనియె
కని నిర్జనాధిత్యకావనంబునను
వినుతతేజఃపుంజవిగ్రహుం డగుచు
కనుపట్టెడి నితండు కమలసంభవుఁడో
వనజారి మౌళియో వనజలోచనుఁడో
గాకున్న మునుల కీకాంతిరూపములు
చేకురు టెబ్భంగి చిరతపఃక్లేశ

మనుభవింపుచు డస్సి యస్థులై యుండి
కనువేదు రయ్యుండఁ గనమె యమ్మునుల
సుకుమారవంతుఁ డాసురుచిరాకారుఁ
డకళంకమోదంబు నలరించె మదికి
నీమహామహుఁడు నాయెడఁ దీర్పఁజాలు
వేమారు కారుణ్యవిభవంబుచేత
ననుచు నూహదలంచి యాయోగి యెదుట
జని భక్తి సాగిలి సాష్టాంగమెఱఁగి
దీనవత్సల ! కృపాదృష్టిచే నన్ను
బూని రక్షింపు నాపూర్వదుష్కృతము

వలన మహాదుఃఖవార్ధిలో మునిఁగి
నెలవు గానక నేను నిను దెప్పఁగాఁగఁ
గనుఁగొంటి నన్నిక కడతేర్చఁ గదవె
యనఘాత్మ శరణు నీ వని నమ్మినాఁడ
నని విన్నవించంగ నాయోగివహాళి
కనువిచ్చి చూచి యోగంబున నరసి
వినుము భూసురవర్య వెతఁబడనేల
మునుజన్మమున నీవు మూర్ఖతచేత
మానవేంద్రులచెంత మంత్రివై యుండి
దానవిఘ్నముఁజేసి దత్తవిత్తములు
మరలహరించి సన్మతులబాధించి
యొరులకలిమికి నీర్ష్య నుడుకుచుఁ జాడి
పలుకుచు శ్రీహరిభక్తియు లేక
పలుగాకివై యున్న పాపంబు లిపుడు
మొనసి యీగతి దుఃఖముల నించెఁగాన
తననేర్పునను దీర్ప తరమె యెవ్వరికి
భువిజనంబులె కాదు పురుహూతముఖ్యు
లెవరైన బ్రారబ్ధ మెడలించఁగలరె
ఐన నీ కొకయుపాయము దెల్పె దనుచు
మానంగ దురితముల్ మరి సిరుల్ గలుగు
వనరుహాక్షుప్రాణవల్లభ లోక
జనని మహాలక్ష్మి సంపత్స్వరూప
మయిమించు నద్దేవి వైనవ్యూహములు
జయకీర్తి లక్ష్మినా జగతి ము వ్వాగలఁ
జెలఁగు నావ్యూహలక్ష్మియె వాసుదేవ

విలసితకారుణ్యవిగ్రహ యగుచు
ప్రారబ్ధము లడంచి భక్తకోటులకుఁ
గోరినయిష్టముల్ గొబ్బున నొసఁగఁ
జాలు న య్యిందిరఁ శరణుగాఁ జెంది
మే లొందు మనుడు భూమీసురుం డలరి

మహాసీంద్రునకుఁ జాల మఱిమఱి మ్రొక్కి
పూనికఁ గేల్మోడ్చి పొగడి వేఁడియును
మునివర్య యాదేవిఁ బొడఁగాంచు టెట్లు
దనరు నెచ్చట నెట్లు ధ్యాన మెబ్భంగి
మెందు ప్రసన్నయౌ నిలలోకజనని
పొందుగాఁ దెలుపు మిప్పుడె యట్లసేతు
నని యడిగిన వాని నాయోగి కరుణఁ
గని విను స్వామిపుష్కరిణిచెంగటను
వరదుఁ డయిన శ్రీనివాసు పేరురమె
యిరవుగా నెలకొని యావ్యూహలక్ష్మి
పొందమ్మిగద్దె ద్విభుజయై వసించు
కుందనపుంబొమ్మ కొమరు మీఱంగ
నాయిందిరం దిరమైన సద్భక్తి
పాయక మదినిల్పి స్వామిపుష్కరిణి
పావనోదకములఁ బరిశుద్ధి గాంచి
భావంబునన్ రమాపతిని భావింపు
మపుడె ప్రసన్నుఁడై యల శ్రీనివాసుఁ
డపరిమితప్రేమ నందుఁ గన్పట్టి
నినుఁ గృతార్థునిఁ జేయు నిక్కమం చొక్క
మనువుపదేశింప మదిఁదాల్చి యతఁడు

తనకు సాగిలి మ్రొక్కి తగ లేచుమున్నె
తన యోగమహిమ నంతర్హితుండయ్యె
అంత నాత్మారాముఁ డాకస్మికముగఁ
జెంత నుండిన యోగిశేఖరుఁ డెందుఁ
గనుపడకుండినఁ గడు చోద్యమంది
తనువు గగుర్పు మందత నిల్చి కొంత
తడవుకుఁ దెలివొంది తడవాటు విడిచి
జడదారి దెల్పిన జాడ దలంచి
యరుగుచుఁ గోనలు నడవులు గడచి
దరులు బల్చరులును తడవుచు నడచి
యుడివోని విరిదోట లొప్పు నొక్కెడను
కడువడి స్వామిపుష్కరిణిని గాంచి
సదయుఁ డమ్మని దెల్పు స్వామిపుష్కరిణి
యిది యంచు మదినెంచి యెంతయు నలరి
శంకింప కాతీర్థసలిలంబు నందు
సంకల్పపూర్వమై స్నానం బొనర్చి
సకలకల్మషములు సడలించి భాగ్య
నికరంబు చేకొని నిత్యకర్మములు
జపములు గావించి సరస నుల్లసిలు
నుపవనాంతరసీమ నొనర దీపింప
నందు కుందనపు తళ్కందుగోపురము
లిందుకాంతంబుల నెసఁగు ప్రాకార
మింపుసొంపులు నింపుమీరు సౌధములు
కెంపులగుంపు చెక్కిన మంటపములు
పచ్చరాల నొనర్చు బహువిమానములు

మెచ్చుగా నీలనిర్మితవేదికలును
వైడూర్యఖచిత మహాద్వారమండలము
చూడనౌ పగడంపు తోరణగండ్ల
నాణెముత్తెంబుల నలరు తల్పులును
మాణిక్యముల మించి మలచు కంబములు
గోమేధికోజ్జ్వలకుట్టిమంబులును
హైమోరుపుష్యరాగాస్థానములును
బహురత్నహర్మ్యాఢ్య భద్రాసనములు
రహిమించు నాపుల్గురా సిడంబులును
సిడములతుదల మ్రోసెడు ఘంటికలును
తొడరి యాఘంటలతోఁ బల్కు చిల్క
లలచిల్కపల్కుల కలరు నచ్చరలు

. . . . . . . . . . . .

అచ్చరల్ నర్తించు హరువురచ్చలును
రచ్చల ఘోషించు రమ్యవాద్యములు
నావాద్యముల్ విని యరుదెంచు వేల్పు
లావేల్పులను గూడి హర్షించు మునులు
మునుల హరిస్తోత్రములు దనరంగఁ
దనరంగు భూనభోంతరములు మెఱయ
మెఱపులు వేవేలు మెదలక నిలిచి
మెఱసినచాడ్పున మింటిపై నంటి
నటియించు గంధర్వనగరంబు పగిది
పొటమరించిన మాయపూన్కి చందమున
నొక దివ్యమందిరం బొప్పంగఁ గాంచి
వికలచిత్తుండయి విస్మయం బొంది

యిది యేమిచోద్య మీయెడ నేన ముందు
పదునై దువరుసల బరికించి యందు
నిర్జనంబగుట నీనిలయంబు గాన
నిర్జరమాయఁ గన్పించెనో యిపుడు
కలయొ నిద్దురలేక కల యెట్లు గలుగు
కలవశంబున భ్రాంతిగాఁ దోఁచినదియొ
శ్రీనివాసుఁడు నన్ను జెలిమి రక్షింపఁ
దాని యీరూపంబు దాల్చి వచ్చుటయు
జనుల కదృశ్యుఁడై జగదీశ్వరుండు
దనరు నీగిరి నంచుఁ దపసి మున్ దెలిపె
నాదు భాగ్యవశంబునన్ దృశ్యుఁ డగుచు
నీ దివ్యగృహమున నెసఁగునో శౌరి
చొచ్చి చూచెదఁగాక సొలయ కే ననుచు
వచ్చి యాభవనంబు వడిఁ బ్రవేశించి
వరగోపురము దాటి ద్వారముల్ గడచి
పరికించి మణిమంటపములు వేదికలు
మరియుఁ గన్గొనుచు హేమమయసౌధములు
నరసి మహావిమానాంతరమ్మునను
చింతామణిమయ సింహాసనమునఁ
గాంతామణి యురంబు గదిసి రంజిల్లఁ
గౌస్తుభమణియందుఁ గడుదీప్తు లొసఁగ
నిస్తులవనమాల నెరి దావి నింప
విమలహారంబులు వెడనిగ్గు నెరప
కమనీయశంఖచక్రము లిరుగడల
నయనేందురవుల విన్నాణంబుఁ జూప

నయముగా వీనుల న్మకరకుండలము
లలరువిల్కాని సోయగములఁ గెల్చి
బలిమిఁ దెచ్చిన డాలు వగిది నిం పెసఁగ
ఘనకిరీటంబు కంకణము లుంగరము
లనుపమభుజకీర్తు లంగదంబులును
మిసిమియొడ్డాణంబు మేలురకంపు
పసిడిరెంటెము మీఁదఁ బరగుమేఖలయు
గండపెండేరముల్ కటిఁ గట్టినట్టి
మండలాగ్రము జీరు మంజీరములును
మించుల౯ రతనంపుమెఱుఁగునిగ్గులును
మించులమించుల౯ మించి రాణించ
జగమెల్ల నాక్రమించఁగ గమకంబు
దగు పాదముల చక్కదనము పిక్కటిలు
పిక్క లొయ్యారంపుబిగు వందు తొడలు
మిక్కిలి సింగము౯ మెచ్చని కౌను
మురువుచూఱమ్మును జూపు మూపులసొబగు
కరికరంబులడంబు గలభుజంబులును
పూవుఁబోడుల చంటిపోటుల నీటు
శ్రీవత్స మనుమత్సచే డాచు నురము
గొల్లగుబ్బెతల సంకులగాజు లొత్తి
మల్లాడు దద్దురుల్ మాయని గళము
పాలకడలిపట్టి పట్టైన బాళిఁ
గ్రోలఁ గ్రోలఁగఁ దృప్తిఁగొలుపని మోవిఁ
కరుణారసముగుల్కు కన్నుదమ్ములును
చిఱునవ్వువెన్నెల చిలుకు నెమ్మొగము

నంగకాంతివిధంబు నంటి సొమ్ములకు
సింగారమొనరించు చెలువు మీఱంగఁ
బొంగారు కార్మొగుల్ భువి నిల్చినటుల
శృంగారమొకమూర్తి చేకొన్న పగిది
కన్నులభాగ్యంబు గనుపట్టి యెదుట
నున్నతాకృతి దాల్చి యొప్పుచున్నటుల
నుడివోని జవ్వనం బొరపుమే నూని
పుడమిపై నాడుచుఁ బొడచూపినటుల
నెల్లసోయగములు నేకీభవించి
యల్లన చైతన్య మందినయటుల
నానందమంతయు నావిర్భవించి
జ్ఞానసంపదలీల సల్పుచున్నటుల
సతతంబు సిరు లిచ్చి జనులఁ బ్రోవంగ
వితరణదేవత విలసిల్లునటుల
ధారుణి గావించు తపములవలన
భూరిపుణ్యము లొక్కప్రోవైన యటుల
చెలఁగుచు నిలుచున్న శ్రీవేంకటేశుఁ
దిలకించి యతఁ డెదఁ దెలివి కలంగ
భయవిస్మయానందభక్తిదైన్యములు
రయకంపపులకసంభ్రమము లక్షణమె
యడ కనురెప్పవేయక వెసఁ జూచి
పుడమి జాగిలిమ్రొక్కి పొదలు బాష్పములు
గురియ క్రమ్మఱలేచి కోరికలెల్ల
మఱచి చూచుచు నిల్చె మందభావమున
అపుడు నిర్వ్యాజదీనావనోత్సుకతఁ

గృప వెల్లివిరియ వీక్షించి యవ్విప్రు
జడియ కోడకు మని చల్లనిదృష్టి
కడునాదరింపుచు కమలేక్షణుండు
వినుతభూసుర నీకు వెత లేల యింక
కనికరంబునలక్ష్మి కరుణించె నిన్ను
చిరతరైశ్వర్యంబు చిత్తసమ్మదము
వరపుత్రసంపద వైభవంబులును
జనపూజ్యతయు నీ కొసంగుదు నెపుడు
జననిగర్భమునందు జనియించుక్లేశ
మొందవు [1] మోక్షంబు నొసఁగుదు తుదను
ముందుగా విజ్ఞానమును నీకుఁ గల్గు
నని యానతిచ్చి మాయలు గప్పి యపుడె
ఘనమందిరము దాను గనుపించఁడయ్యె
అంతట నావిప్రు డం దేమి గాన
కెంతయు వెఱఁగంది యెద శ్రీనివాసు
చెలువు నమ్మందిరశ్రీకరాకృతియుఁ
దలఁచి దలంచి సంతతచింతతోడ
నానందబాష్పంబు లడర కన్గవను
మేను వడంకఁగా మెల్లనే మరలి
స్వామిపుష్కరిణిప్రవాహంబునందు
నేమంబులను దీర్చి నెలకొన్నభక్తి
శ్రీ వేంకటేశ్వరుఁ జింతించుకొనుచు
భావంబలర నాత్మభవనంబుఁ జేరు

---

1. వ్రా. ప్ర. మొందదు.

తలఁపులోఁ దరలెనంతను వాని యింట
నెలనాఁగ కూరపా దిలఁ ద్రవ్వుటయును
పెన్నిధానముగాంచె పృథివీశ్వరుండు
మన్నన నవ్విప్రమణి గౌరవంబు
పరికించి నిజహితప్రకరంబుచేత
వరధనభూషణవ్రాతముల్ పనిచె
చేలు మళ్లును దుక్కి సేయ కెంతయును
మేలుపంట ఫలించె మిక్కిలి సిరులు
పూటపూటకు హెచ్చె పుత్రులు నేర్పు
పాటిల్ల విద్యల ప్రౌఢిఁ జేకొనిరి
ఇటులసంపదమించు నింటికి నతఁడు
పటుతేజ ముప్పొంగ పరతెంచునపుడు
వారలబంధువుల్ పండితోత్తములు
దూరం బెదుర్కొని స్తుతులు సేయంగ
వచ్చి యచ్చెలువ నావరకుమారులను
గ్రుచ్చి కౌగిటఁ జేర్చుకొని యూరడించి
శ్రీకాంతపదభక్తి చెలఁగంగ సిరులు
గైకొని కొన్నాళ్లు కడుసుఖంబుగను
సకలధర్మంబులు సలుపుచునుండె
సకుటుంబమున వృషాచలసమీపమున
కరిగి నిత్యనివాస మందుఁ జేయుచును
హరిచరణాంబుజధ్యానయోగంబు
సాగించి యోగియై సంసారసంభ
వార్తి దొలఁగ ముక్తి హరికృపఁ గాంచె

నీపుణ్యచరితంబు నెవ్వరు వినిన
నేపుమీఱంగ నిష్టమెల్లను గలుగు
తొలఁగు నాపదలెల్ల దురితంబు లణఁగుఁ
జెలఁగును హరిభక్తి సిద్ధమెంతయును
నావుడు నల సూతునకు మ్రొక్కి మునులు
కోవిదోత్తమ మాకుఁ గుతుకం బెసంగ
తెలివిగా వేంకటాద్రిప్రభావంబు
తెలిపితి రందు పదియునైదురెండు

పదునేడుతీర్థముల మహిమావర్ణనము — కపిలతీర్థము.

పరమతీర్థము లెట్లు పరగు నిమ్మహిమ
యెరిగింపు మని వేఁడు ఋషుల కాసూతుఁ
డనుమోద మలర ము న్నది దెల్పఁదొణఁగి
వినుఁ డట్టివేంకటోర్వీధరంబునకు
దిగువ నాగ్నేయైకదిగ్భాగమునను
నగరాజకన్యకానాయకుఁ డైన
హరులింగమూర్తినా యతలాంతరమున
నరుదార కపిలసంయమి పూజసేయు
చుండంగ నాలింగ మొకకారణమున
మెండువేగమున భూమీమండలంబు
గండిగా భేదించి కడునన్నగంబు
దండ పైకెగయ న త్తఱి నాబిలంబు
గపిలేశ్వరుండు రాఁగలిగినకతన
కపిలతీర్థంబయ్యె కడుఁ బావనముగ
నందు పురందరాద్యమరు లయ్యాశుఁ

గండున భజియించి కాంచిరి సిరులు
కావున నిల నట్టి కపిలతీర్థప్ర
భావంబు వర్ణింప బ్రహ్మకుఁదరమె

ఇంద్రతీర్థమహిమ.

నావయి నింద్రుం డహల్యను గలయు
పాపంబు దొలఁగఁ దపం బొనరించ
నతని బావనుజేయు నాసరోవరము
క్షితి నింద్రతీర్థమన్ కీర్తి వహించె

విష్వక్సేనతీర్థము.

వానికి నెగువ విష్వక్సేనతీర్థ
మూనుపుణ్యోదకం బొప్పు నుం దచట
వరుణకుమారుండు వదలవిభక్తి
హరిపూజ యొనరించి యనఘాత్ముఁ డగుచు
వనజాక్షునకు పడవాలు దా నయ్యె
వినఁగ నాతీర్థంబు విభవంబు కొలఁది

శంఖచక్రాదితీర్థములు.

పయి నైదు సరముల పంచాయుధములు
ప్రియమున హరిఁ గొల్చి పెనుపొందుకతన
నవి శంఖచక్రశార్ఙ్గాదిసంజ్ఞలను
భువికీర్తిఁ గని లోకపూజ్యంబు లయ్యె

అగ్నికుండాఖ్యతీర్థము.

నటమీఁద త్రేతాగ్ను లాత్మశుద్ధికిని
పటుతపంబులు సల్పి పావను లగుట

నాతీర్థ మగ్నికుండాఖ్యమై సకల
పాతకంబు లడంచి ప్రబలె నిమ్మహిని
అందుకు నుపరిభాగావనియందు

### బ్రహ్మతీర్థము.

ముందర నాచతుర్ముఖుఁడు ముకుందుఁ
గనుఁగొందు నని యెంచి ఘనయోగనిష్ఠ
ననుపమంబుగఁ బూనె నబ్జసహస్ర
మంత శ్రీకాంతు నేకాంత భక్తి గని
సంతసమొందుటఁ జగతి నాకోలను
బ్రహ్మతీర్థం బనఁ బరగ నం దజుఁడు
బ్రహ్మోత్సవము వేళ బరతెంచు నెపుడు

### సప్తతీర్థములు.

నవల సప్తర్షు లత్యద్భుతతపము
సవరించి రటుగాన సప్తతీర్థములు
కలుషహారంబుగా ఘనుల పేరిటివి
... ... ... ...
యట్టితీర్థముల మాహాత్మ్యము దెలిసి
నెట్టుగ వర్ణింప నేరఁ డాశేషుఁ
డితిహాసమొక్కటి యిట్టి యర్థమున
శ్రుతమయ్యె మునులిది చెప్పిరి వినుఁడు

### శోణపుర బ్రాహ్మణునికథ.

మును శోణపురమున భూసురుఁ డొకఁడు
వినయసంపన్నుండు విష్ణుభక్తుండు
కలఁ డాతఁ డొకనాఁడు ఘనశాస్త్ర మరసి

తొలుజన్మమునఁ దన దురితకర్మములు
తెలిసి పశ్చాత్తాపదీనభావమున
నల వాని కైనప్రాయశ్చిత్త మిలను
తీర్థయాత్రయె యంచు దివ్యంబు లైన
తీర్థంబు లన్నియు తిలకించు కొనుచు
భూమిప్రదక్షిణంబును జేయఁ గడిగి
కోమలి సుతులఁ గైకొనని విరక్తి
నారేయి నిదురించునపుడు స్వప్నమున
వారిజాక్షుఁడు కృప వాని కిట్లనియె
వినుము భూసురవర్య వేంకటశైల
మున సప్తదశతీర్థములు గల వందు
నొకదినంబును స్నానమొనరించువార
లకుఁ దీర్థయాత్రాఫలంబు సిద్ధించు
ధర వేంకటాద్రిప్రదక్షిణంబునను
బురుషులకు లభించు భూప్రదక్షిణము
వలన గల్గు ఫలంబు వనితలకైన
కలుగు నన్నట్లుగాఁ గలఁగని లేచి
యతఁడు మనంబున నాశ్చర్యమొంది
వెతకుచు జనుదెంచి వేంకటాచలము
కనుఁగొని సేవించి కపిలతీర్థంబు
మునుకొని యన్నిట మునిఁగి యాగిరికి
పొసఁగ ప్రదక్షిణంబును సల్పె నపుడె
యెసఁగె నాతని కెల్లనిష్టసంపదలు
కావున నట్టి వేంకటగిరి మహిమ
భావించి యెంతని పలుకశక్యంబో

మరియు నిమ్మహియందు మహితతీర్థంబు
లరయంగ మూఁడుకో ట్లర్థకోటియును
గలవు వానికి నాదికారణంబగుచు
సలిలసంపదఁ బొల్చు స్వామిపుష్కరిణి
యేలికె యిది యీట నిలఁగల్గుతీర్థ
జాల మాశైలనిర్ఝరజలంబులను
నెలకొనియుండు నిన్నిటి క్షేత్రపాలుఁ
డెలమి పాలించు నయ్యేడ శౌరియాజ్ఞ

పాండవతీర్థము.

మును పాండవు లరణ్యముల సంచరించ
గను కృష్ణుఁడు జయంబుగలుగు వారలకు 460.
శ్రీనివాసాచలశిఖరంబునందు
పూని వత్సరము తత్పుణ్యోదకముల
స్నాతులై నియమంబు సల్పితిరేని
ఖ్యాతిగా వైరుల ఖండించి జయము
గైకొని యెద రంచుఁ గరుణ బోధింపఁ
జేకొని యల యుధిష్ఠిరముఖ్యు లేవు
రట్టిపాంచాలియు నాగిరి యొక్క
పట్టున రమ్యమై పరగుతీర్థంబు
చెంత వాసముచేసి శ్రీపతిఁ గొల్చి
యెంతయు జయమొంది యిల నేలి రదియ 470.
పాండవతీర్థంబు పావనం బట్టి
కొండ నుండెడిగనుల్ కొలదియే! మణులు
పసిడియు వెండి తామ్రములోహములును

వెనబారు ప్రాదములు వివిధౌషధములుం బ
నమితంబు లై కల వవియు నొక్కొక్క
సమయమునందు దృశ్యములై చెలంగు
నాగిరి శ్రీనివాసాకృతిఁ బూని
యోగీంద్రులకుఁ దోచు నొక్కొక్కవేళ
నొకవేళ కనకాద్రియొరపున నుండు
నొకవేళ రత్నశృంగోన్నతిఁ జూపు
నొకవేళ శేషునియొడికంబు దాల్చు
నొకవేళ వింతరూ పొనరంగఁ దనరు
హరి మాయగావించునట్టి చందమున
హరిరాజగిరియు మాయలు సేయుచుండు
న మ్మహాగిరి భక్తి నర్థించువారి
కెమ్మెయి తానిచ్చు నెల్లకోరికలు
భువి మూఁగ కనులాపములు నేర్పు గురుఁడు
చెవిటి కేకాంతంబు చెవిఁజొన్పు సఖుఁడు
పిచ్చుకుంటును నడిపించు బల్ వెజ్జు
హెచ్చుదయ్యము నిగ్రహించు మాంత్రికుఁడు
గుడ్డివానికి చూడ్కు లొసఁగెడుదాత
గొడ్డురాలికి చూలు గొలిపెడుజాణ
యా వేంకటనగంబు నంతరంగమున
భావించి సేవింతు ప్రతిసంధ్య మేను
వినుఁ డింక నద్భుతవృత్తాంత మొకటి
ఘనుఁడు జైమిని దెల్పఁగా వింటి మున్ను
స్వామిపుష్కరిణి కీశాన్యదిక్సీమ
గోముండు వైకుంఠగుహ యన నొకటి

## వైకుంఠగుహామహిమావర్ణనము.

యందు వైకుంఠగుహాకారముగను
కుందనంబుల జెక్కు గోపురంబులును
మణిమయప్రాకార మంటపంబులును
ఘృణిమీఱు కాంచన కేతువారములు
పగడపు కొణిగలఁ బరగు మాళిగెలు
మగరాల బిగియించు మందిరావళులు
నాణిముత్తియముల నలరు తోరణము
మాణిక్యఖచితహర్మ్యప్రకాండములు
బాగైన యుబ్బుచప్పరముల గుములు
లాగుల మేడ లుల్లసితవేదికలు
చకచకద్రుచిమించు చంద్రశాలలును
ప్రకటచతుశ్శాలపానశాలలును
పటుగీతశాలలు బలుకురుంజులును
నటనశాలలు వాహనస్థానములును
బంగరువన్నెల బరగు నేనుఁగులు
రంగుపచ్చలనిగ్గు రాణించు హరులు
ఖేచరగతి మించు కెంపుల తేరు
లేచక్కి నడచు మహీరుహంబులును
లయ తప్పక నటించు లతికాగణంబు
నయముగాఁ బల్కు నానామృగంబులును
వేదాంతములు జదివెడు పక్షితతులు
సాధులై మెలఁగు భుజంగపుంగవులు
తగుకోర్కె లొసఁగు చింతామణిగిరులు
మగువలతో నాడు మణిపుత్రికలును

వాయించకయె మ్రోయు వాద్యబృందములు
పాయక విహరించు పద్మాకరములు
బహుళకాంచనమణిప్రభల నిన్నియును
రహిం మించి కోటిసూర్యప్రకాశమున
గంధర్వనగరధిక్కారియై మీఱి
బంధురశ్రీలచే భాసిల్లు పురము
శ్రీభూమినీళలు సేవింప శౌరి
ప్రాభవంబున నందు బరగుచు నిత్య
సూరులు ముక్తులుం శుద్ధసత్వంబు
మీరి కొల్వఁగ లీల మెఱయుచునుండు
నజశంకరేంద్రులు నమరగంధర్వ
భుజగకిన్నరనరపుంగవుల్ మొదలు
నెవరును గననేర రీశ్వరు మాయ
దవిలియుండుటఁజేసి తత్ప్రభావంబు
పొగడంగ వశమె మాబోంట్లకు నెల్ల
భగవంతుఁడే దాని భావింపనోపు
మును రాముఁ డాదశముఖుని ఖండింప
వనచరసేనతో వచ్చుచుండంగ
నంజనాదేవి యాహనుమంతుఁ జూడ

అంజనాదేవి రామునికి హితవుచెప్పుట.

రంజిల్లు చటు చేరి రఘువీరుఁ గాంచి
ప్రణమిల్లి దేవ! యారావణాసురుని
రణమునఁ గెల్వ దుర్ఘట మెవ్వరికిని
దేవర నల వైరిఁ దెగటార్చి గెలువ

గా వేంకటేశ్వరుఁ గాంచి ప్రార్థించి
స్వామిపుష్కరిణిని స్నానంబుచేసి
స్వామిచే వరమంది చను మని పలికె.
అపుడు శ్రీరాముఁ డాయంజనాదేవిఁ
గృపను వీక్షించి యాకెలను నిల్చున్న
హనుమంతుఁగనుఁగొన్న నతఁడు కేల్మోడిచి
వినయంబుతో నట్ల విన్నవించుటయు
మోమున చిఱునవ్వు మొలకలెత్తంగ
రాముఁ డట్లగునంచు రయమునఁ దరలి
వనచరసైన్య ముర్వడి నడువంగ
వనములు గిరులు గహ్వరములు నదర
ధరణి వడంక దిక్తటములు బెదర
నెరసి భానుని గప్పి నెగడ రజంబు
దండిగా సింహనాదము సేయువారు
కొండలపై నెక్కి కుప్పించువారు
పెంపొందువృక్షముల్ పెకలించువారు
సొంపున తేనియల్ జుఱ్ఱెడువారు
బిగువుతో నొండొరుల్ పెనఁగెడువారు
మిగుల రాఘవుకూర్మి మెచ్చువారలును
విడివడి విహరించ వెంకటాచలము
వడి నెక్కి మక్కువ వనజకల్హార
వారహారిణియైన స్వామిపుష్కరిణి
తీరంబున వరాహదేవు సన్నిధికి
వచ్చుచో నుగ్రుఁడై వారిజమిత్రుఁ
డుచ్చస్థితిభజించి యుర్వి కత్యంత

సంతాపమొనరింప సాగెఁ బ్రతాప
మెంతగల్గిన నంత నిల నెల్లవారిఁ
బొగిలించు నతిదుష్టభూపాలుపగిది
దగ మించు సైన్యమంతయు వాడినటుల
వగమించు బలుకాక వనమెల్ల వాడె
బుగబుగ నుడికె నంబుభరంబు లపుడు
సౌమిత్రియును రామచంద్రుఁ డాసరసి
నేమంబులను దీర్చి నీలశైలేశు
భావించి యశ్వత్థపాదపచ్ఛాయఁ
గ్రేవ నంగదుఁడు సుగ్రీవుఁడుఁ గొలువ
సమ్మోదంబున నుండు సమయంబునందు
నమ్మహీధరమున నమ్మృతోపమాన
ఫలములు కందముల్ భక్షించి యింపు
చెలఁగఁ దేనెలు గ్రోలి చెలరేగి సేన
ఝురుల బల్దరుల మేల్చరుల గోనలను
తరుగణంబుల శృంగతటముల నిండి
జవలీలచేఁ జాలఁ జరియింపుచుండె
గవయ గజ గవాక్ష గంధమాదనులు
మరి శరభసుషేణమైందద్వివిదులుఁ
తరలి యీశాన్యదిక్తటిని గ్రుమ్మరుచు

## వైకుంఠగుహా వైభవము.

నం దొక్క గుహఁ గాంచి యంచితానంద
కందళితాంతరంగంబులతోడ
నచటఁ బ్రవేశించి యంధకారంబు

ప్రచుర మహానటుగానరాక యొండొరులు
కేలుకే ల్పెనకుచు కేరి నవ్వుచును
చాల కక్కసముగా చనచన నందు
వెన్నునికృపఁ గొంత వివరంబుదెలిసి
తిన్నగా ముందట కీర్తి రంజిల్ల
కాంచనమణిమయాకార మహాపురము
గాంచి యచ్చెరువొంది కడుచేర నరుగ
బహురత్నతోరణప్రాసాదసౌధ
గృహపాళికాట్టాలకేతుజాతముల
మండపంబులు మణిమయవిమానములు
మెండుగాఁ గనుఁగొంచు మెచ్చుచు నౌర
అందరు నిందు పీతాంబరధరులు
సుందరకౌస్తుభశోభితవక్షు
లంబుజాక్షులు సమాయతచతుర్బాహు
లంబుధరశ్యామళాంగాభిరాము
లంచితశంఖచక్రాదిసాధనులు
చంచత్కిరీటాదిసకలభూషణులు
వీర లెవ్వరో శౌరివీక నున్నారు
తా రిటు వేషముల్ ధరియించినారొ
యనుచు నివ్వెర గంది యరుగంగ నెదుట
ఘనవిమానం బొండు గనుపించె నందు
వైకుంఠవాసుండు వాసుదేవుండు
శ్రీకాంతధరణియుఁ జెంగట నుండ
నీలావధూమణి నెమ్మి భజింప
చాల కొందరుచెలుల్ చామరల్ వీవ

ఫణసహస్రమణిప్రభాభాసమాన
ఫణిరాజమృదుభోగభద్రాసనమున
నాసీనుఁడై సవ్యహస్తాంబుజంబు
వాసిగా నూనిన వామజానువున
చెలువొందఁ జాచి దక్షిణపాణిఁ బూను
జలజంబు బడర శంఖచక్రముల్ మెఱయ
చిరునవ్వు వెన్నెల జిలుగుచెక్కిళ్ల
నిరుదండకుండలహారముల్ తోర
ముగ నిగ్గు నెరపంగ మకుటదీధితులు
మొగమున క్రొక జగ్గు మొలిపించి మించి
కౌస్తుభహారముల్ గ్రైవేయకములు
నిస్తులభూషణోన్నిద్రరత్నములు
మహనీయకాంచనమయపటద్యుతులు
బహుకోటిభాస్కరప్రభ విసాళించఁ
గొలువుండగాఁ గనుఁగొని వనేచరులు
తలకుచుండఁగ నొక్క దండహస్తుండు
హుంకార మొనరింప నుల్లంబు గలగి
శంకింపుచును వారు చయ్యన మరలి
వడి వచ్చినట్టి త్రోవనె గుహ బైలు
వెడలి యందరి కది వివరింప వారు
కడుచోద్య మంది రాక్షసమాయ యేమొ
గడుసు రావణుఁడె యిక్కడ డాఁగినాఁడొ
మూత మం చరిగి యచ్చోట నరణ్య
జాతంబు గోనలు చరులును వెతకి
హరిమాయ గప్పుట నాగిరి త్రోవ

గురు తేమి గనలేక గ్రుమ్మరి యలసి
మగుడి యందఱు విభ్రమంబుగా నెంచి
తగుతావుల వసించుతఱి సంజ యయ్యె
అ య్యవసరమునం దారామచంద్రుఁ
డొయ్యన నర్ఘ్యంబు లొనరంగ వార్చి
జపములు దీర్చి కుశవ్యాప్తశయ్య
నుపవిష్టుఁడై సుఖంబుండి వేగుటయు
వనచరసేనతో వగమీఱ వెడలి
వనధి సేతువుగట్టి వడి లంకకోట
లగ్గలుపట్టించి లావు రక్కసుల
మ్రగ్గించి రావణు మర్దించి సమర
జయరమాజానియై జానకీజాని
నయముగా సాకేతనగరంబుఁ జేరి
పట్టాభిషిక్తుఁడై ప్రజలఁ బ్రోచుచును
పట్టైనసామ్రాజ్యపద మందె వెలసె.
కావున నట్టి వేంకటభూధరప్ర
భావంబు భావించి భవపద్మభవులు
మునులు నిలింపకింపురుషగంధర్వ
జనములు నుతియింపఁజాల రింతైన
నని తెల్పు విని విస్మయంబున నతని
వినుతించి యమ్మునుల్ వినయంబుతోడ
వైకుంఠగుహావైభవంబు మీవలన
మాకు వినంగల్గె మరి శ్రీనివాసుఁ
డెవరికి ప్రత్యక్షమెసఁగంగ నిచ్చి
భువిని యర్చ్యాకృతి పూజలు గాంచె

నెవ్వరిని యనుగ్రహించె నెవ్వారి
క్రొవ్వడంచెను వినఁ గుతుక మయ్యెడిని
వినిపించవే యని వేఁడ సూతుండు
తనగురునిఁ దలంచి తగుపురాణములు
దడసి యూహించి యెంతయు సంతసంబు
అడర నమ్మునుల కపు డిట్టు లనియె
వినుఁడు దెల్పెద నట్టివృత్తాంత మెల్ల
మును హిరణ్యునివంశమున నుద్భవించి
కొందఱు దైత్యులు ఘోరవిక్రములు

రావణునిచేబాధితులగు మునులు బ్రహ్మతో మొరలిడుట.

పొందికతో జగంబులను బాధింప
రావణుండును సురరాజును గొట్టి
పూవుఁబోణులఁ బట్టి పురి చెరల్ బెట్టి
వరగర్వమునఁ దపోవనుల జన్నములు
చెఱుచుచు వర్తించ సిడిముడి పడుచు
గౌత మాగస్త్య గర్గ మృకండు కణ్వ
మాతంగ విభు నత్రి మాండవ్య కుత్స
వరతంతు నడభరద్వాజ వసిష్ఠ
శరభంగ జాబాలి జైమినిప్రముఖ
మునివర్యు లందఱు మూకగాఁ గూడి
కినుకతో దర్భలు కృత్తులు జంక
నిడికొని సమిధలు హితపుస్తకములు
జడలు పై బిగియించి జలకమండలులు
వడి కేలఁ గీలించి వల్కలంబులను
నిడుదదండములఁ బూనిక వ్రేలఁగట్టి

జపసరంబులు వ్రేల సంధించి చెవుల
నుపవీతములు జుట్టి యొనర రుద్రాక్ష
మాలికల్ మెడవైచి మై భూతిఁ బూసి
దాలిచి గోపిచందనములు నుదుట
పర్ణశాలలయందు బడుగులైనట్టి
వర్ణులకాపుంచి వలసగా వెడలి
యమరులనెగ్గించి యష్టదిక్పతులఁ
గ్రమమున దూరి వారలనెల్ల గూర్చు
కొని బ్రహ్మసభ కేగి కొలువున నలువఁ
గనుఁగొని ప్రణమిల్లి కణక నిట్లనిరి
సకలవిధాత ! యో సకలనిర్మాత !
యకళంకగుణజాత ! యబ్జసంజాత !
శరణుగా నిను జేరఁ జనుదెంచినార
మరుదుగాఁ గరుణించి యభయ మీఁగదవె
అల హిరణ్యాక్షుఁడు ఏోవ హాయి నుందుమని
తలఁచుచుండఁగ వాని తలద్రొక్కుపాటి
దనుజులు కొంద ఱిద్ధర మునీంద్రులను
జెనకుచు యజ్ఞముల్ జెరుపుచుండఁగను
పాటిల్లు గోర్చుట్టుపైని రోకంటి
పోటును గల్గుచాట్పున రావణుండు
అమరాధిపతిమొద లష్టదిక్పతుల
సమరంబులన్ దిరస్కారంబు జేసి
మమ్ము సడ్డించక మా తపోవనము
లెమ్మెను జొచ్చి మహీసురాదులను
బాధించి యిల్లాండ్రఁ బట్టుచు నెల్ల

వేధలు జేయ నెవ్విధము తాళుదుము
దేవర యేమియుఁ దెలియనియటుల
రావణాదులకు వరంబు లొసంగి
యీరీతి వేడుక లివి చూచుకొనుచు
వారి దుర్మార్గముల్ వారింపవేమి
శాప మీఁజాలము సమయుఁ దపంబు
మీపల్కు వర మట్టుమృష యౌను గాన
అనుచు బహుప్రకారాలాపములను
మునిముఖ్యులందఱు మొదలుపెట్టంగ
వనజాసనుఁడు విని వారి నందఱిని

మునులు బ్రహ్మతోఁగూడి వెన్నుని వెదుకఁ బోవుట.

అనురాగమునఁ జూచి యాదరింపుచును
తీవరపడనేల తెలియరే మీరు
నావేళ మీ రుగ్ర మైనతపంబు
సలుపుట నటుల దుర్జయులుగా వరము
చెలిమి నిచ్చితి నింకఁ జింతింపనేల
ఖలదైత్యులను ద్రుంపఁ గలఁడు వెన్నుండు
కలశాబ్ధిచెంతకుఁ గడువడి నరిగి
శరణంచు నాహరి చరణముల్ గనినఁ
గరుణించి దనుజరాక్షసతతిఁ గూల్చి
జలజాక్షుఁడే ప్రోచు సకలలోకములఁ
దలఁకనేటికి పోవుదము సామికడకు
అని యూరడించి య య్యంబుజాసనుఁడు
తనకొల్వు చాలించి తరలి యందఱిని

వెంటఁదోడ్కొని యేగువేళ నారదుఁడు
మింటిపైఁ జనుదెంచి మెల్లన డిగ్గి
తమ్మిచూలికి మ్రొక్కి తాపసోత్తముల
నెమ్మిఁ గౌగిటఁజేర్చి నిలువ న న్నలువ
యాతఁడేఁ గలకార్యమంతయుఁ దెల్పి
నాతండ్రి శ్రీజాని నారాయణుండు
వైకుంఠమున నున్నవాఁడో క్షీరాబ్ధి
నేకాంతకేళిని నెనసియున్నాఁడో
యెందు ప్రత్యక్షమై యీశ్వరుఁ గనుదుఁ
బొందుగాఁ దెలుపవే పుణ్యచరిత్ర
నీ వెఱుంగుదు వబ్జనేత్రునియునికి
నావుడు తండ్రి కానారదుం డనియె

మునులకు నారద దర్శనము.

వినుఁ డేను జలజాక్షు వేదైకచక్షు
వనరుహామందిరావాసోరువక్షుఁ
బొడగని సేవింప బుద్ధిఁ గాంక్షించి
కడువడి క్షీరాబ్ధికడ కేగి యందు
శ్రీకాంతుఁ గానక శీఘ్రంబు మరలి
వైకుంఠపురికిఁ బోవఁగ నందు కొంద
రా దివ్యభవనరత్నాంకణద్వార
వేదికల వసించు వేత్రధారకులు
ననుఁ జూచి యందుఁ బన్నగశాయి లేఁడు
చను ముర్వి వేంకటశైలంబునందు
నెలకొని శ్రీభూమినీళలు దాను
చెలగి విలాసముల్ జెందుచున్నాఁడు

నావుడు మగుడి యెంతయుఁ జింతతోడ
దేవర నడిగి యా దివ్యపర్వతము
జాడ నే తెలియ నిచ్చట వచ్చినాఁడఁ
గూడి పోవుదమయ్య గొబ్బున ననిన

బ్రహ్మాదులు నారదుఁగూడి శేషశైలమునకుఁ జనుట.

చతురాననుఁడు చాల సంతసిల్లుచును
సుతుని సమ్మునులఁ గూర్చుక యేగి వేగ
శేషాచలం బున్నచెలు వెల్లఁ జూచి
శేషశాయివసించు శ్రీగిరి యదియె
యిదియె కోమలము తా నిందిరారమణి
పదములకుఁ జిగుళ్లు పాన్పుగానెసఁగు
నిది రత్నగర్భ తా నింపు దీపింప
ముదమున ధరియించు ముకుటరత్నంబు
ఇదె జగంబుల కెల్ల నిరవుగా మెలఁగు
మదనగురున కైన మణిమందిరంబు
ఇదియె భక్తులపాలి కెడలేని సిరులు
పిదపగాక యొసంగు పెన్నిధానంబు
ఇదియె చేరినవాని కెట్టియాపదలు
చెదరిపోఁ గరము రంజిలు చెలికాఁడు
కన్నవిన్నవిగాని కడువింత లెల్ల
చెన్నుమీఱ ఫలించు క్షేత్రమ్ము నిదియ
యెల్లతీర్థంబులు నెలమి గర్భమున
చల్లగా ధరియించు జననియు నిదియె
యనుచు స్వర్ణమయంబు లైన వన్యలను
తనరు మాణిక్యలతావితానములు

చిత్రవర్ణంబు లై చెలగుమృగములు
చిత్రరూపముల మించిన విహంగములు
బహుభావములఁ దోచు భవ్యశృంగములు
బహువిభ్రమముల జొప్పడిన పాదములు
పాడవుగాఁ బ్రవహింపఁబోలు నిర్ఝరులు
నడచి ఫలములిచ్చు నవకల్పతరులు
కనుగొంచుఁ జనిచని కడుచోద్య మంది
తనసృష్టిగామి యెంతయు సిగ్గుపూని
భూరిప్రదక్షిణమ్ములు నాచరించి
శ్రీరమణుని యందు చేరి కన్గొనక
యలసి మేనుచెమర్ప నసురుసురనుచు
నిలిచి మౌనులఁజూచి నెమ్మి నిట్లనియె
నేను మీరును గూడి యిల్లెల్ల వెదకి
కానలేమైతిమి కమలాసహాయు
నెటు లిట్టియిల నుండు నెమ్మోయి నిజము
చటులమాయలఁ బన్నసాగెఁ గాఁబోలు
ప్రతిదరి ప్రతీఝరి ప్రతిగహ్వరంబు
ప్రతితటి ప్రతిశిఖరంబు నంతయును
వెదకుఁడు మీరు వేర్వేర నందందు
ప్రతివనాంతర మేను బరికించువాఁడ
జతనమంచును బంచి సంయమివరుల
వితతమాయలనేర్పు విలసిల్లుచున్న

బ్రహ్మాదులు వెన్నుని గానలేక తిరుగుట.

తనతంత్రిమహిమలు తలఁచి తలంచి
వనజాతములు సొచ్చె వనజాతభవుఁడు

అంతట నా మహానులందఱు నందు
వింతకోనలు చరుల్ వెస కందరములు
సరయుచు వింత లౌనట్టి మృగముల
హరియించు భావింతు రం దొకచెంచు
తిలకించినన్ వాసుదేవుఁడే యంచు
దలఁచి కేల్మోడ్తు రత్తఱి దివ్యమైన
పులుగును గనుగొన్న పురుషోత్తముఁ డని
గొలుతు రే పందిగన్గొన్న వెన్నుఁ డని
మ్రొక్కుదు రీరీతి మొనసి దిగ్భ్రాంతిఁ
జిక్కినటుల బుద్ధి చెదరఁ ద్రిమ్మరుచు
సాయంతనంబున స్వామిపుష్కరిణి
చాయకు దైవవశమున వచ్చుటయు
నాతమ్మిచూలియు నపుడె యచ్చటికి
నేతేరఁగా వార లీతెరం గెల్ల
విన్నవించ ముకుందు వెదకంగఁ దరమె

స్వామిదర్శనమునకై బ్రహ్మాదులచ్చటి పుణ్యతీర్థంబులఁ దపంబుసల్పుట.

య న్నగదారి ప్రత్యక్షమై తానె
కరుణించుదనుక దుష్కరమైన తపము
చిరతరంబుగ నిందుఁ జేయుద మనుచు
పరమేష్ఠి నిర్ణయింపఁగ వార లటుల
కరమొప్పు స్వామిపుష్కరిణి స్నానంబు
సలిపి తపించి యచ్చటి కల్పసరణి
వెలయ సంకల్పముల్ వేర్వేరఁ జేసి
కొందఱు శేషవైకుంఠతీర్థముల
కొందఱు తుంబురుకోన తీర్థముల

మఱికొందఱు సనత్కుమారుతీర్థమున
మఱికొంద రందు కుమారధారికను
నయ్యెడఁ గొందరయ్యాకాశగంగ
జయ్యన కొందఱు చక్రతీర్థమున
కృతమతుల్ గొందఱు కృష్ణతీర్థమున
చతురులు కొందఱు సనకతీర్థమున
ఘను లందు కొందఱు కపిలతీర్థమున
అనఘులు కొంద ఱింద్రాదితీర్థముల
నీరహిఁ దమతమ కెనయు తావులను
జేరి నిష్ఠలఁబూని చెలఁగుచుండఁగ
నారదాగస్త్యకణ్వప్రముఖులును
సారసాసనుఁడు నాస్వామిపుష్కరిణి
తటమున నశ్వత్థతరువులక్రింద
చటులతనియమముల్ సల్పంగఁదొణఁగి
యాసనాసీనులై యచలగాత్రులయి
నాసాగ్రములనిల్పి నయనముల్ కుదుర
నక్షమాలికలు చేయంది మంత్రోద్య
దక్షరాంగన్యాస మమరఁ గావించి
యేకాగ్రచిత్తులై యీశ్వరు నెదలఁ
జేకొని ధ్యానముల్ సేయుచు దిశలు
తిరిగిచూడక కొంకింతఁ దెమలక మేన
నురగముల్ ప్రాకినా నులకక నూర్పు
లడచుచు గాడ్పులే యాహార ముగను
గుడుచుచు రేబగల్ గూర్క కింతైన

నింద్రియంబుల నిగ్రహించి సత్త్వైక
సాంద్రమానసముల శాంతిఁ బెంపొంది
పసదీర్చు బచ్చనప్రతిమలపగిది
వెస పరకాయప్రవిష్టు లౌ వారి
తనువు లుండెడిరీతి తముఁదామె మఱచి
తనరెడుచాడ్పున్ తన్మయానంద
భరితులై బ్రహ్మానుభవవైభవముల
స్థిరతరోగ్రతపంబు సేయుచునుండ

దశరథుఁడు పుత్రులులేక దుఃఖించుట.

నపు డయోధ్యానాథుఁ డాదశరథుఁడు
విపులవిక్రమముల విలసిల్లి రాజ్య
పాలనఁజేయుచు భావంబునందు
బాలురులేమి నిర్భరశోక మంది
కులముద్ధరింపంగఁ గొడుకులులేమి
కలిమి యేమిటికి భోగంబు లేమిటికి
కొడుకులులేని తేకువ వెతగాదె
కొడుకులు లేనిల్లు గోరియగాదె
కొడుకులులేని మేల్ కొఱతయగాదె
కొడుకులులేనిమేన్ కురుమోడుగాదె
యనుచు శోకింపుచు నడర నూర్చుచును
తనగురుని వసిష్ఠుఁ దలఁచిన నతఁడు
క్షణమాత్రమున వచ్చి కనుపట్ట నృపతి
ప్రణతుఁడై యతని కార్తితో నిట్టు లనియె
ఇనవంశదైవతం బీవకా నాదు
ఘనశోకములు దీర్పఁగాఁజాలు దనఘ

నేను నీకరుణచే నిఖిలభూములను
మానితంబుగ నీతిమర్యాద నేల
నెంతవైభవ మది యేమితపంబు
సంతతికి సుతుండు జనియించకునికి
నాదుఃఖ మెటు లౌరు నరక మెట్లుడుగు
నాదైన్యమును బాపి నన్ను రక్షింపు
మేమిచేసిన పుత్రు లిపుడె కల్గెదరు
ప్రేమ నుపాయం బెఱింగింపఁగదవె
అనవు డట్టివసిష్ఠుఁ డాదరంబునను
మనమునఁ దెలిసి సంభావ్యకార్యములు

వసిష్ఠుఁడు దశరథుని స్వామిపుష్కరిణియందు హరిపూజ గావింపుమని చెప్పుట.

వసుధేశ నీ కింతవంత యేమిటికి
అసమాన మహావెంకటాచలంబునను
వ్రతముఁజేకొని యందు స్వామిపుష్కరిణి
నతిభక్తి మజ్జనంబై హరిపూజ
సలిపిన శ్రీజాని సాక్షాద్భవించు
తలఁచినకోరికల్ తక్షణం బొసఁగు
నలువయు నిపు డందు నారాయణాంఘ్రి
జలజముల్ గనుఁగొను సంకల్పమునను
బృందారకమునీంద్రబృందంబుతోడఁ
బొందుగా నియమంబుఁబూని యున్నాఁడు
పరమాత్ముఁ డతనికిఁ బ్రత్యక్ష మగుచు
నరుదెంచు నంతలో నచటికిమనము
జనవలె నని వేగ జననాథుఁ దోడు
కొనివచ్చెఁ దనమదిఁ గుతుకం బెసంగ

గ్రీష్మర్తువర్ణనము.

నప్పుడు వేసవి యధికమై ముదుర
దప్పిగొని యినుండు తనకరమ్ములను
ధరగల్గు నీరముల్ ద్రావెడినాఁగఁ
జెరువులు దోనలేర్లు సెగ నింకసాగె
కొలనుల వాలుగల్ కుతకుత నుడికి
సొలసి యడుగసల్ల చొరఁబారి యడఁగె
భైరవుండు ధరించు పైఠిణీ లుతుకు
నేరుల గతిఁ బొల్చె నెండమావులును
మల్లియలతకూన మమతమీఱంగ
నుల్లసిల్లుచు నినుం డొగిపెండ్లియాడ
మొత్తమై తలఁబ్రాలు వోసిన యాణి
ముత్తియమ్ములలీల మొగ్గలింపొందె
గాటమా నెండచేఁ గాఁగి తెమ్మెరలు
పాటలవాసనఁ బడలిక దేరె
పడమటిగాడ్పుచే భానుయానంబు
వడి తగ్గె ననఁగ దివావేళ హెచ్చె
ధర దప్పి నీళ్ళంబుదము వేఁడి చాచు
కరములో యన సుడిగాడుపు లెసఁగె
మృగముల్ మరీచికాస్మృతిఁ బూని నిక్క-
ముగ బ్రవాహముఁజేర నరుగుచు సొలసె
రవిదీప్తిపటికముల్ రవిలి పెంపొంది
దవవహ్నికతము లత్తఱి సృజియించె
నెలనాగరవికపై నీర్ష్య పాటింప
మలయజరసమట్లు మలసె చన్గవను

చలివెందలి మిటార్ల చనుదోయి దుర్గ
ము లయి డాగెను శైత్యములకు తావయ్యె
కవలపానుపు లెడగాఁగ మరుండు
పువువిల్లు జబ్బుగాఁబోఁ జింత నణఁగె
నపు డమ్మునులు పంచాగ్నిమధ్యమున
విపులతపంబు గావింపుచుండంగ
నన్నగ మమితదావాగ్నిమధ్యమున
నున్నతతప మంది యొప్పారె నంత
తరుణులస్నేహంబు దగుల దీపించు
విరహదీపము కోడి వినువీధి నంటె

వర్షాగమము.

నన క్రొమ్మెఱుగు లయ్యంబువాహముల
తునుకలం గనుపట్టె తొలకరివేళ
నంబుజాప్తుఁడు గొను నప్పు తా మోచు
నంబుదంబును బట్టి యమరవిభుండు
దండించ నది యశ్రుతతి నించెఁగాఁగ
మెండుధారలు కొన్ని మేదినిఁ దొఱఁగెఁ
దవవహ్నిదీపికాతతి క జ్జలంబు
దవిలెనో యన దివిఁ దనరె కార్మొగిలు
ఘనమత్తగజముల కరసీకరములో
యన జల్లువానలు నలరె నందంబు
మెల్లమెల్లన కీలు మేలును దిగఁగ
మల్లడి సయ్యభ్రమదకరిఘటలు
మెఱుఁగులన్ నిగళముల్ మెదలక పూని
నెఱసినట్టుల జడముల్ నిలుకడ దనరె

కడలిలో మొగు లుదకంబులు ద్రావు
నెడ మున్ను ముత్తెంబు లింపొందుకెంపు
లెఱుఁగక మ్రింగి తానిపుడు గ్రక్కె నన
కఱకేంద్రగోపముల్ కడువడి రాలె
ఘనమర్దళంబుల గర్జనధ్వనుల
కెనయుమయూరిక లెలమి నర్తించె
నెమ్మి గొమ్మలు సల్పు నృత్యముల్ చూడ
నెమ్మిఁజెందక హంసనివహంబు దొలఁగె
అప్పు లిచ్చి ఘనుండ వటు లార్భటించు
టొప్పునే యని మబ్బు నుబ్బు నిందించి
మొగిలిపిండు గడంగి మొగమెత్తి కేరి
నగె నన నవ్విరుల్ నవములై యలరె
సరిదంబుజాక్షులు సంపూర్ణరసము
మెరయ నిజేశు నెమ్మెయిఁ జేర నురికె
జగతీరమణికి పర్జన్యుం డొసంగు
మగరానగలుగా నమరె తటాకములు
నలజడి నంబుమధ్యావాసనియతి
నలజడి లేకుండ న మ్మునీశ్వరుల
ఘోరతపంబుఁ గన్గొనుచు నచ్చెరువు

దశరథుఁడా స్వామిపుష్కరిణియొద్ద తపముసల్పు తాపసులఁజూచుట

మీర నాదశరథమేదినీశ్వరుఁడు
గురునివెంబడి నంటి కొండ యెంతయును
వరుసఁ జూచుచుఁ జేరెస్వామిపుష్కరిణి
చేరి యందు నృపాలశేఖరుఁ డపుడు
భూరిప్రదక్షిణంబులు సేయుచుండఁ

గొందఱు మునివ్రేలు కుంభిని నూని
పొందించి చూపు లంబుజమిత్రునందు
ప్రసృతోర్ధ్వబాహులై పంచాగ్నిమధ్య
వసతి చలించక వరలువారలును
కొందఱు నీటిలోఁ గుత్తుకబంటి
నొందు గోముఖవృత్తి నుదకభక్షు లయి
అనిశంబు నక్షీ నాహారిఁ బ్రతిష్ఠించి
కనుఁగొంచు నెంతే నిల్కడ నుండువారు
కొంద ఱాసననిష్ఠఁ గూర్చుండి చూడ్కి
పొందుగా నాసాగ్రమునఁ గీలుకొల్పి

హృదయాంబుజంబున నీశ్వరు నిల్పి
పదరక నానందభరితులౌ వారు
నందు కొందఱు కపాలాసనస్థితులు
జెంది నందకుమారు శ్రీ శ్రీనివాసు
భావించి దృఢముగాఁ బ్రణవజపంబు
గావింపు చున్నతిఁ గనుపట్టువారు
వెస కొందఱయ్యరవిందలోచనుని
బిసతంతునిభ నాడి పేర్మి భ్రూమధ్య
మున నిల్పి ఘనయోగమునఁ బ్రాణములను
తనవశంబుగఁ జేసి తనరెడువారు

నగుచు నమ్మునివర్యు లలర సోద్యముగ
జగదాదికర్త యాజలజసంభవుఁడు
సమశిరోగ్రీవనిశ్చలగాత్రుఁడగుచు
సముదగ్ర మగు వ్యాఘ్రచర్మంబునందు
నాసనాసీనుఁడై యనితరాసక్తి

నాసాగ్రలగ్నమై నలువొందఁ దనదు
దృష్టిఁ బూన్చి మకుందుఁ దిలకించి మదిని
యష్టాక్షరీమంత్ర మభ్యసింపుచును
శుద్ధసత్వంబున శోభిల్లుచుండ
నద్ధాతఁ గనుఁగొని యతివిస్మయమున 1010.
మ్రొక్కి నిల్చిన రాజముఖ్యునిఁ జూచి
మక్కువను వసిష్ఠమౌని యిట్లనియె
తడయ నేమిటి కింక దశరథభూప
కడువడి స్వామిపుష్కరిణి స్నానంబు
సలుపుఁ మే దెలుపుదు సంకల్ప మనుచుఁ
బిలువ నవ్విభుఁడు సంప్రీతి నం దరిగి
తీర్థంబులం గ్రుంకి తీర్చి కర్మములు
ప్రార్థించి గురుని యష్టాక్షరిఁ జెంది
న్యాసపూర్వముగ మంత్రము జపించుచును
వాసుదేవుని శ్రీనివాసు భావించు 1020.
కొనుచు వ్రతంబుఁజేకొని సతతంబు
ఘనభక్తిఁ దత్పూజఁ గావింపుచుండె

శ్రీనివాసుఁడు విమానమునఁ బ్రత్యక్షమగుట.

అంతట నాచెంత నత్యంతకాంతి
సంతతి యెంతయు సంతతం బగుచు
శతలక్షకోటి భాస్కరకరోత్కరము
వితతామితౌర్వాగ్ని వితతికీలములు
ధ్రువతరాసంఖ్య విద్యుత్ప్రభాభరము
నవిరళానందచంద్రాతపోచ్చయము

ప్రణుతకాంతిసముద్రప్రథితసుమేరు
మణిశృంగమును మించు మకుటంబువాని 1080.
కరుణారసాంబుజాకరమున నలరి
కరమొప్పు తమ్ములో కనుఁగవవాని
పురుషార్థములు నాఁ గ్లైపుడు నిచ్చుకల్ప
తరువు లౌ భుజములఁ దనరెడువాని
నొనరఁ గోరికలెల్లనొసఁగనౌ వ్రతము
కనుపట్టఁ బూను కంకణములవాని
జగదంబ గూర్చుండు చదురుపీఠంబు
పగిది మించిన కౌస్తుభముఁ దాల్చువాని
కరధృత శంఖచక్రంబులవాని
వరదహస్తప్రభ వరలినవాని 1090.
చేకొని చాణూరుఁ జిదిమిన తొడల
డాకమించఁగ నుంచు డాకేలువాని
కళుకు బంగరుశాలు గప్పినవాని
బలిఁ గ్రుంగఁ ద్రొక్కిన పాదంబువాని
చాల భక్తులకు నిష్టములు వర్షించు
నీలమేఘుంబుగా నెలకొన్నవాని
పారిజాతద్రుమ ప్రాంతవేదికను
భూరి వైభవములఁ బొలిచినవాని
ఆనందనిలయ విమానాంతరమున
నానందమూర్తియై యలరెడువాని 1100.
శ్రీనివాసునిఁగాంచి చెలువు భావించి
యానంద బాష్పంబులడర నర్తించి
దేహముల్ పులకింప ధృతులు చలింప

మోహంబు రెట్టింప ముదముద్భవింప
పారవశ్యము మించ భయముద్దీపించ
కోరికల్ మఱచి యాగుబ్బుగానరచి
రెప్పవేయక చూచి రిత్తకేల్ సూచి
యొప్పుగాఁ దెలివొంది యూహించిమదిని
వెన్నుని వెసఁగాంచి వేదసూక్తముల
సన్నుతుల్ సేయుచుంగ సాగిరందరును.
అపుడు చతుర్ముఖుండా శౌరిఁ బొగడ
నపరిమితముఖంబు లందమి వగచి
చతురత్వమునఁ దన చతురాగమములఁ
జతురాననంబుల సన్నుతిసేయు
మఱి యగస్త్య వసిష్ఠమాండవ్యకుత్స
శరభంగ జైమిని జాబాలి వత్సు
లయ్యెడ వేర్వేర నలర సన్నుతులు
సెయ్యంగ నందు మించెను మహాధ్వనులు
అంతట నారదుండా నినాదంబు
లెంతయుఁ దడవు కొక్కింత నిల్చుటయుఁ
దనచేతి మహతి తత్తరమున హత్తి
మునిజనంబులకెల్ల ముందరహత్తి
జరగిన బిరుడలు చక్కగానొత్తి
సరిమేళవించి బజాహిణిచేసి
యాంహారిఁ గీర్తించి యాలపించంగ
నా హారి యటు శంకరాభరణాను
దిరువేలువీనుల నింపును సొంపు
మెరయ సాలించి తామెమ్మోయి భోగవితతి

యున్నతిమించంగ నుల్లాస మొంది
కన్నుల బ్రహ్మానుఁగా గనుఁగొనఁడయ్యె 1130.

శ్రీ కాంతుఁడు బ్రహ్మనువిడిచి దశరథుని గాంచనాతఁడు నాల్గుశ్లోకముల నుతించుట.

అప్పుడు దశరథుం డబ్జలోచనుని
విప్పులౌ కన్నుల వెసవెసఁ జూచి
యానందభరితుఁడై యలరి నటించి
పూని యంజలి శిరంబున భక్తిమించ
శ్రీకాంతుగుణములు చింతించి నాల్గు
శ్లోకంబుల నుతించె శోకంబు దొలఁగ
నపుడు ప్రసన్నుఁడై యా శ్రీనివాసుఁ
డుపగూఢసార్వజ్ఞ్యమూని తాఁ దెలియ
నటుల బ్రహ్మాదుల నాదరింపుచును
చటులగంభీరఘోషణభాషణముల 1140.

శ్రీనివాసుఁడు బ్రహ్మాదుల నాదరించి వచ్చిన కారణమడుగుట

మీర లిచ్చట వచ్చి మిక్కిలితపము
లీరీతి సల్పుట కేమి కారణము
దితిసుతుఁ డెవఁడైన దేవరాజ్యంబు
మితిఁదప్పి కొనెనొకో మీయధికార
నిర్ణయం బెవ్వరేనియు సాగనీరొ
వర్ణాశ్రమంబుల వరుస దప్పినదొ
వేధకు నేమైన వేధదాకినదొ
బాధకు లెవరైన బాధించినారొ
వేదరాసులను నిర్వేదమొందినదొ
వేదుఃఖాప్తిఁ దొలంగి వివరింపుఁ డనిమె. 1150.

అనుటయు నబ్జజుం డబ్జనాభునకు
వినతుండై కేల్మోడ్చి వినయంబుతోడ
సర్వలోకేశ్వర ! సర్వాంతరాత్మ !
సర్వశక్తిక ! సర్వజగదాదికర్త !
సర్వజగన్మయ ! సర్వజ్ఞ ! నీవు
సర్వగీర్వాణాదిసాధారణక్రియ
నన్నడిగెద విటె నావల్ల వినఁగ
విన్నవించెద మున్ను వేదాదు లీవు
నిర్ణయించినరీతి నిర్బాధముగను
బూనిననేమంబుఁ బూని యున్నవియు
అల్ల హిరణ్యాకశ్యపుగాని నీవు
పెల్లున నరసింహాభీకరమూర్తి
వగుచు ఖండించి యింద్రాదుల పగయు
వగయుఁ దీర్చితి పట్టి వాని వంశమున
జనియించి కొందఱే జగతిధర్మంబుఁ
జెనకుచు జనుల శాసింపుచున్నారు
సురగరుడాదికస్తోమంబుచేత
వరబలంబున వారు వధ్యులుగారు
మరియు రావణుఁ డను మత్తరాక్షసుఁడు
చఃరుకు చూపుచు సురాసురముఖ్యజనుల
ఘోరాజి బంధించి కోమలాంగులను
మీఱి చరల్ బట్టి మృత్యువు గొట్టి
దేవేంద్రు ననిఁ బట్టి తేమలక కట్టి
దేవలోకముఁ జొచ్చి ధృతిఁ గొల్లబెట్టి
చాల రాయిడిచేయ సాగె నింకేమి

కైలాసగిరిని పెకల్చెను కేల
దేవర లింద్రాదిదివిజుల మునుల
బ్రోవఁగ నల వారిఁ బొలియించవలయు
శ్రీశైలపరిసరసీమను దైత్యు
లాశ్రితనగదక్షిణాంబుధిమధ్య
మంతయు విహరింపు చచటి సజ్జనుల
నెంతయు బాధించు నెడల నెవ్వారు
వారిని వారించువారలే కాక
నారయ రక్షకు లన్యు లున్నారె
శరణంబు దేవర చరణంబె మాకు
కరుణించి మముఁ బ్రోవఁగదవె ముకుంద
అని విన్నవించిన యా శ్రీనివాసుఁ
డనుపమకరుణారసాబ్ధిఁ దేలించి
చిఱునవ్వు మోమునఁ జిందులుద్రొక్క-
[1] నొఱపుజూపులఁ జూచి యూరడింపుచును
సురలార మీ రింత సొలయంగనేల
కఱకురక్కసుల నే ఖండించువాఁడ
దనుజుల క్షణమాత్ర తలలు ద్రవ్వించి
పనుపుదు నా జముపట్టణంబునకు
జడియక సుఖముగాఁ జరియింపు డింక

శ్రీనివాసుఁడు బ్రహ్మాదులకుఁ గోరిన వరములిచ్చుట.

నడుగుడు కాంక్షించు నట్టివరంబు
లిచ్చెద నిచ్చోట నెడపక యిపుడె

1. వ్రా. ప్ర. వెరపు జూపు.

యిచ్చ సందియ మింక నేమిటి కనియె
నావుడు హర్షించి నారాయణునకుఁ
గావించి ప్రణతు లాకమలసంభవుఁడు

కరుణాంబునిధి నిన్ను కనుఁగొన్న వెనుక
నరసి కోరఁగ మాకు నన్యముల్ గలవె
నినుజూచిన లభించు నిత్యసంపదలు
నినుఁ గొల్చిన ఫలించు నిఖిలపుణ్యములు
నిను నుతించినఁ గల్గు నిరతభాగ్యములు
నిను దలంచినఁ బాయు నిష్ఠురాఘములు
కలశాబ్ధిఁ జేరియుఁ గలదె దాహంబు
కలితామృతము గ్రోలఁ గలుగునే తృష్ణ
ఆనందమయుఁడ వౌనట్టి నిన్ గాంచి
యానందరస మోలలాడెద మిపుడు

మరియుఁ గోరినవెల్ల మము వేడుఁ డంటి
మరువరా దామాట మధుకైటభారి

శేషశైలమున స్వామి స్థిరముగానుండునట్లు బ్రహ్మకు వరంబొసంగుట.

పరమాత్మ నీ విందు ఫణిరాజ గిరిని
స్థిరముగా నీమూర్తి చెలువంద నిలిచి
దృశ్యత నిట్టి మందిరమున భక్త
వశ్యుఁడవై యుండవలయు మాతల్లి
శ్రీదేవియును నిట్టి శ్రీ విలసిల్ల
నాదరంబున నుండి యతిచిత్రరత్న
శృంగాంతరంబుల చెలిమి నిన్ గూడి
శృంగారలీలచేఁ జెలఁగి వర్తింపఁ

గోరుచున్నది మౌనికుంజరుల్ నిత్య
సూరులు ఖచరులు సురలు కిన్నరులు
మేమును బ్రార్థింతు మెపుడు నీవరము
పూనిక దయచేయు భువననిధాన !
ఇలఁగల్గు జనముల కిష్టార్థతతులు
చెలిమి నొసంగుచుఁ జెలువొందవలయు
ముందర కలియుగంబున జనించునపు
డందఱు నల్పపుణ్యాక్రమంబుననె
అల్పబలోపాయు లగుదురు వారిఁ
గల్పకతరులీల ఘనఫలం బొసఁగి
రక్షింపవలయు వరంబిదె యనిన
పక్షివాహనుఁ డట్టి బ్రహ్మ కిట్లనియె
కమలసంభవ ! మీరు కాంక్షించినటుల
విమలరూపంబున వేంకటాచలము
శృంగాంతరమ్మునఁ జెలఁగు నిమ్మూర్తి
రంగొందఁబూని సర్వసుపర్వభక్త
సులభతఁ గనుపట్టుచును నెల్ల వేళ
లలరుచు విహరింతు నాకల్పముగను
అని యబ్జభవునకు నానతి యిచ్చి
తనరఁ గటాక్షించి దశరథవిభుని
సాకేతపురనాథ ! స్వామిపుష్కరిణిఁ

నాల్గుశ్లోకములనుతించిన దశరథునకుస్వామి నల్గురు పుత్రులను బ్రసాదించుట.

జేకొని స్నానంబుఁ జేసితిగాన
నీ పురాకృతపాపనివహంబు తొలఁగి

శ్రీ పరంపర నీకుఁ జేకూరు నీకను
నాలుగు శ్లోకముల్ నన్ను గురించి
చాల సందర్భించి సన్నుతించుటను
శ్లోకసంఖ్యను సర్వలోకవిశ్రుతులు
ప్రాకటోజ్జ్వలమహారాజ్యలక్షణులు
బలపరాక్రమములఁ బ్రతిలేనివారు
నలువురు నీకు నందనులు గల్గెదరు
చను మయోధ్యకు ని వ్వసంతంబునందె
దనరంగ నశ్వమేధంబుఁ గావింపు
మీవసిష్ఠమునీంద్రుఁ డిందు నాచార్యుఁ
డై వెలయఁగఁజాలు నని నియోగింప
విని యట్టు దశరథవిభుఁడు కృతార్థ
తను ముకుందునకుఁ బ్రదక్షిణనతులు
గావించి యానందగళితాశ్రుఁడగుచు
సేవించి వీడ్కొని శిష్టు వసిష్ఠుఁ
గలిసి యయోధ్యకుఁ గదిసి యేగుటయుఁ
దిలకించి చక్రమును దేవుఁ డిట్లనియె

దేవుఁడు లోకకంటక సంహారంబొనర్ప చక్రంబున కాజ్ఞయిచ్చుట.

విను మస్త్రరాజ యి వ్వేల్పులు చూడఁ
గను రాజవేషంబుఁ గైకొని నీవు
జ్వాలారపంక్తులు సైన్యపాలురుగ
చాల శస్త్రంబులు సైనికుల్ గాఁగ
నిజకింకరానీకనిష్ఠురోద్ధతులు
త్రిజగద్భయంకరస్థితి విజృంభింపఁ
గదలి వేగమె లోకకంటకు లెందు

మొదలిసఁ బరికించి మించి పోనీక
భండనంబునఁ జండపాండితిఁ జెంది
ఖండతుండంబులు గాఁగ ఖండించి
యొకరెండుప్రొద్దుల నుర్వి నందఱికిఁ
బ్రకటసౌఖ్య మొనర్చి రమ్మని పనిచె

సుదర్శనాగ్రణి శత్రుసంహారం బొనర్చుట.

అటు లంపిన సుదర్శనాగ్రణి హరికిఁ
బటుభక్తి మ్రొక్కి నిబ్బరమొప్ప వెడలి
భీకరతరజైత్రభేరిభాంకృతులు
లోకలోకాలోకలోచనప్రౌఢి
మెఱయ నార్భటులచే మిన్ను భేదిల్ల
కఱకుమించిన పెక్కు కైదువుల్ బూని
కింకరసంఘంబు కెరలి బెట్టడరి
హుంకారసింహనాదోద్ధతుల్ నెరప
చతురంగబలములు సమకట్టి నడవ
చతురత మించంగ జైత్రసన్నాహ
పటిమ ఘటించి యాప్రాగ్దిశాభాగ
కుటిలాటవులఁ జొచ్చి కోలాహలముగఁ
గార్చిచ్చు పేర్చినకైవడి నంటి
యార్చుచు రిపుల సంహరియింపఁ దొణఁగె
అపు డామురారిబ్రహ్మాదులెల్లరును
విపులభక్తుల వేళవేళ నర్చించి
పరిణతబ్రహ్మానుభవమునఁ జాల
నిరుపమానంద మొంది నిరంతరంబు

నిత్యసూరులమాడ్కి- నిరతకైంకర్య
కృత్యసత్యాత్ములై కిల్బిషం బాడలి
సంసారవాగుర సడలించుకొనుచు
కంసారిసాన్నిధ్యకలితభావమున
నన్యాభిలాషంబు లంట కెంతయును
ధన్యులై యా గిరిఁ దనరుచుండి రని
శ్రీ సభాభివ్యక్తిఁ జెలఁగువృత్తాంత
మాసూతుఁ డందు సంయములకుఁ దెలిపె
అనివిచిత్రార్థసమర్థనాకలిత
ఘనసర్గవిశ్రుతకవిముఖ్యు పేర 1300.
విపులానుభావభావితస:విధాన
కపటనాటకజగత్కారణు పేర
భాసురాంగశ్రుతిభారతిభవ్య
లాసికాగీతవిలాసునిపేర
తారకాంతకపితృద్వంద్వా ద్యతీత
తారకమంత్రాభిధానునిపేర
ప్రత్యాహృతోత్తరాపత్యచైతన్య
సత్యనిత్యబ్రహ్మచర్యునిపేర
క్షీరపారావారసీకరాసార
పూరితనిజముఖాంభోజునిపేర 1310.
పావనభక్తాప్తబంధునిపేర
గోవిందరాజముకుందునిపేర
శ్రేష్ఠలూర్యన్వయశ్రేష్ఠశీలుండు
ప్రేష్ఠమహోయశశ్రీధురీణుండు
గోత్రభారద్వాజగోత్రవర్ధనుఁడు

సూత్రుండాప స్తంబసూత్రానువర్తి
అష్టభాషాకవిత్వార్జితప్రోద్య
దష్టావధానవిఖ్యాతశైరవుండు
శ్రీ కృష్ణయార్యలక్ష్మీగర్భవార్థి
రాకాసుధానిధి రాజపూజితుండు 1320.
వివిధవిద్యాశాలి వేంకటార్యుండు
సవరించు శ్రీనివాసవిలాసమునను
హరువొంద నిది ద్వితీయాశ్వాసమగుచు
ధరం బొల్చు నాచంద్రతారకంబుగను.

ద్వితీయాశ్వాసము, సమాప్తము.



# శ్రీనివాసవిలాససేవధి

## తృతీయాశ్వాసము



శ్రీనగరీవాస శ్రీకరోల్లాస
మానితదరహాస మాంజిష్ఠవాస
భాషావధూకాంత భావితోదంత
శేషాంగమృదుతల్ప సిద్ధసంకల్ప
కరసముద్ధృతచక్ర ఖండితనక్ర
కరుణారససముద్ర ఘనయోగనిద్ర
శ్రీవత్సకౌస్తుభ శ్రీరంజితాభ
కోవిదసురభూజ గోవిందరాజ
అవధరింపుము సూతు నమ్మునీశ్వరులు
సవినయప్రేమఁ బ్రశంసించి మిగుల
పౌరాణికేంద్ర ! శ్రీపతి పంపుచక్ర
మేరీతి రాజత్వ మేర్పడ వెడలె
నెవ్వారి ఖండించె నెటుల యుద్ధంబు
నివ్వటిల్లెను నీవు నిఖిలంబు మాకు
వివరింపు మని వేఁడ వెస వారి కతఁడు
సువిశదంబుగ భవ్యసూక్తి ని ట్లనియె

### హరిచక్రము చేసిన శత్రుసంహారక్రమము.

అంతట హరిచక్ర మద్భుతలీల
నెంతయు మణిహారహారకిరీట

కంకణకుండలాంగద తులాకోటి
కింకిణీగణముల ఘృణులు దళ్కొత్త
శ్రీగంధములపూత చెలఁగురొమ్మునను
బాగుగాఁ గుంకుమపట్టెలు దీర్చి
దట్టపు బంగారుతగిటీల ధట్టి
పట్టెసంబు ఘటించు పడదలా గట్టి
యొగవంక బలువంకి యొనరఁగీలించి
సొగసువీఁకను బాకుఁ జొనిపి డావంక
వన్నెలచెంగావి వలెవాటు వైచి
తిన్నఁగాఁ గస్తూరి తిలకంబు దిద్ది
యరుణదీప్తి వహించు నరసహస్రంబు
కరసహస్రంబుగా ఘనత రంజిల్ల
కెందమ్మిరేకులక్రియ జేవురించు
కందోయి మిక్కిలి కనుఁ జెన్నొంద
తొగలరాయని మేని తునకలపగిది
ధగధగద్రుచి మించి దంష్ట్రలు మెఱయ
తేటరెక్కలచాలు దీటుగాఁ గొనిన
నీటందు మీసంబు నిగ్గగ్గళింప
రాజసం బెసఁగంగ రాజిల్లు నైజ
రాజభావంబు స్వారాజు నుతింప
జ్వాలాముఖుండును బడబాముఖుండు
జ్వాలాకరాళుండు సైన్యపాలురయి
కెలనఁ గొల్వఁగ యక్షకిన్నరగరుడ
కులజు లౌ కింకరుల్ కుంతాసిశార్ఙ్గ
పరశు ముద్గర గదా పట్టిస ముసల

శరచాపతోమరాస్త్రంబులు బూని
సందడింపఁగ రథసామజతురగ
బృందంబులును నిండి భెట్టుగా నడర
భేరినిస్సాణగంభీరఢక్కాది
భూరివాద్యంబులు భోరున మొరయ
దిక్కు లాకసము ప్రతిధ్వను లీనఁ
బిక్కటిల్లుచు లోకభీకరంబుగను
చండాంశుమండలసదృశ మహా రథము
నిండువై ఖరి నెక్కి నిష్ఠురోద్ధతుల
సన్నద్ధుఁడై యుద్ధసాహసబుద్ధి
మున్నుగాఁ బూర్వదిఙ్ముఖమున వెడలె

చక్రుండు తూర్పుదిక్కున రక్కసులఁ జెండాడుట.

వెడలినచక్రుండు వీరదశ్యునకుఁ
గడుసురక్కసున కా గహనగోచరులు
వినుము రాక్షసముఖ్య వింతకార్యంబు
జనియించె నద్భుతసన్నాహ మెసఁగ
జనపాలుఁ డెవ్వఁడో చతురంగబలము
దలరంగ నివ్వనాంతరమునఁ జొచ్చి
వచ్చెను వేటాడవలసియో మోాన
మెచ్చి మనలమీఁది కేతెంచువిధమొ
తెలియఁజెప్పుఁడు నిందు తేరిజూడంగ
బలవైరి మొదలుగా భయపడుచుండు
నిదియేమొ యుత్పాత మిట నిర్భయముగ
కదిసి భేరి మృదంగ కాహళుల్ మొరయఁ

జనుదెంచుటను మాకు శంక యయ్యెడిని
యన విని రక్కసుఁ డత్యాగ్రహంబు
నెగడంగఁ గన్గవ నిప్పుకల్ గురియ
భుగభుగ నూర్పులఁ బొగలు బెట్టెగయఁ
జెంత నమ్మంత్రుల జీరి క్రూరోక్తి
నెంతయు గర్జిల్లి యిట్లని పలికె
వినుఁ డిందు మనుజుండు వెర పింత లేక
చనుదేరఁగలఁడె యా శతమఖప్రముఖు
లెవరో వచ్చిరి వీరి నీక్షణంబుననె
భువిఁ గూల మొత్తి బెబ్బులి మృగంబులను
బొదివి కోరలఁ జీల్చి భూరిరక్తములు
మెదడు గ్రోలెడుమాడ్కి మిక్కిలి డొక్క
లుక్కన వ్రక్కలిం చుష్ణాస్రధార
లక్కజంబుగఁ ద్రావి యార్చెద నిపుడె
తే రాయితము చేసి తెప్పించు డెల్ల
వీరసైనికులను వెడలించు డనికి
ననుడు మంత్రులు వేగ నఖిలసైనికుల
మునుగూర్చి వేసడంబులు బూన్చి రథము
బేర్పించి సన్నాహభేరి వేయించి
యేర్పరించి బలంబు నెదుట మున్ననిచి
దుర్గస్థలంబులఁ దొలఁగక నాప్త
వర్గంబు నిల్పి యవ్వార్తలు విభుని
కెరుగింప నతఁడు తే రెక్కి సారథిని
త్వరసేయుచుఁ గడంగి తరలంగ భటులు
ధళధళుక్కన నాయుధమ్ములు మెఱయ

ఝళిపించి యట్టహాసములు సేయుచును
మొనలకుఁ జేరి యా మూఁకపై దూరి
కినుకఁ బంతము మీఱి కినిసి తాకినను
చల మొప్పఁగా సుదర్శనరాజు సేన
లలర వైరిబలంబు లాక్రమించుకొని
చక్కుచక్కునఁ జెక్కి సమితి బల్ డొక్క
లక్కులు పిక్కలు నల కాళ్లు వేళ్లు
సిరములు కరములు చెక్కులు ముక్కు
లురవడి తునియలై యుర్విపైఁ బర్వ
జొత్తుల యేరు లెచ్చోట్టుల నెగడ
హత్తుల మొత్తంబు లత్తఱిఁ గూలఁ
దుత్తుమురై రథతురగముల్ క్రగ్గఁ
దత్తఱంబున దైత్యతతులు నూటాడ
కోలాహలంబుగా ఘోరవైఖరుల
నాలంబు సల్పి రత్యద్భుతంబుగను
అట్టి కయ్యంబున హతశేషులైన
కట్టడిరక్కసుల్ కడువడి నురికి
మన బలంబుల నెల్ల క్రుగ్గించి పరగ
నినుమడించిన కిన్క హెచ్చి వచ్చి రని
వీరదస్యునిచెంత వివరింప నతఁడు
ఘోరాగ్రహంబున ఘూర్ణిల్ల గ్రుడ్లు
వేఁడి వేఁడిగఁ గూర్చి వెస నౌడుగఱచి
వాఁడికోరలు దీడి వాలు చేఁబూని
తనచుట్టములు తాను తాఁకి బెట్టార్చి
యని సుదర్శనసైన్య మంతయుఁ గలచ

వానిముందర దానవస్తోమ మడరి
పూని పచారించి పొదలు రోసమున
మండలాగ్రముల తోమరముల గదల
భిండివాలంబుల బెట్టుగాఁ గొట్టి
తలలు డుల్లఁగ బాహుదండముల్ దునియ
బలు మొండెములు ద్రెళ్ల పదములు చిదియ
కరములు తునియ వక్షంబులు నలియ
కరులు నెగ్గగ తురంగంబులు మ్రగ్గ
రథములు చెదర వీరభటాళి బెదర
రథికులు నుదర సారథులు బెట్టదర
సిడములు నెఱఁగ చేసింగిణిల్ విఱుగ
నడిదముల్ తునుగ నస్త్రాస్త్రముల్ బెనఁగ
నతిఘోరరణమున నాత్మసైన్యంబు
ప్రతిరుద్ధ మగుట చక్రప్రభుం డరిగి
జ్వాలాముఖుని బంప వడి నాతఁ డట్టి
యాలంబు జొక్కి చెక్కాడె వైరులను
అచ్చట చండజంఝానిలంబునకు
విచ్చిపోయెడు మేఘవితతిచందమునఁ
గడకమై తూరు సింగంబు ఢాకకును
కడుభీతి నుఱుకు మృగంబులపగిది
వడిఁ బెల్లడరు సాళువంబును గాంచి
పడి మూర్ఛఁజెందెడి బకములమాడ్కి
కడిది చుట్టుకవచ్చు కార్చిచ్చుశిఖల
నడుగంట మాడు కారాకులకరణి
దురమున నాతని దోర్విక్రమమున

ఫురివిచ్చి వీగియు పొలసి యాపరియు
తనదుపై నిశు లెల్ల తలఁగఁగఁ జూచి
కెనుక రక్కసుఁ డొక్క గిరిశృంగ మతని
తేరు కై వైచిన దృఢశక్తి దాని
వారించి మించి యా జ్వాలాముఖుండు
ఘోరవిక్రమము గైకొని తన హేతి
చే రాక్షసేంద్రుని శిరము ఖండించె
అప్పుడు మింటిపై యమరదుందుభుల
చప్పుడు నెగడఁ బుష్పంబులవాన
గురిసె ఖేచరతతి కొండాడి పొగడె
ధరణీసురాదు లా తద్దేశజనులు
సంతసించిరి సుదర్శనరాజవరుని
అంతట నా విభుం డా దేశమునకుఁ
బరిపాలన మొనర్పఁ బటుబుద్ధి నొకని
ధరణీశుఁ గావించి తరలి యాక్షణమె
కడగి యాగ్నేయదిక్తటమున కరిగి

ఆగ్నేయదిక్కున మాయాక్షుఁడను దానవుని సంహరించుట.

తోడిబడ విజయదుందుభులు మ్రోయించె
అక్కడ మాయాక్షుఁ డను దానవుండు
పెక్కండ్రు దైత్యులు పెంపునఁ గొల్వ
క్షత్రియాకృతిఁ బూని సకలలోకులకు
విత్రాసమొనఁగ గర్వించి గ్రామములు
ననుపమమఠములు నగ్రహారములు
జనపదంబులు మౌనిజనుల యాశ్రమము

లుటజముల్ చెఱిచి బహూపద్రవంబు
లటు చేయుచుండువాఁ డా భైరవము
విని యాగ్రహించి నావిపినంబునందు
మనమున జడియకే మహిపాలుఁ డిట్లు
మదమున వచ్చె నా మాయచే వాని
చదిచి డమూము లశ్వములు నేనుంగు
లన్నియు హరియించి యరుదెంతు నంచు
సన్నద్ధుఁడై బంధుసంఘంబుతోడ
ననికిఁ జేరఁగ వాని నస్త్రశస్త్రముల
నినిచి తూలించె నా నృపసైన్య మపుడు
ఆరీతి ప్రహరంబు లంటిన నట్టి
క్రూరదానవుల మార్కొనలేక తూలి
మాయచేఁ దమయునికి మరుపెట్టి డాగి
పోయిన న వ్వనభూమి యంతయును
వెతకి గానక వారి విడిదిపల్లెల
నతిరోషమునఁ జిచ్చు లంటించి మరలి
సైన్యపతికిఁ దెల్ప చాల నతండు
వన్యాంతరము లంటి వరుస శోధించి
మాయ సేసినవారి మాయఁ జేయంగ
పాయని కినుకను బాణంబు బూని
మరియు నాగ్నేయాస్త్రమహిమ యుం దుంచి
వరభుజాశక్తి నుర్వడిఁ బ్రయోగించె
నంతట నా పావకాస్త్రంబు మంట
లెంతయు నెగయంగ లేచి యావనము

లంటుగ దహియించి యచట నాలోక
కంటకులను భూతిగాఁ గాల్చి మగుడ
నతని యమ్ములదొన నణకువఁ జొరఁగ
నతని శౌర్యము మెచ్చి రఖిలదేవతలు
అటుల నాసైన్యేశుఁ డసురులఁ గాల్చి
చటులత వారుణాస్త్రంబున వర్ష
ధారలు గురియించి ధర చల్లఁజేసి
శూరునొక్కరుని నచ్చో ఠాణె మునిచి
ప్రజలను గరుణించి రావించి యచట
నిజపరాక్రమమున నిర్భయంబుగను
నెమ్మది నుంచి యా నృపతి చెంగటను
సమ్మదమునఁ జేరి చతురుఁడై నిలిచె
నిలిచిన నా చక్రనృపతి సంతసిలి
చెలిమి మన్నించి యా సేనాధినాథుఁ
బొగడుచుఁ గదలి యద్భుతవిక్రమంబు

### చక్రనృపతి దక్షిణదిశను జయించుట.

నెగడ దక్షిణదిశ నిష్ఠురధాటి
నడరి సంగరభేరి కార్భటుల్ మెఱయ
తడయక సింహనాదములు సేయుచును
భటకదంబంబు లుద్భటసాహసముల
చటులత నడచి యచ్చటఁ బేర్చి యార్చి
యుక్కళంబుల డాసి యొనరు ఠాణెంబు
లుక్కణంగించి బెట్టుబికి పాళెములు.
చొచ్చి చుట్టుక ముట్టి చూరలుబట్టి
మచ్చరంబున దైత్యమండలిఁ డాకి

అంపవానల ముంచి యద్రుదు లార్భటులఁ
గంపింప జెలరేగి కదనంబు సల్పు
నత్తఱి దైత్యు లాహాళహాళిఁ గలఁగి
ఉత్తలపాటుతో నఱుకంగ గడఁగి
అంకవంకపుళిందు లనుదైత్యవరులు
పంకజభవుఁ డిచ్చు బహుళోగ్రవరము
లందుట గర్వించి యందు బిడాలు
ముందుగ రావించి మూర్ఖు బాలకుని
హెచ్చరింపుచు వార లేవురు సేన
విచ్చి పోవఁగనీక వెసఁ బురిగొల్పి
పరిఘతోమరగదాప్రాసాసిపరశు
వరచాపశార్ఙ్గాది శస్త్రముల్ బూని
యరదంబు లెక్కి గజాశ్వరథాళి
యిరువంక బారుతై యిల సందడింప
వేరువేరుగ మొనల్ విభజించికొనుచు
చేరి జ్వాలాముఖసేనలఁ గొట్టి
గోరించి చెండిన ఘూర్ణిల్ల విఱిగి
తారిన తనసైన్యతతి నాదరించి
యా సుదర్శనుఁడు నేత్రాంచలదృష్టి
నీసునఁ గోపాగ్ని యెగయ వీక్షించె
నా లోచనాగ్నియం దాక్షణంబుననె
జ్వాలకేశుఁడు మహాసటుఁడు రణఘ్నుఁ
డల స్ఫులింగాక్షకాలాంతకు లనెడి
బలవంతు లేవురు ప్రభవించి వెడలి
కత్తులు కేడెముల్ కరములఁ దాల్చి

మొత్తి దైత్యులశిరంబుల డుల్లగొట్టి
యేవురు నసురుల నేవురుఁ దోలఁగి
పోవనీయక పట్టి పొలియించి రపుడు
ఇటుల వైరులఁ ద్రుంచి యేవురుచక్ర
భటు లేలికకు మ్రొక్కి భక్తితో నిలువఁ
గనుఁగొని వారిఁజక్రప్రభుం డెలమి
వినుతించి యచ్చటి వివిధలోకులను
పిలుపించి యభయంబుప్రియమున నొసఁగి
బలియు నొక్కని మహీపతిగా ఘటించి
మునివరుల్ దీవింప ముదమునఁ దరలి
చని పశ్చిమంబున జయభేరు లులియ

చక్రరాజు పశ్చిమ దిగ్విజయము.

మునుకొని సేన లిమ్ముల సాగి నడువ
వనములు గిరులు గహ్వరములు నడరి
చతురంగబలములు సందడింపంగ
ప్రతిలేక చక్రభూపతి వచ్చుతఱిని
అచట కానకర్త యను రక్కసుండు
సుచిరతపశ్శక్తి శూలిచే వరముఁ
జెంది యింద్రాదులఁ జెనకుచు మునుల
నెందు బాధింపుచు నెసఁగు రక్కసుఁడు
వాఁ డట్టి పటహానిధ్వానంబు చెవుల
వాడిమి వినినంత వడి పెట్టుబడిన
యురగంబుకై వడి యూర్చి కోపించి
యరదంబులు గజంబు లశ్వముల్ భటులు

వీరసేనాపతుల్ వేగ నాయిత్తు
మీఱి రాఁబంచి గంభీరదుందుభులు
తాడించుఁడని వేత్రధారులఁ బలికి
వీడనికినుకతో వేగరి నొకని
పరసేనలతెఱంగు బరికించఁ బనిచి
పురము వెల్వడి దుర్గభూమికై నడచె
నంతలోన సుదర్శనాధిపసైన్య
మంతటంతటఁ జేరి యార్చి రక్కసుల
నఱికి యచ్చటి తోరణంబులఁ బెరికి
విఱిచి డాలులు కోట వెసఁ గూలఁజెఱచి
వ్రాల్చి తేరుల హయవారముల్ గూల్చి
గ్రాల్చి పురము లందు కరిఘటల్ వ్రేల్చి
ముంచి తూపుల ఖడ్గముల తలల్ ద్రుంచి
దంచిభటుల మత్తదైత్యుల నొంచి
తరిమి సేనల నడిదమ్ముల మెరిమి
యురిమినట్టుల నార్చి యుబికి పైఁదార్చె
అటుల నార్చినఁ జూచి యా రాక్షసుండు
నిటలాక్షుఁ డిచ్చిననిష్ఠురవరము
బడయుటను మదించి భయ మింత లేక
వెడలి రథతురంగవేదండఘటలు
సుభటసంఘము నిండి చుట్టుల నడర
రభసంబునను సింధురమ్ముపై నెక్కి
పవరణ గాజిరా సంధించి మేన
వివిధాస్త్రశస్త్రముల్ వేగ ధరించి

యుద్ధవర్ణనము.

బెట్టుగా సంగ్రామభేరి వేయించి
యట్టిమోనం దాఁకఁగా నిరుదళము
లంటి సంకులకలహంబునఁ గినిసి
యొంటరి యొంటరి యోధయు యోధ
రథమును రథము సారథిని సారథియు
రథికుండు రథికుండు రౌతును రౌతు
తురగంబు తురగంబు దొరయును దొరయు
కరియును కరియు గింకరుఁడు గింకరుఁడు
నొండొంటి కైదువు లొరయుచు మెఱయ
మెండుభండన మంట మింట నచ్చరులు
తనవల్లభుఁడు వీఁడు తనవిటుఁ డితఁడు
తననాయకుఁడు వీఁడు తనపతి యితఁడు
తన భుజంగుఁడు వీఁడు తన విభుఁ డితఁడు
తనపల్లవుఁడు వీఁడు తన ప్రియుఁ డితఁడు
తనరమణుఁడు వీఁడు తనకాంతుఁ డితఁడు
ననుచుఁ గోర్కొనుచు న య్యని జూచుచుండ
కత్తి నొక్కఁడు కచాకచి వైరిశిరము
మొత్తి డొల్లించు నా మొండెంబు తనదు
చేతివాలున వాని శిరము ఖండించు
చాతురి నొకఁ డీటె పరిగట్టె బడఁగఁ
బగతురఁ బొడుచు నాపగర యయ్యాటె
తెగ డుస్సిపో నెక్కి తెగటార్చు నతని
నొకఁ డర్ధచంద్రబాణోద్ధతి నహితు
వికలము స్తకుఁ జేయు వెస నట్ల వాని

శిరమూడ నా తూపుచే వేయు లూన
శిరుడయ్యె మదిలోన చెలఁగు రోసమున
నొక్కరుండ లక్షోరి నుచ్చిపో రిపుని
యుక్కున వేయ వాఁ డొకనిమిషమున
నుర మాతనికి నట్ల నుచ్చిపో నేయు
పరువడి నిటు పరస్పర మంట జోదు
లుద్ధులై యొండొరు లొరసి పోరాడి
పద్దున సరిగాఁగ పడుదురు వాలిసి
ఇవ్విధంబున రణం బిరుదళములకు
నివ్వటిల్లఁగ దైత్యనివహంబు క్రుగ్గి
రహిచెడి యురికిన రక్కసుం డలిగి
కహకహ నార్చుచు కదిసి యంపరలు
జడి బట్టినట్టుల సమకట్టి కురిసి
పుడమి నింగియు నిండ పొదివి బల్మాయ

శివభక్తుఁడగు రక్కసుని మాయాయుద్ధము.

గప్పిన నిబిడాంధకారంబు క్రమ్మ
నొప్పునొ ప్పెఱుఁగక నిలిచి యా చక్ర
సైన్య మంధంబయి జడియుచుఁ దమరె
యన్యోన్యశస్త్రఘాతాహతులగుచు
నలయఁగ రక్కసుఁ డవ్వారిమీఁద
శిలలవర్షమునించి చెండుచుండుటయు
నివ్విధం బరసి చక్రాధిపుఁ డపుడు
రవ్వయూ జ్వాలాకరాళుఁ బంపంగ
నతఁడు సూర్యాస్త్రంబు నడరించి వాని
వితతమాయ లడంచి వెస దండహాతిని

దండించి వాని వేదండంబు గూల్చి
ఖండించె నట్టి రక్కసుశిరం బవని
అంతటను సుదర్శనాధిపుఁ డటులఁ
బంతంబున సురారిఁ బరిమార్చి జగతి
నిహతకంటకఁ జేసి నిజతేజమునను
మిహిరుకై వడి మించి మిగుల నాదేశ
జనములఁబాలింప జనపాలునొకని

చక్రరాజు నుత్తర దిగ్విజయము.

యునిచి వాహినితోడ నుత్తరదిశకుఁ
గదలి వేగిరమె యక్కడ నొక్కయెడను
కదళీక్షువనముల కరమొప్పు ధరణి
నిలిచి సురారాతినేతను వెదుక
బలములఁ బంపించి పటహాభాంకృతులు
భూనభోంతరముల బోరున నెగడ
నానోగ్రభటసింహనాదముల్ రిపుల
గుండియల్ వ్రేలించఁ గుంభిని నిండి
దండిగాఁ దనసేన దనరంగనుండె

శివునివలన వరములఁ బడసిన భేరుండను రక్కసుఁడు

ఆచోట భేరుండుఁ డను దానవుండు
ఖేచరాజ[1] సుతుండు గిరిసమానుండు
యోజనత్రితయసమున్నతగాత్రుఁ
డాజి మత్తేభసహస్రబలుండు
మున్ను శ్రీశైలాగ్రమున నుగ్రనిష్ఠ
నన్నంపుసూదిపై చరణాగ్ర మూని

1. "ఖేచరాజ్య సుతుండు" వ్రా. ప్ర. పాఠము.

భుజదండములు రెండు పొడవుగా సాచి
నిజదృష్టి రవియందె నిల్పి కన్ రెప్ప
వేయక శ్వాసంబు వెడలనీ కడచి
రేయును బగలు నిద్రించ కాహార
మేమియుఁ గొనక యట్టిటు చలింపకయె
హోమిక నిల్చి పంచాగ్నిమధ్యమున
గండకత్తెరఁ బూన్చి కంఠనాళమున
మండలాగ్రములు మర్మములఁ గీలించి
భూతంబులు దలంక భూరివృక్షములు
ధాతను గురియించి తపము సల్పంగ
వారిజభవుఁ డేగి వాని నీక్షించి
ఘోరతపం బేమిగోరి చేసెదవు
వేఁడు కోరిన దిత్తు వేగమే యనిన
వాఁడు నాయుధముల వరశిలాధార
గరళంబులను దేవగంధర్వదనుజ
గరుడమనుష్యరాక్షసయక్షజనుల
వలన వధ్యుఁడుగాక వలయురూపమునఁ
జెలఁగునట్టుగ దయచేయవే యనుడు
వనజసంభవుఁ డట్టివరముల నొసఁగి
కనరాక భయమునఁ గదలె నక్షణమె
ఆ దైత్యుఁ డత్తరి నఖిలలోకముల
సాధు లౌ మౌనుల సకలదేవతలఁ
జాల బాధింపుచు జనపదనగర
జాలముల్ చెరుపుచు శకకిరాతాంగ

యవనులు మొదలగు నతిపాపజనులు
భువిఁ దనుగొలువ నెప్పుడునుండు నాతఁ
డీ సుదర్శనురాక కెంతయుఁ గనలి
యాసునఁ దనసేన నెదురుగాఁ బనిచెఁ
బనిచిన నాసేన పాథోధిచయము
పెనుపొంది యుబికి యాభీలతరంగ
రంగత్తిమింగలరాజితో వచ్చు
సంగతి కంఖాణసంఘమాతంగ
భరముతో నడరిన ప్రళయకాలోగ్ర
తరబాడబాగ్ని బృందంబు చందమున
ధగధగ మెఱయు నస్త్రప్రకాండములు
ధిగధిగజ్వాలలై దీపించ మించి
హరిచక్రరాజసైన్యంబు తేజమునఁ
బరవాహినుల గ్రాచి బల్మి నింకించ
కోలాహలంబుగా ఘూర్ణిల్లి తెరలి
యాలంబునం దుభయదళంబు లొరసి
పోరఁగను కబంధములు నటియించె
వారణంబులు డుల్లె వాజులు ద్రెళ్లె
నటు తేర్లు చదిసె రథ్యంబులు చిదిసె
భటతతి మిడిసె సుపర్వాళి జడిసె
అప్పుడు దైత్యసంహతి తన సేన
నొప్పించి నంతఁ గన్గొని చాల కడఁగి
యని చక్రవిభుఁడు క్రోధాగ్ని హుంకార
మున వెడలింప నద్భుతముగా నదియు
తరలి పావకసంజ్ఞఁ దగఁ జిక్కుపఱుచు

పరచమూవీరులపై మోహనాస్త్ర
మేయుంగ వార లయ్యెడ మాయఁ దగిలి
భూయ స్తరాయుధంబులఁ బార వైచి
మూఢులై యంబరంబులు విడ్చిపుచ్చి
గాఢవిభ్రాంతి బొంగఁగ నిల్చి రంత
అదిచూచి నగి పావకాఖ్యుండు వారి
పదరి చంపకుఁ డని భటుల వారించి
యొనర నయ్యస్త్రంబు నుపసంహరించి
యనువుగా క్రౌంచాస్త్ర మపుడె సంధించె
శత్రుల కర్ణనాసములు ద్రుంచంగ
విత్రస్తులై వారు వెసదంతములను
కరచి గోళ్లను వ్రచ్చి కలఁచగా సేన
ఉరివిచ్చినఁ జూచి పౌలి పిశాచాస్త్ర
మపుడు ప్రయోగించి యసురులఁ ద్రుంపఁ
గపటరాక్షససేన కలగి పారుటయు
భేరుండు నలుకచే బెట్టుగాఁ దాకి
ఘోరముద్గరమునఁ గొట్టి యార్చుటయు
వానిపై నలిగి పావకుఁడు వాయవ్య
మానితాస్త్రంబేసె మంత్రయుక్తముగ
అది యట్టిభేరుండు నవలీల నెత్తి
చదలనే వేంకటాచలశృంగమునకు
వడిగ సురాళించి వైచిన యట్ల
కడగి ప్రదక్షిణాకారంబు గాఁగ
బిరబిర ద్రిచ్చి యాబిస మింటినుండి
ధరణిపై లాగించ దబ్బున వాఁడు

శిరము క్రిందుగఁ బడి చిదిశి వ్రక్కలుగ
మురిగిన కూశ్మాండమున్‌వలె వ్రాలిసె

అటుల నా దానవు నిలఁ గూల్చి గెల్చి
పటహార్భటులు మీఱ పావకాఖ్యుండు
చక్రప్రభునిఁ జేరఁ జయ్యన వచ్చి
విక్రమంబున దైత్యు విదళించు తెఱఁగు
వివరించి కేల్మోడ్చి వినతుఁడై చెంత
సవినయంబుగ నిల్వఁ జక్రప్రభుండు
నతని కౌఁగిటఁజేర్చి యనునయింపుచును
స్తుతియించి బహుమతి శోభిల్లఁ దనదు
కంకణమ్ము లొసంగి కరుణించి మరియు
కింకరావళి నెల్ల కెలన రాఁ బిల్చి

వరుస భూషణములు వస్త్రంబు లొసఁగి
పరులచే మృతిబొందు భటులఁ గ్రమ్మరను
బ్రతికించి యా దిశాభాగంబునందు
క్షితిసురాదిజనంబుఁ జెలిమి రావించి
యభయమిచ్చి కుదిర్చి యచట నొక్కరుని
ప్రభువుగా నుండంగఁ బట్టంబుగట్టి
జయభేరి పటహనిస్సాణఢక్కాది
మయతూర్యభాంకృతుల్ మట్టుమీఱంగ
గీర్వాణగంధర్వకిన్నరగరుడ
ధూర్వహానుతులబంధురనాదమెసఁగ

సమరదుందుభిబృంద మార్భటి మొరయ
సుమవర్షధార లచ్చో జడిగొనఁగ
నచ్చరల్ నర్తించ నామోదభరము

లెచ్చిన తెమ్మెర లింపుగా విసర
గంధర్వభామినుల్ గానంబు సేయ
బంధురమాగధప్రకరంబు వొగడ
మణిమయం బైన విమానంబు నెక్కి
ఘృణిమీరు చామరల్ కెలన శోభిల్ల

దిగ్విజయముచేసి చక్రరాజు వేంకటాద్రికివచ్చుట.

మగుడి యాక్షణమె శ్రీ మద్వేంకటాద్రి
తగనధిరోహించి దాపున రాఁగఁ
బక్షీంద్రుఁ డా చక్రపతి రాకమున్నె
లక్షించి వడిఁజేరి లక్ష్మీసహాయు
ప్రణుతించి దేవ ! పరాకు హెచ్చరికె
రణమున మన చక్రరాజసింహంబు
విక్రమం బొప్ప దిగ్విజయంబు చేసి
యా క్రూరదైత్యుల యాతుధానులను
దేవర సెలవిచ్చు తీరునఁ ద్రుంచి
ఠీవి బిరుదులు బట్టించుక వచ్చు
చున్నాఁ డనుచుఁ దెల్పుచుండంగ నపుడె
పన్నగా నాక్షేత్రపాలుఁ డుర్వడిగ
నురుకుచు దూరాన నుండియు భక్తి
సిరమున నంజలి చెలఁగ ధరించి
ధరణి జాగిలి మ్రొక్కి తగ్గి వాతెరకు
కరము చాటుగఁ బూన్చి కరుణాపయోధి !
దేవదేవ ! పరాకు దేవరవారి
సేవకుఁ డగునట్టి శ్రీ చక్రరాజు
భేరిసహస్రగంభీరనాదంబు

భోరున నెరయ తుంబురుకోనదాఁటి
వచ్చినాఁ డిటు శలవా సామి యనుచు
హెచ్చరింపుచునుండు నీలోనె చందుఁ
డతిరయంబున వచ్చి యందందు నుతులు
నతులు సేయుచును నెంతయు నమ్రుఁ డగుచు
బెత్త మూనుక నిల్చి బెట్టుగా దేవ !
చిత్తజజనక! లక్ష్మీప్రాణనాథ !
జగదాశ్రయాధారజఠర ! పరాకు
జగదీశ్వర! పరాకు స్వామి హేల్ బంటు

చక్రరాజు రాకను జయవిజయులు స్వామికెఱింగించుట.

చక్రరాజాధిరాజప్రభుం డితఁడు
విక్రమంబున లోకవిజయంబుఁ జెంది
ప్రతిహారమహి సమీపమున నేగెడిని
పతియాజ్ఞ యిఁక నంచు పలుకు నాలోన
జయవిజయులు దండఁ జని కేలు మోడ్చి
జయజయ విజయాజిజయద పరాకు
జయ కమలాలయాజాని పరాకు
జయ కమలజ కామజనక పరాకు
జయ గర్భధృతజగజ్జాత పరాకు
జయ భక్తజనపారిజాత ! పరాకు
స్వామి యిం దిదె సుదర్శనచక్రవర్తిఁ
బ్రేమఁ గటాక్షించు శ్రీకరాలోక
దేవ ! యీ యస్త్రరాజేశ్వరుఁ డిదిగో
సేవ సల్పెడిని వీక్షింపు మబ్జాక్ష !

యని బరాబరి చేయ నాచక్రరాజు
వనజాక్షు నడుగుల వ్రాలి కేల్మోడ్చి
వినయంబుతో మ్రోల వినతుఁడై నిల్చి
తనసైనికులఁ జూపి తగ నిట్టు లనియె

చక్రరాజు తనసేవకుల పరాక్రమమును స్వామికిఁ దెలుపుట.

చతురాస్యపంచాస్యషణ్ముఖసేవ్య !
సతతయోగీశ్వరస్వాంతానుభావ్య !
ఇతఁడె జ్వాలాముఖుం డీశ్వర ! చూడు
మతిపరాక్రమశాలి యగు వీరదస్యు
నొక్కపెట్టునఁ ద్రుంచి యుగ్రదానవుల
చక్కాడె నీతని సైన్యంబు గణితి
మదకరులైదువేల్ మావులు లక్ష
పదివేలు రథములు భటు లొక్కకోటి
మొనఁ దారసించుచో ముందుంచు నడుగు
వెనుక తియ్యనియట్టి వీరశేఖరులు
కెలన వీఁడిదె జ్వాలకేశుఁ డేవురినిఁ
గలన దైత్యులఁ గూల్చె ఘడియలో వీని
దళమెంచ మత్తవేదండముల్ వేయి
వెలయుహరుల్ పదివేలు రథంబు
లైదువేల్ భటులు లక్షాయుతం బయ్యె
మాదండ వీఁడెగా మానటీఁ డాజి
దుర్వారవిక్రమదోర్బలుఁ డరుల
గర్వం బణచువాఁడు గణుతింప సేన
ప్రోవైన యొకలక్ష పుండరీకాక్ష !
యావంక నదె బడబానలాఖ్యుండు

పాశ్చాత్యుఁ డగుదైత్యుఁ బరిమార్చి గెలిచె
నిశ్చయింపఁగ నీతని చమూభరంబు
తరమె శేషునకైనఁ దడవి వర్ణింప
శరధుల నింకింపఁజాలు నొక్కరుఁడె
వీఁడె పావకుఁ డనువీరుండు సమితి
వాఁడిమీఱు ప్రతాపవంతుఁ డౌవాఁడు
యోజనత్రితయసమున్నతు నసుర
రాజును నిమిషమాత్రమున నీల్గించె
నితని పతాకిని నెంచి లిఖింప
క్షితిఁ దాళపత్రముల్ చిగిరింపఁ గలవె
ఇతఁడు స్ఫులింగాక్షుఁ డితఁడు రణఘ్ను
డితఁడు కాలాంతకుఁ డితఁ డురునేమి
వీరల తేజంబు విక్రమం బసుర
వీరులయెడ నింత విశదమై తోఁచు
వీరె నేఁ గాఁగ భావింపవే కరుణ
సారతేజస్స్ఫూర్తి ! సర్వజ్ఞమూర్తి !
అనుచు కైదువులరాయఁడు విన్నవింప
విని కటాక్షించి శ్రీ వేంకటేశ్వరుఁడు
చెంత శ్రీ దేవి నీక్షింప నద్దేవి
యంతనే మణికంకణాంగదమకుట
హారంబులును కాంచనాంబరంబులును
హారమంజీరముల్ హెచ్చుతాళీలు
వారి కందఱికిని వరుస చొప్పునను
బారితోషికములు బహుమతి నొసఁగె

శ్రీనివాసుఁడు నస్త్రశేఖరుఁ గేలఁ
బూని మచ్చికలు నింపుగ నాదరించె

దేవతలు చక్రరాజు విక్రమము పొగడుట.

అందుండు నిందుజూటాంభోజజాత
బృందారకేంద్ర కుబేరాంబునాథ
సమవర్తిపావకశ్వసనరక్షోధి
ప్రముఖ బర్హిర్ముఖ పటలంబు నత్రి
కలశజ కాశ్యప గర్గ వశిష్ఠ
పులహ కౌశికముఖ్య మునిసమూహంబు
నపు డట్టి చక్రరాజాతిశయంబు
విపులశౌర్యము నెంచి వినుతించి మఱియు
శ్రీ వేంకటాధీశు సేవించి మిగుల
భావించి కేల్మోడ్చి భక్తి నిట్లనిరి
పరమకారుణికస్వభావప్రభావ!
కరుణాకటాక్ష! వెంకటనగాధ్యక్ష!
ఈ చక్రవిక్రమం బెంచి చూడంగ
నా చక్రవాళంబు నం దొరుల్ దీసె
ఇతఁ డాజిఁ ద్రుంచిన యీ దైత్యవరులు
ప్రతిలేని బలపరాక్రమధురంధరులు
ఒకఁ డొకఁడే చాలు నుర్వీధరములఁ
బెకలించి బంతులు పేర్చి గోరింప
నొకఁ డొకఁడే చాలు నుడుగక కడలిఁ
గకబికగా వేగఁ గలఁచి యింకింప
నొకఁ డొకఁడే చాలు నుడువీధినంటి
ప్రకటకరాహతిన్ బ్రవ్యలుసేయ

నొకఁ డొకఁడే చాలు నురుబడబాగ్ని
నొక కబళంబుగా నూటుకొనంగ
నట్టి దైత్యుల నతం డవలీల గాగఁ
గొట్టి రణంబునఁ గూల్చెనుగాక
తరమె యన్యులకు నిద్ధర వారిఁ జేరి
దురమున నెదిరించి తొడరంగనైన

దేవతలు లంకాధినాధుని దునిమి రక్షింపుమని వేడుట.

ఇంక నిం దొక్కరుఁ డింతటివాఁడు
లంకాధినాధుండు లావున వానిఁ 580.
దునిమి రక్షింపవే తోయజనేత్ర !
యనిన వారికి వేంకటాధీశుఁ డనియె
వినుఁడు దేవతలార ! వెస దశగ్రీవు
నని నేనె ద్రుంచెద నద్భుతలీల
నటు గాన సుఖముగా నలుకక మీరు
పుటభేదనంబుల భోగింపుఁ డింకఁ
జనుఁడు మీ మీ నివాసములకు వడిగ
ననుటయుఁ జతురాస్యుఁ డా శ్రీనివాసు
వినుతించి సేవించి వినయ మొప్పంగ

బ్రహ్మ శ్రీనివాసున కుత్సవముసేయ ననుజ్ఞవేఁడుట.

ననుపమభక్తి నిట్లని విన్నవించె 590.
శ్రీ వేంకటావాస! శ్రీ శ్రీనివాస!
భావహరాకార! భక్తమందార!
దేవర నొకటి ప్రార్థించెద నిపుడు
నా విన్నపమువిని నన్ను మన్నించు

దేవ యిం దర్చాకృతి వహించు నీకు
నే వెస నుత్సవం బెలమిఁ గావింతు
భువి ధ్వజారోహణపూర్వకంబుగను
హవణికఁ బుష్పయోగాంతంబుగాఁగ
నాగమోక్తక్రమమై ప్రతిదినము
బాగుగా సేవ సల్పఁగ భావమునను
గోరుచున్నాఁడ నా కోర్కె ఫలింప
నారాధి దయచేయు మనుచు ముకుందు

దేవశిల్పి మందిరప్రాకారాదుల నిర్మించుట.

ననుమతి వడసి య య్యస్వప్నశిల్పి
మును బిల్చి యిటు పురంబు విచిత్రలీల
దీరిచి యిందొక దేవమందిరము
భూరిరత్నావళి పూరితంబుగను
నిర్మించు వడి నన్ విని యట్టి విశ్వ
కర్మ యాక్షణ మట్ల కావింపఁ దొణఁగె
తోరణగోపురస్థూణాప్రతోళి
వారణశాలికావార మందురలు
హారువైన రథశాల లావేశనములు
వరవేశవాటు లవార్యవిపణులు
సంజీవనప్రపాస్థానశాలలును
మంజుల ప్రాసాదమండలంబులును
సౌధోపకారికల్ చప్పరంబులును
వీధికాకుట్టిమవేదికాతతులు
సజ్జలు తగునుబ్బు చప్పరంబులును
సజ్జారములు గోష్ఠశాలాచయములు

సత్రశాలలు కూటజలయంత్రములును
చిత్రశాలలు నభిషేకశాలలును
నాటకశాలలు నటనివాసములు
స్ఫాటికాంబుస్థలభ్రమదమంటపము
లున్నతసాలముల్ వ్యోమయానములు
సన్నుతభూవరాసనకదంబములు
గాటంపుకురుజులు కాయమానములు
వాటంబులైన కవాటపంక్తులును
సోపానమార్గముల్ సోరణగండ్లు
నేపు మీఱంగ నెయ్యోడ పదావళులు
భవనాగ్రకుంభజృంభత్పతాకికలు
వివిధఘంటాపథోర్వీరథంబులును
గొన్ని మౌక్తికములఁ గొన్ని వజ్రములఁ
గొన్ని విద్రుమములఁ గొన్ని కెంపులను
గొన్ని నీలంబులఁ గొన్ని పచ్చలను
గొన్ని వైడూర్యంపుగుంపుల మరియుఁ
గొన్ని గోమేధికకోటుల మెఱయఁ
గొన్ని పదార్వన్నెకుందనమ్మునను
గొన్ని దంతంబులఁ గొన్ని రజతములఁ
జెన్నుమించగఁ బన్నిచెక్కడంబులను
చొక్కంబయిన తాళిచొప్పునఁ బురము
నొక్కయామంబున నొనరించి మఱియు
గమనీయబహువిధకమలాకరములు
కమలాకరంబుల కడలఁ బూఁదోఁట
లా తోఁటలను కాంచనాకారతరువు

దేవ యిం దర్చాకృతి వహించు నీకు
నే వెస నుత్సవం బెలమిఁ గావింతు
భువి ధ్వజారోహణపూర్వకంబుగను
హావణిఁ బుష్పయోగాంతంబుగాఁగ
నాగమోక్తక్రమమై ప్రతిదినము
బాగుగా సేవ సల్పఁగ భావమునను
గోరుచున్నాఁడ నా కోర్కె ఫలింప
నారూఢి దయచేయు మనుచు ముకుందు

దేవశిల్పి మందిరప్రాకారాదుల నిర్మించుట.

ననుమతి వడసి య య్యస్వప్నశిల్పి
మును బిల్చి యిటు పురంబు విచిత్రలీల
దీరిచి యిందొక దేవమందిరము
భూరిరత్నావళి పూరితంబుగను
నిర్మించు వడి ననఁ విని యట్టి విశ్వ
కర్మ యాక్షణ మట్ల కావింపఁ దొణఁగె
తోరణగోపురస్థూణాప్రతోళి
వారణశాలికావార మందురలు
హారువైన రథశాల లావేశనములు
వరవేశవాటు లవార్యవిపణులు
సంజీవనప్రపాస్థానశాలలును
మంజుల ప్రాసాదమండలంబులును
సౌధోపకారికల్ చప్పరంబులును
వీధికాకుట్టిమవేదికాతతులు
సజ్జలు తగునుబ్బు చప్పరంబులును
సజ్జారములు గోష్ఠశాలాచయములు

సత్రశాలలు కూటజలయంత్రములును
చిత్రశాలలు నభిషేకశాలలును
నాటకశాలలు నటనివాసములు
స్ఫాటికాంబుస్థలభ్రమదమంటపము
లున్నతసాలముల్ వ్యోమయానములు
సన్నుతభూవరాసనకదంబములు
గాటంపుకురుజులు కాయమానములు
వాటంబులైన కవాటపంక్తులును
సోపానమార్గముల్ తోరణగండ్లు
నేపు మీఱంగ నెయ్యోడ పదావళులు
భవనాగ్రకుంభజృంభత్పతాకికలు
వివిధఘంటాపథోర్వీరథంబులును
గొన్ని మౌక్తికములఁ గొన్ని వజ్రములఁ
గొన్ని విద్రుమములఁ గొన్ని కెంపులను
గొన్ని నీలంబులఁ గొన్ని పచ్చలను
గొన్ని వైడూర్యంపుగుంపుల మరియుఁ
గొన్ని గోమేధికకోటుల మెఱయఁ
గొన్ని పదార్వన్నెకుందనమ్మునను
గొన్ని దంతంబులఁ గొన్ని రజతములఁ
జెన్నుమించగఁ బన్నిచెక్కడంబులను
జొక్కంబయిన తాళిచొప్పునఁ బురము
నొక్క యామంబున నొనరించి మఱియు
గమనీయబహువిధకమలాకరములు
కమలాకరంబుల కడలఁ బూఁదోఁట
లా తోఁటలను కాంచనాకారతరువు

లాతరువ్రుల దివ్య మగు పక్షిగణము
గణికి కెక్కుడుగాఁగఁ గల్పించి వేగఁ
బ్రణుతుఁడై బ్రహ్మ కాపని విన్నవించె
నంతట చతురాస్యుఁ డమరాధినాథుఁ
జెంతఁబిల్చి సురేంద్ర శీఘ్రంబు నీవు
హరిమహోత్సవమున కమరగంధర్వ
గరుడోరగాప్సరోగణముల నవనిఁ
గల విప్రమహీపాదికప్రజాతతుల
విలసిల్ల దూతల వేవేగఁ బన్పి
రావించు మని పల్కి రాజరాజునకు
భావితసంభారభరముఁ దెప్పించ
సెలవిచ్చి మానుల కెలిమి నీక్షించి
తెలివిడి ముందును దెలియ నిట్లనియె
శ్రీనివాసులకు నే శ్రీమహోత్సవముఁ
బూని కావింప నంభోజమిత్రుండు
కన్యఁ జేకొని యుండఁగా శుక్లపక్ష
మాన్యవాసరముల మహనీయసరణి

వైఖాన సాగమవిధులతో నుత్సవారంభము.

నారూఢి వైఖానసాగమవిధుల
నారంభ మొనరించుఁ డనుటయు వారు
శ్రీనివాసులకు నా శ్రీ భూములకును
స్నానార్చనాపరిష్కారాంగరాగ
వివిధాన్నభక్ష్యముల్ వేగఁ గావించి
సవరణ రాజోపచారముల్ సల్పి
వేదికాకుండముల్ వేయించి సకల

వేదమంత్రములను వివిధతంత్రములఁ
గలశప్రతిష్ఠానకంకణాంకురము
లలర నొనర్చి విహంగపుంగవుని
యావహింపించి ధ్వజారోహణంబు
గావించి దిగ్బలికర్మపూర్వముగ
తిరువీథు లేగించి దేవాధిదేవు
తిరునాళ్ల నవరింప దేశదేశముల
నుండి కుటుంబసంయుక్తులై తరలి
దండిగాఁ ద్రోవ లెంతయుఁ బిక్కటిల్ల

నానాదేశజనులరాక వారినడకలు

చోళద్రమిళపాండ్యసూరసేనాంధ్ర
మాళవకర్ణాటమగధసౌవీర
మళయాళకొంకణ మత్స్యసౌరాష్ట్ర
తుళువ లాటాంగసింధుకళింగహూణ
వంగమహారాష్ట్ర వైదర్భనిషధ
బంగాళనేపాళబర్బరయవన
కురుఘూర్జరోత్తరకోసలప్రముఖ
ధరణీశ్వరులును తత్తద్రాష్ట్రజనులు
నరవాహనతురంగనాగశతాంగ
వరవృషభాదులౌ వాహనమ్ములను
దగ నధిరూఢులై దవ్వని సొలయ
కగణితసంతోష మడరంగ మదిని
తడయ కెంతయు భక్తిఁ దగ వచ్చువారు
కడు వస్తువులు కానుకలు దెచ్చువారు

నడ గడుగుకు దండ మటు బెట్టువారు
సెడపక తల బంగ రిల గట్టువారు
నోటితాళములఁ బూనుక వచ్చువారు
వాటమై తాళముల్ వాయించువారు
చప్పిడి భుజియించి జరిగెడువారు
చప్పరంబులు పూని చనుదెంచువారు
తమ్మటంబులు బెట్టు దాటించువారు
ముమ్మరమ్ముగ వాద్యములు మ్రోయువారు
గోవిందబెట్టుచు గునుకు వారలును
శీవి స్తోత్రములు పఠించువారలును

పటుమతి హరికథల్ బలుకువారలును
కథ విని హర్షించి కథ మెచ్చువారు
కథకునకు ధనంబు కర మిచ్చువారు
రథములపై తమ రమణుల నుంచి
పథికులెడల బరాబరి సేయువారు
శకటంపురవణికి జదియుచు నకట
వికటంబుగా త్రుళ్లు వేసడంబులను
కని కరాళించు కంఖాణాళినుండి
వెనక మళ్లుగ ద్రుళ్లు వెలఁదుల నందు
కొని బుజ్జగించి మక్కువ వెస నుంచి
మొన వాగెబూని యిమ్ముగ నేగువారు
సందడి నొక్క యుష్ట్రంబు కెర్లంగ
నం దళ్కు ప్రియురాండ్ర నలమెడువారు
నడుగుల నొప్పకై యలయు కొమ్మలను
కడుఁగౌగిటన్ బూని కదలెడువారు

గా ముజ్జగంబులఁ గల జీవులెల్ల
స్వామికి గణుతియ్య చనుదెంచుపగిది
వేగ జీవుల ధాత వెస నారుబోయు
లాగున నెందు తొలఁగ దొబ్బరాక
యరుదెంచి యాటుగల యచ్చెరువొంచి
దరులు కోనలు చరుల్ తరువులు లతలు
ఝరులు తటాకముల్ సరసులు దొనలు
గిరిశిఖరంబులు కీచకతరులు
పొదరిండ్లు తుమ్మెదల్ పొదలు ప్రాపొదలు
మృదునాదము లొనర్చు మృగపక్షిగణముఁ
గనుఁగొంచు నందందు ఘనమంటపముల

చలువపందిళ్లు—ప్రపాపాలికలు

వనములన్ మేలైన పందిళ్ల నిలువ
నిసుకలో సగమంత యిడి తడివలువ
బొసగించి వేసువ బూరించు కడవ
నేలకుల్ కపురంపు నెనయించువిరులు
జాలనుసీరముల్ సవరింపఁ జల్ల
దనము తావియు స్వాదుదగు నుదకంబు
ననటిబొండెల యొప్పు లాశ్రొంతిపొడియు
లికుచసారంబు దొర్లిన నీరుచల్ల
ప్రకటమాధురి మించి పరగు పానకము
వరుసగాఁ గై సేసి వలపు మీఱంగ
మరుని మోహనవిద్యమాడ్కిని నిల్చి
సలిలాధిదేవత చందంబు దాల్చి
జలదంబువలె మించు చల్వపందిలిని

మెఱుగులీల వహించి మృగచిహ్న రేఖ
కరణిఁ బొల్పొందుచు కామధేనుమణి
తెరగున జనతృష్ణ దీర్పఁగా నేర్పు
బరిఢవిల్లెడు ప్రపాపాలికాతిలక
మరుదారుచూపుల నాదరింపులను
సరసుల వడపూన్ప జాలిబెంచంగఁ
బనిబూని తన గుబ్బపాలిండ్లసొగసు
గొనుటనో యన హేమకుంభంబు నీట
ముంచి పాంథులకు నంబువులఁ బోయంగ
చంచలేక్షణము లాజలములఁ దోప
వాలుగ లని యుల్కు వారినిఁ జూచి
చాలునో యన్నని సారె నవ్వుచును
పానకం బొసఁగ నే పా లొల్ల ననిన
నాని చూడు మటంచు నదలించు నొకని
మొగడుదప్పి యడంగియును తనమోము
సొగసు జూచుచుఁ ద్రావుచొప్పున రిత్త
గుటకలుబెట్టఁ గన్గొని మోవి విఱిచి
వటజటాకృతి ధార వలతియై వ్రాల్చు
నొకఁడు ద్రావఁగ మరియొకఁడు పైఁబడిన
వెకటుగాఁ గొన దింత వేసర దెందు
నడుగకనే పాంథు లర్మిలి నొసఁగు
విడెముల నొడినించు వినయంబుమీఱ
నిలువుటద్దంబు పందిలిక్రేవఁ బ్రజలు
తిలకించుకొందు రాతెరవ చెక్కులనె
చలువగా నందె వీజనము లూగంగ

చెలి పైఁటగాడ్పుల సేదఁ దేరుచుఁ దరు
తతవుండి ప్రౌఢుబోఁ దడవి వేఁ దరలి
యడుగడుగుకు నట్టివగుచప్పరంబు
లెన్నైన కనుఁగొంచు నెడ మెచ్చికొంచు
తిన్నగా గిరి యెక్కి దిక్కుదిక్కులను
నరవింధ్యముగ నిండి నగరముఁ వనము
నెరసి యుం తెడలేక నిలిచె నాపరిష

ఆనాటి శ్రీ కాంతుని యలంకారవర్ణనము.

ఆనాఁడు శ్రీ కాంతుఁ డందరిమదుల
నానంద ముప్పొంగ నమితవైభవము
లలరంగ నంగదహారకిరీట
వలయకుండలమాణవకనికరములు
గ్రైవేయమేఖలాకంకణోర్మికలు
పావనమంజీరపదకింకిణులును
మెఱయంగ ధరియించి మిసిమికడావి
మెఱుఁగులదుప్పటి మెఱుగుఁగాఁ గప్పి
చొక్కపు మంచి కస్తురితిలకంబు
చక్కఁగా దిద్ది వాసనగ్రమ్మ కలప
మలఁది క్రొవ్విరిదండ లలరంగఁ దాల్చి
కలుముల నీను చక్కనిపూవుఁబోఁణి
రతనంపుపంటలరమణి నిర్వంక
నతిలీల నుంచుక యఖిలభూభరము
తలపూను ఫణికులాధ్యక్షుపై నెక్కి

శ్రీ కాంతుఁడూరేగుట.

తెలివికట్టాణిముత్తియములగొడగు
సురరాజు పట్టంగ స్ఫురదకళంక

హరిణాంకకిరణోత్కరాభములైన
చామరలిరుదండఁ జతురత నమర
సామజయానలు సరిగాఁగ వీవ
నలరుచు త్రేతాగ్నులగ్రభాగమునఁ
వోలఁగక సాంబ్రాణిధూపంబు లొసఁగఁ
దొగలరాయండు నా తోయజాప్తుండు
సొగసుమీరిన జగజ్జ్యోతులు దాల్ప
వరుణదేవుఁడు వింతవైఖరి నందు
నెరయ వీధులను పన్నీరుఁ జిల్కించ
కరువలియందెల్ల ఘుమ్మని తావి
వరలు పుష్పాడి గంధవడి వెదజల్ల
విద్యుల్లతికలెల్ల విడిబడి బాణ
విద్యలు జూపెడు వీఁక రంజిల్లె
సురగేంద్రబృందంబు లొడికంబు మీఱ
స్థిరశిరోమణికరదీపికల్ బూన
మహతిచే నారదమౌనివర్యుండు
రహిమించు రాగముల్ రక్తివాయించ
నసమతాళముల లయవ్యాప్తిగతుల
రసికులెంచఁగ నచ్చరల్ నటియింప
సంతరింపుచు కల్పశాఖులామోద
ముంచు లౌ పూవులసోన వర్షింప
వేదముల్ మాగధవేషమ్ము లొంది
స్వాదూక్తిసరణికై వారముల్ సేయ
చాల సంతోష మెంచఁగఁ బడవాలు
వాలు చేఁబూని యావంకనే నడువ

భవుఁడు నబ్జభవుండు పసిడిబెత్తముల
రవళిఁ జేబట్టి బరాబరి సల్ప
ఘనములు భేరికాకారంబులగుచుఁ
గడునినాదంబులఁ గడుఘోరు కలగ
నొరపుసింగారంబు నొక్కరూపైన
తెరగునఁ దనరుచుఁ దిరువీధు లేగి
యావేళఁ దనుఁగొల్చు నఖిలలోకులకు
వేవేగ నిష్టముల్ వెస నొసంగుచును 820.
నిజదివ్యరత్నమందిరభద్రపీఠి
విజయంబుసేసి యా వెలఁదుల్ నివాళు
లారతు లెత్తంగ నమృతోపమాన
సారాన్నభోజ్యచోష్యము లారగించి
తదవశేషంబు లందఱకు నొసంగి
మృదుశయ్యఁ బవళించె మెలతలు గొలువ
నారేయి కుణదయంచాఖ్య నిక్కముగ
మీఱి మహోత్సవోన్మేషం బొనర్చె
హరిదిగ్రమణి నాసికాభరణముగ
ధరియించుముత్యమై తగు వేగుచుక్క 830.
మయి నలందిన కుంకుమద్రవసార
మయి విలసిల్లె నయ్యరుణరాగంబు

సూర్యోదయ వర్ణనము.

తిరునాళ్లఁ గనుటఁ జెందిన ప్రసన్నతను
మురియుచు దిగ్వధూముఖపాళి దనరె
పొడుపుగట్టను సౌధమును కయిసేయ
నిడిన దీపంబన నినుఁ డుదయించె

తిరువేంకటేశ్వరు తిరునాళ్ల కెనయ
నరుణమండల మను నండచేఁ బూర్వ
హరిదబ్జముఖి కుంకుమాసారములను
ధరణిజవిటపాళిదగుల వసంత
మొరపు రంజిల్లె నా నురువనాగ్రముల
నెరయ కెంజాయల నీరెండ యడరె
నరుణాతపద్యుతి నందు కారాకు
తరుణపల్లవముగాఁ దలఁచి కోయిలలు
నొక్కి త్రుంచఁగలేక నుసివినఁ జూచి
పక్కననగియెనా పద్మంబు లలరె
కమలావధూటికి కమలనాభునకు
కమలజుఁ డొనరించు కలితోత్సవంబు
కమలినుల్ గనుఁగొను కన్నులనంగ
కమలంబు లలరె భృంగము లుల్లసిల్ల
అప్పుడు శ్రీ వేంకటాచలేశ్వరున
కొప్పుగా వైఖానసోక్తక్రమమున
మునులు సపర్య సల్పుచు నలంకార
మొనయఁ గావించి సమృద్ధదధ్యన్న
ముద్గాన్నగౌడాన్నములు సపూపములు
సద్గళద్ఘృతముఁగా నొనర నైవేద్య
ములుఁ సమర్పింప నా పురుషోత్తముండు
చెలువంబు రంజిలి చెలగు శ్రీదేవి
భూదేవియును దాను భూరిలీలను
మోదించి యుత్సవంబునఁ బ్రతిదినము

ప్రతిదినము వాహనారోహణము — వీధి విహారము.

పవనజమృగరాజపక్షీంద్రహంస
జవనాశ్వగజవరస్యందనప్రముఖ
వాహనారోహణవైఖరిమెఱయ
నాహారబ్రహ్మాదులైనదేవతలు
నారదాదిమునిగణంబు గంధర్వ
చారణకింపురుష పతగపన్న
గాదులు మేనకాద్యప్సరోజనులు
వైదేశికప్రజల్ వరుసఁ గొల్వఁగను
వీధివిహారముల్ వెలయంగ నవము
సాధించి యవభృథస్నానంబు సలిపె
అమరులు మునులు ముం దవనిజనములు
క్రమమున స్వామిపుష్కరిణితీర్థమున
నపుడు గ్రుంకిడి వార లందరు దురిత
కపటకర్మములు గడిగి సౌభాగ్య
రమణీయరమఁ గాంచి రంజిల్లి రంత
కమలసంభవుఁడు శ్రీకమితకుఁ బుష్ప
యాగంబు నవరించి యాగమవిధుల
బాగుగా హవనముల్ పరిపూర్తిచేసి
అమరధ్వజావరోహణము గావించి
అమరులు పొగడఁ గృతార్థుఁడై తనరె

శ్రీనివాసులు బ్రహ్మాదులను బహూకరించుట.

శ్రీనివాసులు బ్రహ్మ చేయించినట్టి
మానితోత్సవమున మది సంతసించి

అరవిందజునకు హేమాంబరాభరణ
వరము లొసంగి యావనజాతజాత
మెచ్చితి నీభక్తి మిగులఁ గోరినది
యిచ్చెద నడుగు మీ వెల్లయిష్టంబు
లను డా హరికి ధాత యర్మిలి మ్రొక్కి

స్వామి వెంకటాచలమందె వసియించునట్లు బ్రహ్మవరంబు వడయుట.

వినతుఁడై కేల్మోడ్చి వెస నిట్టు లనియె
వేదాంతవేద్య యో విశ్వవిశ్వాద్య
నీదుకైంకర్యంబు నీయందుభక్తి
గలిగించితివి యింతకన్న భాగ్యంబు
కలదె యట్లయినను గాంక్షితం బొకటి
దేవ యిందఱికిని దృశ్యుండ వగుచు
శ్రీవేంకటాచలశిఖరంబునందె
ఈలాగు ప్రతివర్షమి మ్మహోత్సవము
చాలఁ గైకొనుచుఁ బ్రసన్నత మెఱయ
వరదుఁడవై యెల్లవారి రక్షింపఁ
గరుణఁజేయుచు నుండఁగావలె నిదియె
వర మని ప్రార్థించు వనజసంభవుని
హరి యాదరించి యా ట్లంగీకరించి
మరియు నాతనికి సమ్మోద ముదయింప
నరుదారఁగా నిట్టు లని యానతిచ్చె
పంకజాసన నీవు ప్రార్థించునటుల
వేంకటగిరియందె విహరింతు నెపుడు
సకలలోకములకు సాక్షాద్భవించి
ప్రకటితసర్వసంపదల నొసంగు

స్వామిపుష్కరిణిలో స్నానంబు సల్పు
నా మనుజుల కిత్తు సకలభాగ్యములు
వైకుంఠమున నాభవనమున నిదియె
నాకల్పమై యొప్పు నైరమ్మదాఖ్య
సర మిందు స్వామిపుష్కరిణి నాఁ బ్రబలె
ధరణి గంగాదితీర్థములు నిం దుండు
ప్రతివత్సరము నీవు సన్ను నుత్సవము
హితమతిఁ గైకొందు నిఁక శంక వలదు
సత్యం బగును నీదు సంకల్ప మెల్ల
సత్యలోకమునకు జనును శంకరుఁడు
కైలాసగిరి కేగుగాక నింద్రుండు
స్వాలయంబునఁ జేరు నఖిలదిక్పతులు
మానులుఁ దమ తమ మందిరంబులకుఁ
బోని మ్మనుచుఁ బల్కి భూషాంబరములు
వరము లందఱికని వరుసగా నొసఁగి
కరుణతో సెలవిచ్చి కడువడిఁ బనిచె
వారు నప్పుడు శ్రీనివాసుల యాజ్ఞ
మీరక నేగి రమితసంభ్రమమున

కానుకలర్పించుజనులను శ్రీనివాసు లనుగ్రహించుట.

భూలోకజనము లప్పుడు శ్రీనివాసుఁ
జాల సేవించి యాశ్చర్యంబు గదుర
ధనములు మణులు ముక్తాదామములును
ఘనభూషణంబులు గజము లశ్వములు
చీనాంబరంబులు శిబికలు ధ్వజము
లా నవఛత్రంబు లాలవట్టికలు

చామరంబులు ఘనసారకుంకుమము
లామజ్జసురభికృష్ణాగరుమలయ
జాతంబులుఁ బునుఁగుచట్టంపుగములు
జాతిజవ్వాది నిచ్చలపుకస్తూరి
వీణెలు నవరత్నవిరచితచిత్ర
వీణెలు వల్లకుల్ వివిధవాద్యములు
యేలాలవంగము లింగువల్ ద్వీప
జాలసంభవము లౌ సకలవస్తువులు
కానుకల్ సేయంగఁ గరుణించి వారి
శ్రీనివాసులు సుతశ్రీవైభవాది
వరములు బాలించి వరుసలాలించి
సరగ నందఱి స్వదేశములకు ననిచె.
అటుల శ్రీ వేంకటాధ్యక్షునికరుణఁ
జటులసంపద లంది సకలలోకులును
జలజనాభుని మహోత్సవసంభ్రమములు
తలఁచితలంచి యెంతయు సంతసమున
పొగడుచు నన్యోన్యములు పల్కుకొనుచు
మగుడంగలేని తన్మయభావములను
మరలి చూచుచును శ్రీ మద్వేంకటాద్రిఁ
దరలిపోయిరి జనస్థానముల్ చేర

## వేంకటాచలమహిమ.

కావుననట్టివేంకటధరాధరము
పావన మఖిలసంపత్కారణంబు
వినుఁ డందుఁ గావించు విమలవ్రతంబు
మనుజపంబు తపంబు మఘము దానంబు

పూర్తధర్మము హరిపూజనక్రియలు
కీర్తనంబును యోగకృతి మొద లెట్టి
వైన ననంతఫలావాప్తినలుపు
శ్రీనివాసుల కతిప్రియము నొనర్చు
సులభమయ్యు ననంతశుభదధర్మంబు
కలదు రహస్య మొక్కటిఁ దెల్పె దిపుడు 960.
బృందావనం బందుఁ బెనుపొందఁజేసి
ఇందిరాప్రియపూజ కెనయింతు రేని
యొక దళం బర్పించి యుగసహస్రములు
ప్రకటవై భవముతో బ్రహ్మలోకంబు
నను నిచ్చు హరికథాధ్యానపారీణ
ఘనమతి సన్మానికలితయోగమున
విహరించి తుద ముక్తి విష్ణుసారూప్య
సహితులై చేకొండ్రు సత్య మెంతయును
అచటఁ దటాకాన ధ్యానాదికములు
రచియించువారికి రహి నందు నెట్టి 970.
కారణంబుననైన కాపురంబుగను
వారక నిత్యనివాసంబు సేయు
వారికి వారికిఁ వరధనాద్యైవ
కారకారకులైన ఘనులకుఁ సమత
శ్రీనివాసు లభీష్టసిద్ధి గావించి
యూనినదయ మోక్ష మొసఁగును తుదను
నానోక్తు లేల నా నారాయణాద్రి
పైనఁ బుట్టిన మృగపక్షికీటాది

తరుతృణాంతమ్ముగా తామసజీవు
లరయంగ దుద మోక్షమందె మనుకందు

సారూప్యముఁ గని శౌరికై౦కర్య
ధౌరంధరి వహించుఁ దన్మాహాత్మ్యంబు
నెంతని వర్ణింతు నెంత నుతింతు
నెంతని నుడువుదు నెటుల నూహింతు
నని విచిత్రార్థసమర్థనాకలిత
ఘనసర్గవిశ్రుతకవిముఖ్యుపేర
విపులానుభావభావితసంవిధాన
కపటనాటకజగత్కారణుపేర
భాసురాంగశ్రుతిభారతిభవ్య
లాసికాగీతవిలాసునిపేర

తారకాంతకపితృద్వంద్వాద్వ్యతీత
తారకమంత్రాభిధానునిపేర
ప్రత్యాహృతోత్తరాపత్యచైతన్య
సత్యనిత్యబ్రహ్మచర్యునిపేర
క్షీరపారావారసీకరాసార
పూరితనిజముఖాంభోజునిపేర
పావనభక్తాప్తబంధునిపేర
గోవిందరాజముకుందునిపేర
శ్రేష్ఠులూర్వ్యభ్యాయశ్రేష్ఠశీలుండు
శ్రేష్ఠమహాయశశ్శ్రీధురీణుండు
గోత్రభారద్వాజగోత్రవర్ధనుఁడు
సూత్రతుండాపస్తంబసూత్రానువర్తి
అష్టభాషాకవిత్వార్జితశ్రోద్య

దష్టావధానవిఖ్యాతభైరవుఁడు
శ్రీ కృష్ణయార్యలక్ష్మీగర్భవార్ధి
రాకాసుధానిధి రాజపూజితుఁడు
వివిధవిద్యాశాలి వేంకటార్యుండు
సవరించు శ్రీనివాసవిలాసమునను
హారువొందు నిది తృతీయాశ్వాసమగుచు
ధరఁ బొల్చు నాచంద్రతారకంబుగను. 1010.

తృతీయాశ్వాసము సమాప్తము.



# శ్రీనివాసవిలాససేవధి

## చతుర్థాశ్వాసము



శ్రీ రంజనవిహార శ్రితజనాధార
ధారాధరశ్యామ ధనుధూతభీమ
భీమాసురవిరామ ప్రియతరసామ
సామజావనదక్ష సాధుస్వపక్ష
పక్షలక్షితతార్క్ష్య ప్రకృతిదుర్లక్ష్య
లక్షణోజ్వలరూప లసితాగ్నికోప
కోపనారిదురాప కుహనాదిగోప
గోపాయితాజ శ్రీ గోవిందరాజ
అవధరింపుము మాను లంజనాద్రీశు
వివిధవైభవములు విని విస్మయంబు
నిగుడ నానందించి నెమ్మి సూతునకు
మగుడఁ గేల్మోడ్చి సన్మతి నిట్టు లనిరి
పావనచరిత యో పౌరాణికేంద్ర
నీవు వెంకటధరణీధరమహిమ
వినుపించితివిగాన విశదంబుగాఁగ
విని కృతార్థుల మైతి విమలబోధంబుఁ
జెందితి మఘములుఁ జెదిరి తొలంగె
పొందుగా లభియించె భుక్తియు ముక్తి
యెన్నని చరితముల్ వినవిన మదిని
నెన్నఁడు తృప్తిగా దింతైన మాకుఁ

గావున వెస విన గాంక్ష యయ్యెడిని

శివుఁడు వేంకటాద్రికిఁ బోవుటనుగూర్చి మునులుప్రశ్నించుట.

శ్రీ వేంకటాద్రికి శివుఁడు విశ్వేశుఁ
డేమికారణమున నేగె కుమారుఁ
డేమిటికి కటు తపం బెలమిఁ గావించె
వారుణి యెటుల విష్వక్సేనుఁడయ్యె
నారాయణాద్రికి నామధేయములు
బహువులు గల్గు టెబ్బంగి యింతయును
మహితోక్తులను దెల్పుమా యని యడుగ
నమితపురాణజ్ఞుఁ డైన సూతుండు
క్రమమున వివరింపఁ గడఁగి యవ్యాసు
మదిని భావించి వామనపురాణంబు
వెదకి తత్క్రమ మెల్ల వినిపింపఁ దొడఁగె
మునులార! మీ ప్రశ్నములు తేఁటగాఁగ
వినుఁడు చొప్పరి యట్టి వృత్తాంత మెల్ల
నొకనాఁడు శంకరుఁ డుల్లాస మొదవ

రజితగిరిమీద శివుని యాస్థాన వర్ణనము.

నకళంకరజితశైలాగ్రభాగమున
మరకతస్తంభసంభావ్యవైడూర్య
నికరనిర్మితకుడ్యనీలవిటంక
భూరివాతాయనప్రోజ్జ్వలహీర
చారుతరద్వారచయ పుష్యరాగ
పటల గోమేధికభరితకవాట
ఘటిత స్ఫటికవేదికాపద్మరాగ

విహితపాంచాలికావృతభద్రపీఠ
మహితమహా నాస్థానమంటపంబునను
నాగచర్మము కటి నలువొప్పఁ గట్టి
నాగభోగాభరణంబులు వెట్టి
యస్థిమాలికఁ దాల్చి యమృతాంశురేఖ
సుస్థిరోత్తంసమై శోభిల్లఁ బూని
భసితంబు కర్పూరపటలిగా నలఁది
అసితకంఠద్యుతి యమరఁ గస్తూరి
పూఁతగా నిటలదృక్పుటము కాశ్మీర
జాతవిశేషకచ్ఛాయ నింపొంద
చిరుతవన్నియచేలఁ జెలువుగాఁ గట్టి
కరముల శూలంబు ఘనడమరుకము
సరినంది విసువాక జాజులదండ
యొరపున భరియించి యుదిరి బంగారు
సరిగె పాగయనఁ బెంజడలు బిగించి
సిరులు మీఱిన కొల్వు సింగార మెసఁగఁ
జెలిమిని తన చెంతఁ జేరి యింపారి
చలిగుబ్బలికుమారి శయధృతకీరి
తొలకరి క్రొమ్మించుతో సరి పోరి
చెలువున మీఱిన చిన్నారి గౌరి
తన పదశ్రీల నొందఁగలేక చివురు
పనిమాలి యుండుండి పసులౌచు నలయ
తనదు పిక్కల పెక్కు దాల్పమి మరుని
ఘనకాహళులు భంగకలన వాపోవ
తనయూరువులతీరుఁ దగఁ గానలేక

ననటులు పొరలిచ్చి యటు తలవంచ
తనపిరుం దంద మందక గిరుల్ నార
గని గుండుపడి యింత కదలకుండంగ
తనకౌనుబెడఁగు కెంతయు నళ్కి వెల్లఁ
దనముతో సింగంబు దరులలో డాఁగఁ
దనదు పొక్కిలిచక్కదన మూనఁజాల
కనె సుడి జడతచేఁ గడు భ్రమించంగఁ
దనకుచంబుల డంబు తడవి దాడిమము
లును గుండె వగిలి ముల్బోదలు సేరంగఁ
దనకంఠముబెడంగు ధరియింపలేమి
వనధిలోఁ బడి సంకు వడి మొరలిడఁగఁ
దన మోముగోముఁ జెందమి చందమామ
దినము కృశించి యుండె యెదఁ గందఁ
దన మోవిరంగు బొందఁగలేక యే బిగి
సిన విద్రుమము తెగి చేకట్లుపడఁగఁ
దనదంతముల కాంతి దగమి కుందములు
వనవాసము భజించి వాడుచుండంగఁ
దనకన్నుఁగవ మిన్నదన మందఁ దమ్మి
దనరు నాగళవారిఁ దపము సేయంగఁ
దననాస సొగసంటఁదగు నువ్వుపువ్వు
మునుమున్నగను స్నేహమును పెనువంగఁ
దన కన్బొమలసొంపు తరమ శింగాణి
తునియలు సుగుణంబు దొలఁగి దూర్పడఁగ
తనపెన్నెరుల తిన్నదనము చేకొనమి
ఘనము చులకదనమ్ము గని తెల్విదొలఁగ

తనకల్కి మొయికుల్కు తళ్కుల కుల్కి
కనక నిల్కడ మించు క్షణమాత్ర నడఁగ
సోయగంబునకుఁ దా సోయగం బగుచు
ప్రాయంబునకుఁ దానె ప్రాయంబునగుచు
సొమ్ములకును మేలుసొమ్ము దా నగుచు
నెమ్మి మీఱఁగ నుండ నెమ్మదినందు
గండస్థలీగంధగంధలుబ్ధాళి
మండలఘునడిండిమధ్వాను లెసఁగ
ఘలఘల మని రత్నకంకణమ్ములును
మొలనూలిఘంటలు మ్రోయుచుండంగ
తనబొజ్జకడుపుపైఁ ద్రాచుజన్నిదము
పెనఁగుచు నటు నాభిబిలము దూరంగ
పిండివంటల చవిఁ బెనుచీమ లంటి
తొండంబునన్ జొరఁ ద్రొట్టువాటునను
కసరుచు బుసకొట్టు కరిరాజు ముఖము
విసరుచు నొకదండ విఘ్నేశు డుండ
నందికేశ్వరుఁడు నానంద మువ్పొంగఁ
బొందుగా బెత్తు చేఁబూని భూతముల
దివిజాసురల బారు దీర్చి యందంద
రవళి యడంచి బరాబరుల్ సేయ
సిద్ధులు యోగులున్ చిరజీవముఖ్య
శుద్ధజటాధరుల్ సురమునీశ్వరులు
యక్షాధిప [1] మహేంద్రు లమర ప్రముఖులు
యక్షరాక్షసకిన్న రాప్సరోజనులు

1. " మహేంద్రయమర " వ్రా. ప్ర. పాఠము.

కొలువంగ మువ్వన్నె కొల్వు వికృత్తి
జెలఁగు రత్నోన్నతసింహాసనమున
పేరోలగంబుగాఁ బెద్దయుఁబ్రొద్దు
మీరినగోష్ఠి నర్మిలి నుండు తరిని
ముక్కంటియిల్లాలి ముద్దులపట్టి
చక్కుమోములదొర చక్కనిజాణ
నెమ్మి తత్తడి నెక్కు నెరమేటి రాతు

శివపార్వతులయొద్దకుఁ కుమారుండు వచ్చుట.

క్రమ్మిన వేల్పుమూకల పడవాలు
హరుని పిన్నకుమారుఁ డగు కుమారుండు
పరతెంచి తండ్రికిఁ బ్రణమిల్లి జనని
కెరఁగి దీవన లంది యెలమితో నిలువఁ
బరికించి నేమంబు పార్వతీదేవి
కొడుకు నక్కునఁ జేర్చి కుతుకం బెలర్ప
నొడి నిడుకొని చెక్కు లొయ్యన బుణికి
చన్గవచేప బాష్పకణంబు లింక
కన్గొనఁ బొదలంగఁ గడు నిట్టు లనియె
నాతండ్రి యేమొ యిన్నాళ్లు రావైతి
వేతీరు నినుఁ జూడ కే నుండుదాన
నసురమాయలు తరచంటివారలను
మసలక రణమున మలసి పోరంగ
తరమె యెవ్వరికైన తనయ బాలుఁడవు
దురముఁ జేయుతెరంగు తొలుత యెన్నడును
చేకన్నవాడవే చెదరక నిలువ
నీకొఱ కే నెంతొ నేమంబుఁ బూని

యుంటిని నీతండ్రి నుగ్రుని వేడు
కొంటిని దనుజారిఁ గొలిచితి మరియు
జలజాయుధునిగన్న జవరాలిఁ గూర్మి
యలరి భజించితి యందరికరుణ
నిను జూడఁగలిగెను నేటికి నాదు
మనసులో నెడ దీరె మరియుఁ గన్గొనఁగ
వడదాకి నీ మోము వాడ నేమిటికి
నొడలు గందఁగ నేలనో తెల్పవయ్య
అనవు డా తల్లికి హరునకుఁ మ్రొక్కి
వినయంబు మీఱంగ వినతుఁడై నిల్చి
వినుఁడు మీ కారుణ్యవిభవంబుచేత

కుమారుఁడు తారకవధవలనఁ దనకుఁ గలిగిన బాధను దెల్పికొనుట.

ననిఁ గ్రూరుఁ డగుతారకాసురుఁ ద్రుంచి
జయము గొంటిని సురసంఘంబు బొగడ
నయిన నప్పుడు బ్రహ్మహత్య యత్యుగ్ర
ముగ వచ్చెఁ గావున మ న్నెందులేని
దగ దప్పి యాఁకలి తరచయ్యె నట్టి
పాతకం బెడల నుపాయంబు దెల్పు
మేతీర్థమునఁ గ్రుంకి యిపుడు భుజింపఁ
బరిశుద్ధి నొందుదు బడలి కయ్యెడని
పరమేశ ! తడయక పల్కవే యనిన
దక్షాధ్వరధ్వంసి తనయునిఁ గరుణ
వీక్షించి తాను నివ్విధమున దక్షు
తలద్రుంచి బ్రహ్మహత్యయును జెందుటయుఁ
గలుషనిష్కృతి యైనకథయును దెల్పి

యతనికిఁ బరిశుద్ధి యగునట్లు నొక్క
హిత ముపదేశింప నెంచి యిట్లనియె
విను కుమారక నీవు వెతఁబడనేల
మనమున బ్రాహ్మణు మర్దించుకడక
చేకొన్నఁదలఁచినఁ జెందు నఘంబు
పాకారి నొందఁడే బ్రహ్మహత్య యును
నీవు దేవహితంబు నెమ్మి సేయంగ
భావించికాదె యీ పనిఁ జేసినావు
తారకాసురుఁడు మద్భక్తుఁడు వేద
పారజ్ఞుఁ డటు వానిఁజంపుట తగునె
యైన నిందునకుఁ బ్రాయశ్చిత్త మొకటి

అందుకుఁ బ్రాయశ్చిత్తముగ నాతనికి నారాయణమంత్ర ముపదేశించుట.

నే నెఱుంగుదు నది నెఱి రహస్యంబు
ర మ్మొకసారి నారాయణ యనిన
సమ్మతి గంగాదిసకలతీర్థముల
స్నానంబుసేయ నౌ సత్ఫలం బబ్బుఁ
బూనిన పాతకంబులును దొలంగు.
పూతుండవై మరి భుజియింపు మనిన
నాతండు తన తండ్రి యడుగుల కెఱగి
యా మంత్రము జపించి యతిశుద్ధిఁ గాంచి
ప్రేమ సుమాదేవి పిలిచి వడ్డింప
భుజియించి తృప్తి యింపును జెంది యందు
భుజగభూషణుదండఁ బొసఁగఁ గూర్చుండి
ఖండపరశుచంద్రఖండమండనుని
వెండియు సేవించి వెస నిట్టు లనియె

భూతేశ్వర సమ స్తభూతభావజ్ఞ
పాతకంబు దొలంగ పరమమంత్రంబు
తగ నుపదేశించి దయ నన్ను ధన్యు
నిగఁ జేసితివి యింక నే నొండు వినఁగఁ
గోరెద నా యెడఁ గూర్మిచే నీవు
ధారుణి గలవి యెంతయుఁ బరికించి
తెలుపు మెం దావాసుదేవు ముకుందు
జలజాక్షుఁ గనుఁగొందు సరగ నెం దాత్మ
శుద్ధియు నగు నట్టి శుభతరక్షేత్ర
మిద్ధర నొక టానతియ్యవే యనిన
నిందుకళామౌళి యింపు దీపింప
స్కందుని వీక్షించి కరుణనిట్లనియె
విను తారకాంతక వెన్నునిఁ జూడ
మన సుంచితివయేని మన కాశిపురికి
దక్షిణదిశ శతద్వయయోజనముల
దక్షిణపాథోధితటవసుంధరకు

వేంకటగిరియందు వెన్నుని జూడనగునని చెప్పుట.

నరయ త్రింశద్యోజనాంతంబునందు
మెరయ వేంకటగిరి మేదినీరమణి
కెనయు చూడామణి యిదె యంచు నెంచ
కనకరత్నచ్ఛటాకలితమై యొప్పు
నందు ముకుందుఁ డత్యానంద మొంది
పొందుగా విహరించు భూరిలీలలను
సురమౌనివరులు సచ్చోటనే తపము
నిరతంబు సలుపుచు నెరసియున్నారు

నీవు నచ్చోటి కేగి నియమంబుఁ బూని
భావింపు మా హరిం బరమకారుణికుఁ
గనుఁగొనియెద వంచె కమలాసహాయుఁ
దనయ సంశయ మేల తరలు ముర్వ్వడిని
అనఁడు నంబకు నంబికాప్తున కెఱఁగి
తనరఁ బ్రదక్షిణత్రయము గావించి
యనుమతుండై భుజంగారితురంగ
మనుపమంబుగ నెక్కి యమరసైన్యంబు
సందడింపఁగ నతిజవమునం జనుచు
నందందు నగములు నగమసంఘములు
నాశ్రమంబులు వను లమర గంధర్వ
విశ్రమస్థలములు విమలవాహినులు
పక్కణజనపద పట్టణంబులును
చక్కగాఁ జూచుచు సమ్మదం బొదవ
నావహామారుతాయత్తమార్గమున
ఠీవి వాహ్యాళి వాటించు ఛందమున
దివి రయంబున నేగి దివసాంత మగుట
భువిమీద డిగ్గి యద్భుతమా సపాద
లక్షపర్వతసీమ లక్షించి యచట
న క్షపాముఖమున నాహ్నికక్రియలు
సలిపి యొక్కెడ నందు చంద్రకాంతంపు
శిలమీదఁ గూర్చుండి చింతించి జనని
నెద విన్నదన మొంద నెఱిఁగి గుహుండు
సదయుఁడై యతనికి సరగ నిట్లనియె
దేవ ! సేనానాథ దివిజుల కెల్ల

భావంబు లలరంగ పలుకవు చెల్మి
నాదరించవు విన్నవై నీ విటున్న
మోదం బుడిగి మిత్రముఖ్యులందరును
మూఁగలమాడ్కి మోములఁ జూచుకొనుచు
నీగి పోకాడున ట్లింతైన బలుక
వెఱచి చిత్తరువులవితమున మెదల
కెఱబరికంబున నిది యేమొ యనెడు
శంక నెంతయు సొంపు సడలి యున్నారు
శంకరసుత యింత జాలిజాలించు
మెంతపనికి నైన నిట్టుల దొరలు
చింతింపఁ దగ దెంత చింత గల్గినను
మది నడంచుట కాక మాట పల్కులను
వదనవికారంబు వలన నెవ్వరికిఁ
గనుపించనీరాదు గాంభీర్యమునను
ఘనముగా నెప్పటిగతి నుండవలయు
నదియునుఁగాక నీయతిశయం బీవు
మొదలెఱుంగవు నీకు ముగ్ధత తగునె

కుమారుఁడే విష్ణుమూర్తియని గురుఁడాతని కెఱింగించుట.

విష్ణుమూర్తివి నీవు వెస నుద్భవించి
జిష్ణునకు హితంబు సేయఁ బూనితివి
నిను నే నెఱుంగుదు నీవును దెలిసి
కొను మన నాతఁ డా గురున కిట్లనియె
అనఘ యావెన్నుఁ డే నైన దెబ్బంగి
వినఁగ నీపలుకులు వింత యయ్యెడిని

ఏమిటికి ముకుందుఁ డిటు బుట్టె సత్య
కాముఁ డౌ నతనికిఁ గార్య మేమంత
తా నెఱుంగఁడె తను ధర నెవ్వఁడైన
నేను న న్నెఱుఁగకున్కికి హేతు వేమి
వినుతిరో నిజమైన వినఁగ నా క్రమము
వినుపించు మంతయు వివరంబుగాఁగ
నావు డాగురుఁడు లేనగ విగురొత్త
భావించి వినుమని పరిపాటి దొడఁగి
మును దక్షుఁ డన్ బ్రహ్మ ముక్కంటి కొసఁగెఁ
దనకూతు నదె సతి దా నయ్యో నాఖ్య
యాదేవి పుట్నింటి కరిగి జన్నమున
నాదరించక తండ్రీ యవమతి సేయ
నలుక యోగాగ్నియం దమ్మేను విడిచి
చలిగట్టు కన్యయైఁ జనియించి శివుఁడె
పతిగాఁగ వేఁడి తపంబు సల్పుచును
ప్రతిన మాతంగ నా ఘాలలోచనుఁడు
తనదేవిఁగా కొకతరుణిఁ బెం డ్లాడ
నని వ్రతంబూని హిమాచలంబునను
నిలిచి స్థాణువుమాడ్కి నిర్నిద్రుఁ డగుచు
నలరి దిగంబరుఁడై కొన్నియేండ్లు
తపసియై యుండఁగాఁ దారకాసురుఁడు
విపరీతబుద్ధిచే వెస విజృంభించి
మానంబునన్ సురమండలి నెంచె
వాని నోర్వఁగలేక వనజసంభవుని
కడ కేగి సురలు నాకలఁకఁ దెల్పంగ

తడయ కా నలువ యందఱికి ని ట్లనియె
సురలార! జడు పేల సుజనరక్షకము
హరికళయొకటి ఫాలాక్షునియందుఁ
బెనుపొందుచున్న దా భీము నాగిరిజ
నొనగూర్ప మనుచు నియోగించి మదను
బనుచుఁ డాదేవిగర్భంబున హరియె
జనియించి తారకసంహారియగును
అని వీడ్కొలుప మళ్లి యమరేంద్రముఖులు
ననవిల్తుఁ బిల్చి తిన్నగ వినుతించి
శ్రీ కంతునకు మర్లు రేపు వంచనపఁ
జేకొని మరుఁ డట్టిశివునిపై విరుల
నేసిన నతఁ డల్గి యిందీవరాస్త్ర
నేసి మంటలకంటి హెచ్చుచిచ్చులను
బొలియించె న య్యద్రిపుత్రి య మ్మరుని
చెలిమిఁ గ్రమ్మరఁ జూపుచేఁ బ్రతికించి
నెలదాల్పు వలపించ నెమ్మి నమ్మగువఁ
గలసి యట్టిశివుండు కామవశ్యుఁడయి
తమకించి మోహనతంత్రలీలలను
రమియింపుచుండె వర్షశతంబునందు

కుమారస్వామి జననకథ.

అప్పుడు దివిజు లయ్యసురుని గెల్వ
నెప్పుగానక శూలినిఁ వినుతించి
కడువడిఁ బడవాలు గలిగించు మనుచు
నడుగుటయు హరుండు నర్మిలి క్రీడఁ

జాలించి తనదైన స్ఖలిత తేజంబు
తాలిమి ధరియింప ధరఁ బూన్చుఁ డనిన
నమరులు భూదేవిఁ బ్రార్థించి రుగ్రుఁ
డమిత తేజఃపూర మవనిపై విడిచె
అది జ్వలింపుచుఁ బ్రళయాగ్ని చందమునఁ
బొదలుచు నత్యుగ్రముగ వెల్లివిరిసి
గప్పిన మహీ తాళఁగాఁజాల కలసి
దెప్పరం బగుభీతి దివిజుల కట్టి
తెరఁ గెఱిఁగింపఁగ దేవేంద్రుఁ డగ్నిఁ
గరువలి నల దాని గ్రాంచి యింకించు
మని నియోగించె నయ్యగ్ని యుగ్రముగఁ
బెనఁగొన దహియించి బెట్టైనకాఁకఁ
దా నోర్వఁజాల కెంతయు దాని గంగఁ
బూనింప నా గంగ భుగభుగ నుడికి
తీరజశరవణోద్దేశంబునందుఁ
జేరుప నది దానిఁ జెంది కుందనము
వెండియు నై నిండి వెలుగుచు దీప్తి
వెండియు శిఖిఁ గూడి వెలయంగ నందు
దేదీప్యమాన మహా దివ్యమూర్తిఁ గొని
ప్రాదుర్భవించితి బాలత నీవు
మున్నుగా నింద్రుండు ముదమున నీకుఁ
జెన్నియ్య కృత్తికాషట్కము బనిచె
నల వారి స్తన్యంబు లానంగ నీకుఁ
గలిగె షణ్ముఖము లక్కజముగా నపుడె
గిరిజ నిన్ గనుఁగొని కేవలానంద

భరితమై యగ్ని సంభావించి వరము
లిచ్చె నింద్రాదుల కీసున శాప
మిచ్చె నపుత్రు లయ్యెదరు మీ రనుచు
నంత శంకరుఁడు న య్యంబుజభవుఁడు
సంతసంబున వచ్చి సంజ్ఞాదివిధులు
గావించి యసుర నిగ్రహకార్యమునకు
దేవసేనాధిపతిత్వంబు మెఱయ
నభిషేక మొనరించి రటుగాన నీవె
ప్రభు వైన హరివి ని న్బ్రణుతించి కొలుచు
వారికిఁ బుత్రులు న్వైభవంబులును
సారసౌఖ్యము రాజ్యసంపదల్ గల్గు
ననుచు చాల నుతించు నాగురువరున
కనుపమవైభవుం డా కుమారుండు
కోరినవర మిచ్చి కుతుకం బెలర్ప
ధీరుఁడై మోహము న్దెగటార్చి యాలరె
ఆముచ్చటలచేత నటు వేగుటయును
నేమంబున న్గరణీయంబు దీర్చి
యమరులం గ్రమ్మర నర్మిలి ననిచి
నెమిలి నారోహించి నిముషమాత్రమున
విబుధవాహిని దాటి వింధ్యాద్రి గడచి
ప్రబలమౌ దండకారణ్యము న్మించి
గౌతమి శ్రీగిరి న్గడిమి లంఘించి
శాతకుంభాచల సౌందర్యహారి
నంజనగిరిఁ జేరి హరుషంబుమీఱి
రంజిల్లునటుశౌరి రహిఁ జూడఁగోరి

పరమపావనవారిభరిత మౌ నొక్క
సరసి చెంతఁ దపంబు సలుపుచు నుండె
అయ్యుమ యొక్కనాఁ డాత్మజుఁ దలఁచి
నెయ్యంబునన్ చింత నిగుడంగ వగచి
ఫాలాక్షుఁ జూచి యో పన్నగాభరణ
బాలు నా షణ్ముఖుఁ బరదేశమునకుఁ
బనిచితి వటుల నా బాలుఁ డేలాగు
ఘనతపం బొనరించఁ గలుఁగునో యెదను
మాయావి యవ్వెన్నుమది నైనఁ గనఁగ
నే యోగిచంద్రులు నే మునీంద్రులును
నేరరు గన నేర్తు వీ వొక్కరుఁడవె
సారతరజ్ఞానశాలి వౌ కతన
నట్టి పద్మాక్షుఁ బ్రత్యక్షమై గాంచు
నెట్టుల బాలకుం డిది దుర్ఘటంబు
సుకుమారమూర్తి నీసుతుఁ డుగ్రమైన
ప్రకటతపం బెట్లు బహువత్సరములు
నొంటి నెట్టుల సల్పు నుల్కనో నాదు
కంటికి నొక యింత కలుగదు నిద్ర
దిగులయ్యెడి ని దేమొ తీరనిచింత
జగదీశ తీర్పవే సదయత నీవు
అనుచు [1] వెడందలై యలరు కన్నులను
మొనయు నశ్రులు గోటిమొనను జిమ్ముచును
పదనఖంబున నేలపై లిఖింపుచును
వదనం బటు నొకింత వాల్చి బల్చింతఁ

1. "అనుచు వేడం దలై" ప్రా. ప్ర. పాఠము.

దన చెంత నిల్చి బిత్తరి గౌరిఁ జూచి
నెనరున లాలించి నీలకంఠుండు
తగ నూరడించి కుంతలములు దువ్వి
నగుచు [1] నేలనె వంత నగరాజపుత్రి !

వేంకటాద్రియందు తపముసల్పు కుమారునియొద్దకు శివపార్వతులువచ్చుట.

నీ పుత్రుఁ డిప్పు డా నీరజనేత్రు
శ్రీపతిని గురించి శ్రీ వేంకటాద్రి
నొక సరస్తటమున నొగి వాయుదేవుఁ
డకలంకపతము సేయంగ నావంక
నిలిచి నేమంబుతో నిష్ఠురవ్రతము
సలుపుచున్నాఁ డట్టి శైలంబునందు
నొంటియే సనకాదియోగీంద్రు లబ్ధి
గుంటబెట్టుక గుటగుట క్రోలు తపసి
పదమునఁ జూపు చొప్పడు జడదారి
మొదలుగా నెందరే మునులు వేవేలు
వేలుపులసురలున్ వేడ్కనుండుదురు
వాలాయముగ శౌరి వారికిఁ గరుణఁ
బ్రత్యక్ష మగు రమాప్రభుఁ జూడ మనము
నత్యంతరయమున నటకుఁ బోద మని
యెలనాగయును దాను వృషభేంద్రు నెక్క
బలువిడి నరుదెంచె ప్రమథులు గొలువ
అరిగి వేగమె వేంకటాచలాగ్రమునఁ
దరుషండములు ఝరుల్ దరులు గన్గొనుచుఁ

1. "నగుచు నలసేవంత" వ్రా. ప్ర. పాఠము.

శివునితేజంబున అంజన హనుమంతుంగాంచుట.

జనుచు నం దొక వనచరమిథునంబు
మొనసి క్రీడింప నమ్ముక్కంటి గాంచి
నగుచు గౌరికిఁ జూపి నవబోణి మనము
దగు నిట్టి రూపంబు దాల్చి క్రీడింప
మనసయ్యెడి నటంచు మగువయుఁ దాను
వినువీధి నటులఁ బూవిలుకాని కేళి
సలుప నత్తేజంబు శ్వసనుఁ డందుకొని
దళపుటంబున నుంచి తపము గావించు
నంజన కొసఁగ న య్యంజనాదేవి
రంజిల్లఁ బవనుండు ప్రతిదినం బొసఁగు
ఫలము భుజించు నప్పగిది భుజించి
యలరి గర్భముఁదాల్చి హనుమంతుఁ గనియె.
ఉరగభూషణుఁడు న య్యువిదయు స్వామి
సరసిఁ గ్రుంకిడి భక్తి శార్ఙ్గి భావించి
తమ కుమారుఁ గుమారుఁ దడవుచుఁ బుణ్య
తమమైన తగు కుమారధారికఁ జెంతఁ
గాంచి యాతఁ డొనర్చఁగల వందనములు
గాంచి క్రమ్మరి యట్టి కపిలతీర్థమున
కరుగుచు నటఁ బదియారుతీర్థములు
వరుస నుండఁగ జూపి వనిత కిట్లనియె.
నిచ్చట సప్తర్షు లెలమిఁ దపంబు
లెచ్చుగాఁ గావించి యిష్టముల్ గనుట
నీ సప్తసరసు లా ఋషుల పేరిటను
భాసిల్లు లోకైకపావనంబు లివి

మదిరాక్షి యిదియె బ్రహ్మసరంబు చూడు
మిది యగ్నికుండాఖ్య మిది పంచసరము
చక్ర మిందుఁ దపంబు సలిపి నా డెంద
మాక్రమించుచును నా దగు మైత్రిఁ జెందె

**విష్వక్సేనతీర్థ మాహాత్మ్యము. కుంతల యను నప్సరస కథ.**

వనితరో యిదియె విష్వక్సేనతీర్థ
మనఘంబు మఱి వరుణాత్మజుం డిందు
హరిసైన్యపతి యయ్యె నతులయోగమున
నరయఁబావన మైన యా కథ వినుము
మును పాది కృతయుగంబునను దూర్వాసుఁ
డనుపమతపము సేయంగ నింద్రుండు
కోపనుం డితఁ డేమి కోరునో యేమి
శాపమిచ్చునో యని జడిసి తపంబు
పొల్లుపో సేయంగ బుద్ధి నూహించి
యల్ల కుంతల యను నచ్చరం బిలిచి
కలికిరో యొక్క యక్కర పనిసేయఁ
గలవటే నీదు చక్కదనంబు నేర్పు
కళలమేలిమియు నిక్కడఁ గనుపింప
వలెఁగాక యూరకే వాడకోడెలను
మచ్చుగప్పుచు వెడమాయలు వన్ని
తచ్చనల్ పచరించి తాటోటుసేసి
మచ్చికకెక్కులు మైదుతక్కులును
తెచ్చుకోల్వలపును తియ్యనిసొలపు
గద్దరికుల్కులు కనులబెళ్కులును

ముద్దులపల్కులు మోడియల్కలును
మెరయించి విటులచే మేలైన నగలు
దొర[1] కి నవస్తువుల్ దువ్వటంబులును
వేగిరంబుగ దోఁచు విటముల కేమి
నాగవాసమువారి నయ మది గాదె
అందరిలో జాణ వందురు నిన్నె
యిందుఁ జూచెదము నీ యెల్లనేరుపులు
ధరణి దూర్వాసుఁ డ౯ తపసిని నీవు
మరులు పుట్టఁగ సేసి మదిఁ గరగించి
వలపించి తప మెల్ల వమ్ము గావించి
కులుకుల౯ లోఁజేసు కొందువై తేని
నెఱజాణ వని మెచ్చి నెలతల లోన
బిఱుదు లిత్తును నీకు బిత్తరి యిదిగో
యవసరం బని చాల యాస బుట్టించి
దివిజేశుఁ డంప నా తెఱవ యి ట్లనియె
నగవైరి దేవర నాటకశాల
మగువలలో నెంతమాత్రపుదాన
రసిక మేనక యుండ రంభ యుండంగ
నొసపరి యైన తిలోత్తమ యుండ
పుంజికస్థలి యుండ భోగిని యుండ
మంజుఘోషయు నుండ మరియు నూర్వశియు
నుండ వరూథిని యుండ నా హేమ
యుండ నిందఱిలోన యూరకే నన్ను
మన్నన సెలవిచ్చు మాత్రమే కాక

1. "దొరకైన" వ్రా. ప్ర. పాఠము.

చిన్నదానను మున్ను చేకని యున్న
దానఁగా నా వెజ్జితపసి కోపించి
పూని శపించు నే పోఁజాల ననిన
నింద్రుండు భయమేల యింతి నీ కింత
చంద్రుండు మరుఁడు వసంతుండు నీదు
చెంత సహాయంబు చేతు రేగు మనఁ
జింతతో నాకాంత చేకొని వెడలి
తనరఁ గై సేసి వింతగ నీటు మెఱయఁ
దన మేళజత వెంటఁ దగిలి మద్దిలలు
తాళముల్ ముఖవీణె తంబుర సరిగ
మేళవించుక మందమేళంబు లేక
నెమ్మితో నడువంగ నెలఁత యొకర్తు
ఘుమ్మున కపురంబు గలయ మేదించు
బాగాలు మడుపులుం బనిబూని యొసఁగ
బాగుగా వేరొకర్తు పావడ దాల్ప
బెళుకుచూపులు గుల్క బిత్తరి యొకతె
కళుకు బంగరుగిండి గైకొని రాఁగఁ
బసిఁడినకాసెమేల్ పనిజీనిసురటి
నొసపరి యా నొక్క యుపిద చేఁబూన
నిద్దంపుజిగిమించు నిల్వుటద్దంబుతో
ముద్దరా లొకతె సొంపున నంటి నడువ
సరిగంచు కాసె గజ్జలు చనుకట్టు
మెరుగుఁబోఁ డొకతె యర్మిలిఁ గొంచు నరుగ
చుక్కలగుంపులో సొగసు రాణించు
చక్కని శశిరేఖ చందంబు మీఱి

వలరేని వలపించ వలసి యీ రతియొ
సలుపు మోహనవిద్యచాడ్పునం దనరి
యటు బింబరుచి గేరు నధరరాగంబు
విటులకు మది రాగవిభవంబు గొల్ప
పెలుచసింగిణివిండ్ల బెదరించు బొమలు
నలకూబరునికైన నమ్రతనేర్ప
కలువలనీను క్రీఁ గన్నులచూపు
అలరువిల్తునకు శౌర్యంబు బుట్టించ
చిలుపవెన్నెలనవ్వు చిరునవ్వు కూర్మి
నల జయంతముఖేందు నలరసేయంగ
సురల కిం పెసఁగు మెచ్చుల మోముసోలపు
దురుసుమీఱిన విరక్తులను సొక్కింప
కనకాచలము డంబు గల కుచద్వయము
మునులకుఁ జేరంగ ముదము గల్పించ
మదనేభకరము లై మలయు పెందొడల
పొదలిక విటపాళిఁ బొరి నలయించ
అంచల నణకించు నలసయానంబు
మించి యీ నలువ నెమ్మొయిచలింపించ
మించులు గిలకొట్టు మెఱయు లత్తుకల
మించు కెంపులగుంపు మేదిని నింప
సరిగకుచ్చులహొయల్ సవరింప జిలుగు
నెరిక లోయారంపు నీటునం బొదల
వలరాజునగరికి వలగొనుప్రహరి
పొలుపున గంటలమొలనూలు మొరయ
చిరుజెమటఁ గరంగి చెలఁగు కస్తూరి

పరిమళం బెంతె గుబాళించి విసర
మగరాలమొగపు లమరు కంకణముల
నిగనిగల్ పండువెన్నెలలు గాయంగఁ
బసిడియొడ్డాణము గుబ్బలభార మాని
యసియాడు లేఁగౌను నలమి యాడుకొన
మొనసి ముక్తాహారములు నల్లిబెల్లి
చనుదోయిఁ బెనఁగంగ సరసులకరణి
రతనపుంగమ్మల రంగు లుప్పొంగి
కితవులమాడ్కి చెక్కిలి ముద్దుగొనఁగ
శింజానమంజుమంజీరముల్ శతులు
రంజించునటులఁ జరణముల౯ మలయ
కంగులరవికె కగ్గలమైన గుబ్బ
చంగవ నొకకేలఁ జక్క నొత్తుచును
నుదుటఃపైఁ బొదలుచు నునుగురుల్ జారఁ
గుదురుగా మొనవ్రేలఁ గూడదువ్వుచును
మెదలగా వదలు నెమ్మొఖలసీల
గదియఁ గోటను బిగిగాఁగ నొక్కుచును
రంగారుపైఁటచెఱంగు తొలంగ
నం గెసంగఁగ వెస హావణించుకొనుచు
వీనులపైఁ దాల్చు విరులఁ బల్మారు
పూనిక నీ టంద బొసఁగించుకొనుచు
కవచట్టము లనురాగము లింతు లనఁగ
రవలునొక్కులు రంగు రక్తిఁ జూపుచును
వగలుమించిన నట్టువల కొనగోలు
సొగసుకు మేళంబు సుతి గూర్చుకొనుచు

చనఁగ నాతారాప్రసంగంబు మఱచి
కనకాంగి మోము సింగారముంగనంగ
మునుకొని చంద్రుండు ముఖమౌచుఁ దనర
ననవిల్తుఁ డీ కల్కి నవనవం బైన
కన్నులసొలపు నేఁ గాంచెద ననుచు
నెన్ని బంటుగఁ జెంత నెలమి మెలంగ
నలరుఁబోఁణిబెడంగు నామోద మొందఁ
దలఁచి యామురునిపైఁ దలమూని చెలఁగ
మానిని మేళసుమాళ ముప్పొంగ
మౌనిచంద్రుని యాశ్రమం బటు చేరి
దూరదూరంబునఁ దొంగి చూచుచును
గ్రూరు న మ్మౌనిఁ గన్గొని యుగ్రతపము
నరమోడ్పుకన్గవ యచలగాత్రంబు
కరమున జపమాలికయు మై విభూతి
కెంజడల్ మేనఁ బ్రాఁకెడు నురగములు
రంజిల్ల ముక్కంటి రహిమంట మీఱి
తపసి నిల్కడ కల్కి దవ్వున నాడు
నెపమున పాటల నీటుమాటలను
మెల్లన యంతింత మెలకువఁ జేరి
ఘల్లుఘల్లున హంసకములు మ్రోయంగ
తిరుపుల కోపులఁ దిరిగెడు జతుల
మెరపుల యొరపుల మెయి సిరి కుల్కు
మురువుల నభినయంబుల పొంకములను
దురుపదబాళి ముద్దుగఁ ద్రొక్కి చొక్కి
మురియుచు వినిపించు మోహనలీలఁ

దరు లెల్లఁ జిగురు లొత్తగఁ బులకించె
శిల లెల్లను గరంగి స్వేదంబుజెందె
నిల చేతనంబు లయ్యె నచేతనములు
చేతనాళి దగె నచేతనాకృతిని
యా తపసియు శాంతి యరి కిన్కఁబూని
యిటుల లాస్యము సల్పు యింతినిఁ జూచి
కటిలవీక్షణము లెక్కువ జేవురింప
నెంచక దుర్బుద్ధి నిటు చేరుకతన
చెంచెత వగు మంచుఁ జీరి శపించె.
అంతఁ గంతునిగంతు లడగెఁ చంద్రుండు
నంతరిక్షముబట్టె యరిగె వసంతుఁ
డడవులఁ బడి జారె నచ్చరల్ విచ్చి
తొడవడ నురికి ర త్త్రోయజగంధి
గడగడ మెయి వడకంగ నెఱంగి
జడదారి యడుగులఁ జాగిలి వ్రాలి
పరమమునీంద్ర నే పరతంత్రగాన
దొరలమాటలచెప్పు త్రోయంగరామి
నరుదెంచితిని చాల నపరాధ మాను
కరుణించి నా తప్పు గావవే యనిన
నరసి యింద్రునిచేష్ట యగుట న మ్మౌని.
తరుణి నా శాపంబు తప్పదు నీకు
నలశాపమునకుఁ బర్యాప్తిఁ దెల్పెదను
తలఁక కింక కిరాతతనయ వై పుట్టి
సురలకుషేటి. యా సుతుఁ గాంచి వేగ
మరి నిజాకృతిఁ జెంది మనఁజాలు దనిన

విని యమ్మునికి మ్రొక్కి వెలఁది యాతఁడును
చని యదృశ్యత వింధ్యశైలపాదమున
వీరబాహుఁ డనంగ వెలయు నా చెంచు
కూరిమి యిల్లాలు గుణవతి యనఁగఁ
బూనినసంపదన్ బొగడొందు చుండ
దాని గర్భంబునఁ దగ జనియించె
తనయులు లేమి నా తరుణి యా కూఁతుఁ
గని సంతసముఁ జెంది గారాబు మీఱఁ
జెలిమిఁ బోషింప నా శిశువును విదియ
నెలరేఖపోలుపునన్ నీటు వాటిల్లి
పెరుగుచుండఁగఁ గాంతిపెంపున పెద్ద
లరసి సువర్చల యను నామధేయ
మొనరించి రప్సరోయువతి యా కతన
కనకసలాక పొంకంబున బాల
చిరుతతనంబునన్ జెలువుఁ గుల్కుచును
సరిబుడుతలఁ గూడి చాల నాడుచును
నుండనుండఁగఁ బ్రాయ మొకయింత మొనయ
నిండుసిగ్గును జగ్గు నిగ్గు బల్ నీటు
చన్నుల గమకంబు సన్నంపుఁగౌను
కన్నుల బెళుకులున్ గలిగి రాణించు
తన కూఁతుఁ గనుఁగొని తండ్రి చింతించి
మను వియ్యఁదలఁచి సమ్మదమున భద్రుఁ
డను చెంచు కొసఁగె న య్యతివ సంతటను
వనజాక్షి ప్రథమార్తవముఁ జెందుటయును
ప్రమదవనసరోవరంబున మునిఁగి

యమరిక కటిఁ గట్టినట్టి లేమావి
చివురులజొంపంబు చెంగావి విడిచి
సవరణ లవలి కిసలపాళి యనెడు
తెలిదువ్వటం బూరుదీప్తితో మలయు
చెలువుగా [1] వెందీగె చేల్గట్టికురులు
తుదలం బొదలి నిల్చు తోయబిందువులఁ
గదిసిన మల్లెమొగ్గలతో విదిర్చి
కీలుగం టొనరించి కినిసి చీఁకటులు
చాల నిందుని కల్గి శశిఁ గెల్చు మోము
వెనుకఁ జేరిన వాటి వెస నాదరించు
ననువున కొనగోర నమర దువ్వుచును
రవికర మటు చేరరాక యుండంగ
నవపల్లవము మాళి నయముగాఁ బూన్చి
నెలరాల నపు డొత్త నెరయు జవ్వాది
మెలకువఁ గని తీసి మేటిజక్కవలు
సరిపోర రానీక చన్గవ నలఁది
హరిణముల్ కన్నుల యందంబు గొనుటఁ
బొగిలి తద్రక్తంబు బొట్టిడు పగిది
మృగనాభితిలకంబు మెప్పుగా దిద్ది
పిరుదుకు సాటిగాఁ బెనఁగుట నల్క
కరికుంభముల నేయగా నందుఁ జిందు
నల ముత్తియంబుల హారముల్ దాల్చి
మొలకచన్గవమీఁద ముద్దు గుల్కంగఁ

---

1. వ్రా. ప్ర "వెఁదీలగచేగట్టి"

గురువిందములకన్న గొమరు రంజిల్లు
గురుగింజపేరు లెక్కువగా ధరించి
జీవదంతము చక్కఁ జెక్కిన కమ్మ
లా వీనులం బెట్టి హారువు మీఱంగ
జిలువమానికములు చిల్లులు పుచ్చి
చెలఁగ గ్రుచ్చినయట్టి చేకట్టు గట్టి
చెంగ నారను బిగించిన పులిగోరు
బాగుగాఁ బూని యాపైన వాకట్టు
మందులదండ లేమరక ఘటించి
కుందనపుంబొమ్మకుం దన యంద
మించుక లేదంచు నెంచంగ మించి
మించుదీగె నటించు మించు రాజించ
సెలవిల్లు చిలుకమ్ము చెలువుగాఁ బూని
వలరాజు చెలువ చెల్వము గుల్క నిలువ
వరుణరాజా యింతి వైఖరిఁ జూచి
మరులొంది వలరాజు మాయలఁ దగిలి
ఔరౌర ! యీకొమ్మ యపరంజిబొమ్మ
మారుని పూములుకి మాయలకల్కి
దీని విలాసంబు దీని హాసంబు
దీని సింగారంబు దీ నొయ్యారంబు
గనుఁగొన నిది దేవకాంత గాఁ బోలు
మనుజకాంతల కింత మైసిగ్గు గలదె
దీని కౌఁగిటఁ బూని తేనెమో వాని
మానుగ రతిజెంది మలశి యింపొంది
యామర సుఖింపలే నట్టి నే నేల ?

నమరభోగం బేల ? యైశ్వర్య మేల ?
నని తలపోసి య య్యాతివను డాసి
ననవిల్తుచే గాసి నలఁగి కన్వేసి
నయనములు నేసి యంతరధృతి వాసి
ప్రియ మొప్పగాఁ గల్కిఁ బేర్కొని పల్కె
అలివేణి యెవతె నీ వప్సరోమణివా
చిలువరాచెలువవో చెలువొందు నీదు
బేడిస జిగి మించు బెళుకుల చూపు
నాడెందము గలంచె నవమోహనాంగి
ననవిల్తుకేళిని న న్నేలుకోవె
మనమున నిఁక ననుమానంబు మాను
వరుణదేవుండ నే వలచితి నీకు
వర మొసంగెద తేనెవాతెర యీవె
అని వేగఁ గౌఁగిట నాగిన నులికి
కనకాంగి వాని చక్కదనంబు నయము
సరసలీలలు గాంచి సంభ్రమంబునను
పరవశయై చాల బాళి రెట్టింప
మిక్కిలిపులకింప మెయి చమరింప
మక్కువ రతికేళి మలయుచుఁ గలశి
యానందమును జెంది యలరి సొంపొంది
పూనిన సిగ్గుతోఁ బొలుపొంది నిలువ
అప్పుడా వరుణుండు హర్షించి మెచ్చి
యొప్పులకుప్ప న య్యువిద నీక్షించి
సారసాక్షిరో చాల సంతోష మయ్యె
వారక నీ కోరు వర మిత్తు ననిన

మోద ముప్పొంగ న మ్ముదిత కేల్మోడ్చి
యో దేవ నిను మించు నొక కొమారుండు
హరిభక్తుఁడయినిత్యుఁడై యందఱికిని
పరమపూజ్యుం డగు ప్రాభవశాలి
కలుగునట్లు వరంబు కరుణించు మనుడు
నులికి దుర్లభ మాట యూహించితనదు
వరదుఁడై నట్టి విష్వక్సేనుఁ దలఁచి
వర రహస్యస్తుతి వావిరి సల్పి
తన పల్కు నిజముగాఁ దనరనర్థించి
ననబోఁణి యింద్రుని నలువను గెలువ
గల వైభవంబులు గల కుమారుండు
జలజలలోచనభక్తజనవరిష్ఠుండు
జనియించును ముహూర్త సమయమాత్రమున
నని పల్కి వీడ్కొని యలరుచు నరిగె
హరిసైన్యపతి రహస్యస్తుతిఁ బ్రీతి
మెరయంగ నపుడె య మ్మీనలోచనకుఁ
దనయుఁడై యుదయింపఁ దరళాక్షి కూర్మిఁ
గనుఁగొని యా బాలుఁ గమలపత్రమున
నిడి యా సరసి గ్రుంకి యెడల శాపంబు
కడు నిజరూపంబు గైకొని దివికిఁ
జనుటయును సనత్సుజాతుఁ డా తెఱఁగు
మనమునఁ దెలిసి సమ్మతి నందు వచ్చి
పరమతేజఃపుంజపాదసాంకురతఁ
బరగుచు న వ్వనప్రాంతంబు వెలయ
వనలక్ష్మి యుంచిన వరదీప మనఁగఁ

దనరు న య్యార్భకుం డడవి భావించి
సద్యోవచోబోధశక్తిసంపదలు
విద్యలుఁ గలిగించ వెస నాతఁ డపుడు
దరలి వేంకటశైలతటమున నిచట
జలజనాభు భజించి సారూప్య మంది
నలువున హరి సైన్యనాయకుం డయ్యెఁ
గిరిరాజపుత్రి ! యీ గిరి వైభవంబు
లరసి వర్ణింపంగ నలవియే చెపుమ
చంద్రబింబాస్య ! యీ సరముఁ జూచితివె

శివుఁడు పార్వతికి వజ్రతీర్థమాహాత్మ్యము చెప్పుట.

ఇంద్రుని శాపంబు నెడలించు కతన
నిది వజ్రతీర్థ మం చెన్నిక కెక్కె
మొదటి యీ వృత్తాంతమును వినఁగదవె
నలినసంభవుఁడు మున్దర నొకనాఁడు

బ్రహ్మ మునులనిగ్రహమును బరీక్షింప నొక స్త్రీరత్నమును సృష్టించుట.

తెలివిడి మునుల యింద్రియనిగ్రహంబు
తెమలనిధైర్యంబు స్థిరవిరాగంబు
క్రమమునఁ గనుఁగొనఁగా నెంచి తనదు
నేరుపు మెరయించి నిఖిలసౌందర్య
సారముల్ హావణించి జగనిగ్గు లెల్ల
గూరిచి రవణించి గులికెడి సొగసు
లేరిచి సవరించి మొనలేని సొలపు
లారసి పచరించి హావభావములు
తేరిచి రచియించి తిన్నని చిన్నె

లూరిచి యెనయించి యుల్లాస మెల్ల
తీరిచి యొనరించి తెరవ యంగములు
వన్నెకన్యాసృష్టి వన్నె మీఱంగ
నెన్నెన్ని యూహల నెన్ని భావించి
భావజశరధార పదనుగాఁ దివిచి

పూవుఁబోణిగఁ జేయఁ బూని యస్థిరత
దొరలక కడఁద్రోచి తోయదద్యుతులు
కురులుగాఁగ కళంకుగొనక చందురుని
కై పునె మోముగాఁ గొచుఁ బాయించి
చాపలరమణీయ చాపలశ్రీలు
కనుఁగవగా నల్లె కడకొత్తి విండ్ల
నునుసోయగములు కన్బొమలునుగాఁగ
మైల దొలంగించి మంచి యందముల
డాలుచెక్కులుగాఁ దుటారంపుపరుస
దనము బాపి ప్రవాళతతి రంగు మోవి

గను త్రాసమూడ్చి చక్కని ముత్తియముల
తెలి నిగ్గు దంతపంక్తిగఁ జమ్ముదీర్చి
వలనొందు శ్రీకారవైఖరుల్ వీను
లును గాఁగ వాఁడి నల్గుట మాన్చి నవ్య
కనకపురుచి నాసగాఁ బాఁచిముడిచి
చిందమందము కంఠసీమగా గుహల
నొందనియ్యక గిరియుగలక్ష్మి గుబ్బ
చనుఁగవగా [1] గొరుజవరకరీక

1. వ్రా. ప్ర. " గొరల్ జవిరికరీక "

ఘనరేఖ భుజములుగా పస రొలిచి
కమలంబుల బెడంగు కరములు గాఁగఁ
దమ మూచి చుక్క లందము సఖంబులుగ
జరజరఁ బో నూకి శైవాలవల్లి
సిరులు నూగారుగాఁ జెందినకలక
యొడలించి బంగరుటేటి తరగల
యొడికముల్ వళులుగా నుడుగని భ్రాంతి
పోనిడి సుడిపొంపు పొక్కిలి గాఁగ
పూను చొ ప్పడచి నభోవైభవంబు
లేఁగౌను గాఁగ ధూళి విదర్చి సైక
తాగమసంపద యల పిరుందుగను
ముడుత దెఱిచి గజంబుల కరాకృతులు
తొడలుగా వీలుటఁ దొరగించి పొట్ట
కరలమేల్ చిరుదొడల్గా కప్పు గడిగి
మెరయు తామేటినిగల్ మీఁగాళ్లుగాఁగ
తొడిమల బిరుసెల్ల దునిమి చిగుళ్ల
బెడ గడుగులు గాఁగఁ బేర్చి నెమ్మేన
నుదిరి బంగరురంగు నొరపొందు మెఱుపు
పొదలికె తళ్కునుఁ బూవుల తావి
కలియ మేదించి శృంగారంపు తేట
వలరాజు చెలువ చెల్వము జిగినీటు
బదునిచ్చి మెరుగిడ భావించి తనదు
మదిని యూహించి సమ్మదయత్నమునను
చేత నంటిన కందుఁ జెందెడి ననుచు
చాతురి మనసుచే సరగ నిర్మించి

కని యొచ్చె మింతయు [1] గనమిదహాల్య
యని సంజ్ఞ గావించె న య్యంచుబోణి
చెలువు నుతింప వేజిహ్వాలకైన
నలవియే యా మోహనాంగి మైరంగు
ననుపమశృంగారహావభావములు
కనుఁగొన పదివేలు కండ్లు గావలయు
అంతట నాధాత యాస్థానమునను
శాంతులౌ సనకాదిసకలయోగులును
గౌతమ కణ్వాత్రి కశ్యప కుత్స
శాతాతప వసిష్ఠ శరభంగ పులహ
ఘటజ భరద్వాజ గర్గ భృగ్వాది
జటిసంఘములు నింద్ర చంద్ర యక్షేంద్ర
వరుణ యమాది గీర్వాణముఖ్యులును
గరుడకిన్నరపన్నగప్రవరులును
మనువులు రాజర్షి మండల మేను
మునుగాఁగ నందఱుఁ న్ముచ్చటాడుచును
పరతత్త్వవిభవ తత్ప్రాప్త్యుపాయములు
పరమధర్మస్థితుల్ పరికించు తఱిని
నలినసంభవుని యన్తఃపురసీమ
వెలువడి మోహనవిద్యయో యనఁగ
వనజాస్త్రు నిష్టదేవత యిది యనఁగ
జనలోచనోత్పలశశిరేఖ యనఁగ
మానేంద్రద్రుతివంశమంజరియనఁగ
జ్ఞానకాసారవంశావళియనఁగ

1 "గనమీనహాస్య" వ్రా. ప్ర. పాఠము.

తపములకు పయిరులఁ దగుపంట యనఁగఁ
జపలత మునులపైఁ జల్లు మిం చనఁగ
నలువను గొలువగా నలువొంది యచట
నలరుచు నిలుచున్న యా కన్నెఁ గాంచి
చదువులు మఱచి ప్రసంగముల్ విడిచి
మది విభ్రమముఁ జెంది మరుకాకఁ గంది
పారవశ్యముఁ బూని బలు నాన మాని
వైరాగ్యము దొలంగి వగలఁ గలంగి
రేనాఁడుఁ గాన మీ యింతి యెవ్వతయొ
దీని రూపవిలాసదీప్తు లయ్యారె
దీనిఁ గూడినఁ జాలదే తపఃఫలము
దీనిఁ గౌఁగిటఁ జేర్చితే భాగ్యఫలము
కాదె యంచుఁ దలంచి కడు బాళిమించి
మోద మొప్పఁగఁ గాంచి మొక్క మున్నమించి
శిరములు గదలించి చెలఁగి నుతించి
మరుని మాయలఁ జిక్కి మమతచే సొక్కి
యాసఁ గన్గొనుచుండ నందఱి కనుల
నా సభ వికచపద్మాకరం బయ్యె
కమలజు నన్ను నా గౌతముఁదక్క
యమిచంద్రులను సురేంద్రాదుల నెల్ల
మోహింపఁజేసె నమ్మదిత చూపులనె
హా ! హా ! యే మనవచ్చు నంగజు గచ్చు
నాపుడు గౌరి వేనగవు విస్మయము
భావంబునఁ దలిర్పఁ బ్రాణేశుఁ జూచి
యటమీఁద నే మయ్యె నని యడుగుటయు

నిటలాక్షుఁ డది వినె నీలాహివేణి!
అపుడు విధాత యం దందఱి మనసు
చపలతయు నెఱింగి శమదమంబులను
ఖ్యాతమునీంద్రుఁడై కరము రంజిల్లు
గౌతమునకు నిచ్చెఁ గరుణ న త్తరుణి
నం దుండు మునులు నింద్రాదులు చింతఁ
జెందుచుఁ గుందుచు సి గ్గగ్గళింప
నలఁ పెత నిట్టూర్పు లడర నొండొరులు
పులియుక మొగమొగంబులు చూచుకొనుచు
నాస లుడిగి డెంద మంతయుఁ గంద
వేసట నుండఁగ విధి కొల్వు దీరి
యరిగె గౌతము వెంట న య్యహల్యయును
జరిగె వేగమె నిజాశ్రమముఁ జేరంగ
నెల్లవారలు తమ యిండ్లకుఁ జనిరి
అల్ల యింద్రుడు మోహ మాపలే కపుడె
యింతంత సన్నల నింతిఁ గన్గొనఁగఁ
జెంత నేగుచు కొన్ని చిన్నె లొనర్ప
న న్నెలంతుక మొకం బటు వంచికొనుచుఁ
దన్నుఁ జూడక యేగఁ దపసికి వెఱచి
మరలె నింద్రుండును మదనాస్త్రధార

ఇంద్రుని విరహవర్ణనము.

చురుకుసేయఁగఁ జేరె సురరాజధాని
తనచూపు తలఁపు నాత్మయు నై యహల్య
వెనుకొని మరలి రా విధములే కరుగ
తనువుమాత్రంబుతోఁ దనయిల్లు చొచ్చి

మనసిజునకు లోఁగి మరులున కాఁగి
ఉసురను కలకుబెట్టూర్పు నింతులను
గసరు విరులశయ్యఁ గాఁకచేఁ బొగలు
వలపు మించఁగ బైలువడి గౌఁగిలించు
పలవరించు హసించుఁ బారవశ్యమున
జడునికై వడి నుండు సంకల్పమునను
పడతుక రతి జెందు భ్రమమంచుఁ దెలిసి
తను దాఁనె నిందించుఁ దడయక లేచు
మనసు దిప్పక కొంత మఱచియుండంగ
నందనవని కేఁగు నవత యం దెచ్చి
కొందళించ సుధర్మఁ గొలువుగా నుండు
నుండుచో నెప్పటి యుల్లాస మొంద
కుండినఁ దా మరు లొందుటఁ దెలిసి
రచ్చల న్నగుదురు రసికు లటంచు
తెచ్చుకోలునువంబు దిట్టతనంబు
కపటపుహాసంబు ఘనవిలాసంబు
నెపమున సరసంబు నెరరాజసంబు
పెట్టుచాయల సొంపు బిగువొందు పెంపు
గుట్టైన మాటలు కూర్మియాటలును
పైపూఁత నీతులుఁ బ్రబలహేతువులు
కై పునఁ బ్రకటించి ఘనత వాటించి
తన చిన్నెలను మాటఁదలఁచి యచ్చోట
పునుఁగున మఱుపెట్టు బూనులేఁజెమట
నలరుబంతులఁ దాఁచు నలతనిట్టూర్పు
నెలమి వస్త్రంబుల నిముడు గార్శ్యమును

కపురంబులనె కప్పఁ గడువెల్లదనము
నెపమున నందఱి నెమ్మి వీడ్కొలిపి
కొలువు చాలించి క్రక్కున నంతిపురము
వలగొని చని యెక్కు వైజయంతంబు
భావ మొక్కెడ నైనఁ బట్టక నిటులఁ
బూవుఁబోఁణివిరాళిఁ బొగులుచు నుండె

గౌతమాశ్రమమం దహల్య.

అయ్యహల్యయు గౌతమాశ్రమంబునను
నెయ్యంబు మించ మౌనికి నెల్లవేళఁ
జెలిమిని శుశ్రూషఁ జేయుచు మిగుల
బలునిష్ఠ నా ఋషిపత్నుల కరణి
చాలవ్రతంబులు సాధించు నుదయ
వేళ స్నానంబు గావించి జపించి
తనరంగ నార్ద్రవస్త్రములతో వెడలి
మొన చెఱంగుల నీరములు త్రోవవెంట
ఘనరేఖ యేర్పడఁగా మేనువడక
తనువెల్లఁ బులకింప తడికురుల్ జార
కరములదర్భయుంగరములు మెఱయ
గరిమెను పూర్ణాంబు కలశంబు పూని
శమము మించఁగ బర్ణశాల వేఁజేరి
క్రమమున దేవతార్చనకుఁ గైసేసి
జిగిమంచు తెర మించు జిలుగుదువ్వలువ
తగురంగుల చెలంగు తన యంగకముల
నొరయుచు బిరుసుగా నొత్తంగఁ జారుకు
కరుకును మీరు వల్కలము ధరించి

బిగువుగా నారచే బిగియించి కట్టి
వగవక వేఱొక్క వల్కలం బూని
యుదుటగుబ్బల పొత్త నుత్తరీయముగఁ
గదియించి రత్నమేఖలఁ దాల్పనైన
తనకౌను [1] కౌనుకోదర్భతా డనక
నెనయించి వేదంబు నిల మునుల్ బట్టి
గాదె పూజ్యతఁ జెందఁగలిగి రభ్భంగి
వేదంబు చేపట్టి వేల్మికుండములు
వెలయించి యగ్నికి వింతసంతసము
చెలఁగఁ దృప్తియొనర్పఁ జెంగట నిలిచి
పాకయజ్ఞముసేయు ప్రౌఢియుఁ దానె
గైకొని యతిథిసత్కారంబు నేర్చి
ఈలాగు గరితల కెనయు శీలమున
మేలిమి రంజిల్ల మెలఁగుచునుండెఁ
అంతట నింద్రుఁ డ య్యాలివేణిమీఁది

ఇంద్రుఁడు గౌతమాశ్రమమునకు వచ్చుట

చింత యాపగలేక చిత్తజుకేళి
నెటులైన నయ్యింతి నెనసి కూడంగఁ
గుటిలత నూహించుకొని పనిలేని
పనికి నా గౌతమభవనంబునకును
నరుగు నాతిథ్య మాయన సేయఁదలఁప
నరమాటనే యొప్పి యానాఁడు నిలుచు
నిలిచి ముచ్చటలాడు నెపమున నట్టి
నెలతఁ గన్గొనఁ గొన్ని సీటులుసేయు

1. "కౌనకో" వ్రా. ప్ర పాఠము.

వనిత వడ్డింపగా వచ్చుచో నొరులు
గనకుండ చిన్నెలు గావించుకొన్న
వెస నగ్నిహోత్రపువేళఁ దా వచ్చి
కసిదీర నాచానఁ గనుఁగొని పొగడు
మునిని వీడ్కొని యేఁగ మొనసి యందొక్క
మునిశిష్యుఁ బుత్తెంచు ముదితకుఁ దెలుప
మరియు నొక్కొకవేళ మౌని లేసపుడు
పరికించి యొంటి నప్పడతుకఁ గాంచి
వినయంబు లొనరించు వీరువా రెందుఁ
గనుగొందురో యంచుఁ గ్రక్కున నరుగు
నాపెయు నొకకొంత హర్షించినటులఁ
జూపుజూపులెసేయు సంకోచమునను
వాసవుఁ డొకనాఁడు వనజాక్షిఁ గలయ
నాసచేఁ జనుదెంచి యపరరాత్రమున
నయ్యాశ్రమంబున నణకువ నుండి
చయ్యన నమ్మౌని స్నానార్థముగను
చీఁకటితోఁ దాను శిష్యులు నేఁగ
వీఁక నా గౌతమువేషంబుఁ బూని
పర్ణశాల నహల్యపాలికిం జనిన
నిర్ణయంబుగ వాని నెలఁత యెఱింగి
అమరేంద్రుఁ డని యాస నలమి రమించె
తమిదీర నింద్రుఁ డాతరుణినిఁ గూడి
మొనబంటిగెఱలేక మోవిఁ గ్రోలుటయు
కొనగోరు సోఁకక గుబ్బ లంటుటయు
పలటీలఁ బల్కు లొప్పక పెనంగుటయు

లలిని గాజులు గదల్పక నలముటయు
బంధమై ఖరులు జూపక కలియుటయు
బంధురదీప ముంపక సొలయుటయుఁ
గాఁగ ముచ్చుల గచ్చు కరణి రతంబు
వేగఁ జాలించి యావెలఁది లాలించి
యతికృతార్థతఁ గాంచి యాత్మ హర్షించి
మతి శంక మీఱంగ మగుడ నేగంగ
నటు గౌతముఁడు మళ్ల నరుదెంచి యట్టి
యుటజంబు జొచ్చి య య్యువిదతోఁ నింద్రుఁ
గనుఁగొని యా పాపకర్మంబు దెలిసి

అహల్యాజారుఁడైన యింద్రుఁడు గౌమతశాపము నొందుట.

కనలి యోరి! దురాత్మకా! గుహ్యమొకటి
కామించి యీపని గావించుకతన
నీ మేన నవి వెయ్యి నిండారఁ బొడమి
యుండుఁగా కని శాప మొసఁగిన నపుడె
దండిగా నవి బుట్టి తనువెల్ల నిండె
నది చూచి సిగ్గున నమరనాథుండు
కదలి వేగమె బ్రహ్మకాసారమునను
గమలనాళంబులోఁ గడు డాఁగియుండ
నమరు లెప్పటివలె నయ్యింద్రసభకుఁ
గొలువుసేయఁగ వచ్చి కూడి యందఱును
బలభేదిఁగానక భ్రమసి యం దరసి
గుసగుసలాడుచు గురుని దగ్గఱకు
వెసఁ జని యింద్రునివృత్తాంత మడుగ
గురుఁడు ధ్యానమునఁ గన్గొని యెల్లపనులు

సురల కాతనియున్కి చొప్పడఁ దెలిపె
అంతఁ జింతించి య య్యమరులు దుఃఖ
సంతప్తులై పాకశాసనుఁ డెంత
పనిసేసె సురరాజ్యపతి యెవ్వఁ డింక
నని మంతనముసేయ న య్యింద్రమంత్రి
పిసఁ దప్పుపని దలపెట్టె రం చరసి
వెస దేవతలఁ బిల్చి వెతఁబడనేల
దొరల కొక్కెడ తప్పు దొరలదో మళ్ల
పరిజను లది చక్కబఱచరో జగతి
మనము నయ్యింద్రుఁ గ్రమ్మఱఁ దోడితెచ్చి
ఘనతసేయుగఁ బాడిగాదె పోద మని
యందఱుఁ దోడ్కొని యరిగి యచ్చెంతఁ
బొందుగా నింద్రునిఁ బొగడి గానంబు
సేయించఁగ నతండు శీఘ్రంబ వెడలి
పాయ కా గురునకుఁ బ్రణతు లొనర్చి
తలవంచుకొని సిగ్గు దనర నిల్చుటయు
నల బృహస్పతి యింద్రు నలమి యిట్లనియె
సురరాజ ! లజ్జచే సృక్క నేమిటికి
నురుతరమత్తకి యోన్యసీకంబు
మోహనాకృతిఁ జెందు మేటి యచ్చరల
మోహనకలఁ దేల్చి మోద మొందుచును
నందనం బన మేరునగకందరములఁ
బొందుమీఱ విహారములు చేసికొనుచు
మెరుగుదువ్వటముల మేను కైసేసి
సురరాజ్యపాలన చొప్పడ సల్పు

మనవుఁ డట్లగుటయు న య్యింద్రుఁ డలరి
చనుదెంచి యపుడు నచ్చరలతోఁ గేళి
సలుపుచుం దనివి వేసటయును లేక
మలయుచు మన్మథోన్మాదంబు మీఱి
చాలస్త్రీలోలుఁడై సతతంబు బైలు
దేలక కొలువుండు తెఱఁగువమాలి
పరిపాటియును రాజ్యపాలన మఱచి
సురముఖ్యులకుఁ గండ్లఁ జూడఁగ౯ రాక
యుండుటయును గురుం డొకవేళ యరసి
వెండియు నిది యొక్క విపరీత మయ్యె
నొకటిచే రతికామ ముడుగంగ రాదు
ప్రకటింప నవి సహస్రములైన వశమె
వీనికి హితమైన విధము దెల్పుదును
నానేరుపున నంచు నయముగా నింద్రు
నంతఃపురంబున కరిగి యం దతని
చెంతనుండి నుతించి చెలిమి నిట్లనియె
విను మమరేశ్వర విమలశీలుఁడవు
నినువంటివానికి నిస్సారమైన
కామభోగముఁ గోరఁగా నుచితంబె
నీమేన నివి యున్కి నిష్ఠురదైత్యు
లరసిన నిందింతు రటమున్నె నీవు
వెరవున నొచ్చెంబు వీడునట్లుగను

ఇంద్రుఁడు వెంకటాద్రిని తపంబుసలిపి స్వామియనుగ్రహంబు వడయుట.

శ్రీ వేంకటాద్రి నా శ్రీనివాసులను
భావించి వ్రతములపటిమ మెప్పించి

కర మిష్టములు చెందఁగలుగును వనుడు
పురుహూతుఁ డలరి సొంపున బృహస్పతికి
నెఱిఁగి దివ్యవిమాన మెక్కి యక్షణము
యరిగి యా గిరిఁ గాంచి యటఁ బ్రదక్షిణము
గావించి యచ్చోటు కడు రమ్య మగుట
భావించి శిల వజ్రపటిమ భేదించి
పాతాళగంగను పైకి రావించి
స్నాతుఁడై యొక్కవత్సరము తపంబు
సలిపినం గరుణ నా జలజలోచనుఁడు
చెలిమిఁ బ్రత్యక్షమై చేరి యిట్లనియె
బలభేది నీ కేమి వలసి తపంబు
సలిపెదవు వరంబు సరగ నిచ్చెదను
కోరికొమ్మ నవు డా కులిశాయుధుండు
శౌరిఁ గన్గొని వేగ సాష్టాంగ మెఱఁగి
నిలిచి కేలుమొగిడ్చి నీరజనాభ
బలిని బంధించి నన్ బ్రతికించి కాచి
నాపాలి పెన్నిధానంబుగా నలరు
నీ పాదపద్మంబు నేఁ బొడగంటిఁ
బరమధన్యుఁడ నైతి భాగ్యంబు వేరె
మరియును గలదె యోమందరోద్ధారి !
మైన నా వైరూప్య మంతయు మార్చి
దీనతఁ బాపవే దితిజసంహారి
నావు డింద్రునిఁ జూచి నారాయణుండు
భావంబున న్నగి పాకారి నీకు
నన్ని యొచ్చెంబులు నడఁగి యయ్యన్ని

కన్నులు మేనెల్లఁ గలిగెడి నిపుడె
యని వరం బొసఁగి యత్యాశ్చర్యముగను
తన మాయ నపుడె యంతర్హితుండయ్యె
అపుడు సహస్రాక్షుఁడై సురేంద్రుండు
విపులసౌఖ్యముఁ జెంది విలసిల్లెగాన
నీ తీర్థవిభవంబు నీ గిరి మహిమ
ధాతకైనఁ దరంబె తడవి వర్ణింప
నని తెల్పి శంకరుం డవ్వల కరిగి

శివుఁడు పార్వతికిఁ గపిలతీర్థమహిమను జెప్పుట.

కనుఁగొని యచ్చోట కపిలతీర్థంబు
విను గౌరి యీతీర్థ విమలవైభవము
మును శౌరి కృతయుగంబునఁ గపిలాఖ్య
మౌనియై యతలసీమను వసింపుచును
బూనికె ప్రతిదినంబును నీ సరంబు
వివరంబు త్రోవగా వెడలి యిం దుండు
శివలింగమును పూజసేయుచుండంగఁ
గపిలతీర్థం బనంగా నయ్యె నిదియె
విపులపుణ్యాకరంబు విశ్రుతం బవని
ప్రతివర్షకార్తికపౌర్ణమాసులను
క్షితిఁ గల్గు తీర్థవిశేషంబు లెల్ల
మధ్యాహ్నమున యామమాత్ర మిం దుండి
బుద్ధ్యాద్యభీష్టంబు లెల్లవారికిని
దానె కల్గఁ జేయు దర్శనంబుననె
స్నానదానార్చనల్ సలుపు ధన్యులకు
నే కామితార్థంబు లిహమునం గల్గి

వైకుంఠకైలాసవాసమున్ దొరకు
నిచ్చోట నీ కపిలేశ్వరుం డిపుడు
హెచ్చుగా భక్తుల కీప్సితం బొసఁగు
కపిలయోగి కృతయుగమున ని య్యాశు
నపచితి మెప్పించి యలరుచు నుండె
తరువాత నగ్ని త్రేతాయుగంబునను
ధర పూజ యొనరించి ధన్యతఁ గాంచె
నల ద్వాపరంబున హరిచక్ర మితనిఁ
బొలుపొంద భజియించి పొగడొందె నింకఁ
గలియుగంబున నిందుఁ గపిలార్చనాది
కలనచే నిట్టి లింగమె ప్రకాశించు
నీ లింగమాహాత్మ్య మెంచి నుతించఁ
జాలండు శేషుఁడున్ జతురాననుండు
ననుచుఁ బేర్కొని గౌరి కటు వివరించి
తనరుచు నా సర స్తటమున నుండి
భావించి యోగప్రభావంబుచేత
భావికార్య మెఱింగి పవనుండు గుహుఁడు

### శివపార్వతులకుఁ గుమారునకు హరిప్రత్యక్షంబగుట.

ననుపమంబుగఁ దపం బాచరించుటయు
వనజేక్షణుఁడు గృప వారలయెదుట
సాక్షాద్భవించి ప్రసన్నుఁ డౌటయును
దక్షాధ్వరధ్వంసి తా మున్నె యరసి
హరిని గన్గొనఁగ న య్యతివతోఁ గూడ
నరిమురి నరుదెంచు నవసరంబునను

కటిఁగట్టి హేమాంశుకంబు నామీఁద
ఘటియించి నందకఖడ్గరత్నంబు
మెఱయ మధ్యంబున మేఖలఁ బూన్చి
యురమునఁ గౌస్తుభం బొనర హారములు
ధరియించి యిడి కంఠతటి గంటెసరులు
కరముల రత్నకంకణములు వెట్టి
పొలుపొంద భుజముల భుజకీర్తు లంది
మలయించి వీనుల మకరకుండలము
లురుకిరీటము మౌళి నొనరంగఁ దాల్చి
విరులదండలు తావి విసరఁ గైసేసి
చరణనూపురము లెచ్చరికలు దెలుప
మెరుగారు పావలు మెట్టి కట్టాణి
ముత్తియంబుల గేరు మొనగోరు లచట
గుత్తపువెన్నెల గుంపు నింపంగ
సిరులీనుచెలి పంటచెలువయుం జెలిమి
నిరుదండ కైదండ లియ్యంగ నొయ్య
నయ్యెడ వలరాయనయ్య నెయ్యమున
నయ్యాదికిటిమూర్తి యై యరుదెంచి
హరకుమారసమీరణాదుల మ్రోల
వరకరుణాస్ఫూర్తి వరదుఁడై నిలిచె
నిలిచిన పవనుండు నీలకంఠాఖ్యుఁ
డల నీలకంఠుండు నగరాజసుతయు
వనజాక్షుఁగనుఁగొని వందించి పొగడి
ఘనమనోరథసిద్ధి గాంచి వీడుకొని
తమయున్కిపట్లకుఁ దరలి యేగుటయు

నెమిలిత త్తడిరౌతు నిష్ఠురహత్య
గ్రక్కునఁ దొలఁగంగఁ గని పర్వములను
మక్కువ మీఱం గుమారధారికను
చనిచని స్నానంబు సలుపుచునుండ

అగస్త్యాదిమునులచ్చట హరికై వెదకుట.

ననఘు లగస్త్యాదియమిచంద్రు లందు
వలగొని యరుగుచు వాయవ్యదిశను
తెలియ నా గిరి యొక్క దేవరూపమున
గనిపించి తమకుఁ బల్కక డాగురింపఁ
గని విస్మయమున నాకడ నంతరమున
నవలతాగుల్మవనములరంజిల్లు
వివిధతీర్థంబులు వెసఁ జూచుకొనుచు
నల తూరుపున సనకాదియోగితతిఁ
దిలకించి హరి మాకు దృశ్యుఁడౌ నెందు
నని యడుగఁగ వార లటు పశ్చిమమునఁ
జనుఁ డింద్రు డందు నిశ్చయము దెల్పునన
నరిగి యచ్చట నింద్రు నడుగ నతండు
హరు డుండు కపిలతీర్థాంతికంబునను
తెలుపు నాతం డన తిరిగి యచ్చోటఁ
బులితోలు భూతియుఁ బునుకకంచంబు
నెలవంకపూవును నిడుదకెంజడలు
నలువెక్కు కుత్తుక నాగభూషలును
వెలుగు కన్నులు కల్గి [1] వెలయు ముక్కంటిఁ
జెలిమిఁ గన్గొని మ్రొక్కి సేవించి యడుగ

1. "కన్నులుకల్గి వెలయు" వ్రా. ప్ర. పాఠము.

నతఁడు నియ్యోడ మీఱు హరినిఁ గన్గొనెద
రతిరయంబున నని యాత్మీయమాయ
నంతర్హితుండైన న మ్మునులంత
చింతతో నటకుఁ బశ్చిమకోణమునను

హరిసైన్యపతి జైత్రయాత్రాభిరతిని
వరశిలాతలమున వరుస సైనికులు
తనుఁ గొల్వ నుండ నాతనిఁ గాంచి యలరి
వినతులై తమ కోర్కె వివరింప నతఁడు
గర మొప్ప మాయావిఁ గనుఁగొన మీకుఁ
బరమ మా నొక్క యుపాయంబు గలదు
జలజాక్షునకుఁ గేళిసరసిగా నింపు
సలుపుచు నుండు నాస్వామిపుష్కరిణి
సలిలంబుల౯ భక్తి స్నానంబు సేసి
కొలుచు ధన్యులకుఁ గన్గొనవచ్చు హరిని

అని చనినంత వా రా స్వామిసరసిఁ
గనుగొనఁ జేరి యక్కడ శంఖనృపతి
వసుఁడు శ్వేతద్వీపవాసులు నుండ
వెస వారలను జూచి విస్మితులగుచు
స్నాతులై శ్రీనివాసధ్యానపరత
నాతటంబున నుండి రందఱుఁ గూడి
అని తెల్ప విని జనకావనీశ్వరుఁడు
ముని వామదేవుని ముదమునం బొగడి
యందు శంఖుఁడు వసుం డనువార లెవ్వ
రెందుకు నటు వచ్చి రెలమిఁ దెల్పు మన

శంఖుఁడను రాజుకథ.

మునివరుఁ డాకథ ముందుగాఁదొడఁగి
వినుతవృత్తాంతంబు వివరించె నిటుల
మునుపు [1] హైహయదేశమున శ్రుతాఖ్యుండు
జనపతి యై యుండు శంఖుఁడన్ సుతుఁడు
జనియించె నతని కా శంఖభూవరుఁడు
దనర బ్రహ్మాదిచందంబునఁ జాల
హరిభక్తుఁడై వైష్ణవారాధనంబు
నరగ సల్పుచు వెన్ను సాక్షాత్కరించ
వలసి యనేకము ల్వాజపేయములు
నల రాజసూయము లశ్వమేధములు
విశ్వజిత్సత్రాది వివిధయజ్ఞములు
శాశ్వతికాసక్తి నవరించి హరిని
పొడగాననికొంతఁ బూని శోకించు
నెడ కరుణార్ద్రుఁడై యీశ్వరుం డతని
కనియె నదృశ్యత నందఱు వినఁగ
జనపాల నీ కింత సంతాప మేల
ననుపమం బగు వేంకటాచలంబునను
సనకాదిసేవ్యమై స్వామిపుష్కరిణి
యను నొక్క సర మున్న దచ్చట నియతి
ననుదినంబు మునింగి యజియించి నన్ను
గనుఁగొనియెదవు శంక దొలంగు మింక
నను డాలకించి హైహయరాజసుతుఁడు
ఘనవిస్మయంబు బొంగఁగ మెయి వడక

1. "హ్లైహయ" వ్రా. ప్ర. పాఠము.

వనజనాభుఁడె దయఁగ౯ వచ్చి పల్కె నని
తెలిసి జాగిలిమ్రొక్కి దృఢభక్తి మెఱయ
నలరుచు శ్రీ వేంకటాచలంబునకు
నరిగి స్వామిసరంబు నచ్చటఁ గాంచి
ధరణి సాష్టాంగమై తగఁ బ్రణమిల్లి
విసువక నర్తించి వినుతి సేయుచును
పొసఁగఁ బ్రదక్షిణంబులు సల్పి యందు
త్రిషవణస్నానముల్ దినము సల్పుచును
ఋషివృత్తి హరి భజియింపుచు నుండె
వెస నీకు నరపాల వివరింతు నల్ల
వసుచరితంబు పావన మద్భుతంబు

వసుఁడను రాజు కథ.

వసుధఁ జెండె విభుండు వరధర్మవిదుఁడు
వసుఁడను నొక రాజు వైష్ణవోత్తముఁడు
సకలతత్వజ్ఞుండు శమదమాన్వితుఁడు
సుకృతైకశీలుండు సుజనపూజకుఁడు
సర్వాత్మబంధుండు సత్యసంధుండు
నిర్వైరమతి బ్రహ్మనిష్ఠముఖ్యుండు
నిగమాగమపురాణనిచయార్థవేది
నగధరపాదార్చనానిరతుండు
నిరవద్యగుణగణోన్నిద్రవైభవుఁడు
సురకిన్నరాదులు సొరిది నుతింప
నమృతసారపటీరహారనీహార
విమలకీర్తివహించి విపులఁ బాలింపు
చెలరంగ నొక్కనాఁ డమరేంద్రసభను

కలశోద్భవవసిష్ఠకణ్వాత్రిముఖులు
వరమునుల్ చనుదెంచి వరుస నుంచునెడ
సురల కమ్మునులకున్ శుభగోష్ఠివేళ
మును పూజ్యు లమరులో మునులో యటంచు
మొనసెఁ సంవాదంబు మున్నింద్రుఁ డరసి
యిది నిర్ణయం బని యేర్పరింపంగ
మదిఁ దోఁచకునికి యో మహాసీంద్రులార
మన కేల వాదంబు మహి వసురాజు
తనరంగఁ దేర్చు ని ద్ధర్మసంశయము
పోద మా నరపాలుపొంతకు ననుచు
సాదరంబుగ మహాను లమరు లింద్రుండు
చనుదెంచి ధరణికిఁ జయ్యన నపుడె
జనపాలమణి యుండు సభఁ జేరుటయును
అల వారి నరపాలుఁ డాశ్చర్య మొదవ
తిలకించి యమితభక్తిని వేచి నేమ
మరసి యర్ఘ్యము పాద్య మాచమనీయ
మరుదారఁగ నొసంగి యాసనంబు లిడి
తగ నర్చన లొనర్చి తదనుజ్ఞ వడసి
వగ మీఱఁ గూర్చుండి వారికి ననియె
సుదినాహ మిది మిమ్ముఁ జూడఁగల్గుటను
మది నన్ను గరుణించి మన్నించఁ దలఁచి
దేవమునుల్ వచ్చితిరి నా గృహంబు
పావనం బయ్యె నా భాగ్య ముప్పొంగె
నేమి నే సేయనయ్యెడి దానతిండు
నేమించి పనిగొన నే కింకరుండ

నని పల్కి వసురాజు నమరులు మునులు
గనుఁగొని మధురవాక్యములకు నలరి
జననాథ ధర్మసంశయము ని న్నడుగఁ
జనుదెంచితిమి నీవు సత్యంబు పల్కు
మమరులు యోగ్యులో యగ్రపూజలకు
యమిముఖ్యు లర్హులో యని సంశయంబు
జనియించె నిందు నిశ్చయ మెట్టె దనుఁడు
జనపతి సుర లగ్రసంభావ్యు లనియె
అనుటయుఁ గోపించి య మ్మునీశ్వరులు
కనుగవ నిప్పుకల్ గ్రక్కు వెక్కసపు
కడక న వ్వసురాజుఁ గనుఁగొని సభను
చిడుముడి మొకములు జేవురింపంగ
దొరలఁ కిచ్ఛకముగాఁ దొడి నసత్యంబు
దొరల బల్కితి గాన దుర్గమం బైన
పాతాళతలమునఁ బడు మంచు శాప
మాతతోద్ధతి నిడ నాతఁ డాక్షణమె
ధర నిల్వలేక పాతాళతలంబు
చొరఁ దెప్పునం బడుచో మది హరిని

మునులశాపముచే పాతాళమునఁబడు వసురాజును రక్షింప స్వామి గరుడునిబంపుట.

ధీరత భావించి తెమలని భక్తి
నారాయణముకుంద ! నను బ్రోవఁగదవె
శరణు లక్ష్మీకాంత ! శరణు గోవింద !
శరణు హృషీకేశ ! శరణు సర్వేశ !
యనుచును బడుచుండ నతని మారుతుఁడు
కనుఁగొని శాపంబు కలుగుట యరసి

హరిభక్తుఁ డితఁ డంచు నర్మిలి నంది
ధరియించి నొయ్య న త్తరి నిల్వ నిడియె
నచ్చోట నతినిబిడాంధకారమున
కిచ్చోటువడుచు నా క్షితివల్లభుండు
హరినిదిధ్యాసనాయత్తచిత్తమునఁ
బరమవైరాగ్యసంపన్నుఁడై మదిని
శోకలేశం బైన చొప్పడ కెపుడు
లోకోన్నతానందలోలుఁడై యుండ
క్రూరదైతేయులు కొందఱు పూర్వ
వైరంబుఁ దలఁచి యా వసువసుధేశుఁ
దొడరి హింసింపఁగాఁ దోయజాక్షుండు
కడునిజభక్తుని గాసి యెఱింగి
కారుణ్య మలరంగఁ గరుడునిఁ బిలిచి
వీరాగ్రగణ్య యో వినతాతనూజ
నాదు భక్తుండు వసునరపాలుఁ డనెడు
చేదిపుంగవుఁడు ఋషిక్రోధమునను
పాతాళతలమునన్ బడె నట్టి వాని
దైతేయసంఘంబు దగిలి బాధింపు
చున్నది యందు నీ వుర్వడి నరిగి
మున్నుగా దైత్యుల మోహరం బడఁచి
య య్యధోగతి నుండు నత నుద్ధరించి
చయ్యనఁ దెచ్చి రాజ్యంబున నిలుపు
మని యానతిచ్చిన నా పక్షిరాజు
వనజాక్షునకు మ్రొక్కి వలగొని వెడలె

పక్షిరాజు పక్షవిక్షేపముల వర్ణనము.

వెడలె నిష్ఠురపక్షవిక్షేపణములఁ
గడలినీరెల్ల చిక్కటిలి ఘూర్ణిల్ల
గిరులు ద్వీపంబులు గిరగిర దిరిగి
యొరయిక నొండొంట నూటాడుచుండ
బడబానలజ్వాల పటలంబు చిటిలి
మిడుగురుల్ గాగ నూర్మికలు బై కెగయ
తిమితిమింగిలకోటి తీక్ష్ణాగ్రనఖర
సముదయంబునఁ జిక్కి చక్కులై తునియ
భోగిసంఘాతంబు భోగముల్ ముడిచి
వేగ చుట్టలుజుట్టి వెడవెడ వడక
జవతజంఝామరుజ్ఝాటార్భటంబు
చెవిఁ జొర వరుణుండు చింతించి కలఁగ
చొచ్చి నిజాంగతేజోరాజిఁ దమము
విచ్చి యచ్చో నెల్ల వెలుగొంది మెఱయ
చని కీవి యా వసుజనపాలుఁ జెనకు
దనుజుల తుండాగ్రధారఁ జెండాడి
పరమవైష్ణవుఁ జేరి పార్థివుఁ జేరి
యరుదార మును సేమ మడిగి యిట్లనియె
విను వసుభూపాల వెన్నుండు నిన్ను
గొని తెచ్చి మున్నట్ల కుంభిని నిలుప
నన్ను బుత్తెంచె నింతట వేగ నాదు
వె న్నెక్కు మిప్పుడే వెస నీదు పురికిఁ
గొనిపోదు ననవుడు క్షోణీశ్వరుండు
వినతుఁ డై కేల్మోడ్చి వినతాతనూజు.

వినుతించి యో దేవ వేగ నన్ బ్రోవ
నెనరునఁ గరుణించి నీ విట్టి వేళ
నిటు వచ్చితివి నా దభీష్టదైవంబ
వటుగాక నీ వెన్న నంటి యా వెన్నఁ
డెక్కుట తగుగాక నే నెక్కఁదగునె
యెక్కువ యీ మాట కిదె మ్రొక్కువాడ
నపచార మిది యట్టి యైశ్వర్య మొల్ల
కృప నియ్యెడనె యున్కి కేవలహితము
అని భక్తిమీఱ సష్టాంగమై [1] యెఱఁగి
వినయంబునను నిల్చు విధము నీక్షించి
ఖగరాజు వసురాజుఁ గౌఁగిట నలమి
తగునట్లు బలికితో ధరణీతలేంద్ర!
ఇంత భక్తుఁడ వౌట యిందిరారమణుఁ
డెంతయుఁ గరుణించె నిది నీకె తగియె
నయిన నాభుజముల నలరి నీ పురికిఁ
బ్రియమునఁ గొంపోదు ప్రియము దీపింప
నని యానృపాలుని నక్కునఁ జేర్చి
కొని తెచ్చి జగతికిఁ గుతుకం బెలర్ప
రాజ్యాభిషేకంబు రమణ గావించి
పూజ్యత మ్రోయ నప్పుడె మళ్ల నరిగె
ఈ కథ వినువారి కెందు నాపదలు
బైకొన వెంతటి ప్రారబ్ధ మున్న
నుద్ధరించును వసు నుద్ధరించుక్రియ
సిద్ధసంకల్పుఁడా శ్రీనివాసుండె

1. "మైయరిగి" వ్రా. ప్ర. పాఠము.

నంతట నా నృపాలాగ్రణి యలరి
సంతతంబు ముకుందచరణసంస్మరణ
రాజయోగముఁ జెంది రమ్యశీలుఁ డయి
భూజనంబులఁ బ్రోచి పొగడొందుచుండె
హైహయేంద్రునకు నభీష్టం బొసంగ
శ్రీ హరి వేంకటక్షితిధరంబునను
ప్రత్యక్షమగుటఁ దా భావించి మదిని
సత్యసంకల్పుఁ డా జలజలోచనుని
బొడగాంతు ననుచు నుబ్బుచు స్వామిసరసి
కడ కేగి యందఱు గలసి క్రొన్నాళ్లు
పూనినసద్భక్తి పూజాదివిధుల
శ్రీనివాసులను భజింపుచుండంగ
హరి భక్తవత్సలుం డబ్జనాభుండు
పరమాత్ముఁ డిందిరాప్రభుఁ డచ్యుతుండు
వేదాంతవేద్యుండు విశ్వవిశ్వాద్యుఁ
డాదిమధ్యాంతదూరానందమయుఁడు
దేవాదిదేవుండు దీనరక్షకుఁడు
శ్రీ వేంకటేశుండు చెలిమి నవ్వేళ
నందఱఁ గరుణించి యవ్యాజలీల
నందఱికిని నన్ని యాకృతుల్ దోఁప

**స్వామిపుష్కరిణీతీరమున శ్రీ వేంకటేశ్వరులు వసురాజాదులకుఁ బ్రత్యక్షమగుట.**

శాశ్వతస్వామిపుష్కరిణీతీరమున
విశ్వరూపముదాల్చి వినతాతనూజుఁ
డగు గరుత్మంతుపై నధిరూఢుఁడగుచు
నగణితమణిభూషణావళి మెఱయ

నాశ్చర్యమొదవఁ బ్రత్యక్షమై నిలిచె
నిశ్చలాకృతిఁ జూచి నివ్వెఱ గంది
యందఱు నిలుచుండి రానందమొంది
ఇందిరావిభుమూయ లింతనఁ దరమె
వేవేలముఖములు వేవేలకండ్లు
వేవేలువీనులు వేవేల్భుజములు
వేవేలుపాదముల్ వేవేలుతొడలు
వేవేలుచక్రముల్ వేవేలుశంఖు 1380.
లలరంగఁ గోటిసూర్యప్రకాశముగ
వెలయుంగఁ జెలఁగు న వ్విష్ణురూపంబు
గనుఁగొని యందఱుఁ గడుఁ దెలివొంది
వినుతించి సాష్టాంగవినతు లొనర్చి
శిరముల నంజలుల్ చేర్చి న ర్తించి
పురుషోత్తమ ముకుంద పుండరీకాక్ష !
కనకాంబర ! మురారి ! కౌస్తుభాభరణ !
యనుచును వేర్వేర నలరి కీర్తించి
వసురాజు శంఖభూవరుఁ డగస్త్యుండు
వసువులు గరుడు డఁ వ్వనజసంభవుఁడు 1390.
నల శక్రుఁడును మోక్ష మర్థింపుచుండ

ఇంద్రాది దేవతలు దేవజిదాది దైత్యుల సంహరింపుమని వేఁడుట.

బలవైరి ముఖ్య దేవతలు కేల్మోడ్చి
దేవజిదాదిదైతేయులఁ దునిమి
కావవే మమ్మంచు కాంక్షించి వేఁడ
మరికొందఱైశ్వర్యమహితపుత్రాది

వరములు ప్రార్థింప వారి నందఱని
కరుణఁ గటాక్షించి గడు నాదరించి
వరదుఁ డా నా శ్రీనివాసుఁ డి ట్లనియె
చింతామణీమూ ర్తి శ్రీవేంకటాద్రి
నెంతయు సురధేనువెసకము న్మించు
జగదేకపావని స్వామిపుష్కరిణి
యగణితవై భవం బలరంగ నుండు
నానందనిలయవిఖ్యాతిసంతాన
మానితం బగు నా విమాన మిం దుండు
కనుఁగొను మాత్ర మీ కాంక్షితవరము
లనుపమధర్మకామార్థమోక్షముల
నిచ్చు నంచును నానతిచ్చి య చ్చెంత
వచ్చి నిల్చున్న విష్వక్సేనుఁ గాంచి
దేవజిదాదిద్వై తేయులఁ ద్రుంచు
వేవేగ ననుచు వావిరి సెల విచ్చి
కనుచు నందఱు నుండఁగా నచ్యుతుండు
తన మాయచేత నంతర్ధాన మొందె
అపు డందఱును విస్మయానందములను
చపలత మించ నాస్వామి భావించి
ధరణి జాగిలి మ్రొక్కి తత్ప్రభావములు
మరిమరి బొగడుచు మరలి చూడంగ
చెంత నత్యంత మచింత్య మై కాంతి
మంత మహా నొక్క విమానరత్నంబు
ప్రాదుర్భవించ నా భవనాంతరమున
వేదవేద్యుండు శ్రీ వేంకటేశ్వరుఁడు

నెలకొని యుండుటకై నిఖిలభక్తులును
వలగొని తిరిగి యా వరవిమానంబు
నరసి యా గోవిందు నానందమయుని
నెరసిన భక్తి వందింపుచు నదియు
రెండేండ్లటుండి ప్రార్థితముఁ జేకొనిగె
చండికావిభుఁడును జలజసంభవుఁడుఁ
గరుఁడు వాసవుఁడు శుక్రుఁడు సురాసురలు
సరగ నేగిరి తమ సదనంబులకును

విష్వక్సేనుఁడు దైత్యసంహారార్థము యుద్ధసన్నద్ధుఁడై వెడలుట

అంత విష్వక్సేనుఁ డమితసైన్యంబు
తెంతయుఁ గొలువంగ నిల దిక్కు లద్రువ
యుద్ధసన్నద్ధుఁడై యురుశంఖభేరు
లుద్ధతి మెఱయ బిట్టురుములకరణి
భటసింహనాద మూర్భటిఁ బిక్కటిల్ల
చటులతీక్ష్ణాయుధచ్ఛటలు వెలుంగఁ
గనకరథంబుపైఁ గడువడి నెక్కి
కినుక నాదైత్యులఁ గీటణంగింప
వెడలె నప్పుడు పుష్పవృష్టి చెలంగె
తోడివడ దేవదుందుభులును మ్రోసె
నచ్చరల్ నర్తించి రమరగంధర్వు
లెచ్చుగాఁ గీర్తించి రెల్లలోకములు
నపరిమితానంద మంది చెన్నొంద
రిపుగణంబులు తత్తరింపుచు డాగె
అల దేవజిత్తుండు నగ్నిజిత్తుఁడును
తొలఁగక మృత్యుజిత్తుఁడు నట్టిరవళి

విని సైన్యనాథుండు వెడలుట దెలిసి
ఘనదుర్గ మైన వింధ్యాచలావనిని
దానవసంఘ మత్తరిఁ బురికొల్పి
కాన గహ్యానకు కాల్పుద్రవ్యమును
శస్త్రాస్త్రములచేత సమయక వరము
నిస్త్రాసముగను జెందిన గర్వమునను
తనసేన నెదిరించి తాకి పోరుటయు
తనరు సువర్చలా తనయుండు కిన్కఁ
గాలాంతకు నరిఘ్నుఁ గదనభీషణుని
నాలంబు సల్పంగ ననిచిన వారు
పరిఘ తోమర కుంత పట్టస శార్ఙ్గ
పరశు ముద్గర గదా ప్రాస శూలాది
భూరివిధాయుధంబులు ధరియించి
దారుణోద్ధతి హత్తి దైత్యుల మొత్తి
రథములఁ జిదిమి ద్విరదములఁ దునిమి
రథికుల వ్రాల్చి తురంగాళిఁ గూల్చి
చెండినఁ గని దేవజిత్తుఁ డత్తఱిని

దేవజిత్తుతోడియుద్ధము.

భండనంబున చొరంబడ వానిదండ
లన మృత్యుజిత్తుండు నగ్నిజిత్తుఁడును
చలమున సాహసోత్సాహముల్ మించ
మోహరించి మహోగ్రములగు పాశుపత
మోహన తామస ముఖ మహాస్త్రములు
సంధించి మాయలు సవరించి సైన్య
మంధకారావృతం బగునట్లు చేసి

కడఁ జిక్కువఱచినఁ గాలాంతకుండు
కడఁగి యైంద్రైషీకక్రౌంచసౌర్యాది
వివిధాస్త్రములఁ జేర్చి వికటతమంబు
జవమునఁ బొలియించె శత్రుసేనలను
దునియించి మృత్యుజిత్తును దేవజిత్తు
నని నవనిం గూల్చ నగ్నిజిత్తుఁడది
కని కిన్క మాయలఁగప్పి బ్రహ్మాస్త్ర
మనుపమవరలబ్ధ మగు శరంబునను
బూనించుట యెఱింగి బొసఁగ సైన్యేశుఁ
డానికౌనారాయణాస్త్రంబు నేసె
నపుడు గల్పాంతాగ్నియటుల జ్వాలంబు
లపరిమితంబులై యడరిన భీతి
నమరేంద్రచంద్రాదు లందఱు వడఁకి
భ్రమ మొంది యురుకంగ బ్రహ్మాండ మద్రువ
నయ్యస్త్ర మగ్నిజిదాదిదైత్యులను
చయ్యన సమితి భస్మంబుగాఁ జేసి
వడిమీఱి మగుడి విష్వక్సేను పొదిని
యడఁకువఁ జొచ్చె నత్యాశ్చర్యముగను
అప్పు డింద్రాదు లా నమరులు మునులు
మెప్పునఁ దన గెల్పు మిగుల నుతింప

విష్వక్సేనుఁడు వచ్చి దైత్యసంహారమును స్వామికిఁ దెల్పుట.

సేనాధినాథుండు శీఘ్రంబె మగలి
శ్రీనివాసాద్రికిఁ జేరి దైత్యాది
చరణపద్మములకు సాష్టాంగ మెఱఁగి
కరములు మోడ్చి యా కార్యమంతయును

విస్మయంబొనరించ విని సంతసించె
వెన్నుఁ డంతట నొకవేళ వేటాడ
చెలగు వేడుకఁ బూని చెంచురూపొంది
యలఘువిక్రము వృషభాసురుఁ ద్రుంచి
ఆకాశవిభుపుత్రి యైన పద్మినిని
జేకొని పెండ్లాడి సిరులురంజిల్లఁ
గొలుచువారికి నెల్లఁ గోర్కె లిచ్చుచును
విలసితలీలల విహరింపుచుండెఁ
గావున నట్టి వెంకటగిరి మహిమ

వేంకటాద్రికి వివిధ నామములు గలుగుటకుఁ గారణము.

వాసిరిఁ గొనియాడవశమె ధాతకును
నారాయణవిహారసగ మాట నదియె
నారాయణాద్రి యన్నామంబుఁ గొనియె
వైకుంఠముననుండి వచ్చిన కతన
వైకుంఠగిరి యను వరసంజ్ఞఁ జెందె
శ్రీనివాసనివాససీమ దా నగుట
శ్రీనివాసాద్రిప్రసిద్ధి వహించె
మొదట నాదివరాహమూర్తిఁ జేకొనుట
నదియె వరాహాద్రి యనఁ బ్రకాశించె
నరసింహుఁడు హిరణ్యు నలిసేసి యందు
సిరిఁగూడి దనరుట సింహాద్రి యయ్యె
శ్రీశతపత్రాక్షి చెలిమి నుండుటను
శ్రీశైల మను పేరు చెంది చెన్నొందె
అరుల విష్వక్సేనుఁ డచట ఖండించి
హరిని నిజాఖ్య నియ్యచలంబు మెఱయ

వర మిమ్మనుచు వేడ వసుధలో నిట్టి
గిరియె విష్వక్సేనగిరి యనం దనరె
మును శౌరి యొకకల్పమునఁ బాలకడలి
ననువుగా శేషశయ్యను బవ్వళించి
శ్రీభూమినీళలు చెల్మి భజింపఁ
బ్రాభవోన్నతి నుండుపట్ల నారదుఁడు
వచ్చి సన్నుతిసేయ వరదుఁడై యతని
మచ్చిక నీక్షించి మన్నన చేసి
ధర నీవు చూడని తావు లే దెచట
నరుదార మాకు విహారయోగ్య మగు
నొకదేశ మెఱిగింపు మా మాని యనిన
నగి యాతఁ డో దేవ న న్నడిగెదవె
ద్రవిడాంధ్రదేశమధ్యమున వింధ్యాద్రి
కివల దక్షిణదిశ నెనుబదామటను
రమణీయమై వనరాజి రాజిల్లు
నమరిక విహరింప నది మీ కనుటయు
నలరి శేషునిఁ జూచి యా ముకుందుండు
చిలువలరాయ యీక్షితి విహరింప
వలె నందు నీవె పర్వతముగానుండు
మని యాన తిచ్చిన న య్యనంతుండు
పనుపుచొప్పున వచ్చి ప్రాఙ్ముఖంబుగను
కాళహస్తియె మస్తకంబుగాఁ దనదు
వాలభాగం బహోబలముగా నొక్క
కొండమై ధర నుండె కొన్నాళ్ల కదియె
పుండరీకాక్షుని పురి విహారాద్రి

యగుటను శేషాచలాఖ్య మై వెలసె
మగుడ పక్షివిభుండు మహిఁ దెచ్చెనదియ
గరుడుండు తొలుత నిక్కడికిఁ దెచ్చుటయు
గరుడాచలం బనఁగా నుతికెక్కె
వృషభాసురుఁడు వెన్ను వేడుట నదియె
వృషభాచలం బన విఖ్యాత మయ్యె
అంజన యటు తపం బాచరించుటను
అంజనాచల మన నయ్యె న య్యద్రి
నీలసైన్యాధిపు నిజవాస మగుట
నీలాద్రి యనుపేర నీటు వాటిల్లె
కనకమయంబుగాఁ గనుపట్టుకతన
కనకాచలంబనఁగాఁ బొగడొందె
తీర్థంబులన్ని యిందే యుండుకతన
తీర్థాచలంబన తేజిల్లెనిదియె
జ్ఞానస్వరూపమై జ్ఞానదం బగుట
జ్ఞానాచలం బను సంజ్ఞ చేకొనియె
పటుపాపరాశి వెంపదవాచ్య మగుట
కట దాహనే యనఁ గల్గు నర్థమున
తతపాపముల నెల్ల దహియించు కతన
క్షితి నిదే వేంకటగిరి యనం దనరె

మాధవ సోమయాజి కథ.

ఇందు నే నొక కథ యిపుడు దెల్పెదను
పొందుగా వినరయ్య బుధచంద్రులార !
శ్రీశైలమునకుఁ బశ్చిమమున నంధ్ర
దేశభాగంబునఁ దిరముగా నొక్క

పురము నందన మన భూరిసంపదల
వరలుచురథదంతివాజిసద్భటులు
నెగడ చాతుర్వర్ణ్య నిలయమై జగతి
బొగడొందుచుండు న ప్పురరత్నమునను
తనరు నెప్పుడు పురందరసోమయాజి
యను నొక్క బ్రాహ్మణుం డతిధర్మపరుఁడు
నిర్మలషట్కర్మనిరతుఁ డై నతని
కర్మిలి దనరంగ నాత్మజుం డొకఁడు
జనియించె మాధవసంజ్ఞకుం డగుచు
ననువుగా నుపనయనాదులం దనరి
క్రమమున యవ్వనారంభంబు మైన
సమకట్టి నంతట స్నాతకవ్రతము
సవరించి కులమును చక్కదనంబు
నవవిలాసములు వినయము శీలంబు
కలితలావణ్యంబు కలికితనంబు
గల చంద్రరేఖయన్ కన్నెఁ బెండ్లాడెఁ
గొన్నాళ్ల కా కన్యకయును నంగలతికె
వన్నెమీరంగ జవ్వన మిగురొత్త
మనసున నొకకొంత మరులుతోఁ దొరలి
మొనసిన లేసిగ్గు మొలక లిగిర్చె
ననబోణి కనుబొమల్ నటియించు కొలఁది
ననవిల్తుఁ డుబ్బున నటియింప సాగె
నలినాక్షిచూపు లొందఁగ చాపలంబు
నల వల్లభుమనంబు నందె చాపలము
నువిదకుఁ జన్గవ యుబ్బెక్కె నంత

పువ్వువింటికిని నారి పొడవుగ నెక్కెఁ
చెలి యారు రేఖగాఁ జెలగంగ నట్ల
కలువలకోరి రేఖ వహించె నపుడె
చానకు లేఁగౌను సన్నమై నంత
నానేత కాత్మధైర్యము సన్నగిల్లె
తరుణికి పిరు దున్నతస్థితి నొంద
మరుఁ డున్నతస్థితి మగల మాన్కొనియె
మదిరాక్షిగమనంబు మాంద్యంబుఁ బూన
మదనుచే విభుఁ డందె మందభావముల
నపు డట్టి జవ్వని హావభావముల
నపరిమితాసక్తి నతఁడు మేల్చెంది
సతతంబు న వ్వధూసంగసౌఖ్యముల
మతి నిల్ప తీరని మరు లగ్గలింప
నంగన కవఁగూడి యలరుతోఁటలను
చెంగల్వబావుల శృంగారవనుల
సరసవిహారముల్ సల్పుచుఁ గామ
పరవశుండై యుండె బహువాసరములు

వసంతవర్ణనము.

అంత వసంతోదయంబున వనము
లెంతయు నుత్సవం బెసఁగుటఁ జెలఁగి
తలిరాకుచెంగావి దనరంగఁ బూని
యలరుల యాభరణావలిఁ దాల్చి
వరలుపుప్పొడి గందవొడి సవరించి
విరులచే పన్నీరు వెదజల్లుచుండ
కృతిఁగూడి కోకిలల్ గీతంబుసేయ

లతకూనలు నటింప లయవిదాళి భరతు
లుల్లాసమునఁ దాళ ముగ్గళింపంగ
చల్లతెమ్మెరతావిఁ జల్లుచుఁ బొదలె
వలరాజు కై దువుల్ వాఁడి సేయుటను
చెలరేఁగి విరహుల చీకాకుపఱుప
నలి గుణధ్వని సేయు నార్భటు లెపుడు
నలరుతోఁటల వినవచ్చె నయ్యెడను
మాధవోత్సవలీల మరుగుటనట్టి
మాధవుం డవ్వేళ మగువ కై సేయ
కుసుమాపచయమునకును గాంతుఁ జెంది
విసువక నొకతోఁట విహరించు తఱిని

మాధవ మాతంగీ సమాగమము.

ఆ విరిదోఁటలో నలరు చెంగల్వ
బావుల తావులు పరిఢవిల్లంగఁ
జెలఁగు కాసారంబు చెంగట నొక్క-
అలివేణి మాతంగి యార్తవస్నాన
మొనరించి రుచిరనీలోత్పలలక్ష్మి
వనితయై కొలను వెల్వడి నిల్చుపగిది
నిలిచి తుమ్మెదగుంపు నెమ్మని తావి
కలరి వెంబడి వచ్చునటుల పెన్నెరుల
కీలుగంటు రహింప కెంపుదీపించు
దాళింబవిరిచాయ దగు చంద్రకావి
వలిపెంబు ధరియించి వలుదచన్దోయి
జిలుగుమేల్ రవికఁ గై సేసి గుత్తముగ
వెలిచి పుత్తళినగల్ వెలయంగఁ బెట్టి

నలికట్లు దండలు నలువొప్పఁ దాల్చి
సంకుముత్తియముల సరులు కంఠమున
పొంకంబుగాఁ బూన్చి పోల్ప నవ్వేళ
నల సంజకెంజాయ లావరింపంగ
పలచగా చీఁకటి పైపైఁ జెలంగ
మొలకచుక్కలగుంపు మొనసిన సంధ్య
పొలుపున న య్యించుఁబోఁణి రాణించె
అపు డాతఁ డయ్యంబుజాక్షి నీక్షించి
చపలచిత్తుండయి చాల మోహించి
అయ్యారె యొయ్యారి యకార యీరూపు
వెయ్యారు చెలులలో వెదకినఁ గలదె
చందురుసగబాలు సరిఁబోలు నుదురు
కెందమ్మిరేకులఁ గేరు కన్నులును
కొదమతేంటుల బారు కొమరారు కురులు
మెదలునద్దపునిగ్గు మెఱయు చెక్కిళ్లు
తులలేని పగడపుందునుక యామోవి
తెలిముత్యముల సరిదెగడు పల్వరుస
అలరుబంతుల పంత మడఁచు పాలిండ్లు
కలదులే దనుపాటిగాఁ దోఁచు కౌను
కదళియుగము మించు గదలించు తొడలు
మృదుహంసగతులను మెచ్చని నడలు
జిగినీలపుసలాకఁ జెనకు మైసొబగు
మగువల కీటీరు మరి జూడ మెందు
దీనిఁ గౌగిటఁజేర్చి తియ్యని మోవి
యాని రమించిన నదియె భాగ్యంబు

అని మది నూహించి యా విప్రవరుఁడు
వనితచెంతకుఁ జేరి వలరాజుబారి
తగిలి యెంతయుఁ దారి తమకంబు మీఱి
నగలాడి యెవతె వెవ్వరిదాన వీవు
నిను జూచి మరులు చెందితి నిందువదన
పనిఁబూని దీవింతు బ్రాహ్మణోత్తముఁడ
తరుణీలలామ నీ దయకుఁ బాత్రుఁడను
మరుకేళి నను గూడి మన్నింపఁగదవె
అనుటయు నా మతంగాంగన యులికి
వెనుకకు జని కొంత విను బాపనయ్య
వొద్దికి రా కండె యుండు దోసంబు
పెద్దకులము దాన పెక్కు లేమిటికి
మాలదానికి నీవు మరు లొందఁదగునె
సాలుమాలిన వెఱ్ఱిబాపనవాఁడ
యెంతపాపము గట్టె యెంచినా విప్రుడు
చెంతకు రాక విచ్చేయు మింకనిన
మోహంబున నతండు ముదితను జూచి
హా హా విధాత యీ యంగనామణిని
నిరుపమసౌందర్యనిధిగా సృజించి
మరియు నంత్యజఁజేసె మహీసురు లంట
రాదంచు ధర్మశాస్త్రంబులు గొన్ని
బోధించి చెఱిచెఁగా బుధుల వంచించి
యింత చక్కనిదాని నెనసి కూడినను
సంతతస్వర్గ మిచ్చుట నబ్బుగాదె
దీనిఁ గూడనియట్టి దేహ మేమిటికి

పూనిన బ్రాహ్మణ్యమున నేమి యనుచు
మదినిట్లు దలపోసి మాలని డాసి
ముదితరో స్త్రీరత్నమున కేటి కులము
పావనరూపవై భవమునఁ గులము
పావనంబగుఁ గాని పాపంబు గాదు
బురుదలో రత్నంబు పుట్టిన దానిఁ
బరికించి కొనరొకో పండితోత్తములు
గేదంగి ముండ్లతోఁ గీలితం బైన
నాదరంబున దాని యలరు చేకొనరె
నీఁగలు ముసరంగ నెంగి లౌ తేనె
నాఁగిన తమిఁ గ్రోలనగు గాదె తరుణి
గోమాంసమున గల్గు గోరోచనంబు
భూమిఁ బావనమంచు బుధులు గైకొనరె
కావున నీవంటి కామినీమణిని
పూవిలుతుని కేళిఁ బొందుట తగదె
యని చేరి కౌఁగిట నలమి కెమ్మోవి
తనివిదీరఁగ నాని దగిలి రమియించి
ధనములు మణులు వస్త్రములు సొమ్ములును
తన కల్మి యెల్ల న త్తరుణి కొసంగి
యెడబాయఁజాలక నెవ్వేళ దాని
పడకిల్లు వెడలక పశుమాంసమధువు
లుడుగక భుజియింపుచుండి కొన్నాళ్ల
కడిగిన దొసఁగంగ నర్థంబు లేమి
తెగ ముచ్చిలించియు తెరువాటుగొట్టి
మగువల బాలురఁ మదిమది జంపి

కడలేని బహుపాతకములు గావించి
గడియించు సొమ్ము లా కాంత కిచ్చుచును
చిరకాల మీగతిఁ జెలఁగంగ మేన
జరబుట్టి వాని కా శక్తి దొలంగె
అయ్యెడ న య్యింతి యాప్తబంధువులు
చయ్యన ధన మియ్యఁజాలనివాని
నం దుండనియ్యక యదలించి కొట్టి
నిందించి తోలిన నిర్ధనుండగుట
నతిదుఃఖసంతప్తుఁడై వెడలి వాఁడు
క్షితిఁ గాననంబులు చేరి యం దందుఁ
దిరుగుచు బడలికఁ దీనుఁడై భాగ్య
పరిణామమున శేషపర్వతోత్తమముఁ
గనుఁగొని యం దెక్కఁగా దాని మేన
ఘనతరాగ్నిజ్వాల గప్పి మండుచును
పాతకంబుల నెల్ల భస్మీకరింప
నాతండు పరిశుద్ధుఁడై యాక్షణంబె
బ్రహ్మవర్చసమునఁ బ్రబలుచుండంగ
బ్రహ్మర్షు లవ్వాని పాతకంబులను
ధరణీధరంబట్లు దహియించుటయును
పరమపవిత్రుఁడై బ్రాహ్మణుండపుడె
విలసిల్లుటయుఁ జూచి విస్మయంబొంది
యలఘుపాపైకదాహక మౌట నిట్టి
నగము వేంకటసంజ్ఞ నలువొందె ననుచుఁ
బొగడుచుండిరి మహాద్భుత ముద్భవిల్ల
నటుగాన ని య్యైతిహాసంబు వినినఁ

బటుబుద్ధిఁ జదివినఁ బరగవారలకు
సకలపాతకములు సమయును బుణ్య
నికరంబు చేకురు నిశ్చయంబంచు
నల మునీంద్రులకు బ్రహ్మాండపురాణ
కలన సూతుఁడు దెల్పె కమనీయఫణితి
అని విచిత్రార్థసమర్థనాకలిత
ఘనసర్గవిశ్రుతకవిముఖ్యుపేర
విపులానుభావభావితసంవిధాన
కపటనాటకజగత్కారణుపేర
భాసురాంగశ్రుతిభారతీభవ్య
లాసికాగీతవిలాసునిపేర
తారకాంతకపితృద్వంద్వా న్వధీత
తారకమంత్రాభిధానునిపేర
ప్రత్యాహృతోత్తరాపత్యచైతన్య
సత్యనిత్యబ్రహ్మచర్యునిపేర
క్షీరపారావారశీకరాసార
పూరితనిజముఖాంభోజునిపేర
పావనభక్తాప్తబంధునిపేర
గోవిందరాజముకుందునిపేర
శ్రేష్ఠలూర్యన్వయశ్రేష్ఠశీలుండు
ప్రేష్ఠమహోయశశ్రీధురీణుండు
గోత్రభారద్వాజగోత్రవర్ధనుఁడు
సూత్రతుఁ డాపస్తంబసూత్రానువర్తి
అష్టభాషాకవిత్వార్జితప్రోద్య
దష్టావధానవిఖ్యాతభైరవుఁడు

శ్రీ కృష్ణమార్యలక్ష్మీగర్భవార్ధి
రాకాసుధానిధి రాజప్రాజితుఁడు
వివిధవిద్యాశాలి వేంకటార్యుండు
సవరించు శ్రీనివాసవిలాసమను
హాఁడవోంద నిది చతుర్థాశ్వాసమగుచు
ధరఁ బొల్చు నాచంద్రతారకంబుగను. 1739.

చతుర్థాశ్వాసము, సమాప్తము.



# శ్రీనివాసవిలాససేవధి

## పంచమాశ్వాసము

శ్రీకరగుణహార శ్రితపారిజాత
శ్రీకరగ్రహదక్ష శ్రీకంఠమాన్య
చతురాగమస్తుత్య జగదాత్మకృత్య
చతురాననత్రాణ చతురావతరణ
చిత్రకూటవిహార జితయాతువీర
చిత్రకూటనివాస చిత్రవిలాస
గోత్రారిముఖసేవ్య కుశలానుభావ్య
గోత్రా[1] హితబిడౌజ గోవిందరాజ
అవధరింపుము దేవ యమ్మునీశ్వరులు
వివిధకథాకృతి విని విస్మయమున 10.
నా సూతునకు బ్రమోక్తి యలరుచు వినుతి
సేసి పౌరాణికశేఖర నీవు
సదయత వేంకటాచలవైభవంబు
కుదురుగాఁ దెలుపంగఁ గుతుకం బెసఁగె
శ్రీనివాసులు వనసీమ వేటాడఁ
బూని వృషాసురుఁ బొలియించు టెటుల
నల పద్మినీకాంత నంది పెండ్లాడఁ
గలుగు టెబ్భంగి యా కలియుగాగమము

---

1. "హితమఘవేరాజ" అని. వ్రా. ప్ర. పాఠము.

నం బెట్లు విహరించు నంతయు మాకుఁ
బొందుగాఁ దెలుపవే పుణ్యచరిత్ర !
అనుటయు నాసూతుఁ డమ్మునీశ్వరుల
కనుపమవృత్తాంత మటు వివరింపఁ
దలఁచి పురాణముల్ దడవి యవ్యాసు
నిలిపి భావంబున నెమ్మి నిట్లనియె
యమిచంద్రులార ! మీ రడిగినయట్టి
విమలవృత్తాంతంబు వేడ్కగా వినుఁడు
వెన్నుఁడు మున్ను శ్రీ వేంకటాచలము
తిన్నగా భూమికిఁ దెప్పించి యందు
బహువైభవంబులు పరిఢవిల్లంగ
విహరింపుచును నిత్యవివిధోత్సవములు
సురవరుల్ సవరింప సురుచిరకరుణా
ధర భక్తవరదుఁడై తనరు నత్తఱిని
యల నీలకంఠాశ్రమాంతికంబునను

వృషభాసురుని కథ

బలపరాక్రములఁ బ్రతిలేనివాఁడు
వృషభాసురుం డను వీరుఁ డొక్కరుఁడు
వృషభధ్వజు భజించి వివిధాస్త్రములను
సకలమాయలఁ జెంది చావకయుండ
బ్రకటవరంబునన్ బడసి కయ్యముల
నింద్ర చంద్రాదుల నెందు నెంచకనె
సాంద్రగర్వంబున సంచరింపుచును
నరుల బాధింపుచు నగరరాష్ట్రములఁ
జెరుపుచు జనపాండ్రఁ జెఱలుబట్టుచును

సురలకిన్నరుల యక్షుల రాక్షసులను
తరిమికొట్టుచు మదోద్ధతి విహారి నుండె
అతఁ డొకనాఁడు శేషాద్రిశృంగంబు
లతులితమణికాంచనాంచితశ్రీల
కనుపట్టిఁ గా జూచి కరము చింతించి
వనభూమి నెందుండి వచ్చె నీకొండ
ఒకనాఁడు నిం దిది యుండుట లేదు
ప్రకటింప నెవ్వఁడో ప్రబలమాయావి
తనశక్తిఁ గల్పించి తగిలి యుండుఁడుఁ
గనుఁగొని యతని నే ఖండింతుఁగాక
యనుచుఁ గ్రొవ్వునఁజేరి యందెల్లవెదకి
కొనుచుఁ జరింపఁగ గోవిందుఁ డపుడు

గోవిందుఁడు శేషశైలమున వేఁటాడఁ బోవుట.

వనమున వేటాడ వలసి సైన్యోఘుఁ
దన సైనికుల తోడఁ దరలనేమించి
సురలుగంధర్వులు ఘోరకింకరులు
సరసకిరాతవేషముల మెలంగఁ
దురగంబుపై నెక్కి దుమికించుకొనుచు
దొరతనంబు చెలంగ దుందుభిప్రముఖ
భీకరవాద్యగంభీరనాదంబు
ఢాకమీఱంగ శార్ఙ్గటంకృతుల్ మెఱయ
వెడలంగ గుమిగూడి వేటకాం డ్రపుడె
కదుపడి సరుదెంచి కణిశిచర్మనుల
బలుటోప్పులును చేతఁబట్టినవిండ్లు

సెలగోల లిరువంకఁజిక్కంబు లురులు
వలలు పగ్గంబులు వాకట్టుమందు
లలరంగఁ దను వెంటనంటి జాగిలము
లరుదేరఁగా భీకరాకారములను
గరివించు జముని కింకరులో యనంగ
నలువొప్ప కాటుకనడగొండ లనఁగ
బలిసిన చీకట్లబారులో యనఁగ
ధర నాడు కఱుమొగిల్ తండమో యనఁగ
పుఁగొన్న భేతాళముల గుంపులనఁగ
కడక మించగ నిల్చి కరములు మోడ్చి
వాడిసూడుమనాసామి మాబంటుతనము
లీసోట సింగంబు నీడి శికాడి
కోసరారక పట్టి కొట్టి చెండెదము
బెబ్బులి మీసంబు పెకలిస్సి కాడి
కబ్బిగా పైయెక్కి కాఢి యూంచెదము
గొప్ప యేనుంగుల కొమ్ములుడిస్సి
తిప్పి తొండము బట్టి తీసి తెస్సెదము
మెకముల నొక కోల మిడిశిపో నేసి
మొకమైన కోరలు మొక్కఁపుస్సెదము
మాసాసములు సూడు మాసామి యనుచు
యూసబాసల బీరమొచ్చఁ బల్కుచును
కరి వరాహ లులాయ ఖడ్గ సింహముల
శరభ భల్లుక వృక శార్దూలములను
తొలఁగి పోనియ్యక దోర్విక్రమమునఁ
బొలియించి కొన్నిటిఁ బొడలి పగ్గముల

బిగియించి కొన్నిటి బెట్టుగాఁ జేత
తగఁబట్టి కొన్నిటి తరిమి కొన్నిటిని
కడు నిట్లు వేటాడఁగాఁ జూచుకొనుచు

శ్రీనివాసుని వృషాసురుం దర్శించుట.

వడి నుత్తరపుదిశ వనజాక్షుఁ డరిగె
అపు డా వృషాసురుం డల శ్రీనివాసుఁ
గుపితుఁడై కెలనఁ గన్గొని యడ్డ మరిగి
యీ గిరి సృజియించు నిట్టి మాయావి
వేగ నీతని సైన్యవితతి ఖండించి
యితనిఁ బట్టెద నంచు నెంచి బెట్టార్చి
యతిరయంబునఁ జేరి యనికి మార్కొనిన
శబరులందరు వానిఁ జయ్యనఁ గ్రమ్మి
ప్రబలముద్గరముల పట్టిసంబులను
పరిఘకుంతంబుల ప్రాసభల్లముల
పరశుతోమరముల బహుళాస్త్రములను
కొట్టి చుట్టుకముట్టి గుదుపల శిలల
బెట్టుగాఁ బ్రహరింప బెదరక వాఁడు
తనదు శూలంబుచేతనె వారి నొంచెఁ
గినుక మీఁగఁగఁ దోలి కినిసి ముకుందు
వడి మార్కొనిన శ్రీనివాసుఁ డా యసుర

ముకుందుడు వృషాసురునిపై విష్వక్సేనుం బంపుట.

నడచ విష్వక్సేను నయ్యెడఁ బనిచెఁ
బనివిని య వ్వేన్నుపవవాలు కడగి
మొనసిన కోపాగ్ని ముంచుకై పడిని

అసురసైని జ్వలించు నస్త్రమ్ముఁ గురియ
మసలక నవ్వాఁడు మాగ్నిలయుటయు
నపుడె యిమ్ముల గ్రమ్మి యమరగంధర్వు
లపరిమితాయుధాహతి నొంప వాఁడు
కంపించి తనమాయ ఘనసైన్యగణము
పెంపొంద సృజియించి భీకరోద్ధతుల
చెలఁగి వెన్నునిసేనఁ జీకాకుసేయ
నలిగి విష్వక్సేను నైంద్రగాంధర్వ
సౌరాగ్నిమారుతాస్త్రంబుల నసుర
వీరసైన్యంబుల వేగఁ ద్రుంచుటయు
వృషభాసురుఁడు సైన్యవిభువిక్రమమున
విషముదీసిన త్రాచు విధమున నూర్చి
నిజసేనయంతయు నీల్గుట యరసి
భుజబలశక్తిచే భువి సైన్యవిభుఁడు
దుర్జయుం డని యెంచి తొలఁగక మఱియు
నిర్జరాహితమాయ నిర్మించి కడక
దనుజసైన్యంబు లుద్ధతకరిఘటలు
ఘనరథంబులు తురంగప్రకాండములు
లెక్కకెక్కుడుగాఁగ లెస్స పైకొల్పి
గ్రక్కున సైన్యేశు గణములఁ దరిమి
యంతఁ బోక మురారి నడరిన వాని
నంతకాలయమున కనుపఁగా నెంచి

శ్రీనివాసుఁడు వృషాసురునిపైఁ జక్రప్రయోగము సేయుట.

శ్రీనివాసుఁడు తన చేతి చక్రంబు
నూనినకిన్కఁ బ్రయోగించుటయును

ఆ చక్ర మపుడె కాలాగ్నిచందమున
నాచక్రవాళ మూటాడి చలింపఁ
దరలి యత్యుగ్రమై దైత్యసేనలను
కరకరి దహియింపఁగాఁ జూచి యపుడె
యతఁడును జ్ఞానోదయం బొంట నరసి
ప్రతిలేని విష్ణుచక్రం బిది దనుజ
కులము ద్రుంపక పోదు గోవిందు నిపుడె
చెలిమి భజించి నే సేయు నేరంబు
క్షమియింపఁ బ్రార్థించి సమసి మోక్షంబు
విమలతనొందనౌ నెత యేలయనుచు
తలఁచి వేంకటనాథు ధ్యానించి దేవ!
జలజాక్ష వేంకటాచలనాథ! శరణు
నా తప్పు గాచి నన్ మన్నించి నీవు
హేలిమోక్షంబున నియ్యవే ముక్తి

వృషాసురునకు జ్ఞానోదయంబై యానగమాతనిపేరఁ బరగ వరముగొనుట.

నాపేరిటనె యిట్టి నగము విఖ్యాత
మై పెంపుమీఱంగ నను వరం బొసఁగు
మనుచుఁ బ్రార్థించగా నంబుజాక్షుండు
కనికరంబున నట్ల కరుణించుటయును
వానిఁ జక్రము ద్రుంచి వడి ముక్తుఁ జేసె
నా నగంబు వృషాద్రి యను నాఖ్యఁ జెందె
పటులీల వెంకటపతి శ్రీనివాసుఁ
డటుల రక్కసులఁ వెంటాడి యాలమున
హతులైన భటుల కటాక్షామృతముల
బ్రతికించి గ్రమ్మరం బరతెంచి వేగ

నానందనిలయంబునందు శ్రీభూము
లానందమునఁ గొల్వ నలరుచుఁగొన్ని
యుగముల బహువిలాసోల్లాసమునను
జగదేకరక్షణాక్షమ కేళి నుండె

నారాయణపురంబున విష్ణుభక్తుఁడగు నాకాశరాజు కథ.

ఆయెడ చంద్రవంశాభరణుండు
శ్రీయశోయుక్తుండు శిష్టసమ్మతుఁడు
ధర్మైకనిరతుం డుదారుండు మిత్ర
వర్మయన్ రాజు దుర్వారతేజుండు
నారాయణపురంబునన్ రాజ్యభరము
భూరిభుజాశక్తిఁ బూని భూజనుల
నరయుచు నుండంగ నతనికి భాగ్య
పరిపాకమున విష్ణుభక్తుఁడై తనయుఁ
డాకాశరాజన నవతీర్ణుఁడగుచు
నాకాశసేతుమధ్యావనియెల్లఁ
దనరఁ బాలింపుచు ధరణి యన్ కన్యఁ
బెనుపునఁ బెండ్లాడి ప్రేమచెలంగ
విహరింపుచును క్రతువితతి సల్పుచును
బహువత్సరంబులు ప్రఖ్యాతుఁ డగుచు
నుండి పుత్రార్థమై యొకయిష్టి సలుప
దండనదీతీరధరణి శోధించు
నెడ హలాగ్రంబున నెంతయుఁ గాంతి

ఆకాశరాజునకుఁ గన్యకారత్నము దొరకుట.

గడలుకొనఁగ నొక్క కన్యకారత్న
మత్యంతశిశువుగా నందుఁ గన్పడిన

సత్యాద్భుతంబుగ నా శాలఁ జూచి
యెత్తి యాకాశభూమీశుఁ డెంతయును
చిత్తం బలరి యక్కుఁ జేర్చి సంభ్రమము
నిగుడఁ జింతింపుచు నిలుచున్న వాని
వగదీర నశరీరవాణి యి ట్లనియె
వినుము మహారాజ వెన్నండు నీకు
తనయఁగా నీబాల దయసేసెఁగాన

ముకుందుఁడే నీ కల్లుఁడగునని యాకాశవాణిచెప్పుట.

నీ కన్య సంతసంబెసఁగఁ బోషింపు
లోకోన్నతులు పుత్రులుంగలిగెదరు
హరి ముకుందుండు నీ యల్లుఁడై యెల్ల
సిరులు భాగ్యంబులుం జెలిమి నీ కొసఁగు
ననుటయు నతివిస్మయంబున నతఁడు
తనదు పట్టపురాణి ధరణి రావించి
దేవభాషితమును దెలిపి యీ బాల
నీవు కూతురుగాఁగ నెమ్మిఁ బోషించు
మని చేతి కొసఁగిన నా దేవి శిశువుఁ
గనికరంబున నంది కని కరంబునను
చెలఁగి ముద్దాడుచుఁ జెక్కువంబు నిగ్గు
గులుకును వర్ణించుకొనుచు సంతోష
మలర నంతిపురంబు నందు కుందనపు
గొలుసులు బూన్చు రంగుల రతనంపు
మెరుగు తొట్లను పాన్పుమీదట నునిచి
వారపుజోలలఁ బాడి యూఁచి లాలింప

నా నాఁడె భాగ్యోదయమున నాకాశ
భూనాథరమణి యద్భుతముగా గర్భ
మెలమిని ధరియించి యింపు దీపింపఁ
గలికిమైఁ గొన్ని లక్షణములు దాల్చె

ధరణీదేవి గర్భచిహ్నములు.

తళుకుమోముఁన వెల్లఁదనము చెలఁగి
తెలిగన్నుగవవడ దేలుచు సొలసి
పలుమ రంబువు గ్రోలు పనిఁబూనె రసన
యిల మట్టిచవియఁయ్యె నెద కెన్నియున్న
ఘనకుచంబుల మొనఁ గప్పు నుబ్బెసఁగె
నునుసోగ యేర్పడె నూగారునకును
బలుఁవిడి మై కౌను పాటి గన్పట్టె
నలసత నడల నింపలరె నెంతయును
చపలత మాదిఁబుట్టె నవరించెఁ గోర్కె
లెపుడు మేనఁ జెమర్పు నెచ్చె నూరుపులు
పసరురేక లురోజపాళికె మెఱసె
పసిడిమెఱుంగు మైఁ బాటిల్లె మిగుల.
నీరహి తనరారు నింతినిఁ జూచి
భూరమణునకు నుప్పొంగె నమ్మదము
అంతఁ గుమారోదయం బౌట నవని
కాంతుండు బహుకోటికాంచనమణులు
గోగణంబులు పదికోట్లును కోటి
నాగముల్ హయములు నాలుగుకోట్లు
బుధులను దానంబు భూమియు క్తముగ
విధిపూర్వకంబుగా వేఁగాఁ గావించె.

చామరచ్ఛత్రరాజన్యచిత్రములై
తా మిగులఁగ సర్వాసనముల నొసఁగి
తన వసువులు విప్రతతి కియ్యఁగల్గు
తనయునికిని వసుదానుఁ డన్ పేరు
ఘనతమీరఁగ నామకరణంబు చేసెఁ
దనరుచు నవ్వసుదానుండు విదియ
శశిలీల నభివృద్ధిఁ జయ్యనఁ గాంచె
విశదవివేకుఁ డై విద్యలు నేర్చి
సామును సాధించి శస్త్రాస్త్రపటిమ
భూమి విఖ్యాతుఁ డై పొగడొందుచుండె

పద్మిని సౌందర్య వర్ణనము.

జనపాలుఁ డలకన్య జలజపర్యంక
మునఁ గాంచుకతమున మును పద్మిని యని
చెలిమి సంజ్ఞ యొనర్పఁ జెలఁగు నాకన్య
కలితనూతనచంద్రకళచందమునను
క్రమమునఁ బెరుగుచుఁ గమలావఘూటి
రమణీయరూపంబు రంజిల్లఁ దాల్చి
సౌందర్యసారపున్ సరసియో యనఁగ
కుందనపుందళుకుల గనో యనఁగ
నిరతాద్భుతవిలాసనిధియో యనంగ
సిరులొందు లావణ్యసింధువో యనఁగఁ
దనరుచు ప్రాయంబు దన మేన మొనయఁ
గనకాంగి వెడదకన్గవ బెళ్కు లందె
కచసోగ నెరులు వక్రత నేర్చుకొనియె
తడలేని నడలును దాల్చె మాంద్యంబు

తియ్యబెల్లితనంబు దేలె మాటలను
నొయ్యారపుబెడంగు లొందెను కులుకు
మొలకచన్నవకొంత మొనచూపసాగె
నలువొందుపిరుదు లౌన్నత్యంబుఁ బూనె
వెలఁదియంగంబులు వింత లయ్యె నని
తలచి లేఁగౌను నెంతయుఁ గృశించఁగ
నది చూచి శైశవం బటు జారఁగడఁగె
పొదలె జవ్వనము సొంపున నెచ్చె నపుడు
చెలులతో నాబాల శృంగారవనుల
నెలమి నాడుచు చాల నిం పొందుచుండె

**శ్రీనివాసుఁడు చెంచురూపమున వేటకుఁ బోవుట.**

ఆయవసరమునం దా శ్రీనివాసుఁ
డొయ్యన వేటకు నుద్యుక్తుఁడగుచు
చెంచురూపు వహించి సెలవిల్ ధరించి
మించుపన్నియ చాల మించిన శాల
చెఱఁగు జారఁగఁ జుట్టి సిగపైన గట్టి
బుఱుసారుమాల్ గట్టి పాలుపొందు నట్టి
మృగనాభితిలకంబు మెప్పుగాఁ బెట్టి
పగమీఱు నొక కేల వడి నేజబట్టి
చొక్కమౌ నొకజక్కి సొగసుగా నెక్కి
యక్కజంపుదువాళి యలరు వాహ్యాళి
పిక్కటిల్లఁగ ధాటిఁ బెగడక మేటి
కక్కసిభటు లంటఁ గదిసిరా వెంట
మితపరిజనముగా మెఱయంగ వెడలి
యతిరయంబున నేగె యాగ్నేయదిశను

కనకముఖరి చెంత కానల నంత
మొనసి వేటాడుచు మోద ముప్పొంగ
మదగజంబుల ద్రుంచి మగ్గించి పులులఁ
జడిచి సింగంబుల శరభాళి నడచి
కుదియించి పందులఁ గొట్టిఖడ్గముల
పొదలునీహామృగంబును వెంబడించి
చనిచని యాకాళజనపాలునగర
ఘనతరోద్యానంబుఁ గదియ నేగుటయు
ఘోటవేగంబునఁ గూడి రాలేక
నాటవికభటాళి యందందు చెదరి
కానక విభుని యా కానల వెతక
నేనుఁగు లవ్వారి కెంతయు బెదరి
యులికి రాఁ జూచి య య్యువిదలు వెఱచి
తరులచాటునకుఁ జేరి తల్లడిల్లుచును
హాహారవము మీఱ నార్చుచుండంగ
నా హరి తురగంబు నందు వెంబడిగ
నరుదెంచినం జూచి య య్యళుకఁ దీరి
హర్ష విస్మయముల నలరుచుండంగ
వారణేంద్రము శ్రీనివాసు నీక్షించి
మీఱి పోఁజాలక మించిన భక్తి
నెరుగుచం దంబున నెత్తరంబైన
శిరము వంచి కరంబు చెలఁగఁ బై కెత్తి

స్వర్ణముఖరిచెంత కానమున పద్మిని వేంకటాధీశుఁజూచుట.

వినయంబులోడుత వేవేగ మరలి
తన గుంపుతో వనాంతరమున కరుగ

నది చూచి కడుచోద్యమందె డెందమున
మదిరాక్షి యాకాశమహిపాలతనయ
యా వేంకటాద్రీశు హావభావములు
ఠీవియు మహిమ మేటితనంబు నరసి
యెవ్వఁ డి వ్వనమున నివ్వేళ వచ్చె
పువ్వువిల్కానిసొంపున నున్నవాఁడు
చంద్రబింబమువంటి జక్కిపై నెక్కి
ఇంద్రనీలపురంగు నీను మేనారపు
కెందమ్మి యొడికంబు గేరు పాదములు
కుందనపుటాశాల గొమరొప్పు తొడలు
శింగంపుగౌను మంచి వెడందరొమ్ము
రంగొందు చేతులు రాజసలీల
మించు చూపుల కెంపు మెఱయు కెమ్మోవి
యించువిల్తుని పిండ్ల నెంచనిబొమలు
పాలకాయొంటులం బరగు వీనులును
నీలోత్పలచ్ఛాయ నిరసించు మీస
మెలమిని కస్తూరి నిడు తిలకంబు
పొలుపొందు కొంత మూపున జారు సికయు
బురుసారుమాలు మెప్పుగ గట్టు సొగసు
మురువుమీరినయట్టి మోహనాకారు
ననవిల్తుకేళిఁ జెందని నే న దేల
యని యెంచి పులక మెయ్యడరంగ నిలిచె
శ్రీ వేంకటేశుఁ డా చెలువను జూచి
భావించి తన మది బాళి రెట్టింప
ఔరౌర యీచాన యందచందములు

హారవిలాసంబు లంగకాంతియును
కలకల నగు మోము కళలూరు నుదురు
సొలపు గుల్కెడి చూపు సొగ క్రీల్జూపయుఁ
దళుకు చెక్కిళ్లు గుత్తపుఁ జన్నుదోయి
పలుచని లేఁగౌను బటువైన పిరుదు
నొయ్యారపున్నడ యొఱపరి తనము
నెయ్యెడ జవరాండ్ర కిటులఁ జూచితిమె

పద్మిని చెలికత్తెలతోడ శ్రీనివాసుఁడు సంభాషించుట

అని మెచ్చుకొనుచు నొయ్యన చెంతఁజేరి
వనజాక్షులార! యివ్వనమున నొక్క
మృగ మేఁగఁ గంటిరే! మీరు నిక్కముగ
తగఁ దెల్పుఁ డనవుడా తరుణులు బెగడి
మది భయంబు విరాళి మదము విస్మయము
గదురంగ నతనికిఁ గడక నిట్లనిరి
ఏ మృగంబును గాన మేము నీవిటుల
కామిను లొంటి నిక్కడ నాడు వేళ
నళుకు శంకయు లేక యడుగుట సోద్య
మిల చూపరులు మెత్తురే యో! కిరాత!
ఆకాశభూపాలు నాత్మజ యిచట
నేకతంబున నాడు చెఱుఁగవే నీవు
నిలువక చను మింక నిలిచినఁ జాల
కలుగును శాస్తి కింకరులు గఱగొనిన
ననుటయు శ్రీ వేంకటాచలవిభుఁడు
వనబోణుల విడంబనములకు నగుచు

అలివేణులార ! యహా ! నందుల కేమి
యలర నే నొకటి మి మ్మడుగ నెంచితిని
కలయట్లఁ దెలుపు డీ కన్నియ యెవతె
కుల మెద్ది యెవ్వాని కూతు రేమిటికి
నీవనంబున మీర లేగితి రిటుల
నా విధంబులు విన హర్ష మయ్యెడిని
అనుచు తురంగంబు నయ్యెడ డిగ్గి
కనికరంబు చెలంగఁ గదిసి పల్కుటయు
వనజాక్షు లా శ్రీనివాసు మృదూక్తి
వినవిన వీనుల విందుగా నునికి

చెలికత్తెలు పద్మినిజన్మ వృత్తాంతమునాతని కెఱింగించుట.

నలరి కొంత ప్రమోద మాత్మ జనింపఁ
జెలిమిని దిలకించి చేరికె నిల్చి
విను నరోత్తమ యిట్టి విరిబోణి జనన
మనుపమకీర్తి యీ యాకాశవిభుఁడు
యాగార్థముగ భూమి హలముఖంబునను
బాగుగా శోధించుపట్ల న య్యవని
దళనంబునఁ బద్మదళశయ్యమీద
నెలమి మైకని బాల యెసఁగినఁ గాంచి
తనదు పుత్రికగాఁగఁ దనరంగఁ బెనిచె
ననఘుత పద్మినియను పేరు నిడియె
తరుణవసంతంబు తగుట నిం దిపుడు
విరులఁగోయఁగ మమ్ము వెంటఁ దోడ్కొనుచు
నరుదెంచె వృత్తాంత మంతయు దాచ
కెరుగఁ దెల్పితిమి నీ యిర వెద్ది నీదు

పే రేమి యేటికిఁ బ్రియమున నిటుల
నారయ నడిగితి వది దెల్పవలయు
నావు డర్మిలి చిఱునగ వెగురొత్త

వాసుదేవుఁడు వారలకుఁ దన్నెఱింగించుకొనుట.

దేవోత్తముఁడు వాసుదేవుఁ డచ్చెలులఁ
దిలకించి వినుఁడు నా తెరమైనయిరవు
చిలువలరాగొండ చీకట్లుబాపు
వేవెలుంగుకులంబు వెలయించువాఁడ
నా వారు పండితుల్ ననుఁ గృష్ణుఁడంద్రు
వనముల వేటాడ వచ్చితి నిందు
కనకాంగులార ! యీ కన్యాలలామ
సొగసు చక్కఁదనంబుఁ జూచి మేలొంది
తగ నెమ్మి నడిగి తింతగ నేర మేమి
యని వెండియును నమ్మృగాక్షి నీక్షించి
ననబోణి నీకు నెంతయు మేలువాఁడ
తమి నిల్వఁజాల గాంధర్వక్రమమునఁ
గమలాస్త్రకేళి నకా గలిసి యెల్లెపుడు
నెడబాయ కెదఁజేరి యెలమి నానంద
ముడుగని రతిఁ జొందుచుండఁగా రాదె
వలరాజుతూపుల వాఁడియల్గులకు
సొలయకుండఁగ నన్నుఁ జోడుగాఁ గూడి
విరహతాపమునఁ బల్విడియైన దప్పి
ధరియింప నధరామృతం బానీవె
కలికి నా వీనుల కసిదీర ముద్దు
పలుకులతేనియల్ పైఁ జిల్కఁగదవె

భామరో విరిదీఁగపైఁ బూన్చు కరము
నా మూపునం జేర్చి నన్నేలుకోవె
యనుచును బల్కు న య్యంగజుజనకుఁ
గనుఁగొని ననబోఁణి కడు మరుల్ బూని
చెలిమి పెంపువహింప సి గ్గగ్గళింప
నెలమి పెంపువహింప నెద చెమరింప
పలుకక తలవాంచి బాళి రెట్టించి
పొలయుచూపుల నించి సుదతులఁ గాంచి
పొదమంచు నొక విరిపొదచెంతఁ జేరి
మదనవంచన మది మాటుచుండంగ

పద్మినికై వెదకుచున్న సైనికులామెను పల్లకిలో నింటఁజేర్చుట.

నంతలో సైనికు లార్భటింపుచును
కాంతారమంతయుఁ గమలాక్షు వెదకి
యచ్చోటు జేరంగ నళికి యచ్చెలులు
విచ్చలవిడి తోట వెడలఁ బద్మినిని
పల్లకి నిడుకొని బలువడి నగరి
కల్లన నరుగంగ నా కన్నె వెన్ను
నొరపుశింగారంబునుల్లంబునందు
మరులునఁ దలఁచుచు మరుకాక సొలసి
మరలి చూచుచు నేగ మదనగురుండు
విరహంబు మది వెల్లివిరియ న వ్వేలఁది
చెలువంబునకుఁ జొక్కి చింతతో మగుడి
తలవని తలఁపుగాఁ దగిలి వీరెల్ల
నిం దేల వచ్చిరి యిట్టి వేళ నని
కందువ విన్ననై కళవళంబునను

కమిలి బిట్టూర్చుచు గాంభీర్యమునను
తమకంబు లివుడక తన సేనఁ గలిసి
తురగంబు నెక్కి బంధురవేగమునను

సేనతోఁగలిసి యిల్లుచేరిన శ్రీనివాసుని విరహావర్ణనము.

నిరుపమం బగునట్టి నిజమందిరంబు
నపుడె ప్రవేశించి యందఱి ననిచి
కపటమన్మథమాయ కాక రెట్టింప
అలివేణి మీద మోహమున నేమియును
బలుకక విరిపాన్పుపైఁ బవ్వళించి
చెలులతో నాడక శృంగారవనము
తిలకించక కొలంకుదెస దృష్టియిడక
కొలువుకూటంబునఁ గూర్చుండఁబోక
జలకంబుగొనక వేసటఁ గలపంబు
లలఁదక యింపుగా నారగించకయె
చలువకట్టుక విరిసరులఁ గై సేసి
యలరక నెందుల నర్మిలి మనసు
నిలుపక నూరక నిస్సంగుపగిది
సంతతధ్యాననిష్ఠత నుండు కరణిఁ
గాంతఁ జింతింపుచుఁ గంతునిబారి
గలకనొందుచు బైలు గౌగిలింపుచును
తలయూచి వికవిక తనలోనె నగుచు
భ్రమసి చూచుచు నుల్కి భామఁ జేర్కొనుచుఁ
దమి నిదురఁ దొలంగి తనలోఁ గరంగి
న్యాయంబు మరచి ధైర్యంబుఁ బోవిడిచి
పాయని విరహాగ్ని బడలుచుండంగ.

అందా ముకుందుని యాకార మరసి
యందఱు బల్ వెఱగంది సందియము
కొందళించఁగ గుజగుజ లాడ నప్పు
డిందిరారమణుని హృదయజ్ఞ యైన

శ్రీనివాసుని వకుళమాలిక ప్రబోధించుట.

వకుళమాలికె చాల వలతియౌ నొక్క
సఖియ యై విభుఁజేరి సరసత మీఱి
సుగుణత మెఱయంగ సొగసు చెలంగ
నగణితామోదంబు నలర నిట్లనియె
పద్మాస్త్రజనక ! యో పరమకారుణిక !
పద్మామనోహార ! భక్తమందార !
దేవాదిదేవ ! ప్రతీతప్రభావ
దేవర విబ్భంగి ధీరతఁ దొలఁగి
కడు విన్ననై యుండు కారణం బేమి
తడవాయె బోనమై తడయు నేమిటికి
జలకంబు నవధరించఁగ సమయంబు
జలజమందిరఁ జేరఁ జని విన్నవించ
నళుకుచున్నది లేవవయ్య నెయ్యముగ
తిలకించితే వధూతిలకమ్ము నిన్ను
వలపించఁగలయట్టి వలతియుఁ గలదె
తెలిపె నీ చిత్తంబు దేవ శ్రీదేవి
సొలయించఁ దలఁచిన జూటుతనంబొ
పొలయల్క యేమైనఁ బుట్టెనో రేయి
కలకఁ దేరిచి నేను ఘటియింప లేనె
తెలుపవే నీ మది తెలియ నాతోన

కావలసిన పనుల్ కా నోపు గాక
ఈవేళ భుజియింపు మిభరాజవరద
అనవుడు శ్రీ వేంకటాచలరమణుఁ
డనుపమంబుగఁ బల్కు నా బెడబల్కు
లాలించి లాలించి యంగీకరించి
శ్రీలలనామణి చెలిమి వడ్డింప
సరసాన్నభక్ష్యభోజ్యము లారగించి
పరిపూర్ణహృదయుఁడై పరిమళభరిత
మృగమదమిళితకాశ్మీరసారోద్రు
దగరుచందనరస మలది నెమ్మేన
మకుటకుండలహారమౌక్తికహార
చకచకత్కంకణస్ఫారకేయూర
మంజీరమేఖలామణిపతకాది
రంజితాభరణముల్ రమణ ధరించి
బంగారువన్నియఁబరగు చెంగావి
రంగుగా రింగువారం గటిఁ గట్టి
సరిలేనిక్రొవ్విరి సరులు గైసేసి
మరుని మాయలు మరుల్ మరలంగఁ దరలి
కలువరాచలువరా గద్దియం జేరి
యెలమి మీఱఁగ నుండు నేకాంతవేళ
శుకవాణినిఁ దలంచి సొలయుచు మించి

వకుళమాలికతో శ్రీనివాసుఁడు తనవిరహకారణమును దెలుపుట.

వకుళమాలికఁ జూచి వావిరిఁ బలికె
వినఁగదే విరిబోఁణి విస్మయం బొకటి
మును కానలో నేను మొనసి వేటాడ

నరుగుచో నల్ల నారాయణపురము
సరసఁ బూఁదోఁటలో సరిలేని యొక్క
కన్నియఁ గనుగొంటి కసుమరుల్ గొంటి
నెన్నియు నన నేల యెన్ని చూడంగ
నా మగువకు సాటి యగు నట్టి బోఁటి
భూమిని జనియింపఁ బోల దెంతైన
పుత్తళిబొమ్మ యా పొలతియై యొరపు
చిత్తరువును వ్రాయఁ జెల్ల దెల్లెడను
వలరాయునిష్ట దేవతయె యీ లీలఁ
చెలువొంద విలసిల్లు చెలువయో కాక
సౌందర్యసారవిస్తారావతార
మిందుబింబాస్యగా నింపొందు టేమొ
యవ్వనలక్ష్మియై యలరి మేనంది
పువ్వుఁబోఁణిగ నిల్చి పొలుపొందెనేమొ
లేక ముజ్జగముల లేమ లీ లీల
నా కండ్ల కింపుఁబూన్పఁగఁ జాలువారె
చాల నా లోలాక్షి చక్కదనంబు
లీలలుఁ మరువంగ లేనె నీయాన
వలరాజు విరిగోల వడి కోర్వఁజాల
వల పుబ్బగాఁ దాళవశమటే చాల
నీవు నాయెడ ప్రేమ నించితివేని
వేవేగ నీ నేర్పు వెలయించి నాదు
వెతలబల్విడి రేచు విరహంబు దీర
నతివను గూర్చి పుణ్యము గట్టుకోవె
నావు డా ననబోఁణి నగుచు నో దేవ

నీవు మేలొందుమట నేను నమ్ముదునె
యీ వంచనకు నేమి యెల్లవారలను
నీవె మోహింపించు నెఱ మాయదారి
వెదను నిస్సంగత నెసఁగి బల్మాయ
వదలక లోకభావనఁ జేసె దిచట
అదిగాక సరిలేని యందచందముల
మదిరాక్షి యలమేలుమంగ యుండంగ
మఱియు నొక్క మిటారి మహి నీదు దృష్టి
కరయ తాళినయట్టి యంగన గలదె
నే నెఱుంగుదు సామి నిక్కంబు దెల్పు
మా నాటి కెందుకై యాశించి [1]తనఁగ

పద్మావతియం దాతని యనురాగమునకుఁ గల కారణము

చిఱునగ విగురొత్త శ్రీనివాసుండు
మఱియు నత్తరుణి ప్రేమను జూచి మొదట
నా వరవర్ణిని యర్థించి తన్ను
భావించు తెరగు తెల్పఁగ నిట్టు లనియె
కను మట్టి కథ నీకు వివరింతు నింతి
మునుపల్ల కృతయుగంబున బృహస్పతికి
సుతుఁ డొక్కఁడు కుశధ్వజుం డనువాఁడు
సతతంబు స్వాధ్యాయశాలియై తపము
నెఱపుచు మద్భక్తినిష్ఠుఁడై యుండు
పఱగ నాతఁడు వేదపఠనంబు సల్పు
వేళ నాతని ముఖవివరంబునందు
బాలికై జనియించె భవ్యరూపమున

1. వ్రా. ప్ర. పాఠము. "యాశించితే నుండు"

### వేదవతి వృత్తాంతము

వేదంబునకు సంభవించిన కతన
వేదవతి యనంగ విఖ్యాతి యయ్యె
నది యౌవనము నొంది యలరంగఁ జూచి
సుదతిని మోహించి సురదైత్యవరులు
నరకిన్నరేంద్రులు నయమున నతనిఁ
గర మొప్ప వందించి కడు బ్రియంబునను
నతివను దనకు నిమ్మనియుఁ బ్రార్థింప
నతఁడు వారి కొసంగ కప్పు డిట్టు లనియె
వెన్నుఁ డల్లుఁడుగాఁగ వేడుచుఁ దపము
లెన్నైన సల్పుచు నిటులున్నవాఁడ
పన్నగశయుఁ దక్క పరుని కెవ్వనికిఁ
గన్నియ నే నియ్యఁగాఁ జాల ననుడు
మరియు నా బాలయు మరుగన్న హరునె
వరియింతు నని చాల వ్రత మూనియున్న
దనుటయు వా రేగి రందు శంభుఁ డను
మనుజవల్లభుఁ డల్ల తరుణిపై మరులు
పట్టఁజాలక యట్టి బ్రహ్మర్షి వరుని
పట్టి వధించెఁ దద్బ్రాహ్మణహత్య
పాపాత్ము నవ్వాని భస్మంబునేసె
నా పరితాపంబు నాపఁగలేక
అల మునిపత్నియు నాత్మేశు మేను
నలమి యుజ్వలితాగ్ని నటు ప్రవేశించె
నా వేదవతియును నబల యెంతయును
భావించి తన తండ్రి పట్టు ప్రతిజ్ఞఁ

గమలాక్షుని వరించి కడతేర్తు ననుచు
హిమవద్వనంబున ఋషివృత్తి నుండి
యటుల కాషాయకృష్ణాజినంబులను
జటలను ధరియించి స్ఫటికాక్షమాల
కరమునఁ దాల్చి యోగస్థితి మెఱయ
పరమపవిత్రమౌ బృసిని గూర్చుండి
జ్ఞానభక్తివిరాగశమదమక్షమలఁ
బూని నిరంతరంబును నన్నె గురించి
వ్రతము సల్పుచునుండ రావణుం డనెడు
పాతకుఁ డచ్చటి కేగి య వ్వేదవతిని
గని జవ్వనంబు చక్కదనంబు నిగ్గు
తనరు ని వ్విరిబోణి తపము సేయంగ
నె వ్విధాత విధించె నెంచంగ నతని
య వ్వెఱ్ఱితనము నెంతనవచ్చు నకట
యొసఁగునే దోసపం డెనుపకట్టలకు
బిసమునఁ బలుకొండఁ బేర్చుటగాదె
యతులభోగంబుల కైన ప్రాయంబు
నతి తపఃక్లేశంబు నందింపఁ దగునె
కామసౌభాగ్యంబు గాలిఁ బోఁబుచ్చి
కోమలి వ్యర్థమై కుం దిట్టి దీని
నవరూపమును యవ్వనము తన రుచులు
భువి సఫలత నొంది భోగయోగ్యముగ
వెలయసేయుదు నంచు వే మది నెంచి
చెలిమిని బలిమినిఁ శృంగారలీలఁ
బొదలు మాటల బాళి బుట్టించు నట్ల

### వేదవతి రావణుల వాగ్వాదము

మదమునఁ జేరి యో మదిరాక్షి యెవతె
వెవ్వని సతివి పే రేమి యే కతము
క్రొవ్విరివంటి మై గోముఁ గందించి
పసలేని పరలోక ఫలముల నమ్మి
కసపైన తపముచే గాసి నొందెదవు
వికృతాంగకులు నతి వృద్ధులు నిటుల
సుకృతచర్యల మేను స్రుక్కించి దివిని
జననాంతరంబునఁ సౌఖ్యంబు వలసి
వనవాసదుఃఖ మోర్వఁగఁ దగుఁగాక
వరసౌఖ్యనిధి యైన వయసున నిట్లు
తరుణీమణిరో నీకుఁ దగునె యీ చర్య
యనుచుఁ జెంతకు వచ్చు నా దశగ్రీవుఁ
గనుఁగొని య మ్మౌనికన్య గన్విచ్చి
తన తపోబలమునఁ దద్వృత్త మరసి
తనర నాతిథ్యంబుఁ దగ ము న్నొసంగి
జననంబు మొదలుగా సకలాత్మకథయు
జనకవృత్తాంతంబు సవ్యసంకల్ప
మంతయు వినిపించి యతనికి మరియుఁ
జింతితం బెఱుగింపఁ జెలువ యిట్లనియె.
పురుషోత్తముముకుందు భువనసంభావ్యు
హరిని జామాతగా నర్థించు తండ్రి
పూనిక నెరవేర్ప బుద్ధి నూహించి
నేను న వ్వెన్నుని నెమ్మి వరింపఁ
దపము సల్పెద నగథాలినిఁ దక్క

నపరు నెవ్వరి నొల్ల ననుడు రావణుఁడు
కోపించి యో వెట్టి కోమలి వెన్ను
నేపాటివాఁ డంచు నెంచి వరించఁ
గోరెద వరయంగఁ గులమున బలిమి
సారవిక్రమమున చాతుర్యమునను
నా సరివాఁడె యీ నారాయణుండు
దాసరి వానితో తగు లేల నీకు
ముందర నతఁడు నా ముందర గినిసి
చిందరవందరై చెదరి బెట్టదరి
యుదరి సేనలు దాను నురకఁడే సమితి
బెదరి యంబుధిఁ జొచ్చి పెలుచ పాతాళ
వివరంబు చొరఁబారి వెస నొంటిగాడు
నవ్వుచుఁ గానల దూరి యట నోరు తెఱచి
బతిమాలి వెండియుఁ బాపఁడు జోగి
యితఁడన వెల్లనై యిల సిగ్గు విడిచి
పాది నంచు ననాదిజగ ముడాయించె
యేదియు నొక కులం బెంచరా కెందు
నూరిది యనరాక యొక్క వేరొంద
నేరక భిక్షుకనికరముఁ గూడి
సత్రభోజియె యాచు జరుగు న వ్వాని
నత్రప వరియింప నగు ఫలం బేమి
సురరాజును కుబేరు స్రుక్కించి గెల్చి
మెరయు నన్ను వరించి మేలొందు మనిన
ఆ నీచు మాటకు హరిహరి యనుచు
వీనులుం గరములఁ బేవేగ నదిమి.

యులికి మో మటు ద్రిప్పి యోరి దురాత్మ !
బలుమదంబున నిట్లు బలుకంగఁ దగునె
పురుషోత్తము ముకుందు భువనైకబంధు
పరమకారుణికస్వభావు మాదేవు
పోనాఁకురర నోరు పుచ్చిపొయ్యను
మాను మీ మాటలు మాటికి సూర్యు
పై దుమ్ముఁ జల్లినం బడుఁ దన మోము
మీఁదనే గాక న మ్మిహిరున కేమి
నీవు నిందించిన నీ జిహ్వా చెడియె
పావనమూర్తి కా పరిభవం బేది
శాలిశ యిఁకఁ జాలు పదివేలు పామ్రు
కాలంబు డగ్గిరెఁ గాఁబోలు నీకు
నావు డత్యుగ్రత నయనముల్ మెఱయ
రావణుఁ డా బాల రమ్యకేశములు
బట్టి తీసి రథంబు పై కెత్త నబల
దిట్టతనంబునఁ దెగువ వాటిల్ల
నరిగి యా నీచాత్ము డంటిన కురుల
బలిమినిఁ ద్రుంచంగ బదరుచు తనదు
కరముఁ బూన్పఁగ నది ఖడ్గమై వాడి
కురుల ఖండించిన కోపాలి నిలిచి
ఓరి దురాచార యోగి నే నగుచు
భూరివ్రతంబులఁ బొలుపొందు నన్ను
నంటితి విపుడె ని న్నతితపశ్శక్తి
మంటిపాలుగ గ్రాల్చి మ్రగ్గించలేనె
చిరతరార్జితపుణ్యసిద్ధి తగ్గునని

యరసి తాళితి నేనె యవని జనించి
నిను పుత్రమిత్రాది వివహంబుతోడ
ననిని గ్రుంగఁగఁ జేతు నంత నీ గర్వ
ముడుగు నంచు శపించి యోగక్లుప్తాగ్నిఁ
బడఁజొచ్చె న వ్వేదవతి నగ్ని దేవుఁ
డతిశీతలాత్మయై యంగీకరించి
కతిపయాబ్దములు దాఁ గైకొనియుండె
నంత దాశరథి నై యా సీత తోన
కాంతారమున నుండఁ గాను మారీచు
వంచనఁ దగిలి నే వనమునఁ జనఁగఁ
బొంచి రావణుఁడు గొబ్బున పర్ణశాల
చేరినన్ జానకి చింతఁ గలంగి
యారూఢమతి నగ్నిఁ బ్రార్థింప నతఁడు
ధరణిజఁ దనలోనఁ దాచి మున్నొండు
తరుణి తద్రూపంబు తగు వేదవతిని
వెడలింపఁగా నది వెస దొంట్టికినుక
యడరంగ నా రాక్షసాధము నిఁట
చేరియుండుక ప్రతిన జేసినయట్లు
దురమున పుత్రబంధుసమేతముగను
వాని ద్రుంపించి నావద్దకి వచ్చె
మానిని పూనిక మది చాల మెచ్చి
యపుడు నే నంతయు యరసి య య్యగ్ని
నుపగూఢయగు సీత నొద్దఁ గాంక్షించి
వ్యాజాకృతి మహీజ వగ వచ్చు చెలిని
వ్యాజభాషణముల వహ్నిఁ. జొరంగఁ

జేసిన నగ్ని నా చిత్త మెఱింగి
భూసుత నపుడె యింపుగఁ దెచ్చి యిచ్చె
అటు రహస్యోక్తుల నగ్నిదేవుండు
పటుమతి యగు నిట్టి భామాలలామ
నిన్నె పెండ్లాడంగ నెమ్మదిఁ గోరి
యున్నది సీతకు నుపకృతిఁ జేసెఁ
గావున నిచ్చెలిఁ గరుణించి యిపుడె
నీవు చేకొను మంచు నెమ్మి నర్థింపఁ
గొన్ని యుగంబులకును మీద నటులఁ

సీత కుపకృతిచేసిన వేదవతి పద్మినిగా జనించి తన్ను వలపించెనని చెప్పుట

గన్నియ వరియింతుగాక యాకాశ
నృపపురంబున నయోనిజగాఁ జనించి
చపలాంగి నను జెందఁజాలు నం చేను
సరసిజగర్భాది సకలదేవతలు
వరుసను వినుచుండ వర మొసంగితిని
యా వేదవతియే యుగాంతరంబునను
పావనవ్రతములు బహువుగా సల్పె
నల ఋణం బెటు దీర్పనగు నంచు చాల
తలపుచుండుదు నదే తన ప్రభావమున
నవని నయోనిజ యై జనియించె
నవవిలాసంబుల నను వలపించె
కటకటా నే నెంత కఠినచిత్తుండనొ
మటుమాయఁ జేసి య మ్మగువ నిన్నాళ్ళు
తలచక భక్తి వ్రతంబులకైన
ఫలముగాఁ గరుణించి పడతిఁ జేకొనక

మెలయుంచి తది యెంచి మెలయించుబోణి
వలపించి సొలపించి వగఁ దలపించె
నిక నేల నొకవేళయిన తాళఁజాల
వకుళమాలిక నీవె వడిమీఱి వెడలి
చిత్తవేగము మించి చెలఁగు బిత్తరపు
తత్తడిపై హత్తి తగు భటుల్ గొల్వ
వాణి నీటువహించి వాణి నీ వగుచు
రాణించు నారాజు రాణివాసమున
కరిగి ధరణి సేమ మరసి నీ నేర్పు
మెరసి మెరుగుబోణి మేల్మిఁ దోడుకొని
యరుదెంచితివయేని యపుడు నిఁక గూర్మి
నరుదెంచి కౌగిట నలముదుసువ్వె

వకుళమాలిక పద్మావతిని దోడ్తేర నారాయణపురంబున కరుగుట

అనవు డచ్చెలి వెన్ను నడుగుల కెరగి
వినయంబు దనరంగ వీడ్కొని వేడ్క
జేజేలరాతేజి చెలువు తేజంబు
రాజిల్లు నొకజక్కి రాజిగా నెక్కి
కాంచనవేత్రముల్ కరములఁ బూని
కంచుకిప్రకరంబు కడువడి నడర
లంకెకారులతో నలంకృతులగుచు
కింకరవరులు శంకింపక నడవ
నరుగుచు వేగమె యాస్వర్ణముఖరి
యరుత నగస్త్యాశ్రమావని హరుని
కనుఁగొని య చ్చెంత కాంతలు గొంద
రనుపమలీలల నరుదేరఁ గాంచి

యొలనాగలార! మీ రెందుండి యిందు
బలుకాన నరుదెంచ పనియేమి దెల్పు
డనిన న వ్వనజాక్షు లా బేడఁ జూచి
ఘనవిస్మయంబు బొంగఁగ నిట్టు లనిరి
వినుము మావచ్చినవిధ మో మృగాక్షి
యనఘశీలుం డగు నాకాశరాజు
నారాయణపురంబునం దగు నతని
సారసేక్షణ భూమిసంజ్ఞఁ బెంపొందు
న ద్దేవి కొక కూతు రందచందముల
ముద్దుగుల్కుచు జగన్మోహనలీల
మీరుచు నాఖ్య పద్మినియనఁ దనరు

పద్మినివిరహావస్థను గూర్చి చెలులు చెప్పుట

నారామ యొక్కనా డారామసీమ
నలరులు గోయ నలరువిల్తునివలె
నలరూపురేఖల నలరు నొక్కరునిఁ
దిలకించి యారాజ తిలకున కెంతె
వలచి పూవిలుకాని వలఁ జిక్కి సొక్కి
మదిని సొంపునుఁ దక్కి మరులను స్రుక్కి
నిదురఁజెందకఁ గూడు నీరు నొల్లకనె
జలకంబు నాడక జలువఁ గట్టకనె
తిలకంబు దిద్దక తెలివిఁ గైకొనక
చెలులతోఁ బల్కక చిల్కకు ముద్దు
పలుకులు నేర్పక బలుకాకఁ బొరలి
మరులను సొలయంగ మహిపాలు రమణి
ధరణి యా కన్నియ తనుతాప మరసి

వెరగంది మొదఁగంది వెజ్జు రావించి
పరికించి జ్వరమంచు భ్రమియించి మించి
యసమాన చంద్రోదయంబు వసంత
కుసుమాకరంబునుఁ గొంచు రమ్మనిన
నలపేరు చెవిసోకి నంతనే కాక
బలువిడి వైమూర్ఛఁ బైకొనఁ గాంచి
శంకించి మది గ్రహశంకగా నెంచి
మంకుతనంబునఁ మంత్రవాదులను
బిలిచి చూపించగాఁ జెలువ నవ్వారు
వెలయ యంత్రోద్ధారవిధి పూర్వకముగఁ
బూనికె దిగ్బంధము నొనర్చి మంత్ర
మానితాస్త్రస్తోత్ర మణులు పఠించి
యల కార్తవీర్య దుర్గాది దేవతల
నలరఁ భావించి తదాత్మతం జూచి
రమణి తాపంబుఁ దీర్పఁగ నిర్ణయింపఁ
దమకు శక్యముఁగామి ధరణి కిట్లనిరి.
ఈ చెలువకు నెద నెసఁగు దయ్యంబు
మాచేత నిర్ణయింపఁగ లోను గాదు
శ్రీవేంకటేశ్వరుఁ జేరి మ్రొక్కినను
పూవుఁబోణికి మేలుఁ బుట్టించు నతఁడె
బ్రహ్మాదులును కని పట్టరా నట్టి
బ్రహ్మాభూతము దీనిఁ బట్టిన దమ్మ
యని మాంత్రికులు జన నద్దేవి విప్ర
జనమతంబునఁ జెలి సౌఖ్యంబు నొందఁ
నిందుకళామాళి నిం దభిషిక్త

ముందుగాఁ గావింపఁ బుత్తెంచె మమ్ము
ధరణీసురులచేతఁ దదభిషేకంబు
లరుదుగాఁ జేయించి నరిగెద మింత
నీ వెవ్వరమ్మ నీ నిలయము మెం దెందుఁ
బోవలె మాకు వింపుగఁ దెల్పు మనిన
వకుళమాలికయు భావమునఁ దా వచ్చు
సకలకార్యము దిగ్విజయము మాయె ననుచు
ముదము రంజిల్ల న మ్ముదితలఁ జూచి
సుదతులార వినుండు శుభదమై నట్టి
వెంకటాచలమె నా వీడు దలంప
వేంకటేశ్వరుఁడె మా విభుఁడు నన్ వకుళ
మాలిక యండ్రు మీ మహీపాలు రాజ్ఞి
ప్రేమలఁ బ్రయోజనంబులు గల్గి యునికి
నారాయణపురంబునకు వచ్చితాన
నా రాజపత్నిని యందు గన్గొనఁగ
నగు నుపాయముఁ దెల్పుఁ డనిన నచ్చెలులు
మిగుల నాదరమున మేమె తోడ్కొనుచుఁ
జనియెద మది యట్టి సఖియతో విభుని
వనజాక్షి చెంతకు వచ్చుచుండంగఁ
నందుఁ బద్మిని విరహాగ్ని తాపమునఁ

పద్మావతి విరహవర్ణనము

గుందుచు కెంపెక్కు కన్గవ నశ్రు
లడర వెచ్చగఁ నూర్చి యుసురుసురనుచు
నుడుగక సల్పు శైత్యోపచారముల
విడుఁ బ్రజ్వలింపగ నెడ హారమణులు

కడిమి చూర్ణముగాఁగఁ గమలనాళములు
చురచుర మాడంగ శూనంబు వెండి
సొరుగు గానంత మై జొబ్బిలిఁ జిలుకు
పన్నీరు జయ్యంచు బలువేడి నిక్క
వెన్నెల ఘల్కి కోవెల మ్రోత కలికి
యల్లికి చిల్కకుఁ దిగులంది లోఁ గుంది
మలయానిలమునకు మదిఁ దల్లడిల్లి
తనలోనఁ గనలంగఁ దల్లియు నల్ల
తనయఁ గాంచి కలంగి తారుచుండంగ

నారదుఁ డెఱుకత వేషమున వచ్చి యెఱుక చెప్పుట

నారదుఁ డప్పు డా నలినాక్షి విరహ
మారసి చెలిమనం బలరింపఁ దలఁచి
యొక యెఱుకతవేష మొంది పొందుగను
శకమ్మానివరుఁ గేల సుఖముగాఁ బూని
యయ్యెడఁ దనవీణ నాత్మజు గాఁగ
జయ్యన పయ్యెదన్ జంక బిగించి
యిడి యొక్క జంక నయ్యెరుకల బుట్ట
కడు సంకుగాజులు కరములఁ దాల్చి
దంతపుంగమ్మలు ధరియించి చెవుల
వింత మీరఁగ గురువిందదండలును
పాలపూసలు రాతిపగడముల్ గ్రుచ్చి
మేలుసరుల్ చాల మెడను సంధించి
వెదురు ముత్తెములు బర్వినఁ గుత్తికంఠి
కుదురుగాఁ గై సేసి కొమరు మీరంగ
పురవీధి నింపుసొంపు రహింప నడచి

యెరుకెరుకో యవ్వ యెఱుక యో యవ్వ
కొల్లాపురము యెరుకులదాన నవ్వ
కల్లగా దిందుఁ దార్కాణ నా మాట
మొరిటెలలో నించి ముత్తెముల్ దెంపు
బురకసికిని మంచి బువ్వఁ బెట్టవ్వ
యను పల్కుల రవంబు లాలించి ధరణి
కనికరంబునఁ బిల్వఁగఁ బంచి దాని
మొరిటెలలో ముత్తెములు నించి యుంచి
విరిబోణికిని మేలు వివరించి మించి
యెఱుక దెల్పుమటంచు నెలమితో నడుగ
యెఱుకత కేల్మోడ్చి యెదను భావించి
చెంగల్వరాయ యో చెంచోబళేశ
మంగళగిరినాథ మంగమ్మతాయి
గోవిందరాజ యో కొండలరాయ
వావిరి నిజమైన వాకియ్యఁగదవె
అని మ్రొక్కుకొనుచు నందందరిఁ బొగడి
కనువిచ్చి యయ్యింతిఁ గనుఁగొని పలికె
చేసూపవమ్మ నే సెప్పెదు యెఱుక
వాసిమీరఁగ నాదు వాక్కు నిక్కంబు
వెలఁదికి నే మింత వెత యంచు మదిని
దలఁచి యడిగెద వవ్వ తగ మేలుఁ గలుగు
మగువకు నల్లని మగవాని మీఁదఁ
దగిలిన మరులచేఁ దాపంబు వొడమె
అలయకు మిప్పుడే యూ వన్నెకాని
చెలిమిఁ దెల్పఁగ నొక్క చెలియు రాఁగలదు

పడుకలి యొక చిలుకనిచ్చి చనుట

చిలుకలకొలికి యీ చిలుకఁగైకోవె
కలకదీరఁగ నిది కత లెన్నియైనఁ
దెలుపనేర్చును విభుఁ దెచ్చి కూర్చంగ
కలదంచు నొసఁగి యా కలికి కా చిలుక
నయ్యింతి కనుపించ కరిగిన భ్రమసి
యయ్యెడఁ జోద్యంబు నంది రందరును
అంతలోనే కాంత లవనీశురాణి
యంతఃపురము జేర నరుదెంచి తమరు
పోయివచ్చు తెరంగు పొసగఁ దెల్పుటయు
పాయనిప్రేమ న ప్పడతులఁ జూచి
సంతసం బెసఁగ నా జనపతి రాణి
వింతయై యున్నది వెలఁది యెందుండి
వచ్చె నం చడుగంగ వా రట్టి తెఱఁగు
లచ్చుపడఁగ దెల్ప నరసి యా దేవి
లేచి యా వకుళమాలిక నాదరించి
యాచోట మణికాంచనాసనంబునను
కూరిమిఁ గూర్చుండి కుశల మన్యోన్య
మారసి ముచ్చట లాడుచుండంగ

వకుళమాలిక ధారుణీదేవికిఁ దన వచ్చినకార్యం బెఱింగించుట

వకుళమాలికను భూవరురాణి పొగడి
యొకనాడు నిందు రా వువిదరో యిపుడు
వచ్చిన పని యేమి వాంఛితం బెద్ది
ఇచ్చెద నిపుడె నీ కెద శంకవలదు
నీవు రాఁగల్గుట నే ధన్యనైతి

పావనం బయ్యె నా భవనంబు నిపుడు
నాపు ణా నృపపత్ని నయభాషణముల
కేవల సంతోషకలిత యగుచు
వరవర్ణిని వివేకవంతురాల వని
కరుణయు సత్యంబు కలదాన వనుచు
వినుతిసేయఁగ మున్ను విను వంతకన్న
కనులపండువు గాఁగఁ గననయ్యె నిపుడు
నేను వచ్చిన పని నెమ్మితో వినుము
పూని యాకార్యంబుఁ బొసగించ మేలు
శ్రీవేంకటవిభుండు శ్రీనివాసుండు
తా వేఁటవచ్చి నీ తనయను జూచి
మే లొందె నతని కా మేలంత నొసఁగి
కేలొందు మీ బాల మేల్మి శ్రీదేవి
తానె యై విభు నురస్థలము కాపురము
నేనాడు విహరించు నెడలేని యట్టి
యానందరస మోలలాడంగ వచ్చు
భానువంశ్యుఁడు హిమ భానువంశజను
వరియింప సంబంధమై భవం బొప్పు
నరపాలుఁ డీవు బాంధవులు మంత్రులును
దెలియ విచారించి దేవాధిదేవ
కలశాంబునిధికన్యకాభర్త నీకు
నల్లుఁడౌ తన భాగ్య మందగోరినను
తెల్లమి నాతోడఁ దెలివిడి సేసి
తడయక పెద్దల తగ వెంటఁగూర్చి
వడి నంపు మనుడు భూవరురాణి యల్లర్తి

నలరుబోఁణిరో భాగ్య మాయె మాయావి
యల వేంకటేశ్వరుఁ డనుచు న మ్మునులు
బలుకఁగ విందు న ప్పంకజాక్షుండు
నిలవరం బొప్ప మా నెలతుకఁ జెలిమిఁ
దలఁచునే యతనికిఁ దగునె మాకన్య
యలమేలుమంగ హృదంతరంబునను
నిలుకడ నుండి రానిచ్చునె యొరులఁ
దలఁపున నమ్మంగ తాళ దీమాట
యైనను నీవంటి యతిధన్యశీల
పూని పల్కినమాట బొంకుగా దాట
విన సంగతంబయ్యె నెస నారదుండు
మును దెల్పె వెన్నఁ డీ ముదితఁ బెండ్లాడు
ననుచు నా హరి వేంకటాధిపుం డగుట
విని యుందు నటుగాన విషయంబు లేదు
శ్రీకాంతుఁ డగు దేవుఁ జెట్టబట్టంగ
మా కన్నె యెన్ని జన్మములఁ దపంబు
సలిపెనో కాని నిశ్చయముగా నిట్టి
కులము ధన్యతఁ జెందు గొబ్బున రాజు
కిది తెల్పివడి నిర్ణయించి యవ్వార్తఁ
బదపడి నీకుఁ దెల్పగ వత్తునుండు
మనుచు నా వారసాని యరిగినఁ గన్య
విని యట్టి సంతోష వృత్తాంత మెల్ల
చెక్కిళ్ళ పులకలు చిగురొత్తఁ జిత్త
మెక్కువ ముదమంద నెలమి నచ్చెలువ
నలమి కౌఁగిటఁ జేర్చి యాదరంబునను

చెలువుని సుద్దులు చెలఁగుచు నడుగ
తలచును సిగ్గునం దలవంచుకొనుచు
పొలతిరో మగుడ నెప్పుడుబోదు వ్రారి
కను నెఱుంగనియట్ల అమ్మ యే మనియె
నను రాజులును మంత్రులంగీకరించ
కేమందురో యని యెదలోనఁ గలఁగు
కామించి విభుఁడు మక్కా కడువేఁడు నప్పుడె
కలయంగ లే నై తిగా యంచు నాలయు
నాలసి తా వెసనొందు సుద్దులు దెలుప
చిలుక నంపుదు నంచు చింతించి యింతి
చెలిమి న న్నెప్పుడు చిత్తంబునందు
తలఁతువో యిది జూచి తలచుకొమ్మనుచుఁ
జిలుక నా విరిబోణి చేతికి నొసఁగె
అంతలో యద్దేవి యరిగి వేఁొక్క
యంతస్తున న్నిల్చి యాకాశవిభుని
అల మంత్రులను బిల్వనంపి యంతయును
తెలిపిన నా రాజు తెలివియు ముదము.

దేవి యాకాశవిభునితోఁ దెలిపి ముహూర్తనిశ్చయము గావించుట

నచ్చెరువును హెచ్చ నంగీకరించి
మచ్చిక నిజబంధు మంత్రులతోడ
మంతనం బొనరించి మంచి లగ్నంబు
చింతితకల్యాణసిద్ధికి నరయ
ధరణీసురలఁ బిల్చి తఱి దేవగురుఁడు
వరపురోహితరీతి వచ్చి వద్మనికి
శ్రీనివాసులకును జెలఁగు పొంతనము

లూనిన సిద్ధాంతయుక్తి నిర్ణయము
సేసి కన్యకు మృగశిర యౌట శ్రీని
వాసుల తార శ్రవణ మౌట యరసి
మాధవమాసంబె మహనీయ మైన
మాధవోద్వాహకర్మమునఁ బ్రశస్త
ముత్తరఫల్గునియును దంపతులకు
నుత్తరోత్తరమహాభ్యుదయం బొనర్చుఁ
గావున నత్తారకను మీనలగ్న
మౌ వివాహక్రియ కగునంచుఁ దెలుప
వారెల్ల హర్షించి వకుళమాలికకుఁ
గూరిమి మీఱంగ కోకలు మణులు
ఘనభూషలును గంధకస్తూరికలును
తనరు తాంబూలముల్ దగు మున్నొసంగి
దేవున కీలగ్న దినములు దెల్పి
కావించు మిచ్చట కల్యాణ మనుచు
తరుణీమణిని బంపి తనరాజధాని
కరము రంజిలు నలంకార మొనర్ప
నధికారుల నృపాలుఁ డప్పుడే పనిచె
నధికసన్మతిఁ దూతి యలరుచు నడచె
అప్పు డా కింకరు లధిపతియాజ్ఞ

### పురాలంకరణము

చొప్పునఁ బురమెల్ల శోభిల్ల మిగుల
చంద్రకాంతనిశాంతసంతానదాంత
చంద్రశాలారత్నసౌధజాతములు
కాంచనమేరువుల్ కాయమానములు

ప్రాంచితస్థిరతరరథనికాయములు.
విడుదుల కొప్పఁగా వేవేలు బన్ని
కడిమి పహాంబట్టు మేల్కట్టులు గట్టి
కలిత పాంచాలికా గణము రంజిల్ల
విలసదాస్థానికావితతిఁ గై సేసి.
ప్రతిగృహంబును సుధాభరములఁ దీర్చి
ప్రతివీధి నరుచిత్రపటములు బూన్చి
వరుస నవ్వీధుల ధ్వజముల్ ఘటించి
కరమొప్ప ధ్వజముల ఘంటల్ బిగించి
ఘంటల పావడల్ గదియ సంధించి
జంటగా తోరణసరులు గీలించి
పడితోరణాలు మువ్వలు తగు ల్కొల్పి
యెడల నద్దపుబిళ్ళ లెనయించి మెఱయ
నందందుఁ జందువ లందందు మీఱ
క్రందుగా విరిచప్పరంబు లమర్చి
గోపురోజ్వల శాతకుంభకుంభములు
గోపురాంభోరుహాకోటుల నలర
రంగొంద రాజిలు రాజవీధికల
శృంగార మొనరించి చెలఁగ నెల్లెడను.
పన్నీరుఁ జిల్కి రంభాస్తంభపాళి
వన్నె మీరఁగ గృహద్వారాళి నిలిపి
లలితవైఖరుల నలంకరించి రటు
పొలుపుదీపించి య ప్పురలక్ష్మి యంత
నమరావతిని గెల్చి యలక నదల్చి
యమరు బల్కొమరు బెంపలర రాజించె.

అయ్యెడ నా దూతి హయముపై నెక్కి
చయ్యన చని చని సంభ్రమంబులను
శ్రీవేంకటాచలశిఖరంబుఁ జేరి
దేవునిఁ బొడగాంచి తెరవ యొసంగు
చిలుకను జూపి యచ్చెలువ దేవరకు
నలువున మనవి విన్నపము సేయంగఁ
బనిచె దీనినటంచు పలికె వెండియును
తన దూతకృత్యంబు ధరణి పల్కులును
రాజుతాత్పర్య మా రాజాస్య వలపు
రాజితలగ్ననిర్ణయమును దెలుప
విని మోద ముప్పొంగ వేంకటేశ్వరుఁడు
కనికరంబునఁ దూతిఁ గౌఁగిటఁ జేర్చి
రాచిల్క చెలిమితో రంజిల్లు కరుణఁ
జూచిన కేల్మోడ్చి శుక మిట్టు లనియె

పద్మిని పంపిన చిలుక స్వామితోఁ జేయు విన్నపము

దేవాధిదేవ ! యోడీనమందార !
భావజజనక ! స్వభావకారుణిక !
విను పద్మినీకాంత విన్నపం బెల్ల
నిను విరిదోటలో నెమ్మి కన్గొనిన
యదిమొదల్ నా మనం బంటె నీయాడె
కుదురుకొన్నది నీదు గుణబాళి మరగి
నను జూరరాదయ్యొ నలినాక్షి యనియె
మనసున జనియించు మరుఁడు పల్మరును
మరులుబుట్టించి యామరని బీరమున
మరల బల్ కాక ముమ్మరముగా నిచ్చి

యలయించఁ బూనె నీ యాత్మజుం డగుట
కలఁకఁ బుట్టించె నోకరుణాబ్ధి యనియె
మోమోటము దొరంగి మొనసి యాచంద
మామ వెన్నెలచిచ్చు మైసెఁ జల్లుచును
నీ మోముగోముఁ జెందిన గర్వమునను
బాములఁ బెట్టెదో పరమాత్మ యనియె
నీవు దొంగతనంబు నేర్చి నాధైర్య
మీవగ హరియించె దింతయుఁగాక
కనుఁగూర్చినంత నక్క గదియంగ వచ్చి
కనఁబడకనే డాగి గాసిఁబెట్టుచును
జూపుజూపులను వంచనఁజేసె దింత
రాపోర్వఁజాల నోప్రాణేశ యనియె
నన్నేలుకోవె పన్నగశాయి యనియె
జన్నెపట్టితి నీకు జగదీశ యనియె
అనవు డా శ్రీవేంకటాచలవిభుఁడు
మనమున మరులుగ్రమ్మఁగ నెమ్మొగమునఁ
జెలిమియుఁ జిఱునవ్వుఁ జిందులు ద్రొక్క
కులుకుచూపులుఁ దయం గొమరొంద చిలుక
నెంతయు మన్నించి యింపు దీపింప
ఇంతికి నానవా లెద నంటి పొదలు.

పద్మిని తులసీదామము వానవాలుగా బంపుట

తులసికాదామంబు తుదలేని రత్న
కలిత మాలికె యిచ్చుకరణి నొసంగి
వేగ వచ్చెద నని వివరించు మనుచు
బాగుగాఁ బుత్తెంచ పనిఁబూని మ్రొక్కి

యా శుక మాత్రణం బాకాశవీధి
యాశుఁగ రయమున నరిగి యా కన్య
కరవిందలోచను కంతరంగంబు
కరుణయు మధురవాక్యము నెఱింగించి
యతఁ డిచ్చు కస్తూరికాంచితదామ
మతులితామోదంబు లలరంగ నొసఁగె

నొసఁగిన నా బాల యున్నతానంద
మెసఁగఁ జేకొని దాని నెంతయుఁ బొళి
గులుకుకన్నుల నొత్తుకొను నెద నుంచు
మొలకచన్నులఁ బూన్చు ముద్దుగా మెడను
ధరియించు వెండియుఁ దనమౌళిఁ దాల్చుఁ
గరమొప్ప మొగమునఁ గదియించుకొనుచు
మరియు నాథుఁడె కాఁగ మదినిభావించి
పొరిఁ గౌఁగలించు వే పొలయల్క సొలయు
కొసరును వెస దూఱుకొను నిట్లు తమిని
బిసజాక్షి భ్రమయుచుఁ బెలుచనే తెలివిఁ

జిలుకచెలినిఁ బిల్చి చెలఁగుచు నిల్చి
యలరుచుఁ బలుమాఱు నల ముద్దు లడుఁగు
గడుమనోరథమునఁ గాంతునిఁ గలిసి
కడలేని సరససౌఖ్యము లందుచుండు
అయ్యవసరమునం దా వెన్నుఁ డెదను
తొయ్యలిపై మరుల్ త్రోద్రోపు లాడ
కడలేని తమకంబుఁ గడు ముమ్మరముగ
నడరంగ నెంతయు నంతరంగమున
నెప్పుఁ డెప్పుడు సారసేక్షణం జూతు

వెన్నుని వివాహసన్నాహము

నెప్పుడు కల్యాణ మెసఁగఁ జేకొందు
నను తత్తరంబున నా సైన్యవిభునిఁ
గనుఁగొని చెల్మిఁ బొంగఁగ జేరఁబిలిచి
అమరగంధర్వయక్షాదికిన్నరుల
కమలజు హరిని దిక్పతుల రావించి
చీటిఁ బంపు మటంచు సెలవిచ్చి భక్త
కోటికి శుభయాత్రకును బయనంబు
తెలియఁ జాటింపించి తెరవలు వినఁగ
అలవేలుమంగకు నట్టి వృత్తాంత
మంతయుఁ దెలిపిన నద్దేవి యలరి

అలమేల్మంగ శ్రీనివాసునకుఁ దలయంటుట

కాంతుని కపుడ శింగారం బెసంగ
బంగారుగిన్నె సంపఁగినూనెఁ దెచ్చి
మాంగల్యవాద్యముల్ మలసి మ్రోయంగఁ
దగిన పేరంటాండ్రు ధవళముల్ బాడ
సుగుణకాముని సతుల్ సారిది సేస లిడ
కులుకుచుఁ దానె కుంకుమగంధములను
నలుఁగులుఁబెట్టి తిన్నఁగఁ దాళగతులఁ
గంకణంబులుఁ ఘల్లు ఘల్లనఁ గాంచి
కింకిణుల్ మొరయుచు కెరలి నటింపఁ
జిగి పిరుందున వేణి చిందులుఁ ద్రొక్క
వగ మీఁది హారముల్ వరుస నాడంగ
ముంగరముత్యంబు మోవి నర్తింప
ముంగురులును ఫాలమునఁ దాండవింప

చిరుచెమటలు మేనఁ జెలువుఁ గుల్కంగ
హారువుగాఁ దలయంటె నద్భుతలీల
అటుల నూనియ యంటి యలమేలుమంగ
చటులత ధాత్రిగాఁ జంబీరజాతి
ఫలసారముఁబు గంధపటవాసకములు
నలఁది యామోదించు నాకాశగంగ

స్వామి నలంకరించుట

జలములు జలకంబు సదగ నాడించి
చలువను తడియొత్తి చక్కని కురుల.
రంగొంద నొసఁగి సాంబ్రాణిధూపంబు
శృంగారమొసగంగ సిగవైచి మెరుగు
బంగారుదుప్పటి బాగుగాఁ గట్టి
అంగరాగ మొనర్చి హరిచందనముల
పైఁ బచ్చికస్తూరి పట్టెలుఁ దీర్చి
నయమొప్ప్వక్రపు నామంబు దిద్ది
మగరాల నిగ మించు మంజీరములును
ధగధగ మౌక్తికోదగ్ర మేఖలలు
నవపద్మరాగసంతతకంకణములు
నవకం బెసంగు తిన్నని యుంగరములు
హారువైన పచ్చని యంగదంబులును
మురువైన మురువులు ముంగామురములు
నవరత్నపతకముల్ నవ్యహారములు
వివిధేంద్రనీలపు విడి నేవళములు
భువనమోహనము లౌ బుజకీర్తికలును
నవరణ్వైదూర్యచయ కంఠసరులు

మకరకుండలములు మాణిక్యఖచిత
మకుటంబు తగఁ బూన్చి మందారవికచ
దామముల్ కై సేసి తామరుల్ మీఁద ?
రామాభిరాముఁడై రంజిల్ల విభుని.
యగణితసౌందర్య మరసి చెక్కిటను
సొగసుగాఁ గస్తూరిచుక్క బొట్టిడియు
మరియొక్క కొమ్మ హుర్మంజి ముత్యములు
నెరయు బాశికము వన్నియ మీఱఁగట్టి
వాణి శర్వాణి గీర్వాణేంద్రసతియు
నాణెంబుగా నల్ల నారాయణునకు
వేరువేరుగ భక్తి వెలయ గర్పూర
హారతు లెత్తి రయ్యంబుజాక్షునకు
నాదరంబున సూవె నందం బొకర్తు
పాదుకల్ దొడిగించె పడతి వేరొకతె.
చామర లమర కంజాతాక్షు లిడిరి
కోమలి యొకతె చేకొనె రంగు హారిగ
కొంద ఱూడిగములు కొమరొందఁ జేసి
రందు కొందఱు బెత్తు లంది బారిడిరి
సేనాధినాథుండు సిద్ధగంధర్వ
సైనికవరులతో సన్నద్ధుఁ డగుచు
సందడింపఁగ పక్షిసార్వభౌముడును
క్రందుగాఁ జెలువొంది రాజవాహ్యమయె
నచ్చరల్ నర్తించి రచ్చెరు వెచ్చ
విచ్చలవిడి పుష్పవృష్టియుఁ దనరె.
అంతనా బ్రహ్మాదు లందఱు నందు

సంతోష మెసఁగంగఁ జనుదెంచి వేగ
శ్రీనివాసుల కింపు చెలగు వస్తువులు
కానుక లొనరించి క్రమమునం గొలువ
దేవదుందుభులును ధృతిమీర మొరయ

వైనతేయుపైనెక్కి వచ్చుట

నా వైనతేయుపై నలరుచు నెక్కి
యలమేలుమంగ నిజాంకపాళికను
చెలిమి నుంచుక వేగ శ్రీవేంకటేశుఁ
డరుగుచుండఁగ విని యాకాశవిభుఁడు
గురుపురోహిత బంధుకోటులతోడ. 1160

ఆకాశవిభుని యెదుర్కోలు

దూరం బెదుర్కొని తోడ్కొని తెచ్చి
స్ఫారరత్నోన్నత ప్రాసాద మొకటి
విడిపట్టు గావింప విచ్చేసి యందు
కడు నా విభుం డిచ్చు కానుక లంటి
నారాయణపురంబునన్ రాజగృహము
జేరంగఁ బద్మినిఁ జేకొను తమిని

రాజమార్గంబుననే స్వామినిజూచుటకు పౌరాంగనలయుత్సాహము

యారాజమార్గంబు నం దా మురారి
భూరివైభవము లుప్పొంగ నేగంగఁ
బౌరాంగనామణుల్ బాళి నాదేవు
కూరిమిఁదిలకించుకోరికె మీరి. 1170
లలినించ తమ మే నలంకరించంగ
నలరి కరంబులన్ హంసకంబు లిడి

కడిమిని కాళ్ళఁ గంకణములు బెట్టి
నడుమున తీఁగె కంధరనొడ్డాణంబుఁ
వ్రేళ్ళ మెట్టెలు బూన్చి వెన నుంగరములు
లోలత చరణాంగుళుల పొసఁగించి
బిల్లలసరిపెణుల్ పిరుదుపైఁ దాల్చి
అల్ల మేఖల గుబ్బలందు సంధించి
కదియించి మల్లెమొగ్గల దండ లెదను
పొదలు కీల్జెడ హారములును గైసేసి.
కన్నులఁ గస్తూరికారేఖఁ దీర్చి
తిన్నగాఁ గాటుక తిలకంబు దిద్ది
తడవాటు మీఱంగఁ దత్తరంబునను
పొడవైన మేడల పూనికమీఱి
సోపానములవెంట సొలసి యొండొరులు
త్రోపునూకుల నెక్కి తొలగక నిక్కి
యల గవాక్షంబుల నానాబ్జములు
నిలిపి కన్నులతేట నిగ్గగ్గళింప
బారుగా నమ్ముఖపంక్తు లిరుగడల
సారగంగాంబుజ చయశంక నెరప.
తమకటాక్షద్యుతుల్ ధారగా నిగుడి
రమణఁ గలువలతోరణములై మెఱయఁ
దిలకించి వేంకటాధీశు సోయగముఁ
బులకించి మైవలపునఁ జొక్కువారు
పరమాత్ముఁడితఁ డంచు భావించి మొదల
మెరసినభక్తి నర్మిలి మ్రొక్కువారు
ఇతఁడెకా యెడబాయ కిందరిఁ జెందు

చతురుఁ డటంచు విస్మయ మొందువారు
తిరుమలకొండ నీ దేవుఁ డిష్టములు
కరమిచ్చు నని కోరికలు జెందువారు.
అలమడే నన్నని యాస రెట్టింప
సొలపు మించఁగ సొగసులు గుల్కువారు
ఇల నీత నర్చింతు మిపుడైన ననుచు
పొలుపొందు తమిఁ బుష్పములు జిల్కువారు
సేవింప నెలమి రంజిలు కటాక్షముల
నా వనితలకు భాగ్యము లొసంగుచును
చని వేగ నా రాజసదనంబునందు
వినతుఁడై కల్యాణవేదిఁ గూర్చుండె

పద్మావతిని చెలులు పెండ్లి కూతుగాఁ గై సేయుట

అపుడా నృపాత్మజ కభ్యంజనంబు
చపలాక్షు లొనరించి జలకంబు దీర్చి
సరిగంచు చెంగావి చక్కఁగాఁ గట్టి
మురువొందు రవికెయు ముద్దుఁగాఁ దొడిఁగి
జడయల్లి క్రొవ్విరి సరులును జుట్టి
కడువేడ్కఁగాఁ దిలకంబును బెట్టి
పంజులకమ్మలు బవిరెలు సరులు
రంజల్లు కంకణ రత్నమేఖలలు
బంగరొడ్డాణంబు బన్నసరములు
ముంగామురలు రత్నముద్రితోర్మికలు
పొందైన కుతికంఠి భూరిహారములు
సందిదండలు కంఠసరులు తాళీలు.
ముంగరముత్యంబు ముగువుబొప్లిలు

రంగొంద నివిమొదల్ రత్నభూషణము
లన్నియు వరుసగా నమరఁ గై సేయ
కన్నెకుఁ గొందఱు కమలలోచనలు
కలపంబు నలఁది శింగారం బెసంగ
తొలకరి క్రొమ్మించుతోఁ దులతూఁగుఁ
మెయినిగ్గుజగ్గున మించి రాణించ
ప్రియుని మోహింపించు బిరుదు చందమున
నెలవంక లిరువంక నీటు వాటిల్ల
పొలుపొందు బాసికంబును గట్టి రంత.
కమలసంభవుఁడు వెంకటనాథుచేత
నమితగోదానంబు లాచరింపించి
యా రాజవిభుఁ జూచి యధిప లగ్నంబు
చేరిక యయ్యె న చ్చెలువ రావించి
పురుషోత్తమునకు నింపుగ దారబోసి
పరమకృతార్థతం బరగు మి వ్వేళ
తడయనేటికి నన ధరణీవిభుండు
వడిఁ గన్యఁ బిలిపించి వరునిపీఠమున

పద్మావతీ వివాహవర్ణనము

నునిచినఁ వై ఖానసోక్తక్రమమునఁ
బనుపడి యా బృహస్పతి రమాపతికి.
ప్రతిసరకంకణ బంధపూర్వముగ
వితతాంకురార్పణవిధి సల్పి మునులు
పుణ్యాహవాచనంబు లొనర్చి సూత్ర
గణ్యరీతిగను సంకల్పంబు దెల్పి
మధుకైటభారికి మధుపర్క మొసఁగి

పృథివీశుఁ డల కన్య పెనుపొంద తెరను
నిలిపిన వెన్నుండు నెమ్మితోఁ గొమ్మ
తిలకించి ముదముజెంది చెలంగునపుడు
శ్రీనివాసునకు ముక్ శ్రీదేవి నబ్ధి
పూని భక్తిని దారబోసినయటుల.
ధరణీధరునకు నా ధరణీవిభుండు
ధరణీకుమారి నత్తరి దారవోసె
భువనైకదాతయై పొలయు శ్రీవిభుఁడు
యువనిజకై దాన మంది కేల్సాచె
వాణీశమతమున వనజాక్షి నతఁడు
పాణిగ్రహముసేసె బాళిఁ జేకొనుట
అంగనామణికిఁ గంఠాభరణముగ
మాంగల్యసూత్రంబు మమతసంధించె
దేవవాద్యము మ్రోసె దివి పుష్పవృష్టి
భూవలయము నిండఁ బొలుపొందఁ గురిసె.
పాడిరి గంధర్వభామ లచ్చరలు
నాడిరి ముదమున నలరె లోకములు
అయ్యెడ దంపతు లన్యోన్య మెలమిఁ

తలంబ్రాలు

జయ్యన తలఁబ్రాలు సవరించినంత
జగతీజనములకు సంసారపుముడి
తగిలించిపెట్టిన తనకు నా జనులు
వీడుకువీడుగా వెలయఁ గొంగుముడి
వోడక పెట్టిరి యొగి దంపతులకు
తేజంబుగా నగ్నిదేవుం డెసంగ

### లాజహోమము

లాజహోమంబు లీలఁగ సల్పి రపుడు.
పదములుమూఁటి కొప్పని వాఁడు సప్త
పదములు నడిపించె భామలలామ

### అరుంధతీ దర్శనము

తరుణికి నా యరుంధతి జూపె శౌరి
కరుణఁ జూడంగ తగరె పతివ్రతలు

### స్త్రీలపాటలు

మరివధూవరులను మణిపీఠి నునిచి
తరుణులు కొందఱు ధవళముల్ బాడ
జయమంగళము జగజ్జనని యా సతికి
జయమంగళము జగజ్జనకు డౌ హరికి
జయజయ పద్మిని జలజాయతాక్షి
జయజయ పద్మాప్త జలజాతనాభ.
మంగళం బలమేలుమంగమ్మ కెపుడు
మంగళం బహిరాజమహీభృద్విభునకు
ననుచు పాటలు పాడి హారతు లెత్తి
రనుపమాంగులు హరి కబ్జమందిరకు
అంత సాంగముగాఁగ నంతయు సల్పి
కాంతయు దాను నుత్కలిక మీఱంగ
నూరేఁగి యందఱి కుడుగర లొసఁగి
సారకాశ్మీరరసముల వసంత
మెసఁగ చల్లాడి య య్యిందఱఁ గూడి
బిసజాక్షి తనుఁగొల్వ ప్రియమొంది బువ్వ
మారగించి చతుర్ముఖాదులు పొగడ

నా రాజశేఖరుం డరణమ్ము గాఁగ
వారణస్యందనవాజిరత్నములు
భూరిభూషాంబరంబులు నొసగంగ

### శ్రీనివాసులు పద్మినితో వెంకటాద్రిని గృహప్రవేశముచేయుట

సకలసంభ్రమము లెసంగ బంగారు
చికిలిపల్లకులపై చెలువ లేతేర
పరగజంబులు వేణునాగస్వరములు
మురువందు చెంగులు ముఖవీణియలును
స్వరమండలములు రావణహస్తవీణ
లొరపైన తంబుర లురుమర్దళములు
డక్కాలు గిడిబిడల్ డమురుగంబులును
అక్కాని వీరణాల్ చక్రవాద్యములు
తాళముల్ గజ్జ లింతయు సరిగాఁగ
మేళవించిన రక్తి మిగుల రాణించు
లలితగంధర్వమేళముచెంత వింత
గులుకంగ ముందర గోముఖ శంఖ
కాహళకాది భాంకారంబు దిక్క
మూహాంతజంతుల మోహింపఁజేయ
విడిదిచెంతను మామ వీడ్కొని గరుడుఁ
గడువేడ్క నెక్కి ముక్కంటియు నలువ.
ఇరుదండ చామర లింపుగా వీవ
సురభామినులు పూల సురటీలు విసర
ఫణిరాజు ముక్తాతపత్రంబు బూన
మణివేత్రములు దాల్చి మరి సైన్యపతులు
భటసంఘములు బరాబరిచేసి నడవ

పటుగతి నారదపర్వతుల్ బాగడ
విస్తృతాగమముల వివిధసంయమములు
స్వస్తివాచనములు సలుపుచు పక్షి
రాజవైఖరి నేగి రహిఁ వేంకటాద్రి
రాజిల్లు నిజమందిరము ప్రవేశించి
చింతామణీ చిత్రసింహాసనమున
కాంతామణులుఁ దాను గరిమఁ గూర్చుండి
విధిశంకరేంద్రాదివిబుధుల మునుల
నధికసన్మతిచేసి యనిచి భక్తులకు
కామితార్థములెల్ల కరుణ నిచ్చుచును
శ్రీమించి విహరించె శ్రీనివాసుండు.
ఈగతిం బద్మిని నిందిరావిభుఁడు
బాగుగాఁ బెండ్లాడు పావనకథను
నిజభక్తిఁ జదివిన నెమ్మితో వినినఁ
బ్రజలకుఁ గల్యాణ భాగ్యసంపదలు
పొదలు సామ్రాజ్యంబు భోగమోక్షములు
కుదురుగ లభియించు గోరిన వెల్ల
అని విచిత్రార్థసమర్థనాకలిత
ఘనసర్గవిశ్రుతకవిముఖ్యుపేర
విపులానుభావభావితసంవిధాన
కపటనాటక జగత్కారణుపేర
భాసురాంగశ్రుతి భారతీభవ్య
లాసికాగీత విలాసునిపేర
తారకాంతక పితృద్వంద్వాన్వధీత
తారకమంత్రాభిధానునిపేర.

ప్రత్యాహృతోత్తరాపత్యమై తనర్చు
సత్యనిత్యబ్రహ్మచర్యునిపేర
క్షీరపారావార శీకరాసార
పూరితనిజముఖాంభోజునిపేర
పావనభక్తాప్తబంధునిపేర
గోవిందరాజముకుందునిపేర
శ్రేష్ఠలూరన్వయశ్రేష్ఠశీలుండు
శ్రేష్ఠమహాయశశ్శ్రీధురీణుండు
గోత్రభారద్వాజ గోత్రవర్ధనుఁడు
సూత్రుఁడాపస్తంభసూత్రానువర్తి
అష్టభాషాకవిత్వార్జితప్రోద్య
దష్టావధాన విఖ్యాతబిరుదుఁడు
శ్రీకృష్ణయార్యలక్ష్మీగర్భవార్ధి
రాకాసుధానిధి రాజపూజితుఁడు
వివిధవిద్యాశాలి వెంకటార్యుండు
సవరించు శ్రీనివాసవిలాసమునను
హరువొందునిది పంచమాశ్వాసమగుచు
ధరఁబొల్చు నాచంద్రతారకంబుగను

పంచమాశ్వాసము, సంపూర్ణము.

# శ్రీనివాసవిలాససేవధి

## షష్ఠాశ్వాసము



శ్రీనివాసగిరీంద్ర శిఖరాళిసాంద్ర
మానితమణిరూప మహితప్రదీప
క్షీరాంబుధితరంగశీకరార్ద్రాంగ
సారలీలాదక్ష సదయకటాక్ష
మధుకైటభనిరాస మంజుళహాస
మధురేశబలశౌర్యమథనచాతుర్య
రక్షితాఖిలలోక రాజితశ్లోక
కుక్షిలక్ష్యాంభోజ గోవిందరాజ
అవధారు సూతుఁడిట్లమ్మునీంద్రులకు
భువనపుణ్యచరిత్రమును దెల్పి మఱియు.

### భవిష్యత్కథలు

ఇల భవిష్యత్కథ లింపుగాఁ దెల్పఁ
దలఁచి యద్భుతరీతిఁ దనర నిట్లనియె
వినుఁడు సంయములార వేంకటేశ్వరుఁడు
వనజాలయప్రాణవల్లభుం డగుచు
విహరింపుచును భక్తవితతిఁ బ్రోచుచును
బహుమహాయుగము లిబ్భంగి నుండంగ

### కలియుగారంభమునఁ గలివిజృంభణము

నిజపురాసంకల్ప నిర్ణీతసరణి
భజియించి కలియుగప్రారంభమునను
కలిపురుషుఁడు మహోగ్రత మీఱవచ్చి
బలియుఁడై గద కేలఁ బట్టి ధర్మ మను

వృషభంబును ద్రిపాదవికలంబు చేసి
ఋష నొక్కపాదముగా జూపరునట్లు
వెదకి సత్యముఁ ద్రుంచి వినయంబు నొంచి
మొదల వర్ణాశ్రమములసార మడఁచి
శ్రౌతసంస్కృతుల నుత్సవరీతిఁ దుడిచి
భ్రాంతిజన్నముల డంభమున మ్రగ్గించి
యాదివర్ణోచితం బంత మొందించి
వేదజాతంబు నిర్వీర్యం జొనర్చి
జపతపోనిష్ఠల సవరుబోఁ జవరి
విపులాశ విప్రధీవిభవంబు చిదిమి
గురురూపధారియై కొందఱి జెఱిచి
గురుల నహంకార కుహనాప్తి నలిచి
దేవతానిజశక్తిఁ దెగటార్చి క్షుద్ర
దైవతశక్తి నెంతయు నిరూపించి
దానాదికములెల్ల తామసంబులుగఁ
బూనించి యన్నియుఁ బొల్లుఁగావించి
యాయువు మతి బలం బటు కొంచపరచి
పాయని మోహంబు ప్రబలించి యిటుల
బహుళవై పరీత్యంబుఁ బాటిల్లఁ జేసి
మహిమ నత్యుద్ధతి మదమునఁ దనరు
నంతట శ్రీవేంకటాచలరమణుఁ
డంతరంగంబున నంతయుఁ దెలిసి
తా నొసంగినయట్టి తదధికారంబు
మానుపరాదు ని మ్మహి జీవకోటి
నల కలి హింసించునది తాళరాదు

వెంకటరమణుఁ డర్చావతారము, శేషాచలము ప్రాకృతగిరి యగుట

తలఁచి తా నర్చావతారమై నిల్చి
మాయచే దివ్యవిమానంబు మరుగు
సేయుచుఁ దా నుండు శేషాచలంబు
శ్రీకరాకృతి మాటుసేసి లోకులకు
ప్రాకృతగిరియట్ల భాసిల్లఁజేయు.
అచ్చటి దివ్యరత్నావళు లెల్ల
నిచ్చలు మానుషనిచయంబులకును
పనికిరానట్టి యీ పలుగురా ళ్లనగ
కనుపట్టుచుండు న క్కాంచనచ్ఛటలు
మృత్స్నావిశేషసమ్మిశ్రముగాఁ దోఁచు
వాత్సల్యనిధియైన వనజాక్షుఁ డపుడు
కలిదోషదగ్ధులు కడతేరునట్లు

భక్తిఁ గలిగించుటకై మహిమలను జూపుట

తలఁచి యీ జనులకుఁ దనయందు భక్తి
కలిగించు నొకకొంత గనుపించు మహిమ
కలలఁ బత్యక్షమై కనుపట్టుచుండు.
ఆవేశముల కొంత అల్పజ్ఞులకును
భావికార్యము దెల్పి భక్తి బుట్టంగ
కొందఱికిని మది కోరినర్థములు
పొందుగా నొసఁగు నద్భుత ముద్భవిల్ల
తనకుఁ గానుక యింత తగనిండు మీకుఁ
దనయు లారోగ్యంబు ధనము గల్గింతు
ననుచు బేరములాడు నట్ల గావించు
జనులకు నిటు నిదర్శనములు చూపు

పలికి తప్పినవారిఁ బట్టి దండించు
విలుకడ భయమును నెమ్మఁ బుట్టించు.
తను భజించు మటంచుఁ దన కొండఁ జేర
తన లీలచేఁ బిల్చి ధన్యులఁ జేయు
మిక్కిలి యాపదల్ మేకొల్పి తనకు
మ్రొక్కిన నది దీర్చు ముదము రంజిల్ల
దేవమునీంద్రుఁ దెలియరానట్టి
దేవాదిదేవుండు దీనవత్సలత
ఖలుల కజ్ఞానాంధకారమగ్నులకు
కలుషయుక్తులకు సంకరజాతులకును
నాస్తికులకును జ్ఞానంబు సద్భక్తి
యాస్తిక్యమును కల్గునట్లు గాఁదాన
వివిధయత్నములు గావించి రక్షించు
భువనపావనలీలఁ బురుషోత్తముండు
అపు డట్టి శ్రీవేంకటాచలేశ్వరుని
విపరీతకలియుగవేళలయందు
జ్ఞానహీనులె యైన సకలజంతువులు
దీనులు రుగ్గులుఁ దృప్తులు జడులు
విప్రులు రాజన్యవిట్శూద్రజనులు
నప్రబుద్ధకిరాతయవనబర్బరులు
శకపుళిందాభీర శబరనిషాద
నికరముల్ మొదలుగా నిఖిలలోకులును
సేవించి కోరికల్ చేకొని లోక
పావనులై పుణ్యపదవిఁ జెందుదురు
కృతయుగాద్యులయందుఁ గేవలనిష్ఠ

క్రతువులు తపము యోగంబులు సల్పి
బహుజన్మములయందుఁ బ్రాపింపరాని
మహిత పుణ్యఫలంబు మనుజు లందఱును
కలియుగంబునను వేంకటనగాధ్యక్షుఁ
గొలిచి శీఘ్రంబుగాఁ గోరికల్ జెంది
యమరులు యోగీంద్రు లందలేనట్టి
విమలపదం బొంది వెలయఁ జాలుదురు.
జగతిఁ గావున కలి సాధు వనంగ
పొగడొందెఁ గలియుగంబు ముకుందుకరుణ
నావేంకటేశ్వరుఁ డర్చావతార
భావితమూర్తిప్రభావంబు మెఱయ
సాక్షాద్భవించి యా స్వామిపుష్కరిణి
దక్షిణతటభూమిఁ దనరెడి నొక్క
ఘనవనస్పతిక్రిందఁ గమనీయకుంజ
మున రమాదేవితో మురియుచు నుండు

వసుండను నిషాదునికథ

అప్పు డందొక వసుండను నిషాదుండు
చొప్పడు తన పూర్వసుకృతంబుకతన
స్థిరభక్తి నద్దేవుఁ జేరి సేవించి
నిరతంబు చిత్రయ న్నెలతతోఁ గూడ
చేరికె నొక కొఱ్ఱచేను గావించి
ధీరుఁడై మృగములు దిననీక కాచి
ముదిరిన యెన్నులు మును దీసితీసి
యది పిండి యొనరించి యలరుతేనియలు
బోసి మర్దించి యా బోనంబు శ్రీని

వాసుల కర్పించి వనితయుఁ దాను
నడె భుజింపుచు నితరాహార మేమి
మదిఁ గోర కీ నియమంబునఁ గొన్ని.
దినము లుండంగ నద్దేవునికరుణ
ననుపమహరిభక్తుఁడగు తనయుండు
కలిగిన నచ్చెంచు కలికి యా బాలు
నెలమిఁ బ్రోచుచునుండు నెడ నొక్కనాడు
ఆ నిషాదుఁడు తన యారేండ్లచిఱుతఁ
జేనికావలియుంచి చెలువయుఁ దాను
తేనె పొలమునఁ బోయి తిరిగి యందందు
పూని యొక్కెడ చేరఁబోరానియట్టి
చరిపణఁకున గొప్ప జలదంబుపగిది
తరచు తేనియబొట్లు ధరఁ జిల్కు తెట్టెఁ
కనుఁగొని చింతించి కాంక్ష రెట్టింప
మనమున నియ్యాస మానంగలేక
కలకంఠి కంటె యెక్కడ నెక్కరాని
బలుచరి నీ తేనె పదినూరు తొట్ల(ళ్ళ)?
పొడవున నున్న దిప్పుడు దీనిఁ దీసి
వడిచి యా నల్లదేవర కారగింపు
చేసిన భాగ్యంబు చేకురుగాదె
వాసిగా నది తీయ వశము గా దేమి
సేయుదు నేలాగు చేకొందు దీని
పాయక చేరు నుపాయ మే మనిన.
చెలి తన నాథుని చిత్తం బెఱింగి
బలుచింత యేమింత ప్రాణేశ నన్ను

తీగెయుట్టిని బెట్టి దించిన నేన
వేగిరం బా తేనె వితపోక తీసి
తెచ్చెద ననుఁ డట్టి తెరవ పల్కులకు
మెచ్చి కౌఁగిటఁ జేర్చి మీఁదికి నెక్కి
గట్టితీగలు దీసి కడు వడి నుట్టి
గట్టి బల్ నిడివిపగ్గముఁ బూన్చి యందుఁ
గలకంఠి నుంచి చుల్కని సిద్దె మొలను
బలునార సంధించి పౌజు కట్టియలు
మొనరాతఁ బొడిచి సొంపున దహజ్వాల
ననువుగాఁ దవిలించి యవి చేతి కిచ్చి
సరఘులవాక ట్టైసగుమందు జమిరి
సరగ నేర్పునని దించగ నించుబోణి
యా తేనెపెర చెంత నఘుకక నిల్చి
చేతి పౌజున నింత సెగఁ జూపినంత
ఝుమ్మని మక్షికల్ సుడివడి రేగి
కొమ్మ నంటగలేక కొమ్మల మీఁది
మర్కటంబుల నంటె మరిమరి మీట
మర్కటంబులు నటు మాటికి దాటి
కిచకిచమని పండ్లిగిల్చి కోపమున
నచటి భల్లుకముల నదరంట గరవ
నదరిపాటున భల్లుకావళి రేగి
పొదదూరి యలుక బెబ్బులుల మొత్తంగ
పులులు బల్ నిదుర మబ్బున చెలరేగి
పులిపులిగాఁగఁ గార్ఫోతులఁ జదుపఁ
గార్ఫోతు లదరి బాకరమంచు మిగుల

నార్చుచు కొమ్ముల నడవియేనుగుల
గొట్టంగ నవి బెట్టుఘూర్ణిల్లి కేల
బట్టు ఖడ్గాళిని బరిమార్చ నవియు
శరభంబులను జీల్చి చక్కాడ బెదరి
శరభంబుట్టలును సింహసంతతిఁ బొడువ
సింగంబులు కలంగి చిడుముడి కినుక
బొంగఁగ వనమృగంబులు దెబ్బటించ
మొనసి కోలాహలంబుగ సత్వములకు
ఘనమైన మధుబిందు కలహంబు గలుగ
చాన యల్లనఁ జేరి చక్కని చూర
తేనెతెట్టియ చీరి ధృతి నేర్పుమీరి
బలుసిద్దెలనునించి పగ్గంబు పైఁగ
చెలఁగ పైకదలించ చెంచు భావించి
చెలి చేఁదుకొనుతటి చేర్చి యుల్లాస
మలర కావడిఁగట్టి యతివ కిట్లనును
పొద్దుపోయెను కొమ్మ పొదమొ దేవరకు
నెద్దియు నైవేద్య మిడు వేళ దప్పె
నేమి యయ్యెనో చేను నెఱుఁగని బాలుఁ
డేమరియుండునో యిపుడు పోవలయు
నని హుటాహుటి రాగ నాలోన బాలుఁ
డనువుగా ముదిరిన యమ్మెన్నలెల్ల
తిగిచి యగ్గినిఁ గాచి దివ్వటనఁ బిసికి
తగుభక్తి వేంకటాధ్యక్షు భావించి

యా తండులము లుపహారం బొనర్ప
ప్రీతి మీరగ నందు శ్రీనివాసుండు
నట్టి నైవేద్యంబు నారగించుటయు
దిట్టయై బాలుఁ డాదేవుని కెఱఁగి
హరినివేదితశేష మటఁ దా భుజించి
హరిని కీర్తింపుచు నాడుచుండంగ
నంత నా చెంచువాఁ డరుదెంచి యెన్ను
లెంతయుఁ దిలకించి యా బాలుఁ జూచి
యోరి దురాచార యుబికి యీ యెన్ను
లారూఢి దేవుని కర్పించు మున్నె
తింటివి యిపుడె నీ దెగటార్తు ననుచు
నంటి ఖడ్గము దూసి యతని వేయఁబూను
నతని చే ఖడ్గంబు హరి యాచి పట్టి
క్షితిరుహంబున నిల్వఁజెంచు బెట్టులికె
మరలి చూడఁగ నీడ మలయు వృక్షమున
నరుదుగా వెడలి పీతాంబర ద్యుతులు
కర మొప్ప శంఖచక్రములు రాణింప
వరద కటీహస్త వైఖరి మెఱయ
నలమేలుమంగమ్మ యలరు రొమ్మునను
లలితకౌస్తుభహారలతలు చెన్నొంద
మకరకుండలరత్నమండనప్రభలు
మకుటకాంతులు దిశామండలి నిండ
నిలుచుండు హరిఁ గాంచి నెరి వెరగంది
యులికి ఖడ్గము వైచి యుర్వీతలమునఁ
గడిమి జాగిలమ్రొక్కి కరములు మోడ్చి

వడఁకుచుఁ దెలివొంది వనరుహనాభ !
దేవదేవోత్తమ ! దీనమందార !
దేవరలీలలు తెలియువా రెవరు
మాయెడ నింతటి మాయ లేమిటికి
చేయఁ బూనితివయ్య శేషాచలేశ !

అనవుడు శ్రీకాంతుఁ డన్నిషాదునకు
కనుపట్టి యోరి నీకన్న నీసుతుఁడు
పరమభక్తుఁడు వాని బాధించఁదగునె
తరుమూలమున నేనె తదుపహారంబు
చేకొంటి మద్భుక్తశేషంబు వీఁడు
గైకొని భుజియించెఁ గడు నందఱికిని
స్వామిసరస్తీరజగతి నుండుదును
నీ ముద్దుకొడు కెందునిలుచు నందెల్ల
నేను నుండుదు నంచు నెమ్మిఁ బల్కుచును
గానరాకనె మాయఁగప్పి యేగుటయు

వసుఁడు విస్మయమొంది వలఁగొని తరువు
వెసవెస సేవించి వినుతించి సుతునిఁ
గ్రుచ్చి కౌగిటఁ జేర్చుకొని యదిమొదలు
హెచ్చు కొఱ్ఱిలపంట నిడి రక్షణంబు
సలుపుచు జేనియల్ సంగ్రహింపుచును
నిలకడ తగుభక్తి నీరజాక్షునకు
వేళవేళలకు నైవేద్యంబు లిడుచు
చాలమోదంబునఁ జరియింపుచుండు
నయ్యెడ పాండ్యదేశాంతరాయాతుఁ
డై యొక ద్వాదశహాయనబాల

రంగదాసు పూలతోటఁగావించి స్వామిని సేవించుట

శూద్రుండు రంగదాసుం డనువాఁడు
వ్యాఘ్రదంజనము లైన యెల్ల దేశములు
ధీరతఁ గనుఁగొంచుఁ దిరుగుచు నల్ల
నారాయణపురంబునకు వచ్చి యందు
నారూఢిఁ బెద్దల నాశ్రయింపుచును
గూరిమి వసియించి కొన్నాళ్ళ వెనుక
శ్రీశుకాశ్రమమును జేరి యాపుణ్య
రాశి యగు పద్మసరంబునకు గ్రుంకి
పావనులగు బలభద్రకృష్ణులను
సేవించి తత్కృపచే ధన్యుఁ డగుచు
హరిభక్తి మది బుట్టి యలరుచుండఁగ
గరిమ మీరంగ వైఖానసమునులు
దినము శ్రీవేంకటాధీశు నర్చించు-
కొనుచు నిత్యము నందు గ్రుమ్మరునపుడు
వారలఁ బొడగాంచి వాఁడు ముదించి
సారెకు శుశ్రూష సలుప నమ్మునులు
కరుణించి యాశూద్రుఁ గడతేరునట్లు
పరమకైంకర్యలాభము సేయఁదలఁచి
వాని దోడ్కొని శ్రీనివాసాద్రి కరిగి
శ్రీనివాసులఁ జూపి చెలిమి నిట్లండ్రు
విను రంగదాస శ్రీవేంకటేశ్వరుల
కనుదినార్చనముల కగునట్లు పూల
తోటగావింపు ..............
..............నుండు ప్రతిదినంబిచట

హరినివేదిత శేష మాహారముగను
..........................
భుజియించు మిటు పనిఁబూని యుంటేని
నిజముగా ముక్తిఁ జెందెద వంచుఁ బలుక
నా రంగదాసుఁ డిట్లతి భక్తి మీర
నారామ మొనరింప నాత్మఁ దలంచి
స్వామిసర స్తీరసంకులారణ్య
భీమకంటకలతాభి వ్యాప్తగుల్మ
భూరితరక్రూర భూరుహావార
దారణం బొనరించి దంతురానంత
యంతయు కుద్దాలహాలకుఠారాది
సంతతహతిఁ జెక్కి సమభూమి చేసి
శ్రీనివాసాస్థాన చించాగమంబు
మానుగా రాణించ మహనీయవేది
సవరించి మెప్పైన చప్పరం బొప్ప
హవణించి యాచుట్టు నావరణంబు
గావించి కరవీర కాంచనవకుళ
దేవద్రుమందార తిలకపున్నాగ
నాగకేసరముఖ్య నగవిశేషములు
బాగైన మల్లెలు పారిజాతములు
జాదులు విరజాజి సన్నజాజులును
గేదంగి మొల్లలు గిరిమల్లికలును
శావంతెలును పచ్చశామంతెగుములు
లావైన కురువేరు లామజ్జకములు
దవనముల్ మరువముల్ తగిన కల్హార

కువలయవాటికల్ గొమరొప్ప సల్పి
విరిదోట గావించి వేంకటేశులకు
నిరతంబు మాలికానిచయముల్ గట్టి
నిలుకడయగు భక్తి నెమ్మనంబునను
నలువొప్పగ సమర్పణము సేయుచుండె
ఆరీతి నాతఁడా హరిరాజగిరిని
వైరాగ్యము వహించి వదలనిభక్తి
స్వామిపుష్కరిణిని స్నానం బొనర్చి
స్వామిపదాబ్జాభి సంధాననియతి
విరు లెత్తి యొక్కెడ విమలస్థలమున
సరులు గట్టుచు నుండు సమయంబునందు
దైవయోగమున నత్తఱి నొక్కనాడు
వేవేగ గంధర్వవిభుఁ డొక్కరుండు
నవరత్నమయవిమానంబుపై నెక్కి
భువనమోహనరూపముఁ మించుచెలులు
గొలువగాఁ గొందఱు కొమిరెగుబ్బెతలు
కలనాదము లొసంగు గానంబు సేయ
సరసంబు లాడుచు జవరాండ్రు కొంద
ఱిరుదండల విలాసహేలలు మెఱయ

గంధర్వవిభుఁడాతోటయొద్ద డిగి కాసారమున జలక్రీడగావించుట

నరుదైన వైభవం బలరంగ నింగి
నరుదెంచి యత్తోట యవనిపై డిగ్గి
విహరింపుచు మనోజవిభ్రమం బెసఁగ
బహువిధంబుల యాటపాటలఁ జెలఁగి

## జలకేళివర్ణనము

యలరుచు కాసార మటుగాంచి యందు
జలకేళి సలుపంగ సన్నద్ధుఁ డైన
నయ్యెడఁ బ్రాయంపుటాగనామణులు
చయ్యన వస్త్రముల్ సడలించి యుంచి
యూరుమూలద్యుతు లొరపొందు మెఱపు
తీరున మెరయంగ దీప్తనితంబ
మా రతిరాజవిహారాద్రి కరణి
మీరంగ రంగొందు మెయి నిగ్గుజగ్గు
కులుకు శిబ్బెపుగబ్బి గుబ్బపాలిండ్లు
కులుకు కన్గవల బెళుకులు తళ్కొనంగ
సంజడాల్ దొరగిన శశిరేఖలనఁగ
గంజిల్లు మొయిలు బర్వని మించు లనఁగ
కంతుని పరుఁజంచు కైదువు లనఁగ
కాంతువెంబడిని సింగార ముప్పొంగఁ
గాసారమునఁ జొచ్చి కమలకల్హార
భాసురవాసనాభరితతరంగ
జాలడోలాలోల శైవాలనీల
నీలకుంతలపాళి నెరి గమ్మకొనఁగఁ
దమ నెమ్మొగమ్ములందంపుకెందమ్మి
గముల విందుగ నంది కందువ నలరఁ
గలికివగలు గుల్కు కన్నులబెళ్కు
వొలయు బేడిసలసొంపున నింపు నింప
కుముదకుట్మలముల కొమరున హార
విమలమౌక్తికములువింత నీటంద

వెలికలఁబడియీఁదు విరిబోఁడిమోవి
తలిరు చిమ్మనఁగ్రోవి దనవిభుమోముఁ
దగల నీరము జిమ్మఁ దమకించి యతఁడు
తొగలయందెలఁ బూని తోయముల్ చల్లఁ
గెలన నొక్కతె బోరగిల యీఁదిఁ వేఁడిఁ
జిలువయంచును జూపి చెలి నళికింప
నది యొక్క కే లంటి యలివేణి పిరుదు
నిది తెప్పయని యొక్క నెలఁత నుంకించ
నొకతె యట మునింగి యూర్పక నడఁగ
నొకతె వెంబడి దాని నొగి వేగ వెతక
స్తనతటద్వయసమాజలమునఁ జెలువఁ
గినిసి కాంతుఁడు స్థితక్రీడ సల్పగను
కనుఁగొని వనిత యొక్కతె రతి కలరి
పెనఁగి సిగ్గు దొలంగి ప్రియునిఁ బైకొనఁగ.
నిటుల మోహనకేళి నింపొందునట్టి

రంగదాసుని మతిభ్రమ-వైఖానసులుదూరుట

కుటిలాలకలను గన్గొని మరు లొంది
యల రంగదాసుఁ డం దలరి మైమఱచి
నలరులసరుల నొయ్యన జారవిడిచి
[1] తనువి స్ఖలనఁగా నతనుపరవశతఁ
దనరుచునుండ గంధర్వుఁడు కేళి
చాలించి చెలులతోఁ జయ్యన వెడలి
మేలొప్పఁ దటభూమి మెఱయు వస్త్రములు

1. "తనువిస్ఖలనంగా" వ్రా. ప్ర. పాఠము.

క్రమమున ధరియించి కనకవిమాన
మమరికె నెక్కిఁ నిజాలయంబునకుఁ
దరలిన నా రంగదాసుండు తెలివి
వరల సిగ్గున మోము వంచుక లేచి
విరులదండలు బారవేసి యా స్వామి
నరసి తీర్థంబున స్నానంబు చేసి
సమయంబు దప్పుట జడిసి క్రొవ్విరులు
విమలత గ్రహియించి వెస సరుల్ గట్టి
కడిమి వైఖానసాగ్రణిచేతి కొసఁగఁ
గడకతో వాని నా ఘనుఁ డిట్టులనును
తడవయ్యె నో రంగదాసి యిందాక
కడు నిద్రఁజెందితో కాక మరచితో
విరులు దేవైతివి వేళ దప్పుటను
హరిపూజలను చాల నపచార మయ్యె
నిదివర కొకనాఁడు నిటు ఉంటలేదు
మదము దొట్టెను నీకు మాట లేమిటికి
యను మానిపలుకుల కాత్మఁ గలంగి
తన నేర మెంచి యుత్తర మియ్యలేక
తలకొన్న సిగ్గునఁ దనలోనె క్రుంగి

### రంగదాసుని శ్రీనివాసులూరడించుట

తలవంచుకొని పరితప్తుఁడై నిలువ
శ్రీనివాసుండు మచ్చిక నానతిచ్చు
బాలక ! నీకేల బలుచింత యింత
పోలని సిగ్గుచేఁ బొగల నేమిటికి
సుదృఢవైరాగ్యంబు శోధించవలసి

మదిమది నేనె యిమ్మాయఁ బన్నితిని
నా మాయఁ దెలియంగ నలువయుఁ జాలఁ
డిల మనుజు లెఱుంగ నెంతటివారు
నాలీలచొప్పున నరులెల్ల నెపుడు
కీలుబొమ్మలమాడ్కి గెరలి యుండుదురు
గాఢబోధవిరాగకలితులుదక్క
మూఢులిమ్మాయచే మోసపోవుదురు
కావున వగపేల కడతేర్తు నిన్ను
భావంబునన్ దృఢభక్తిఁ జెందుదువు.
తెలగుగంధర్వుని చెలువంబు చూచి
యలరి మోహించుట నవ్విధంబునను
నీ వొక్కజన్మంబు నృపతివై పుట్టి
భూవర కన్నెలన్ బొసఁగ వేవురిని
కడు స్వయంవరములఁ గై కొనికోర్కి
లడరంగ మరుకేళి నమితభోగంబు
లనుభవింపుచు నన్ను నతిభక్తిఁ గొలిచి
కనకవిమానాదికము మా కొనర్చి
బహువత్సరంబులు భాగ్యసంపదల
రహిచక్రవర్తివై రాజ్యంబు నేలి
తుదను మోక్షమును జెందుదు వంత నీవు
వదలక యారామ వరముఁగావించి
యలరులసరులు మా కర్పించుకొనుచు
నలరుచునిట యావదాయుష ముండు
మనుచు నాజ్ఞాపించి యందు ముకుందుఁ
డొనరు నర్చాకృతి నూరక యుండ

యా రంగదాసుండు నటులనే భక్తి
మీఱంగ కైంకర్యమే స్వరూపముగ
శ్రీవేంకటేశ్వరుసేవ సల్పుచును
పావనశీలుఁడై బహువత్సరములు
చరియించి దేహావసానంబునందు
సురరాజ్యవైభవ సుఖములు చెంది
ధర చోళభూపాల తనయుఁడై పుట్టి
వరశీలమునఁ జక్రవర్తి నాఁదనరి
శ్రీనివాసులకు విశిష్టవిమాన
మానితమందిరమంటపావరణ
వరభూషణాదుల వరుసఁ గావించి
పరమభక్తి చెలంగ భాగ్యసంపదలు
నిరతంబు చేకొని నృపకుమారికల
వరుసమీఱఁగ స్వయంవరవేళయందుఁ
బెక్కండ్ర నర్మిలి బెండ్లాడి కీర్తి
పిక్కటిల్లఁగ శత్రుభీషణుం డగుచు
హరిచక్రమే తన యాప్తబలముగ
ధరణిచక్రంబు నంతయును బాలించి
సాగతరజ్ఞాన సంపత్తి శౌరి
సారూప్యమొప్ప మోక్షంబుఁ జేకొనును.
అనుచు సూతుఁడు భవిష్యత్కథఁ దెలుప
విని యమ్మునీంద్రులు విస్మయమొంది
ఖ్యాతపురాణేతిహాససారజ్ఞ
సూత యా రంగదాసుఁడు చోళవిభుని
కెవనికిఁ దనయుఁడై యిల నుదయించు

భువి నెందు వాఁ డుండు భోగసంపదలఁ
బూని మదాంధుఁడౌ భూవరుం డగుచు
శ్రీనివాసుల నెట్లు సేవింపఁగలుగు
చక్ర మాతని కెట్లు సాధనం బగును
చక్రవర్తిగ ధరాచక్ర మె ట్లేలు
విన వేడుకయ్యె సవిస్తారముగను
వినుపించు మంతయు వేసటపడక

యనుచుఁ బ్రార్థించిన నాతఁ డమ్మునులఁ
గనుగొని మరియు నక్కథఁ దెల్పఁ దొడఁగె

చోళచక్రవర్తియై పుట్టిన రంగదాసుకథ

వినుఁ డట్టి దక్షిణోర్వీభాగమునను
వనరాశి వేంకటవసుధాధరంబు
గొనకొన్న కన్యయు కుటకరాష్ట్రంబు
దనయెల్లలుగ మించు ద్రవిడదేశమున
నల చోళదేశధరాధీశుఁ డొకఁడు
బలశాలి యతిధర్మపరుఁ డుదారుండు
పలికి బొంకనివాఁడు పరదారములను
తిలకించనొల్లని ధీరమానసుఁడు

పరరాజబలగర్వ భరతమోహరణ
తరుణార్కకోటి ప్రతాపశోభితుఁడు
రారాజదక్షిణదిగ్రమణికుచాగ్ర
హారకర్పూర నీహారపటీర
సారమందార లసత్సరాకార
ఘారగారోదారకమనీయకీర్తి

మానినీజనమనోమానలుంటాక
భూనుతసౌందర్య పుష్పబాణుండు
భూరిలసద్గుణాద్భుతసముద్రుండు
వీరచోళుండను విభుఁడు చెలంగు

వీరచోళుఁడు వేఁటాడఁబోవుట

అతఁ డొక్కనాఁడు వేటాడంగ వెడలి
యతులమగు నొక్క జాత్యశ్వంబు నెక్కి
వనగోచరావళి వరసైనికులును
మొనమీరనుద్ధతి ముందర నడర
నందు కొందఱు గుఱ్ఱాళ్ళఁ జేపట్టి
పందివలల్ బూని బలువిడి నడవ
కుందేటివలలు చేకొని కొంద ఱేగ
కొందఱు నటు జోపుకోల లూని చన
కొందఱు పికిలిపూల్ కొమరారు కుచ్చు
లందమొందెడు డేగ లందుక రాగ
వనములెల్లను నిండి వడి నార్భటములు
దనరంగ మృగము లెంతయుఁ దల్లడిల్ల
ధాటిమీఱగ నట్టి ధరణీశ్వరుండు
వేటలాడుచు జని వేంకటాచలము
చెంగట నత్యంత శీతలాంబువులు
చెంగలించంగ రంజిలు స్వర్ణముఖరి
తీరంబునన్ దావి దెలుపంగ నలరు

వేంకటాచలసమీపమున విరిదోటలో నొక నాగకన్యనుగాంచుట

నారంగకనకపున్నాగాదిశోభి

తారామములఁ జేరి యాతపశ్రాంతి
దీరంగ నీడలఁ దిరుగుచుండంగ
నవ్వారిజోఁటలో నందచందముల
నివ్వటిల్లుచుఁ గుల్కు నీటువాటిల్లు
మెరుగుచందంబున మేనిగ్గు మెఱయ
మరునిమోహానవిద్యమాట్కి సింగార
మొరపుమీఱంగ మే నొందిన కరణి
మెరుఁగుబోఁణి యొకర్తు మెల్ల నె విరులు
గోయుచు నఖకాంతి కోరకావలికి
చాయలు దేరుప సరసహాసంబు
విరులకు నొకకొంత వింత రం గిడఁగ
కరకంకణంబుల కలరవంబులు పుల్గు
నాదంబుతోడ విన్నాణంబు నూప
పాదపద్మము లంటి బలుకు హంసకము
లడుగడుగునకు నొయ్యన నెచ్చరికలు
నుడువుచుండఁగ మొలనూలు చలింపఁ
బెనుపొందు చనుదోయి బేర్చిన పరపుఁ
గొని యానుటం గాను కొంత గంపింప
మక్కువ మెరుగుకమ్మల తళ్కు ముద్దు
చెక్కిళ్లపై రంగు చికిలి సేయంగ
నలరుమోమునఁ దమ్మి నళు లంటుకరణి
నలకముల్ జార నఖాళిఁ దీర్పుచును
పొదలెడు బంగారు బొమ్మన నలరు
పొదచెంత మొల్లఁగునాపూఁబోఁణి నతఁడు

దిలకించి విస్మయోదీర్ణ భావమునఁ
బులకించ మైమరుల్ బొడమ డెందమునఁ
దనచూపు మరలింప ధైర్యంబులేమిఁ
గనుఁగొంచు నిలుచు నంగజమాయఁ దగిలి.
ఆ నాగకన్యక యా నృపుఁ జూచి
మానసంబున మరుల్ మమతయు మించ
కువలయాప్తునకు మేల్ గొను చకోరికల
హావణికఁ దనచూపు లానంద మంద
నతని రూపవిలాస మరయుచు భావ
మతులితోల్లాసంబు లందఁగా నందు
సొలయుచు నీతఁ డా సురరాజసుతుఁడో
నలకూబరుఁడో యల్ల నలినసాయకుఁడో
గాకున్న నీసోయగము విలాసములు
చాకచక్యంబు నెసంగు మైరుచులు
గలుగునే యొరునకీ గతి నంచు మిగుల
వల పగ్గళించ నవ్వనమున నడుగు
దరలఁజాలక నిల్చి తన కేలు బొదల
విరుల [1] గుత్తుల నంటివిడువక నదల
సొలపుచూపులు రాజు సొగసుల నంటి
కలువలు వెదచల్లఁగా మనోరథము
నెక్కుడు గాఁజెంది యిందీవరాక్షిఁ
డెక్కుడువింటితూ పెదనంటి నాట
సొమ్మసిల్లుచుఁ జాల సొక్కి చిత్తరువు
బొమ్మచందంబునఁ బొలుపొందుచుండ

1. " విరులగొంతుల నంటి " వ్రా. ప్ర. పాఠము.

అపు డంగజాంభోరుహాస్త్రధారలకు
నృపతి తల్లడమంది నెలతుక జోడు
గూడి జీవితరక్ష కొమరొంద సలుపఁ
దా డెందమున నెంచి ధైర్యంబు డించి
కలకంఠి చెంగటఁ గదియుచో దాని
బెళుకుచూపను ములికి బెట్టు నాటంగ
మది విభ్రమముఁజెంది మరి మోహమంది
సుదతి నొయ్యనఁ జేరి సొలపింతఁ దేరి
తమకము న్నయ మూప తన నాన చాప
లము మాప నేపున లలన కిట్లనెను
అలివేణి యెవతె వీ వమరభామినివొ
చిలువరాచెలువవో చిత్తజుచెలివో
నీయందచందముల్ నీటందు నీదు
సోయగంబును జూచి సొలసితిఁ జాల
యెవ్వరిదాన వదేమి నీ నామ
మివ్వనంబున వచ్చు టేమి నీ వొంటి
నో కొమ్మ దెలుపవే యుల్లాస మెసఁగఁ
జేకొమ్మ నన్ను నీ చెలికాఁడు గాఁగ
నావు డా ననబోణి నరపాలమణిని
భావించి యాతని భావంబు దెలిసి
వానిపల్కులు సుధావర్షంబు కరణి
వీనుల వడ దీర్ప వేడ్క రెట్టింప
తమకంబు సిగ్గును తడవడ నిలిచి
తెమలని వల పూని తిలకించి యతని
నరపాల నేను ధనంజయుం డనఁగఁ

బరగు నాగేంద్రుని పట్టి నీతోఁట
యందు విరుల్ గోయ నరుదెంతు నెపుడు
నందినియనుదాన నాగకన్యకను
నీ వింద్రసుతుఁడవో నీరజాస్త్రుఁడవొ
భూవరోత్తముఁడవో పొసఁగ నిచ్చోట
నెన్నడు రాఁ గాన మెవ్వఁడ వీవు
తిన్నగా నన్నియుఁ దెలుపుము వనిత
చోళభూపాలుఁ డా సుదతికి మదిని
బాళి రెట్టింపఁగాఁ బలుకంగఁదొడఁగె.
వినుము నందిని భానువిమలవంశజుఁడ
వినుతచోళావనీ విభుఁడను నన్ను
వీరచోళుం డంద్రు వేటాడవలసి
ఘోరకాననములఁ గ్రుమ్మరునెడల
సేనలు నందందు చెదరి యేగంగ
నీ నదీతటమున నే విశ్రమించు
తమి నిందు వచ్చితి దైవయోగమున
రమణీయమూర్తి వై రంజిల్లు నీదు
చక్కదనముఁ జూచి చాల మేలొంది
చక్కెరవిలుకాని శరములఁ గంది
నీ దండఁ జేరితి నెమ్మి మీఱంగ
వేదండగమన నన్ వెడవిల్తు కేళి
నలమి వే చెలిమి నీయధరామృతంబు
నెలమిఁ గ్రోలఁగ నీవె యెదతాప మెడల
తమ్మిమొగ్గల నిగ్గుఁ దరమి యెగ్గించు
పొంమ్ము చన్దోయి నాఁయురమునఁ గ్రుమ్మి

మోహాబ్ధి దాటించి ముదముఁ బాటించి
మోహనకేళి సొంపున నేలఁ గోవె
అనుటయు నాబాల నంగజలీల
దసరంగ భావించి తనమోము వాంచి
చెక్కులు పులకించఁ జెలువునిఁ గాంచి
మక్కువ మదినుంచి మహిపాలచంద్ర
నీతిశాస్త్రంబులు నీ వెఱుంగుదువు
స్వాతంత్ర్య మంగనాజనులకుఁ గలదె
ఈతరి కన్యక నే నిట్టిపనుల
మాతండ్రిచే ననుమతి నొందవలదె
తెగువ గుర్వాజ్ఞ నతిక్రమించంగఁ
దగవుగా దింక మాతండ్రిని నడిగి
తేని సమ్మతి నీకె యిచ్చెను నిజము
మానుము దుడు కనుమాన మేమిటికి
జలరాశి యుప్పొంగి సంరంభమునను
చెలియలికట్ట మించిన నాగవశమె
నీవె ధర్మంబుల నెఱిని బాలింపఁ
గావలె మర్యాదఁ గడవంగఁదగునె
యని పల్క నా చెలి నవనిపాలుండు
నెనరునఁ జేకొని నీతిగాఁ బల్కు
తరుణిరో రాజు కధర్మంబు గాదు

చోళరాజు నాగకన్యకను గాంధర్వ విధిని బరిణయంబగుట

పరికింప గాంధర్వపరిణయం బవని
నన్యోన్యసమ్మతి నగు వివాహంబు
ధన్యమై తగును గాంధర్వం బనంగఁ

దొలుత శకుంతలాదుష్యంతులకును
కలయిక వినలేదె ఘనులు దెల్పగను
నిమిషమాత్రంబైన నినుఁ గూడకున్న
తమిఁ దాళఁజాలనే తరుణీలలామ
అనుచు సమ్మతి నిల్పి నలివేణి నలమి
ననవిల్తుకేళిని నయముగాఁ గలసి
యానందభరితులై యతివయుఁ దాను
బూనినచెలిమితోఁ బూఁబొదరిండ్లఁ
జెలఁగి విహారంబు సేయుచుండంగ
నల ప్రొద్దుగ్రుంక సంధ్యారాగ మెసఁగ
నంతట న య్యింతి యటుసంజయగుట
నెంతయుఁ జింతించి యింటివా రెందు
వెదకుదురో యంచు వేగిరపాటు
గదురంగ విభుఁ బాయగాఁజాల కపుడు
బెదరుచు విభు వేగ బిగువుకౌఁగిటను
గదియించి యేమి బల్కఁగలేక మదిని
విరహంబును దలంచి వివశయై సోలి
నెరసిన నిట్టూర్పు నిగుడ నో రమణి
జక్కవకవ లిట్టి సంజలు నెంత
స్రుక్కనో యెడబాసి సొలయుచు నెటుల
వేగించునో యిట్టి విరహంబు మనకు
నీగతి విధియించె నీశ్వరుం డకట
యిలఁ జేరవలె నింక నేమి సేయుదును
కల గన్నటుల నిట్టి కలయిక గల్గె
ననుచుఁ గన్నుల నశ్రు లడరంగ నృపతి

యనుపఁగా వీడ్కొని యరుగంగ నతఁడు
మోహాంబురాశిలో మునిగి పైఁదేలి
యూహించి చెలికూర్మి నుసురుసు రనుచు
నెతమీఱ మరలి తన్వెతకెడుసైన్య
తతిఁ గూడి యరుదెంచెఁ దనపురంబునకు
మదిరాక్షిపై మరుల్ మది నిముడ్చుకొని
పదపడి రాజ్యంబు పాలింపుచుండు

ప్రొద్దుగ్రుంకినపిదప నాగకన్యబిలముసొచ్చి రసాతలంబున కరుగుట

అయ్యెడ నాగకన్యామణి బిలము
జయ్యనఁ జొచ్చి రసాతలంబునకు
నరిగి తండ్రి కెఱంగి యట్టి వృత్తాంత
మెఱిగింప విని యతం డెద మోదమందె
నా నందినికి గర్భ మపుడె గల్గుటయు
మేనఁ జిన్నెలు కొన్ని మెఱయంగఁ జెలులు
జననియుఁ గనుఁగొంచు సంతోష మడరఁ
జనవున గర్భోపచారముల్ సల్పఁ
గొన్నాళ్ళ కా కన్నెకును ప్రొద్దు లగుట
సన్నుతం బగు శుభసమయంబునందు
హరిభక్తియును గీర్తి యతులసామ్రాజ్య
మురుతరభోగభాగ్యోన్నతుల్ చెందఁ

హరిభక్తుఁడగు కుమారునియుదయము

గల మహాపురుషుఁడు కలకంఠి పుణ్య
కలనచేఁ దనయుండుగా నుదయించెఁ
బెరుగుచు శైశవప్రియకరలీల
లారఁబొంద నాడుచు నుచితవిద్యలను

జదువుచుండఁగ ధనంజయుఁ డను తాత
ముద మొంది యాదరంబునను లాలింపఁ
బ్రకటవివేకంబు ప్రబల నాబాలుఁ
డొకనాఁడు తన తల్లి యొడిని గూర్చుండి
ముద్దుల మాటల ముచ్చటాడుచును
తద్దయు మురియుచుఁ దనతండ్రి యెవ్వఁ
డని యడుగుటయు న య్యతివ డెందమున
నెనరును ఖేదంబు నిగుడ భావించి
సుతుమోము మూర్కొని సొలయుచు నూర్చి
క్షితి చోళవిభుఁ డంచు చెలఁగు భూవరుఁడు
నీ గురుం డని తెల్ప నృపకుమారకుఁడు

కుమారుఁడు తనతండ్రిచోళవిభునిఁ జూడఁబోవుట

వేగ న వ్విభుఁ జూడ వెడలి యా తాత
కెరగి య బ్బిలము నాగేంద్రుండు చూప
పరిజనుల్ కొందరు పరిచరింపంగ
నరుదెంచు తన ధైర్య మందఱు మెచ్చ
నరిమురి యా జాడ నవనికి వచ్చి
నారాయణపురంబునం దన తండ్రి
వీరచోళేంద్రుండు విలసిల్లునగరుఁ
జేరి యమాత్యులచేఁ దన రాక
భూరమణునకును బుత్తెంచునంత
వార లద్భుతమంది వసుధేశుకడకుఁ
జేరి చోళనృపాల! చిన్నవాఁ డొకఁడు
ద్వారవేదిక నిల్చి ధైర్య మొప్పంగ
వారక మముఁ బిల్చి వాక్యచాతురిని

నందినిసుతుండను నాగలోకంబు
నందుండివచ్చితి నవనిపాలకునిఁ
గని మాటలాడంగ కార్యంబుగలదు
విన విభునకు విన్నవించుడీ యనుచుఁ
బలికెడి నతని రూపము వైఖరియును
పొలుపును జూడ నీపోలికె గాఁగఁ
గనుపించు నివి యేమొ కారణం బనుడు
విని చోళభూపతి విస్మయంబునను
బిలువుఁడా బాలకుఁ బెలుచ నంతయును
తెలియుద మన వారు తీవరంబుగను
రమ్మని యతని నా రాజశేఖరుని
సమ్ముఖంబునఁ దెచ్చి సరస నుంచంగ
నా నందినీసుతుం డవనిపాలునకుఁ
బూనికఁ గేల్మోడ్చి పొసఁగినభక్తి
వినయముల్ మీరంగ విసువనిధైర్య
మొనరంగ గాంభీర్య ముప్పతిలంగ
నిలుచుండఁగాఁ జోళనృపతి యాబాలుఁ
దిలకించి ముదము సందేహంబు గదుర
భావించి యిట్లను బాల యెందుండి
నీవు వచ్చితి విందు నృపకుమారుఁడవో
దివిజసంభవుఁడవో తెలియ మీతండ్రి
యెవరు వచ్చినపని యేమి నావుడును
విభునికి బాలుండు వెస కేలుమోడ్చి
సభికులందరు విన సమ్మదం బొదవ
వినుము దెల్పెదను వివేకనిధాన !

యినవంశతిలకుఁడై యిల యెల్ల నేలు
వీరచోళాహ్వయ విభుఁడు నా తండ్రి
యారయ నందిని యను నాగకన్య
నను గన్న జనని ధనంజయుఁ డనఁగఁ
దనరు నాగేంద్రుండు తాత యీవరకు
నాగలోకమునందునన్ వసియించి
నే సురుశుశ్రూష నియతి సల్పగను
వచ్చి తెంతయును దేవర యెరుంగనిజె
మచ్చిక నిపుడు నా మాటలు వినఁగ
నడిగెద రింతెగా కందఱు తెలియ
నెడపక తెల్పితి నే నెరింగినది
అనిన సభాసదు లందఱు దొరయు
మునుకొని మొకమొకంబులు చూచుకొనుచు
విస్తుబోవుచుఁ బల్కువెరవు జాలక యె
సుస్తిమితాత్ములై చోద్య మందుచును
రంగుచిత్తరువుల రహిఁ నుండునపుడు

ఆకాశవాణి యా కుమారుని మహత్త్వమును దెలుపుట

సంగతి గగనభాషణ మిట్టు లొడము
ధరణీంద్ర నిజము నీ తనయుఁ డీతండు
పరమాత్మ వెంకటపతికి భక్తుఁడయి
యా చక్రవాళాంత మనదృశాఖండ
భూచక్రమంతయు భుజశక్తి నేలఁ
గలుగును శ్రీరమాకాంతుఁ డీతనికి
నెలమిఁ బ్రత్యక్షమై యిష్టసంపదలు
కలిగించి యితనిచేఁ గైంకర్యములను

చెలిమిఁ జేకొనఁగల్గు క్షితిచక్రవర్తి
యగుచు నీవంశంబు నతిధన్యముగను
బాగ డొందగాఁ జేయు పుణ్యుఁ డీతండు
మది సంశయముమాని మన్నించుమనవు
డది విని సభ మంత్రు లభినుతి సేయ
జనపాలుఁ డా బాలు సమ్మదం బొప్ప
నెనరునఁగైకొని నెఱిఁ గౌఁగిలించి
శిరము వే మూర్కొని చెక్కులఁ బుణికి
కరుణ లాలింపుచుఁ గడు మున్ను వేటఁ

జనుటయు నం దొక్క జలజలోచనను
గనుఁగొని మోహించి కలయు వృత్తాంత
మంతయుఁ దలఁచి యాఁ దా మంత్రులకును
వింతగా వివరించి వేగ నచ్చెలువ
రావించి మునులచే రాకొమరునకు

తొండమానాఖ్యఁడగు నందిని కుమారునకు రాజ్యాభిషేకము

భావితసూత్రోక్తపరిపాటి నపుడె
జాతకర్మాదులౌ సత్క్రియల్ సల్పి
ఖ్యాతిగా తొండమా నను నాఖ్యఁ జేసి
చదివించి వేదముల్ సాదనల్ నేర్పి
చదురుగా వేంకటశైలంబుచెంతఁ

దనరంగ నొక రాజధాని నిర్మించి
తనయు నప్పురమునఁ దనరాజ్యమునకు
నభిషేకమొనరించి యభిమతసిద్ధి
నుభయలోకశుభంబు లొనగూడునట్లు

క్రతువులు సల్పి సంక్రందనాస్థాని
నతిశయవిభవంబు లలరంగ నుండు
అంత నా తొండమానను చక్రవర్తి
సంతతవిక్రమ చాతురి నరుల
నిగ్రహింపుచు మిత్రనివహముల్ గడు న
నుగ్రహింపుచు సురల్ నుతియింప ధరణి
నాసేతుతలశీతలాచలం బెలమి
భాసురనిజభుజాబలవిక్రమములఁ
బాలింపుచుండంగఁ బాండ్యభూవరుఁడు
శీలవతి యనంగఁ జెలఁగెడు తనదు

తొండమానుఁడు పాండ్యాది భూవరుల కన్యలబెండ్లాడి సుఖించుట

తనయకు నభినవతారుణ్యలక్ష్మి
మొనసి సౌందర్యవిభూషణంబుగను
తనులతానవవసంతశ్రీయనంగఁ
దనరుచుండంగ న త్తరుణీలలామఁ
గనుఁగొని పతియోగ కల్యాణయోగ్య
త నెఱింగి చెలికింపు తగ స్వయంవరము
చాటించఁగా నందుఁ జని చక్రవర్తి
బోటినిఁ బెండ్లాడి భూవరుల్ బొగడ
మామ యరణ మిచ్చు మణిభూషణములు
సామజరథఘోటసంఘంబు నంది
నందినిదేవి కానందం బొసంగ
పొందుగా నరుదెంచి పురి విహరించు
నీ గతి కర్ణాటహైహయభోజ

మాగధకాంభోజమాళవమత్స్య
కేరళాంధ్రకళింగకేకయలాట
శూరసేనాధికక్షోణీధురీణ

కన్యకలను బరిగ్రహలీలఁ జెంది
మాన్యమనోజ్ఞాగమక్రమాచార
మలర విచిత్రసౌధాంతరంబులను
సలలితశశికాంతచంద్రశాలలను
నద్దపుఁబడకిండ్ల హారువుమేడలను
నిద్దపు విరులపందిరుల తావులను
వెన్నెలబైళ్లను వెస రతనంపు
దిన్నెల కాసారతీరభూములను
వన్నె మీఱిన పుష్పవాటీతతులను
పొన్నలగున్నలఁ పొదలు పూఁబొదలఁ

కేళిడోలికలను గృత్రకశైలముల
బాళిక్రీడింపుచు భామినీమణుల
తమిరేఁచి వలపించి దక్షునిలీల
రమియింపుచు సుఖాభిరతి నొకింతయును
తనివి వేసటయు నితరకార్యాసక్తి
యును లేక యుండియు నుచితవేళలను
ధరణిఁ బాలింపుచుఁ దగు బలంబులను
కరుణఁ బ్రోచుచునుండఁగా నొకనాడు

కీలారులు పాలకడవలు పగులుచున్న వృత్తాంతము రాజునకు దెలుపుట

అతని గోధనముల నరయు కీలారు
లతిరయంబున వచ్చి యాస్థానమునను

పేరోలగంబుగాఁ బెంపొందు నృపతిఁ
జేరి వే పాడగాంచి చేతులు మోడ్చి
వినుము దేవర యొక్క విన్నపం బిపుడు
మన యాగదుపులెల్ల మల యొక్క యందు
మేతలు దండిగా మేయుచుఁ జాల
నా తోటదోనలయం దమృతమువంటి
నీరు ద్రావుచు మేల్మి నిత్యానిత్యంబు
మీఱి చ న్నవిసి పాల్ మిగులఁ బిండంగ
నేము నచ్చోటనే నిలుకడ గాఁగ
గీము సేసుక దొడ్డి ద్రేపులు మనఁగఁ
గాచుచు నా పాలకడవలన్నియును
దాచక నగరికిఁ దగువేళఁ దెచ్చి
యొప్పగించుచు నుందు మొకనాడు నెట్టి
తప్పిదంబులు లేవు ధరణీతలేంద్ర
అలత్రోవలో నొక్క యడవిలోపలను
కొల నున్న దా చెంత గొప్పయౌ పుట్ట
యొక్కటి యున్న దా యోరగా రాఁగ
నక్కడ కడవ లీ యన్నియుఁ బగిలి
పాలెల్లఁ బుట్టలోఁ బడిపోవఁ జూచి
యేలాగు పదిలమై యేగినా యందె
వాలాయముగఁ గడవలు దానె బలిమి
వ్రీలుచున్నవి యెందు వెదకిన నొకని
గానము మరి యొక్క కడ వత్తు మనిన
కాన యల్లుక త్రోవ గనఁబడ దెందు
నెవ్వరిచేఁతయో యేదైవ మచట

నివ్వగ సేయునో యెఱుఁగరాదయ్యె
నిది తెలివిడి గాఁగ నిపుడె దేవరవు
కదలి విచారించఁగావలె నొండె
తగు నాప్తులైన పెద్దలఁ బంపి తెలియ
నగునొండె యిదియెంత యని యుండరాదు

దినదినం బీ గతి తెఱువున పాలు
కనుకట్టువలె పోవఁగా నగరికిని
పాలురాలేదని ప్రభువులు మమ్ము
చాల దండింపఁగా జనులెల్ల వారు
మదిని శంకింపరే మము దొంగ లనుచు
అదిగానఁ దెల్పితి మంతయు ననిన
విని నరపాలుఁడు విస్మయంబునను
మనమునం జింతించి మంచిదేఁ వెదుక
నన్నియుఁ [1] దెలిసెదునని వారిఁ బంచి
తిన్నఁగా నరిగి యంతిపురంబునందు

వసుధేశుఁ డా గొల్లవారి వాక్యములు
వెసవెస తలపోసి వెంకటగిరిని
వెన్నుఁ డున్నాఁడంద్రు విబుధు లావల్క
లన్నియు నిక్కమే యాపుట్టయందు
హరి యుండకుండిన నట్టి పాలెల్ల
నిరతంబు నచ్చోటనే చిందనేల
యని యూహసేయుచు నాహ్నికక్రియలు
దనరంగఁ దీర్చి యెంతయు శుద్ధుఁడగుచు
పరమాత్ము మదిలోన ధ్యానించుకొనుచు

1. "దెలిసెదనని" వ్రా. ప్ర. పాఠము.

### స్వప్నమున రాజునకు శ్రీనివాసులు తనను గూర్చి తెలుపుకొనుట

వరశయ్య నిద్రింప వనజలోచనుఁడు
నరనాథ స్వప్నంబునఁ గనుపట్టి
కర ముపదేశంబు గావింప నతఁడు
కలఁగని ప్రత్యూషకాలంబునందు
నలరుచు లేచి యత్యాశ్చర్య మొదవ
తన మంత్రిజనుల నందరిని రావించి
యనుపమానందుఁడై యప్పు డిట్లు లనును
వినుఁ డూకొనక రేయి వేకువ నేను
కనుఁగొంటి నొక వింత కల యది దలపఁ
బులకాంకురంబులు బూనెడి మేను
జలధరశ్యాముఁడు జలజలోచనుఁడు
గను నొక్క దాసరి యరుగుదెంచునట
మిగుల నాతనికి నే మిక్కిలి భక్తి
నెఱిఁగి మొక్కఁడనుండి యేతెంచి తీవ్ర
కరము నే సేయనా కార్య మే మనుచు
నడుగుదునట యతం డాదరం బొదవఁ
బుడమి శ్రీవేంకటభూధరంబునను
వసియింతు నే శ్రీనివాసుఁడఁ వాఁడ
వసుధాధినాథ నీవద్దికి నేను
వచ్చితి నీ కిష్టవరదుఁ డౌ దేవు
మచ్చిక గనుపించ మదినెంచి యిపుడు
దేవ ని యోగమా తీరె యా గిరికి
నా వెంట ర మ్మటు నలినలోచనుని

దివ్యవిమానంబు దిలకించి హరిని
భవ్యభక్తినిఁ గొల్చి భాగ్య మందు మని
నను దోడుకొనుచు పన్నగరాజగిరికి
జనునట రత్నకాంచనవిమానంబు
నందు నే కనుఁగొందునట యంత నతఁడు
నందమందు విమాన మా క్షణంబునను
కానరాకయె మాయఁగప్పిన నులికి
మేను గంపింపఁగా మేల్కాంటి నపుడె

ఇది యేమి సోద్య మయ్యెడి నంచుఁ బలుక
నది విని మంత్రు ల య్యవనిపాలునకుఁ
గమలేక్షణుఁడు నిన్నుఁ గరుణించి చాలఁ
బ్రమదంబు లొసగంగఁ బనిబూని పిలిచి
రక్షింపఁదలఁచె నా రాజీవనేత్రు
నీక్షించి సేవించి యిష్టసంపదలఁ
జెంది కృతార్థతఁ జెలఁగుదు వనుచుఁ-
బొందుగాఁ గల దెలుపుచునుండు నపుడు

వసుఁడను నిషాదపతి శ్వేతవరాహచేష్టలనుగూర్చి రాజునకు విన్నవించుట

శ్రీవేంకటాచలసీమవసించు
పావనుండు నిషాదపతి వసుఁ డమ్మ

సెలవిల్లు చిలుకమ్ము చేతులఁ బూని
చెలువుమీరగ కొండసిలచర్మమైన
దట్టిపై పట్టంబు దనరంగఁ గట్టి
మట్టంద కణితిచర్మము పోటుబెట్టి
టోపిపైఁ జిగురాకు జొంపంబు బూన్చి

కై పుగాఁ బులితోలు గట్టి చల్లడము
పయి తేకుటాకులు పసగా బిగించి
మయి నిగ్గు చీకటికి మరిమరి గురియ
గ్రుమ్మరు కాటుకకొండయో యనఁగ
నెమ్మిమీరఁగ వచ్చి యెల్లవారలును
వెరగంది చూడ న వ్విభుడుండు నగరు
బిరబిరఁ జొచ్చి యా పృథివీశునెదుట
నిలిచి కేల్మోడ్చి వన్నియల చెన్నొందు
చిలుకఁ గానుకయిచ్చి చెలిమి నిట్లనును
సామి ! నే వేంకటాచలమున నెపుడు
గ్రామైన నొక పెద్దకొలనిచెంగటను
కొంతచేతులపాటి కొఱ్ఱుచేఁ జేసి
యెంతయు బతుకుచు నెలమి నుండుదును
దినము నాచేనెల్ల తెల్లని వంది
తిని పోవసాగె నే తిలకించి దాని
నేయఁబోయిన నమ్మ లెక్కవు వలలు
వేయంగ నవియెల్ల వేయుదునక్కలుగఁ
దగఁ ద్రుంచి యురుకు నోదంబునఁ బడదు
వెగటుమందుల కట్టు వెస నడ్డగొనదు
మంతరించినన్నైన మట్టుకురాదు
చెంతఁజేరి యదల్పఁ జివ్వున నెగయు
నీలాగు మేయంగ నెదపడి నేను
చాల విచారంబు సంధిల్లఁ గేల
వాలుఁబూనుక తెంపు వడినేయ నెంచి
చాలఁగడంగుచో నరగ నం దొక్క

పలుకు వినంబడెఁ బై నాకసమున
నెలుగ కోరి నిషాద! యా వెనుబంది
ప్రకటించి చూడ నీపాలి దేవుండు
సకలలోకములను సారె రక్షింప
నీ కొండనే యుండు నెప్పుడు దాని
నీ కొలందియె తోల నీవు వేగిరమె
చక్రవర్తినిఁ జేరఁ జని నిన్ను కేయి
చక్రధరుఁడు వచ్చి స్వప్నంబునందుఁ
దెలుపుట యానవాల్ దెలివిడి చేసి
కలశాబ్ధికన్యకాకాంతునిఁ గొల్వ

రమ్ము చూపెద నంచు రంజిల్లఁ బలికి
య మ్మహీపాలు నిం దరిమురి నొంటి
నెంటఁ దోడ్కొనిరమ్ము వేంకటగిరికి
నంటుమీఱఁగ రమానాథుని యునికి
వివరించి తేసి యవ్విభునకు నీకు
వివిధవాంఛితములు వేగ సిద్ధించు
నని పల్కినంతనే నంతటఁ జూచి
కనుఁగొన మనుజుఁ డొక్కరుఁడు లేకునికి
దేవుండె యంచుఁ బందిని జూడ నదియు
వేవేగ నొకపుట్ట వెసఁ బ్రవేశించెఁ

గావున నది దెల్పఁగా వచ్చి తిపుడు
భూవరోత్తమ లెమ్ము పోదము రమ్ము
దేవరచిత్తంబు దెల్పితి ననుడు
భావించి యా చెంచుఁ బరగఁ బూజించి

యొంతయు మది భక్తి యినుమడించంగ
సంతోషమున మంత్రి జనుల కిట్లనును
అందరు వింటిరే యా దేవుపనుపు
చందము నే నందుఁ జనవలె నిపుడె
పిలిచి గోపాలురం బెలుచ నెందెందుఁ
గల గపిలల పాలు కావడుల్ గట్టి
పదిలక్షఘటముల పాటి కెచ్చుగనె
పదిలమై తెప్పించి పట్టించుకొనుచు
నచ్చోటి కరుదెంచు డని నియోగించి

చెంచువెంట రాజు శ్రీనివాసాద్రికిఁబోయి వరాహమును గాంచుట

విచ్చలవిడి చెంచువెంటనే నృపతి
శ్రీనివాసాద్రికిఁ జేరి యాకొఱ్ఱ
చేను వీక్షించి యా చెంగటఁ దనరు
స్వామిపుష్కరిణి పావనవారి సంజ
నేమంబులను దీర్చి నెమ్మి నుండంగ
యీరేయి వెన్నెల లటు పట్టపగలు
తీరునఁ గాయంగఁ దెల్లని మేను
మోరచక్కదనంబు ముద్దుల మెడయు
కోరలయందంబు గొరిసెలబిరుసు
తొడలమందము చాపు దొడ్డతనంబు
నొడికమందినవీపు నుల్లసిల్లంగ
నిలయెల్ల నవలీల నెత్తినపంది
బలువిడి నా కొఱ్ఱపంటలోఁ జొచ్చి
మహి నాడు చంద్రబింబంబు చందమున

రహిమించఁ దిరుగు నైరావతం బనఁగఁ
గనుపట్టి ఘురఘుర ఘాత రొప్పుచును
దనరంగ నెన్ను లెంతయు మెసవుచును
మొగి నిల గోరాడి ముస్త లెత్తుచును
జగతి నూరులు బర్వ చవురుగొట్టుచును
నీటుమీరఁగ చెవుల్ నిక్కరింపుచును
నాటల గతి నిందునందుఁ జరింపఁ
గాంచి భావించి యక్కజముగా నెంచి
పొంచి విల్వంచి తూపులను బూనింప
నతని పూనికెఁ జూచి యా చెంచు డాసి
క్షితిపాల యిది చూడ సీమతరంబు
మెకముగా దిట్టి భూమిని యుద్ధరించి
సకలలోకులఁ బ్రోవఁ జాలినయట్టి
యాదిమహావరాహం బని తెలియు
మాదరంబున మ్రొక్కి యర్చించు మితని
యనవుఁ డాతఁడు నట్ల యవ్వరాహునకు
ననుపమభక్తి సాష్టాంగం బెఱఁగి

వరాహము పుట్టఁ జొచ్చుట

పొగడుచుండంగ నప్పుడె యాది చెంత
తగు పుట్టఁజొచ్చి నంతనె విస్మయమున
చేరి వల్మీకంబు చెంగట నిలిచి
కూరిమి హరినిఁ గన్గొని పూజసలుపు
కోరిక మీఱఁ గ్రక్కున నంటి పుట్ట
పారల శోధించుపాటి నచ్చటికి

క్షీరకుంభంబులం జేకొని వేగ
నారయుచును గొల్ల లా మంత్రివరులు
వచ్చుటయును ధరావరుఁడు సంతోష
మెచ్చంగ వల్మీక మెంతయుఁ గరఁగ
క్షీరాభిషేకంబు సేయింపుచుండ
మేరుశృంగముఁబోల మెరయుచు రత్న
భూరివిమానంబు పొడచూపుటయును

శౌరి వరాహరూపమున సాక్షాత్కరించి విమానమంటపముల నిర్మింపుమనుట

శౌరి యచ్చటఁ గృప సాక్షాద్భవించి
యాదిమహావరాహాకృతి యగుచుఁ
బాదంబు భూమిలోఁ బాతుగాఁ గాన
రాకుండ జానుమాత్రంబు పైఁ దెలియ
శ్రీకరార్చాకృతి చెలువొంది చెంతఁ
శ్రీమహీరమణులు చెలఁగంగ నిలిచి
ప్రేమ న న్నరపాలుఁ బేర్కొని పల్కె,
విను భూప! నే నిందు విహరింపుచుందు
జనుల రక్షింపఁగా సత్కృప నెంచి
ఘనవిమానం బిది కలియుగంబునను
గనుపించ దెవరికిఁ గావున నీవు
నా కియొక విమానమంటపంబులును
ప్రాకారము లొనర్చి భవ్యప్రతిష్ఠ
యొనరించి వైఖానసోక్తక్రమమున
ననుదినంబు భజించి యమితభాగ్యంబు
లందుము నీతోడ నర్చావతార
మొందియు భాషింపుచుందు నెల్లప్పుడు

స్వామి మహాసరోవర దక్షిణమున
శ్రీమించ నేనె యా శ్రీనివాసాఖ్య
నుందు నిర్వారి నిట్లు నుద్యద్విమాన
మందిరప్రాకారమండపప్రకర
నిర్మాణపూర్వకనిరతకైంకర్య
ధర్మశీలతఁ గొల్చి దనరుదువేని

భోగమోక్షంబులు పుణ్యకీర్తులును
బాగుగా నీవంశభవులకు నిత్తు
లోకపాలకముఖ్యులును జెందరాని
వైకుంఠపురము కైవశమగు నీకు
నని యుపదేశించి యమ్ముకుందుండు
తన మాయ గప్పి యంతర్ధాన మొందు
అంత నా తొండమా నను భూవరుండు
సంతుష్టుఁడై యట్టి శైలంబు నందె
నిలిచి శిల్పిగణంబు నెమ్మి రప్పించి

తొండమానుడు శ్రీనివాసులకు, వరాహునకు విమానాదులను నిర్మించుట

వలువలు భూషణావళులు నొసంగి

శ్రీనివాసులకును శ్రీవరాహునకు
మానితంబైన విమానమందిరము
ప్రాకారములు మంటపములు నిర్మించి
శ్రీకరాభరణముల్ చేయించి మిగుల
వరుసమీరఁగ శ్రీనివాసప్రతిష్ఠ
కరమొప్ప నందు వైఖానసమునుల
రావించి భక్తి మీరఁగ శాస్త్రవిధులఁ

గావించి సమయత్రికంబును పూజ
సలుపుచుఁ గొన్ని వత్సరములు రాజ్య
కలనంబు దలఁచక కామభోగములు
వదలి యప్పుడు శ్రీనివాససేవలనె
ముదమందుచుండ నమ్మురవైరి మెచ్చి
విక్రమంబునఁ బరవీరుల నడచు
చక్రంబు నతని భూచక్రరక్షకును
బనిచి యానృపుఁజూచి పరమవత్సలత
ననవద్యసూక్తి ని ట్లని యానతిచ్చు
భూవరోత్తమ నాదు పూజసల్పుచును
నీ విచ్చటనె యుండి నిజరాజ్యలక్ష్మి
భోగంబులుఁ మాని భూరివిరక్తి
యోగిచందంబున నుండ నేమిటికి
బాగుగా నను గొల్చు పావనాత్ములకు
భోగమోక్షము లిచ్చు పూన్కి నా బిరుదు
గాఁగ విశ్రుత మౌను గావున నీవు
రాజవై యోగివై రహి భోగి వగుచు
రాజయోగివి కాఁగ రంజిల్లు మెపుడు

స్వామి తొండమానుపూజలకై బిలద్వారమును జూపుట

పురికేగి కాంతానుభూతిఁ జెందుచును
నిరతంబు మత్సేవ నెరపుము నీకుఁ
గడిమి రా నొక త్రోవ గలదంచు నందు
వెడదయౌ నొక బిలవివరంబుఁ జూపి
యనుదినం బీవు మధ్యాహ్నవేళలను

చనుదెంచి మత్పదాబ్జంబులు విరుల
కనకపద్మసహస్రకమున నర్చించి
చనుచుండు మనఁగ నా జనపాలమౌళి
కరములు మోడ్చి యో కమలాసహాయ!
వరద! భక్తజనైకవత్సల! నీదు
చరణాంబుజార్చన సతతంబు సల్పు
పరమభాగ్యము గల్గఁ బ్రాకృతసుఖము
గోరునే యమృతంబు గ్రోలఁగల్గియును
నీరు ద్రావఁగ నెంచునే యెవ్వఁడైన
నైన దేవర యిట్టు లానతిచ్చినను
పూని యట్లన సేయఁబోలు నిక్కంబు
నా విన్నపంబు కన్యామాసమునను
భావితోత్సవము నే పని బూని సల్ప
నభిలషించెద నట్ల నంగీకరించు
మభిమతభవదాజ్ఞ నంత యయ్యెడిని
భక్తప్రతిజ్ఞానుపాలనుండ వని
యుక్త మాగాదన కొగిఁ దెల్పుకొంటి
నని విన్నవించిన నంబుజాక్షుండు
అనవధికరుణ ని ట్లనుమతించుటయు
జనపతి వైఖానసముని రావించి
వినతుఁడై తనకోర్కె వివరించి జగతి
గల విప్రులను రాజగణముల వైశ్య
కులముల శూద్రులఁ గోటి సంఖ్యలను
సకలదేశనివాస జనుల నందరిని
ప్రకటరయంబునఁ బనిబూని పిలువ

దూతలఁ బుత్తెంచి దుర్గమార్గముల
నాతతనగరప్రపాళి నిర్మించి
గోపురంబుల స్వర్ణకుంభంబు లెత్తి
యేపు రంజిల కేతు లెనయఁ బూనించి
ప్రాకారములనెల్ల పట్టు సరాతు
లాకారవైఖరు లమరఁ గట్టించి
మెరుగుబంగరురంగు మెఱయంగ వరుస
బురుసాకురుంజులు పొసఁగ వేయించి
మండపంబులనెల్ల మణిదర్పణములు
మెండుగాఁ దగటీల మేల్కట్లఁబూన్చి
స్వామిపుష్కరిణికి సరిగ నల్గడల
శ్రీమించు పందిళ్ళు చెలఁగఁ గావించి
చప్పరంబులును పచ్చని తోరణములు
గొప్పతామేరువల్ కూటపాళికెలు

స్వామి తిరునాళ్ళ వర్ణన

వివిధమందిరసౌధవీధికల్ మిగుల
సవరించి తిరునాళ్ల సామగ్రు లెల్ల
నపరిమితంబులై హవణించి నించి
విపులమంత్రస్థితి వినతాతనూజు
నతులధ్వజంబున నావహింపించె
వితతాంకురార్పణ విధిపూర్వకముగ
నాయతకనకధ్వజారోహణంబు
నేయించి బ్రహ్మాద్యశేషదేవతలఁ
బిలిపించి దిగ్బలుల్ పెంపొంద సల్పి

యలదేవతలును దేశాంతరజనులు
కలిసి యందరు వచ్చి కడువడి నడరఁ

జెలువొప్ప నర్చించి శ్రీనివాసులను
శేషాద్రినాథుగాఁ జేసి తిర్వీధి
భూషణద్యుతుల నుప్పొంగ నేగింప
హరి యప్పుడు తన శేషాసనత్వమును
[1] వరభక్తులకు దెల్పు వైఖరి మెఱసి
యా మరునటినాడు హంసనిష్ఠుఁడయి
తామరచూలికిఁ దత్త్వబోధనము
సలుపుట రూపించి సారె మర్నాఁడు
కలితసింహాస్థితి గనుపట్టి మున్ను
బలువిడి యుక్కుకంబంబున వెడలి

ఖలు హిరణ్యునిఁ ద్రుంచు కక్కసితనము
రహిఁ గనుపించి మర్నాఁడు లోకింప
మహిసుతయును దాను మహితపుష్పకము
పయినెక్కి వచ్చు టిబ్భంగి యర్క పగిది
రయమునవిరిచప్పరముమీఁద నలరి
గరుడునిపై నెక్కి గజరాజుఁ బోరు
ఖరనక్రముం ద్రుంచు గతి నిరూపించి
మరునాడు నా హనుమంతుపై నెక్కి
కరకురావణుఁ గూల్చు కడక న్నటించి

యంత శత్రుంజయ మను నేన్గు నెక్కి
యెంతయు శ్రీరాముఁ డే నై యయోధ్య

1. "వరదభక్తులకు" వ్రా. ప్ర. పాఠము.

వెలసితి ని ట్లంచు వివరించి మరియు
నల స ప్తమదినంబునందు నందముగ
జలజా ప్తమండలసంయూథుఁడగుచు
............. .....
నంతరాదిత్య విద్యార్థ్యేయుఁడగుట
యంతయుఁ బ్రకటించి యద్భుతలీల
యష్టమదినమునం దరదంబు నెక్కి
దృష్టవిజయసారథిత్వంబుఁ దెలిపి
యల మాపు తురగవాహనముపై నెక్కి
కలితుదర్ మ్లేచ్ఛనిగ్రహము సేయంగ
భువి సారిసై యిట్ల పొసఁగుదు ననుచు
వివరించు గతి తిరువీథుల నేగి
నవమదినమునందునన్ ముకుందుండు
శ్రీమదాదివరాహు చెంగటం జేరి
స్వామిపుష్కరిణి పావనతీర్థవారి
నవభృథస్నాతుఁడై యాశ్రితదివిష
దవనదీక్షాపూర్తి నటు జూపుటయును
అంత వైఖానసు లా యుత్సవమున
నంతరాయములఁ బ్రాయశ్చిత్తముగను
శ్రీనివాసులకు విశేషార్చనములు
జానూరుకటినాభిసద్వత్సబాహు
గళముఖమౌళ్యంత కలితక్రమమునఁ
దలఁపఁ బద్మాదికదశవిధార్చనలు
గావించి నల్దెసక్రమమున నిల్చి
భాషించి సూత్రోక్తపరిపాటి నల్పు

పుష్పయాగంబెంత్తెఁ బొలుపొంద నపుడె
పుష్పవర్షము నభోభూజముల్ గురియ

ధ్వజము డిగ్గిన బ్రహ్మవాసవాదులను
నిజవాసముల కన్చి నీరజేక్షణుఁడు
నమ్మహోత్సవమున నప్సరోమణులు
సమ్మతి నాట్యంబు సల్పుదు రపుడు
కిన్నరుల్ పాడ సంగీతముల్ సురలు
సన్నుతింతురు శేషశైలనాయకుని
సకలదేశపుజనుల్ జాంబూనదాంబ
రకరితురంగాది రత్నముల్ కాన్క
గావించి పుత్రాది ఘనవాంఛితములు
దేవుని కృపఁ జెంది తిరుగ నేగుచును

తిలకించి నట్టి యా తిరుణాళ్లసొగసు
తలఁచి తలంచి యెంతయు విస్మయమున
ననుదినంబును స్వామి కా చక్రవర్తి
దనరఁ గావించురత్నపుభూషణములు
నల భక్ష్యభోజ్యాదికాన్నరమ్యతలు
నలఘువైభవములు నయ్యలంక్రియలు
నాతపత్రధ్వజాద్యాభిరూప్యంబు
నాతతకరదీపికావలిచ్ఛటలు
కమనీయతౌర్యత్రికంబులరక్తి
యమరిన బాణవిద్యల విచిత్రతయు

హరి తిరువీధుల నరిగెడి సొబగు
నరుదుగా వేర్వేర నభినుతింపుచును

శ్రీనివాసుల నెద జింతించుకొనుచు

### కృష్ణశర్మయను విప్రుని కథ

నానందభరితులై యరుగు నయ్యెడను
భూసురుఁ డొక్కఁడు పొలతియుఁ దాను
వాసి మీరఁగ చక్రవర్తి చెంగటికిఁ
జేరి మంత్రోక్తి నాశీర్వదించుటయు
నా రాజు ప్రణతుఁడై యతనిఁ బూజించి
భూసురోత్తమ నీదు పుర మెద్ది యిచట
భాసురాకృతివి యే పనికి వచ్చితివి
యేమి నీపే రిట్టి యెలనాఁగ యెవతె
కామితంబులు నీకుఁ గలిగింతు నిపుడె
అనవుఁడు భూపాలు నతఁడు వీక్షించి
విను చక్రవర్తి నా వృత్తాంతమెల్ల
ధరణి దక్షిణవార్ధి తటమున చంద్ర
పుర మను నగరంబు పొగడందు నందు
గలఁ డొక్క విప్రుఁ డాగమనిగమాంత
కలనశీలుండు విఖ్యాతయశుండు
కూర్మభట్టారకాఖ్యుఁడు నిరతంబు
ధార్మికుం డాతని తనయుండు కృష్ణ
శర్మ యందురు నన్ను జనపాల యిది సు
ధర్మిణి యను నాదు తరుణి యందుండి
ధారుణి మోక్షప్రదం బైనయట్టి
వారణాశికిఁ బోవ వచ్చుచో నిదియు
నావెంట జనుదెంచె నవగర్భయగుచు
త్రోవను నీళ్ళాడ తొలుచూలు కాన్పు

తనయుండు జనియించి తగ మూఁడునెలలు
ధనము వెచ్చంబయ్యె తడయుట వలనఁ
గావున నా యాత్ర కడువిళంబించె
పూవుబోఁణినిఁ గొని పోరాదు గాన

సకలధర్మార్థరక్షణసేయుకర్త
వకలంకశీలుండ వగు నిన్నుఁ జేర
వచ్చితి నే మళ్ళి వచ్చునందాక
ఇచ్చుట నీ బాల నీవు రక్షింప
వలయును రక్షణవ్రతము నీ దగుట
ఇల నీకె యుక్తమా నిదె నేను పోయి
వచ్చెద ననిన నవ్వసుధామరేంద్రు
మచ్చిక దయచేసి మహిత ధనంబు
లిచ్చి పంపించి యయ్యింతినిఁ బ్రేమ
హెచ్చుగఁ దనవీటి కెలమిఁ దోడ్కొనుచు

హరియాజ్ఞ చేకొని యరిగి యందొక్క
వరమందిర మొసంగి వరుసగా నారు
నెలలకు గ్రాసంబు నిలిపి యయ్యింతి
కలికి బయలు వెళ్ళఁగా వద్దటంచు
నేమించి దృఢభక్తి నిష్ఠుఁడై దినము
స్వామికైంకర్యైకసక్తతనూఁడు
నంతటనావిప్రుఁడరిగియక్కాశి
సంతసంబునఁజేరి జన్వారిఁజూచి
మధురాప్రయాగాది మహితస్థలముల
మధుసూదను భజించి మరలి యాగయను

శ్రీనివాసుల నెద జింతించుకొనుచు

కృష్ణశర్మయను విప్రుని కథ

నానందభరితులై యరుగు నయ్యెడను
భూసురుఁ డొక్కఁడు పొలతియుఁ దాను
వాసి మీరఁగ చక్రవర్తి చెంగటికిఁ
జేరి మంత్రోక్తి నాశీర్వదించుటయు
నా రాజు ప్రణతుఁడై యతనిఁ బూజించి
భూసురోత్తమ నీదు పుర మెద్ది యిచట
భాసురాకృతివి యే పనికి వచ్చితివి
యేమి నీపే రిట్టి యెలనాఁగ యెవతె
కామితంబులు నీకుఁ గలిగింతు నిపుడె
అనవుఁడు భూపాలు నతఁడు వీక్షించి
విను చక్రవర్తి నా వృత్తాంతమెల్ల
ధరణి దక్షిణవార్ధి తటమున చంద్ర
పుర మను నగరంబు పొగడందు నందు
గలఁ డొక్క విప్రుఁ డాగమనిగమాంత
కలనశీలుండు విఖ్యాతయశుండు
కూర్మభట్టారకాఖ్యుడు నిరతంబు
ధార్మికుం డాతని తనయుండు కృష్ణ
శర్మ యందురు నన్ను జనపాల యిది సు
ధర్మిణి యను నాదు తరుణి యందుండి
ధారుణి మోక్షప్రదం బైనయట్టి
వారణాశికిఁ బోవ వచ్చుచోనిదియు
నావెంట జనుదెంచె నవగర్భయగుచు
త్రోవను నీళ్ళాడ తొలుచూలు కాన్పు

తనయుండు జనియించి తగ మూడునెలలు
ధనము వెచ్చంబయ్యె తడయుట వలనఁ
గావున నా యాత్ర కడువిళంబించె
పూవుబోణిని గొని పోరాదు గాన

సకలధర్మార్థరక్షణసేయుకర్త
వకలంకశీలుండ వగు నిన్నుఁ జేర
వచ్చితి నే మళ్ళి వచ్చునందాక
ఇచ్చట నీ బాల నీవు రక్షింప
వలయును రక్షణవ్రతము నీ దగుట
ఇల నీకె యుక్తమా నిదె నేను పోయి
వచ్చెద ననిన నవ్వసుధామరేంద్రు
మచ్చిక దయచేసి మహిత ధనంబు
లిచ్చి పంపించి యయ్యింతినిఁ బ్రేమ
హెచ్చుగఁ దనవీటి కెలమిఁ దోడ్కొనుచు

హరియాజ్ఞ చేకొని యరిగి యందొక్క
వరమందిర మొసంగి వరుసగా నారు
నెలలకు గ్రాసంబు నిలిపి యయ్యింట
కలికి బయలు వెళ్ళఁగా వద్దటంచు
నేమించి దృఢభక్తి నిష్ఠుఁడై దినము
స్వామికైంకర్యైకసక్తనుండు
నంతటనావిప్రుఁడరిగియుకాశి
సంతసంబునఁజేరి జన్హ్వారిఁజూచి
మధురాప్రయాగాది మహితస్థలముల
మధుసూదను భజించి మరలి యాగయును

కరణీయములు దీర్చి కడువడి వెడలి
పురుషోత్తములఁ గాంచి పొసఁగ సేవించి
యాదికూర్మముఁజేరి యట ధర్మపురిని
సాదరంబుగ నృసింహాకృతి శౌరి
వందించి కృష్ణాదివాహినుల్ గడచి
పొందుగా వేంకటభూధరంబునకు
వచ్చి యచ్చటఁ జక్రవర్తిని గాంచి
విచ్చలవిడి తన విమలయాత్రయును
కడు నందు తనయున్కిక్రమమును దెల్పి
తడవయ్యెఁ బోవలె తరుణి నంపు మన
నరపాలుఁడు గలంగి ననబోఁడి తెరఁగు
మరచి యిన్నాళ్లు ప్రమత్తుఁడై యుండు
కతనఁజింతించి యొక్క యమాత్యుఁ జూచి
ద్విజకాంత యేమయ్యె దెలిసి యేకతము
నిజము దెల్పు మటంచు నెమ్మిఁ బుత్తెంచ
నా మంత్రివరుఁడు బ్రాహ్మణవధూగృహము
వేమరు బరికించి వెలఁదియు సుతుఁడు
నింటిలో మృతిఁజెంది యొంటి యుండంగఁ
గంటికి వెగటుగాఁ గని యత్తెరంగుఁ
దెలిపిన విని మదిఁ దిగులొంది నృపతి
పలుక నోరాడక బ్రాహ్మణుఁ జూచి
విను విప్ర నీసతి వేంకటేశ్వరులఁ
గని భజించఁగ నేగెఁ గావున నీవు
నొక్కనాఁ డిచ్చోట నుండి నీమగువ
మక్కువఁ దోడ్కొని మరి యేగు మనుచు

నాతని నందుంచి యతిరయంబునను
భీతుఁడై యరిగి య బ్బిలమార్గమునను
శ్రీవేంకటేశ్వరుఁ జేరి దైన్యమున
సేవించి యశ్రువుల్ జెంద నిట్లనును
వారిజేక్షణ! శ్రీనివాస! నిర్వ్యాజ
కారుణికాత్మ! సకలలోకనాథ!
నేను మత్తత నుండి నిష్ఠురాఘంబుఁ
బూనితి విప్రుని పొలఁతిని శిశువు
పొలియించు హత్యలు పొందితి మిగుల
బలువైన విశ్వాస పాతకంబునకుఁ
బాత్రైతి నే నట్లు బ్రాహ్మణుఁ జూచి
యేలాగు నీవుంచు నింతియు సుతుఁడు
పొలిసిరి నీవింక పొమ్మను వాఁడ
నిలుకడ ధర్మంబు నీరుగాఁ బుచ్చి
యీమేను బెట్టుక యెట్టుల నతని
మోమునఁ బల్కుదు మూర్ఖత నేను
నా తప్పుఁ గాచి యో నగధారి యిట్టి
పాతకంబులు మాన్చి బ్రతికించు నన్ను
ఎలనాగ బ్రతికిన నే బ్రతుకుదును
చెలిమిన ద్విజపతి జీవితం బొసఁగు
కాదేని నన్ను నో కమలాక్ష [1] నీదు
పాదపద్మముఁ జేర్చు పాటి గావించు
మని విన్నవించిన నా శ్రీనివాసుఁ
డనుపమకరుణచే నవనీంద్రుఁ జూచి
చిరునగ వాననసీమఁ దళ్కొత్త

1. "కమలాక్షునిందు" వ్రా. ప్ర. పాఠము.

హారుషంబు దనర నిట్లని యాసతిచ్చె
భూనాథ నీ వేల పొగిలెద వింత
నేను గల్గియు నీకు నిష్ఠురవ్యథలు
రానిత్తునే తత్తరంబిక మాను
పూని యిచ్చోటికిఁ బూర్వభాగమున
శరశతద్వయదూర సమ్మితస్థలిని
సర మొక్క టున్నది శమననిర్హారి
యా తీర్థమున వారి యస్థిచయంబు
పూతంబుగా నింత ప్రోక్షించినంత
నిదురించి మేల్కాంచు నీటు వాటిల్ల
సుదతియు బాలుఁడుఁ శోభిల్లఁగలరు
వారి న వ్విప్రుని వశమున నొసఁగి
భూరివైభవములఁ బొగడొందు మవని
ననుచు విష్వక్సేను నటు చూచి నీవు
జనపాలునకు నట్టి సరము గన్పించు
మనుటయు నా నృపాలాగ్రణి హరికి
వినతులు గావించి వినుతించి యపుడె
తనరాణివాసంబు తరుణుల తోడఁ
దనర నద్దేహముల్ దగ పల్లకీల
నుంచుక తెమ్మని యొక మంత్రి వేగ
బంచిన నతఁ డట్ల పనిఁబూని యరిగి
నిమిషమాత్రనె దెచ్చి [1] నేతకుఁ దెల్పె
ప్రమద ముప్పొంగ సంభ్రమము చెలంగ
నతఁడు వేంకటనాధు నాజ్ఞ చొప్పునను

1. "శ్రీపతికిదెల్పె" అని వ్రా. ప్ర. పాఠము.

హితమతి నరిగి సైన్యేశు వెంబడిగ
నా తీర్థజలముల నస్థిచయంబు
పూత మౌ నట్లుగాఁ బ్రోక్షించుటయును
ఆ విప్రరమణియు నా బాలకుఁడును
పావనులై లేచి బలు నిద్రచేసి
మేలుకాంచినయట్లు మేలు రంజిల్ల

చాల నా జనముల సందడి మాని
మది సిగ్గు భయము గ్రమ్మఁగ నిల్చినంత
త్రిదశులు బొగడంగ ధీరుఁడా నృపతి
వారిఁ దోడ్కొని శ్రీనివాసుసన్నిధికిఁ
జేరి యవ్విప్రునిఁ జెలిమి రావించి
యతనిచేతికి నట్టి యంబుజేక్షణను
సుతు నప్పగించి హెచ్చు విభూషణములు
కౌశేయకములును గాంచనరత్న
రాసుల నొసఁగిన రంజిల్లి విభుని
సన్నుతింపుచు కృష్ణశర్మ యా కొమ్మ

యన్నియుఁ దెల్పఁగా నచ్చెరు వంది
పరమాత్మ వెంకటపతి యంచుఁ దెలిసి
పరమభక్తిజ్ఞానపటిమఁ బ్రార్థింప
నా విప్రవరు వేంకటాచలవిభుఁడు
భావితకరుణ యుప్పొంగ నిట్టులను
విను కృష్ణశర్మ కావేరితీరమున
జనియించి వేందాతసారానుభవము
గలిగి వ్యాఖ్యాతవై గాఢవై రాగ్య

విలసితభక్తిప్రవీణత నన్ను
సతతంబు భజియింపఁ జాలుదు వపుడు

మతి నీవు ప్రార్థించు మాట్కి మోక్షంబు
నిచ్చెద నందాక నిట్టిజన్మమున
నిచ్చలు మత్కర్మనిరతుండ వగుచు
భోగముల్ దానముల్ పుణ్యవ్రతములు
యాగాదులన్ని మదర్పణబుద్ధి
సలుపుచుండు మటంచు శాసించి పనుప
నలరుచు నద్విజన్మాగ్రణి హరికి
బహుళప్రదక్షిణప్రణతు లొనర్చి
విహితార్చనలు సల్పి వీడ్కొని యరిగి
నిజనివాసంబున నీలశైలేశ

భజనకైంకర్యతత్పరబుద్ధి నుండు
చక్రవర్తియు శేషశైలశేఖరుని
చక్రధరుని భక్తజనపారిజాతు
సేవించి వీడ్కొని సిద్ధార్థుఁ డగుచు
భావంబునన్ దృఢ భక్తి యుప్పొంగఁ
దన పురి కరిగి యెంతయు సంతసమున
ననుదినం బచట మధ్యాహ్నవేళలను
చనిచని వేంకటేశ్వరుపాదయుగళిఁ
గనకాంబుజసహస్రకమున నర్చించి
తనతోడ శౌరి యాప్తతను భాషింప

నెనలేనిసంపద నింపొంది మిగుల
సుర లాత్మభాగ్యంబు చూచి నుతింప
ధరరాజ్యపాలన తగ సల్పుచుండ

## కుర్వపురి కుమ్మరి కథ

అ య్యవసరమునం దల కుర్వపురిని
యొయ్యన కుమ్మరి యొకఁడు భీముఁడన
నుదయించి దృఢభక్తి యుక్తుఁడై యపుడు
సదయుఁడౌ వేంకటాచలనాథు నెదనె
సంతతధ్యాననిష్ఠత భజింపుచును
వింతగా మృత్ప్రసూనవితతి నర్చించి
కయిసేసి నైవేద్యకము వేళ నిడుచు

నియతిఁ దచ్ఛేషమే నిత్యంబు దాను
సుదతియు భుజయింపుచును నన్యచింత
మది నింతయును లేక మరుపు గైకొనక
తనవృత్తి నుండు నాతని భక్తి కలరి
వనజేక్షణుఁడు శ్రీనివాసుఁ డవ్విరులు
నిజముగా నానందనిలయాంతరమునఁ
ద్రిజగన్మనోహర దివ్యపుష్పములు
గాఁగఁజేకొన నవి కదిసి పాదముల
నాగి యాధణీశుఁ డర్చించు విరులఁ
గప్పుచుఁ దామె పైగాఁ బ్రకాశించి

మెప్పైన తావు లెమ్మెయిఁ గ్రుమ్మరించు
నొకనాఁ డల నృపాలుఁ డుల్లాసమునను
సకలలోకాధ్యక్షు జలజాయతాక్షు
శ్రీనివాసు వృషాద్రి శిఖరైకవాసు
పూనికె బంగారుపూల నర్చింపఁ
బోవుచోఁ దాఁబెట్టు పూవులపైని

దేవతాపుష్పముల్ దివ్యవాసనలు
జల్లుచుండఁగఁ జూచి సందేహ మొంది
ఉల్లంబునను గొంత యూహించు కొనుచు
నతివిస్మయంబున నా శ్రీనివాసు

నుతియించి యో స్వామి నూతనలీల
యేమి చేసితి విట్టి వెవ్వారి వ్వీరులు
స్వామి పాదముల నర్చనసేయువారు
నీమాయఁ దెలియంగనేర్తునే నేను
శ్రీమనోహర దయచే నానతీవె
నావు డా వేంకటనాథుఁ డాతనికి
భావితభక్తప్రభావంబు దెలుప
నరపాల! యది విను నాదు భక్తుండు
కురువను భీముఁడన్ కుమ్మరి యొకఁడు
సతతంబు మత్పదాసక్తచిత్తమున

వితతమృణ్మయపుష్పవిసరంబుఁ జేసి
యందె నన్ గురియించి యర్చించు వాటి
నంది మందారపుష్పావలి గాఁగఁ
గైకొందు నే నిందుఁ గడుభక్తి గలిగి
నేకడ నెవడైన నిడునట్టి పూజ
కొంచమే యైన నే కొండంతగాఁగ
నెంచుచుఁ జేకొందు నిదియె నాబిరుదు
కావున నీ వందుఁ గడువడి నరిగి
పావనశీలుగా భక్తునిఁ గాంచి
యతికృతార్థతఁ జెందు మయ్యెడ నిన్ను

నతఁడు వీక్షించి కృతార్థుఁ డై ననుచు
నానతిచ్చిన వేంకటాచలేశ్వరున
కా నరపాలుండు సాష్టాంగ మెఱఁగి
ఘనవిస్మయానందకలితుఁడై కురువ
యను పురంబునకు రయంబున నరుగ
నపుడు రథమతంగజాశ్వభటాది
విపులసైన్యంబులు వెంబడి నంటి
కడువడిఁ గదలంగ కళవళపడుచు
గడి దునెదార్ల ముఖ్యాములు కలగి
గుసగుసలను గుంపుగూడి యోజించి
వసుధేశుఁ డీ ధాటి వచ్చు తెరంగు
కాళింగవంగబంగాళనేపాళ
మాళవేంద్రుల నెల్ల మట్టుపెట్టగనో
యీదిక్కున విదర్భహేహాయమగధ
చేదిఘూర్జరులను చెక్కి చెండఁగనో
యాంకడ లాటమహారాష్ట్రహూణు
లాకులింపగ రాజ్య మాక్రమింపగనో
యావంక కర్ణాటయవనశకావ
నీవరసంఘముఁ నిగ్రహింపఁనో
కోటలులగ్గలన్ గొలుపుచ్చగనో
మేటిదుర్గములుహామిక గట్టుకొననో
వేటలాడంగనో విరులతోటల నై,
యాటలాడంగనో యుద్ధతంబైన
నేటిధాటియటంచు నెరిమంతవములు
శాటించి దొలగకుఁ బత్రికల్ బంప

భేరినిస్సాణగంభీరభాంకృతులు
వీరవారణగణోద్వేల ఘీంకృతులు
తురగహేషలు రథోద్ధురచటత్కృతులు
వరభటక్ష్వేళాద్యవార్యహుంకృతులు
భూనభోంతర మెల్ల భోరునఁగ్రమ్మ
జానపదప్రజల్ సకలపౌరులును
దొరలు మన్నెకుమాళ్ళు తులలేనికాన్క-
లురుభక్తిఁ గొనుచు నం దొండొరుల్ నిండ
నల వారి విభుఁ డింత యాదరించకయె
బలువిడి కుమ్మరపాళెంబుఁ జేరి
యాకులాకులితులై యందరుఁ జూడ
నా కులాలగృహంబు నందు వచ్చుటయు
నమ్మహీకాంతుని నచ్చటఁ జూచి
కుమ్మరి తనచేతి కుంభ మటుంచి
సమ్మదంబున లేచి స్వామిభక్తుఁడని
నెమ్మిని వందిచి నృపతిఁ బూజించి
అమలాజినం బొక టాసనం బొసఁగి
నిమిషంబు చెంగట నిల్చి కేల్మోడ్చి
దేవర విటవచ్చు తెర గేమి యిపుడు
భావింప నాయిల్లు పావనం బయ్యె
నేను ధన్యుఁడనైతి నిన్నుఁ జూచుటను
భూనాథ యెచటికిఁ బోవుచున్నావొ
యానతీవలయుఁ యథార్థంబుగాఁగ
అనవుఁ డాతనిమాట లా చక్రవర్తి
విని యాదరంబును వినయంబు నరసి

తన యంతరంగ మంతయు తేటగాఁగ
విను భీమ! నినుఁజూడ వే వచ్చినాఁడ
శ్రీనివాసుల నీవు చిత్తంబునందుఁ
బూని నిత్యము నెట్లు పూజసల్పుదువు
జలజేక్షణుండు ప్రసన్నుఁడై యేమి
పలుకు న వ్విధము తప్పక తెల్పు మనిన
నతఁ డవ్విభునిఁ జూచి యళుకుచు నిలిచి
క్షితిపాల యజ్ఞానజీవుండనైన
యే నెందు శ్రీవేంకటేశ్వరు లెందు
పూని నే నాదేవుఁ బూజించు టెందు
తెగడంగ నెవ్వరు తెలిపిరో యనుఁడు
జగతీశుఁ డాతనిఁ జాల నుతించి
వేంకటాచలపతి వివరించె నీదు
కైంకర్యపూజాదిక క్రమ మెల్ల
నిక నేల దాచ న న్నిచటికిఁ బనిచె
నకళంకభక్తుండవగు నిన్నుఁ జూడ
ననుటయు నంతలో నంతరిక్షమున
నినసహస్రప్రభ లింపు దీపింప
నవరత్నమయమవి మానంబు డంబుగను
భువనాద్భుతంబుగాఁ బొడచూపినంత
నాచక్రవర్తి యత్యాశ్చర్య మొంది
చూచుచు వెరగందుచు నసందియమున
నాకులాలసబుద్ధి నందుండు తరిని
ఆకులాలకులోజ్జ్వలావతంసుండు
పరికించి వేంకటపతి ము న్నొసంగు

వరముఁ దలంచి భూవరున కిట్లనును
విను చక్రవర్తి శ్రీవేంకటేశ్వరులు
ననుఁ జూచి దాస! యేనాఁ డిట్టి పూజ
విని చక్రవర్తి నీ విడిదికి వచ్చి
యనుపమపూజ యెట్లని నిన్ను నడుగు

నానాఁడు నా వీటి కరుగుదు ననుచు
నానతిచ్చె విమాన మదె వచ్చె చూడు
మని భార్యయును దాను నా శ్రీనివాసు
ననువుగా ధ్యానించి సాష్టాంగముగను
ధరణి జాగిలి వ్రాలి తనువుల ట్లుండ
నరుదైన దివ్యదేహంబు ధరించి
మహిపతి యెదుట విమానంబు నెక్కి-
మహితాప్సరోమణుల్ మణిభూషణములు
హేమాంబరంబులు నెనయఁ గై చేసి
శ్రీమించ మేనెల్ల శ్రీగంధ మలఁది

మందారకుసుమదామములు ఘటించి
పొందుగా నూడిగంబులు సేయుచుండ
కొందరు నాట్యముల్ కొమరొప్ప సల్పి
కొందరు పాట రంగుగ వినుపింప
కొందరు చామరల్ కుంచలు వీవ
కొందరు పావడల్ గొని చెంత నిలువ
వందిమాగధజనుల్ వర్ణించి బొగడ
బృందారకగణంబు పేర్మి గొల్వగను
హరిభక్తముఖ్యుడై యాత డందుండి
ధరణీశ్వరునుతించి తదనుజ్ఞఁ జెంది

లోకపాలురకును లోకింపరాని
వైకుంఠపురికి బల్వైఖరి నరుగు
అంత నా మహీకాంతుఁ డత్యంతచింత
సంతసంబును మహైశ్వర్యంబు నడర
మగుడి శ్రీవేంకటమహీధరంబునకు
తగ రయంబున వచ్చి దవ్వుననుండి
సన్నుతింపుచు దృఢాంజలి మౌళిఁ బూని
వెన్నునిఁ బొడగాంచి వినుతు లొనర్చి
తా నందు జనుటయుఁ దద్దర్శనంబు
వాని సద్గతియును వరుస నన్నియును

తొండమానునకు స్వామి జీవన్ముక్తి సాయుజ్యము కటాక్షించుట.

విన్నపం బొనరించి వెస మానసమున
నెన్నఁ డీగతి మోక్ష మిచ్చునో తనకు
వెన్నుఁడు కృప నంచు వేడఁగా స్వామి
నెన్నుచు నిలుచు మహీపతి తలపుఁ
దెలిసి లేనగవుతో దేవాదిదేవుఁ
డెలమి నాతనిఁ జూచి యిటు లానతిచ్చు
విను పుత్ర! యెంతటి విమలయోగులకు
ననఘభక్తులకు నే నర్మిలి ముక్తి
సాలోక్యసామీప్యసారూప్యసరణి
మేలిమి నొసఁగుదు మిగులఁ గూరిమిని

నీకు నీవంశజనిర్మలాత్ములకుఁ
జేకొని వేంకటక్షితిధరంబుననె
పాయకవసియించు భక్తినిష్ఠలకు
సాయుజ్యమే యిత్తు శంకింపవలదు

నీవు యావజ్జీవనియతకైంకర్య
సేవలు మా కిట్లు సేయుచు మిగుల
భోగభాగ్యంబులు భుజియించి తుదను
యోగిదుర్లభమోక్ష మొందు మత్కృపను
పరమపదంబునఁ భక్తులు నన్నె
నిరతకైంకర్యైకనియతిఁ గొల్చుటనె
ఆనందమొందుదు రందు నీ విందె
పూని మత్కైంకర్యములు సల్పికొనుచు
గరిమజీవన్ముక్తిఁ గనితి విం దందు
సరినీకు తుద హెచ్చు సాయుజ్యపదము
కావున నిచ్చలు కామినీమణులఁ
బూవిల్తుకేళి నింపుగ రమింపుచును
మఱువక వేళలఁ మము భజింపుచును
మెఱయంగ రాజ్యలక్ష్మి వహించి యుండు
అని నియోగించిన నా చక్రవర్తి
వినతుఁడై మాయావి వీడ్కొని తనదు
పురమున సౌఖ్యానుభూతిఁ జెలంగఁ
బరమభక్తి దలిర్ప ప్రాజ్యరాజ్యంబు
పాలింపుచును మిత్రబంధుభృత్యాది
జాలంబు నరయుచు సౌలభ్యమునను
సామంతమహికాంతసంతానగర్వ
ధూమధ్వజస్తోమదుస్సహోద్ధతుల
కరధృతకరవాల కాళికాధార
లరిమురి చల్లార్ప నతిశయించును

తనదు విశ్రాణనోదకపూరపూర్ణ
వనధులఁ గ్రోలుట వారిదపాళి

సలిలముల్ కోర్వెట్టు చాట్పున జగతి
నెల మూఁడువానలు నిల్కడఁ గురియ
నిజభుజాశ్లేషజనితసస్యపులక
భజన నీరత్నగర్భ సుఖప్రసూతి
ఘనరత్నసంతతిఁ గనియెడి నాఁగ
గనులెల్ల మణిగణకలన నింపొంద
స్వకరార్పితాంభోజజాతంబుఁ బూని
సకలేశ్వరుఁడు శేషశైలనాథుండు
సదయత నంభోజ జాత జాతంబు
నుదయింపఁ జేయుట నుర్విపై నట్టి

యజులు జగత్సృష్టి నలవడి రనఁగ
ప్రజలు ప్రజావృద్ధిఁ బరిఢవిల్లంగఁ
దన దనంతగుణాళి తత కలశాబ్ధి
జనితకీర్తిసుధారసంబు లానుటనో
యనఁగ నిద్ధర జను లందరు సౌఖ్య
మొనర నారోగ్యంబు నొందుచునుండ
తనదుష్ట నిగ్రహోద్ధతిఁ జూచిచక్ర
ఘనపరాక్రమకళాక్రమము నెఱింగి
కలి డాగిపోవుటఁ గడు ధర్మవృషభ
మిల నాల్గుపదముల నెలమి వర్తింప

నిలఁ బ్రోచుచును వేంకటేశ్వరభజన
నలరుచు సాగ్రశతాబ్దంబులుండి

దుస్తరసంసారరత్రోయధిఁ గడచి
శస్తమౌపరమాత్మసాయుజ్య మొందుఁ
గావున నిట్టి వేంకటశైలమహిమ
వావిరి నా శ్రీనివాసువైభవము
అతని భక్తుల యమ్మహాప్రభావంబు
మతి నెంచగా నవాఙ్మనసగోచరము
విశ్వరూపముఁ బూను వెన్నుండు కవిత
శాశ్వతికోక్తుల సంగ్రహంబుగను

బలుకుచుఁ గరపరంపరల లిఖింపఁ
దలచినఁ గలములై తరులెల్లఁ దగిన
సప్తసాగరములు సరిగాఁగ నయిన
వ్యాప్తాంబరము పత్రికాకారమైన
నా వేంకటాద్రి మాహాత్మ్య మంతయును
సావధానతఁ దెల్ప శక్యంబుగాదు
నాలుగువేదముల్ నానాగమములు
చాల నయ్యష్టాదశపురాణములును
కలితేతిహాసముల్ కావ్యజాతములు
వలనొప్ప నా శ్రీనివాసవిలాస

మొకయింత వర్ణింప నోపవు జగతి
సకలంబు వివరింపఁజాలు వా రెవరు
నేను మీ రడుగంగ నేర్చినపాటి
పూనికఁ దెల్పి తద్భుతముగాఁ గొంత
ఈ పుణ్యచరితంబు నెవ్వారు వినిన
నేపునఁ దెల్పిన నిష్టసంపదలు

పుత్రపౌత్రారోగ్యభోగభాగ్యములు
ధాత్రీతలాధిపత్యము నిత్యకీర్తి
యక్షయైశ్వర్యంబు నమితపుణ్యంబు
మోక్షపదానందమును జెందఁగలరు

అమృతసాగరమున నల్పంబు గ్రోలి
యమరులౌగతి ని మ్మహాకథయందు
పద మర్థమే యైన పద్యమే యైన
పాదమున విని పాపముక్తు లౌదు రిల
మొదటినుండియుఁ దుదిముట్ట నేమమున
మది రంజిలఁగ విన్న మనుజవర్యులకుఁ
గోరిక లెల్లఁ జేకూరు టే మరుదు
శౌరి యాతనిపాల సదయుఁడై నిలుచు

తుదినొక్క రహస్యము,

ఇక నొక్కటి రహస్య మిది బుధుల్ వినుఁడు
సకలవేదాంతార్థసారరూపంబు
శ్రీనివాసులు నట్టి శ్రీవేంకటాద్రి
యానందనిలయంబు నా స్వామి సరసి
జీవకోటులఁ బ్రోవఁ జెలగి యెల్లపుడు
పావనస్థితి నుండు భావంబుఁ దెలిసి
తద్వైభవంబులు దలఁచి సంతతము
సద్వివేకంబు మించంగఁ గీర్తించి
ద్వీపాంతరంబులఁ దేశాంతరముల
నేపట్ల నుండైన నెట్టి వాఁడైనఁ
దదభిముఖంబుగా ధర వ్రాలి మ్రొక్కి
మదిలోనఁ గొల్చిన మాత్రంబునందు

శ్రీనివాసులు వాని చెంగట నిలిచి
తానె యిష్టార్థముల్ దయమీఱ నొసఁగు
వేదశాస్త్రము వంటి విద్య వేఱొండు
శ్రీదేవి కెనయైన చెలువ యొకర్తు
భూమికి సరియైన భూత మింకొండు
స్వామిపుష్కరిణికి సాటి తీర్థంబు
వేంకటాద్రికి నుద్ది విష్ణుస్థలంబు
వేంకటేశ్వరుఁబోలు వేఱె దైవతము
సత్యంబుగాఁగ నెచ్చట లేదు లేదు
ప్రత్యక్షముగ నుమాపతి సాక్షి యిందు

అని సూతముని నైమిశారణ్యసీమ
అనఘు లౌ మౌనుల కాశ్చర్య మొదవ
వరుసగా వారాహ వామన పద్మ
గరుడపురాణాది కథితమార్గమున
వివరించు నిట్టి శ్రీవేంకటాధీశ
భువనాద్భుతచరిత్రమును సంగ్రహించి
యెల్లవారలు విని యింపొందునట్లు
తెల్లమిగాఁ దేర్చి తెనుఁగున ద్విపద
లొరపొంద రసభావయుక్తి సంగతుల
వరలి యష్టాదశవర్ణనల్ మెరయ
శ్రీనివాసవిలాససేవధి యనఁగఁ
బూని మహాకావ్యపూర్ణలక్షణము
గలుగ నే నొనరించు కబ్బంబు జగతి
లలితసందర్భకళారసజ్ఞులకు

పరమభక్తులకును పండితేంద్రులకు
సరసచిత్తులకు మాత్సర్యదూరులకు
వీనుల నమృతంబు వెల్లి జల్లుచును
మానితానందంబు మది నించుగాత.
అని విచిత్రార్థసమర్థనాకలిత
ఘనసర్గవిశ్రుతకవిముఖ్యుపేర
విపులానుభావభావితసంవిధాన
కపటనాటకజగత్కారణుపేర
భాసురాంగశ్రుతి భారతీభవ్య
లాసికాగీతవిలాసునిపేర
తారకాంతకపితృ ద్వంద్వాన్వధీత
తారకమంత్రాభిధానునిపేర
ప్రత్యాహృతోత్తరాపత్యచైతన్య
సత్యనిత్యబ్రహ్మ చర్యునిపేర
క్షీరపారావార శీకరాసార
పూరితనిజముఖాంభోజునిపేర
పావనభక్తాప్తబంధునిపేర
గోవిందరాజన్ ముకుందునిపేర
శ్రేష్ఠలూర్యన్వయ శ్రేష్ఠశీలుండు
ప్రేష్ఠమహాయశశ్రీధురీణుండు
గోత్రభారద్వాజగోత్రవర్ధనుఁడు
సూత్రఁదాపస్తంబ సూత్రానువర్తి
అష్టభాషాకవిత్వార్జితప్రోద్య
దష్టావధానవిఖ్యాతబైరుదుఁడు

శ్రీకృష్ణయార్య లక్ష్మీగర్భవార్ధి
రాకాసుధానిధి రాజపూజితుఁడు 1660

వివిధవిద్యాశాలి వేంకటార్యుండు
నవరించు శ్రీనివాసవిలాసమునను
హరువొందు నిదియె షష్ఠాశ్వాసమగుచు
ధరఁబొల్చు నాచంద్రతారకంబుగను

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ ని వా స వి లా స సే వ ధి

సంపూర్ణము.

